# పానుగంటివారి సాహిత్యసృష్టి

## సవిమర్శ పరిశీలనము

డాక్టర్
ముదిగొండ వీరభద్రశాస్త్రి

మొదటి ముద్రణము :
అక్టోబరు - 1968

ప్రతులు
1,000

వెల :
రు. 30-00

శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు
శతజయంత్యుత్సవ సంఘము సహాయముచే
ముద్రింపబడినది.

ముద్రణ :
సుదర్శన్ ప్రింటర్స్, హైద్రాబాదు-29.

# ము న్నుడి

నవ్యాంధ్ర సాహిత్య నిర్మాతలం దగ్రగణ్యులగు వారిలో పానుగంటివారొకరు. వారి ప్రతిభ యనన్యము, ప్రజ్ఞ బహుముఖీనము. నాటక కర్తగా, వచన కవిగా, హాస్యస్రష్టగా సంఘ విమర్శకుడుగా ఆయన కీర్తి చిరస్థాయి నందుకొన్నది.

ప్రస్తుత గ్రంథము ఆ మహానుభావుని జీవిత చరిత్ర సంగ్రహమును, నాటకములను, వచన కావ్యములను సమీక్షించునట్టిది. పి. హెచ్. డి. డిగ్రీకై శ్రీ వీరభద్రశాస్త్రి కృషిచేసి ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు సమర్పించిన పరిశోధన వ్యాసము ఇది. ఆతడు పరిశోధన చేయుచుండిన సమయమున నేను పర్యవేక్షకుడనుగానుండిన కారణమున ఆతని కృషిని మిక్కిలి సన్నిహితముగా అనుశీలన మొనర్చినాను. "పానుగంటివారి రచనలను చదివి నేను పొందిన ఆనందానుభవమును ఇతరులతో పంచుకొనదలచుకొన్నాను. ఈ విధముగా నా కింతటి రసానందము చూరలిచ్చిన పానుగంటివారి ఋణమును కూడ తీర్చుకొనగలుగుదును." అని అతని దీక్ష. ఆ దీక్షయే మొట్టమొదట నాకు అతనిని ప్రీతి పాత్రునిగా చేసినది.

పరిశోధనము చేసిన ఆ మూడేండ్లును అతడు ఎంత పరిశ్రమ చేసెనో, ఎట్టి తత్పరత్వము చూపెనో నేను వేఱుగా చెప్పనక్కఱ లేదు. ఈ గ్రంథమే వివరించును. పానుగంటివారి బంధుగులను, సన్నిహితులను కలిసి, వారినిగూర్చిన అనేకాంశములు సేకరించుటలో, సులభ సాధ్యములుగాని వారి రచనల నన్నిటిని (తొలి ముద్రణ ప్రతులతో సహా) సేకరించుటలో, ఎంతటి పట్టుదల చూపెనో, లభ్యమైన ఆధారములన్నింటిని సమీక్షించి నిశిత పరిశీలనాయుతమగు విమర్శ

వెలయించుటలో శ్రీ వీరభద్రశాస్త్రి అంతటి సమర్థతను ప్రకటించి నాడు. అధిక ప్రతిభావంతమగు రచనను విమర్శించుట కంతటి అధిక ప్రతిభయే కావలయును గదా ! శ్రీ వీరభద్రశాస్త్రి ఆ స్ఫూర్తిని వెల్లడింపజాలినాడు.

పరిశోధక వ్యాసము సమర్పించి పట్టమును పడసిన వెనుక కూడ ముద్రణకాలము వఱకును అతడు విషయసేకరణము నెడగాని, పునర్విమర్శనము నెడగాని ఉదాసీనుడు కాలేదనుట నాకు సంతోషము కొలిపిన మఱియొక విషయము. అప్పుడు లభ్యము కావను కొనిన మణిమాల, సుబ్బరాజు అను నాటకములు సంపాదించినాడు. మఱికొన్ని జీవిత విశేషములు సేకరించినాడు.

నా పర్యవేక్షణ క్రింద కృషిసాగించిన అతనినిగాని, అతడు చేసిన కృషినిగాని ఇంతకంటె మెచ్చుకొనుట ఉచితము కానేరదు. అయినను, భగవదనుగ్రహము చేత పుస్తకము నలుగురిలో పడు చున్నప్పుడు, నేను ప్రత్యేకముగా ప్రశంసించుట ఏల ?

ఇతోధికముగా కృషిచేసి రాణింపవలయును అని అతనికి నా శుభాకాంక్ష.

హైదరాబాదు
కీలక సం॥ విజయ దశమి

బి. రామరాజు

# Acknowledgements

This volume is based on my doctoral thesis approved by the Osmania University. On the occassion of publishing this volume I cherish the encouragement and help given to me by Prof. K. Lakshmi Ranjanam, Prof. N. Venkata Rao and Dr. P. S. R. Appa Rao. I am particularly indebted to Dr. B. Rama Raju, who supervised my work and gave me the benefit of his rich experience and profound scholarship.

I am thankful to Sri Devulapalli Krishna Sastry, Sri Mokkapati Narasimha Sastry, Dr. S. V. Joga Rao, Sri Rao Gangadhara Rama Rao, Sri Koka Sivanadha Sastry, Sri Vanguri Narasimha Rao, Dr. Tanikella Satyanarayana, Sri Panuganti Jagannadha Rao and other members of the Panuganti family, for the valuable information, they gave me during the project. I am grateful to Sri S. Radhakrishna, and to Sri M. Subrahmanya Sarma who kindly made the back numbers of Andhra Patrika and Krishna Patrika available to me for reference. I am also obliged to the authorities of Srirama Bala Bhakta Samajam Library, Rajahmundry and Sri Suryaraya Vidyananda Library, Pitapuram for some of the rare books made available to me.

My thanks are due to Dr.S D. Satwalekar and Dr. (Mrs.) Santhabai Satwalekar, for the inspiring encouragement they extended to me during my work and to the Trustees of H.E.H. The Nizam's Charitable Trust Fund for their generous financial assistance.

I thank the Sri Panuganti Lakshmi Narasimha Rao centenary celebrations committee, who came forward to finance this publication and the authorities of the Osmania University for permitting me to publish my thesis in this form.

I am thankful to Sri Chandra, who readily obliged me by preparing the several designs and drawings intended for this Volume.

Sri Venkataiah and his staff at Sudershan Printers have generously co-operated with me in ultimately getting this volume out and I sincerely thank them for their job.

M. Veerabhadra Sastry.

# అంకితము

పెదనాన్నగారు　　　　　　　　　　అమ్మ



డా॥ యం. మల్లికార్జునరావు　　　కీ॥ శే॥ శ్రీమతి సుందరరాజమ్మ

గారలకు

# వి ష య సూ చి క

మొ ద టి అ ధ్యా య ము

## జీవిత చరిత్రము 1- 32



రెం డ వ అ ధ్యా య ము

## రూపక వాఙ్మయ నిర్మాత 33-288

-o-

## జననము - విద్యాభ్యాసము :

నవ్యాంధ్ర వాఙ్మయమున నైకపథమున పురోగమించి, ప్రతిభ వెలయించి, తమ పేరు ప్రతిష్ఠల కొరకు శాశ్వత స్థానము సంపాదించుకొనినవారు పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. పంతులుగారు రాజమండ్రి తాలూకా సీతానగరమందు 11–2–1865 నకు సరియగు రక్తాక్షి సంవత్సర మాఘ బహుళ పాడ్యమినాడు జన్మించిరి.[1] వీరు మధ్వ మతస్థులు. వీరి తల్లి రత్నమాంబగారు; తండ్రి వేంకట రమణయ్యగారు (1840–1923) గొప్ప ఆయుర్వేద వైద్యులు. సుప్రసిద్ధులగు శివల మల్లుగారి శిష్యులు. తమ తండ్రిగారిని గూర్చి పంతులుగారు ఇట్లు వ్రాసి యున్నారు.[2]

''మా తండ్రిగారు కలియుగ ధన్వంతరి. ఈయన రాజమండ్రిలో ననేకల రోగములు కుదిర్చిరి. ధర్మవైద్యము, అమృతహస్తము ఆయనకు గలవు.''

తల్లి రత్నమాంబగారు చిన్నతనముననే కాలము చేయగా, పంతులుగారు పితామహియగు జోగమ్మగారియొద్ద పెరిగిరి. వేంకట రమణయ్యగారు పుత్ర

---

1. "ఆంధ్ర నాటక కర్తలు" అను గ్రంథమున ''పానుగంటి లక్ష్మీనరసింహా రావుగారు" అను వ్యాసము వ్రాయుచో డా. పి.ఎస్.ఆర్. అప్పారావుగారు పంతులుగారు జన్మించిన తేదీ 1-2-1865 అని ఇచ్చియున్నారు.

 పంతులుగారి యనంతరము 1948 లో ముద్రితమైన ''అద్వైతము'' అను వ్యాసమున పిచ్చివాడు ఒక డుపన్యసించుచు నడుమ తన జననపు తేదీని, తిథిని చెప్పినట్లున్నది. అది పంతులుగారి జనన తిథియే. అచ్చటి తేదీ 11-2-1865 అనియే యున్నది.

2. "మా ప్రాంతీయ వైద్యకుటుంబాలు" పంతులుగారి రచన. 'ఆయుర్వేద' మాసపత్రిక. సంపుటి 1 సంచిక 2. మే 1955.

వాత్సల్యము మూర్తీభవించినవారు. ఆ విషయమున పంతులుగారికిని తండ్రి పోలికయే వచ్చినది.

లక్ష్మీనరసింహారావుగారి బాల్యము, విద్యాభ్యాసకాలము రాజమండ్రిలో గడచినవి. వారు 1884 లో మెట్రిక్యులేషన్, 1886 లో ఇంటరు, 1888 లో బి.ఏ. పరీక్షలలో మొదటి తరగతిలో నుత్తీర్ణులైరి.[1] బి.ఏ. ఇంగ్లీషులో

---

"శ్రీరామ జననము" అను నాటకమున పీఠికలో తత్కర్త సుసర్ల అనంతరావుగారు పంతులుగారి విద్యాభ్యాసకాలమునుగూర్చి యొక పద్యమును వ్రాసియున్నారు. ఆ పద్యమిది :

పానుగంటి కులాబ్ధి పార్వణచంద్రుండు నరసింహరాయుండు నాదు ప్రాణ
సముఁడైన చెలికాఁడు సకల విద్వజ్జనాధీన మానసుఁడు సందీప్త గుణుఁడు
మతి ప్రవేశ పరీక్షఁ బ్రథమ శాస్త్ర పరీక్ష మొదటి తరగతునె పొంది యిపుడు
శ్రద్ధావిధేయుఁడై చదువుచు నున్నాఁడు పట్ట పరీక్షకీ వర్షమేగు
బహుమతు ల్పెక్కులందెడుఁ బాఠశాలయందు నాంగ్లేయభాషయు నాంధ్రభాష
యును సమంబుగ నభ్యసించెను గవిత్వ మతిశయిల్లెడు భాషాద్వయంబునందు.

ఈ పీఠిక 25, సెప్టెంబరు 1888 తేదీతో నున్నది. పంతులు గారెచ్చటను తాము బి. ఏ. పట్టము పుచ్చుకొనినట్లు వ్రాసికొని యుండలేదు. దీనిని గూర్చి యొక జనశ్రుతి యున్నది. వారు తమ తమ్మునికి బదులుగనో, మేనల్లునికి బదులుగనో పోయి పరీక్ష వ్రాసిరట. ఆ కారణమున వారి పట్టము రద్దయిపోయినదట. పంతులుగారినిగూర్చి వివరములు సేకరించి నప్పుడు పలువురు ఈ అంశము చెప్పిరి. ఇది యెంతవరకు నిజమో తెలియదు.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు పంతులుగారి సప్తతి పూర్త్యుత్సవమున కధ్యక్షత వహింపునెడ తమ యుపన్యాసమున వీరు బి. ఏ. లో రెండు బ్రాంచీలు ప్యాసైరని చెప్పిరి.

పంతులుగారు కాలము చేసినప్పుడు "ఆంధ్ర పత్రిక" ప్రధాన వ్యాసమున (2-1-1940) నిట్లు వ్రాసినది. "వీరు బి. ఏ. డిగ్రీని పడసినారు."

సర్వోత్తములుగా కృతార్థులైనందుకు వీరికి మెట్కాఫ్ స్వర్ణపతకము లభించినది.[1] కూచి నరసింహముగారును వీరును సహపాఠులు.

కళాశాలలో చదువుకొను రోజులలో పంతులుగారు షేక్స్పియర్ నాటక ప్రదర్శనములందు పాల్గొనెడివారట. కూచి నరసింహముగారుకూడ నటనానుభవమున్నవారే. కందుకూరి వీరేశలింగము పంతులుగారి శాకుంతలానువాదము నొకసారి ప్రదర్శించినప్పుడు కూచివారు దుష్యంత పాత్రము ధరించిరి. ప్రదర్శన నిర్వహణము పానుగంటివారు. పిఠాపురములో ప్యాలెస్ థియేటరులో తమ నాటకములను ప్రదర్శించినప్పుడు ఆ నటులకు పంతులుగారు తామే స్వయముగా నొద్దికలు నేర్పుచుండెడివారు. ఆ శిక్షణగూర్చి తెలిసినవారు పంతులుగారు మంచి స్టేజి డైరక్టరని యందురు.

రాజమండ్రి కాలేజీలో చదువుకొను దినములలో ఒకసారి ప్రిన్సిపాలు క్లాసునకు వచ్చుట ఆలస్యముకాగా, పానుగంటివారు సరదాగా వేదిక నెక్కి షేక్స్పియర్‌గూర్చి ఉపన్యాస మారంభించిరనియు, ప్రిన్సిపాలు వచ్చి ఆ యుపన్యాసమున కంతరాయము కలిగింపకుండ గోడచాటున నుండి పదునేను నిముషములకుపైగా విని వక్తను బహూమానించిరనియు చెప్పెదరు.

## ఉద్యోగిదశ :

ఉపాధ్యాయ వృత్తికి గౌరవమును, మన్ననయు విశేషముగ నుండిన ఆ కాలములో పంతులుగారి యుద్యోగదశయును ఉపాధ్యాయ వృత్తితోడనే యారంభమైనది. పెద్దాపురము హైస్కూలులో మొదటి అసిస్టెంటుగా వారు కొలది కాలముండిరి. తరువాత వారు కొత్తపల్లి జగ్గారాయనింగారు అను వెలమ దొరగారియింట పిల్లలకు చదువు చెప్పుటకు కుదురుకొనిరి.

పిదప వారు లక్ష్మీనరసాపురము ఎస్టేటు జమీందారిణియగు రావు చెల్లయమ్మారావుగారి కడ నుద్యోగము సంపాదించిరి. పంతులుగారు అచట

1. పంతులుగారికి మెట్కాఫ్‌స్వర్ణపతకము లభించినట్లు వారి తమ్ముని మనుమడు శ్రీ పానుగంటి జగన్నాథరావుగారు లేఖ మూలమున దెలిపినారు.

సరిగా ఏ సంవత్సరమున చేరిరో తెలియదు కాని నర్మదా పురుకుత్సీయ నాటకము మొదట ముద్రితమైన కాలమునకు (1902) వారు ఎస్టేటు దివానుగా నుండిరని అందలి వేదాల రంగాచార్యుల వారి యనుమోదికనుబట్టి తెలియుచున్నది. మొత్తముమీద చెల్లయమ్మారావుగారికడ నుద్యోగములో పంతులుగారు ఆరేడేండ్లు ఉండినట్లున్నది. లక్ష్మీనరసాపురము ఎస్టేటు కార్యాలయముకూడ పిఠాపురము నందే యుండుటచేత పంతులుగారి నివాసము పిఠాపురమే యయ్యెను. కొంత కాలమునకు చెల్లయమ్మారావుగారికిని తమకును అభిప్రాయభేదములు పొడ చూపుటచేత ఆ ఉద్యోగము వారు మానివేసిరి.

ఇటీవలనే స్వర్గతులయిన శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యా రావు బహద్దరువారు మైనరుగా నుండగా పిఠాపుర రాజ్యమునకు వచ్చిరి. కావున అప్పటి బ్రిటిష్ ప్రభుత్వపు అధికారులు రాజ్యమును వశము చేసికొని, మైనరు రాజును విద్యాభ్యాసము నిమిత్తము మద్రాసు పంపిరి. సూర్యారావుగారు 1905 సెప్టెంబరులో పిఠాపురమునకు తిరిగివచ్చిరి. అప్పటికి పానుగంటివారు పిఠాపుర మున నుండిరి. రాజావారికి స్వాగతపత్రము సమర్పించిరి.

లక్ష్మీనరసాపురమునందలి యుద్యోగము మానుకొనిన వెంటనే వారిని పీఠికాపురాధీశులు తమవద్ద కొలువులో నుంచుకొనలేదు. చెల్లయమ్మారావుగారు తమకు కావలసిన దగ్గరి బంధువగుటచేత చిరకాలమునకుగాని సూర్యారావుగారు అక్కడ నుద్యోగము మాని వచ్చిన పంతులుగారిని చేరదీయలేదు.

ఆ నడుమ కాలములో పంతులుగారొక మిత్రునితో కలిసి యే మదరాసు లోనో యొక హోటలు పెట్టి నడుపవలెననికూడ తలపోసిరట; వారికిగల ఈ ముచ్చట జంఘాలశాస్త్రి, కాలాచార్యులచేత హోటలు నడిపించుటతో (సాక్షి 1—31) తీరినది.

సూర్యారావు బహద్దరుగారి వివాహ మహోత్సవమునకు "కోకిల" నాటకమును, పట్టాభిషేక మహోత్సవమునకు "విజయరాఘవ" నాటకమును వ్రాసి, ప్రదర్శించుటతో పానుగంటివారికిని, సూర్యారావుగారికిని సన్నిహితత్వ మేర్పడియుండును. రాజావారు పంతులుగారికి కోకిల నాటకము మొదలుకొని

తక్కిన రచన లన్నిటిని ముద్రింపించి యిచ్చుచుండిరి. కోకిలకంఠె మండే పంతులుగా రచ్చువేయించుకొనిన "రాధాకృష్ణ" కు కూడ అయిన వ్యయమును రాజావారు ఇచ్చిరి. అప్పటికి పిఠాపురము ఆస్థానమున పానుగంటివారు ప్రవేశించి నట్లు అగపడదు.

లక్ష్మీనరసింహారావుగారి సన్నిహిత బంధువులగు ఢిల్లీ జగన్నాథరావు గారు అప్పుడు దత్తమండలములలో రివెన్యూశాఖలో డిప్యూటీ కలెక్టరుగా పని చేయుచు పేరుప్రతిష్ఠల నార్జించియుండిరి. వారి సిఫారసుపై పంతులుగారు 1910 సంవత్సరారంభమున ఆనెగొంది సంస్థానమునకు దివానుగా వెళ్ళిరి. ఆ సంస్థానములో ఉర్దూ, పర్షియన్ రాజ్య వ్యవహార భాషలు. అతి స్వల్పకాలముననే వీ రాభాషలు నేర్చుకొని సివిల్, క్రిమినల్ వ్యవహారములు నడుపసాగిరి. సుమారు పదునైదు మాసములు మాత్రమే ఆ ఉద్యోగమునందు వా రుండిరి. పిఠాపురమునందే కుటుంబమునుంచి, వారొక్కరే ఆనెగొందిలో నుండిరట. ఆనెగొందిలో ప్లేగు ఉపద్రవమురాగా, ఆ ఉద్యోగము మానుకొని పంతులుగారు తిరిగివచ్చిరి.

తరువాత నరసింహారావుగారు ఉర్లాము సంస్థానమునందు కందుకూరి లక్ష్మీప్రసాదరావు బహద్దరుగారివద్ద దివానుగా స్వల్పకాలముండినట్లు తెలియు చున్నది. కోర్టువ్యవహారములలో ఆ జమీందారుగారి నిమిత్తము శ్రమించి, ఎస్టేట్‌లో భాగము వచ్చునట్లు కృషిచేయుటచే వారు కృతజ్ఞులైయుండి పంతులు గారు జీవించి యున్నంతకాలము రెండుపుట్లు సన్నధాన్యమును వార్షికముగా పంపించుట కేర్పాటు చేసిరి.

1910_13 ల నడుమ పీఠికాపురాధీశ్వరులకు పంతులుగారిపై కొంత ఎక్కువగా ఆదరమేర్పడినట్లు తోచును. బుద్ధ బోధసుధ, వృద్ధవివాహము, అను నాటకములు వారికోరికపై పానుగంటివారు ఈ వ్యవధిలో వ్రాసిరి. 1913 పంతులు గారి జీవితచరిత్రయందు, నవ్యాంధ్ర సాహిత్య చరిత్రయందుకూడ క్రొత్త మలుపు. ఆ సంవత్సరమే పంతులుగారు సాక్షి సంఘ నిర్మాణముచేసి "సువర్ణ లేఖ" పత్రికను, ఆధునిక గద్యవాఙ్మయ సరస్వతిని అలంకరించిరి. సాక్షి వ్యాసములలో కొన్ని వెలువడిన యనంతరము పీఠికాపురాధీశ్వరులు వీరిని

ఆస్థానకవులనుజేసి మాసమునకు నూటయేబది రూప్యముల వఱకు ఇచ్చుటకు నియమించినట్లు తెలియుచున్నది. అప్పటినుండియు పానుగంటివారు పిఠాపురమున స్థిరపడిపోయిరి.

దివానుగా నుండిన మొక్కపాటి సుబ్బారాయుడుగారు 1918 డిసెంబరులో కాలధర్మముచెందిన వెనుక పిఠాపురపు రాజావారు అనుభవజ్ఞులగు పంతులుగారిని దివానుగా నుండుమని కోరిరనియు, చిరకాలమునుండి యున్న మైత్రికి భిన్నముగా ఇప్పుడు సేవ్యసేవక సంబంధము తెచ్చిపెట్టుకొనుట కిష్టములేదని పంతులుగారు ఆ సూచనను త్రోసివేసిరనియు చెప్పుకొందురు.

## గృహస్థ జీవితము :

నరసింహారావుగారి భార్య అప్పమ్మగారు. ఈమె పంతులుగారి యనంతరము పదియేండ్లు బ్రతికి యుండినది. పంతులుగారి యారోగ్యము అంత దృఢమైనదికాదు. అందుచేత వారికెట్టి బాధ్యతయు లేకుండ గృహమున నామెయే నిర్వహించుచుండెడిది. పంతులుగారి వివాహమును గూర్చిన యుదంతమును వారి చివరి కుమారుడు వేంకటరమణరావుగారిట్లు ఒక వ్యాసమున వ్రాసియున్నారు.

''మా మాతామహులు దుమాత్రావు రాజారావుగారు. వారి రెండవ కుమార్తె మా అమ్మగారైన అప్పమ్మగారు. మా నాయనగారి వివాహం వింతగా జరిగింది. మా తాతగారు తమ మూడవకుమార్తె అయిన జానకమ్మగారిని మా నాయనగారి కివ్వడానికి నిశ్చయించారు. అప్పమ్మగారికి మరో సంబంధం చూశారు. రెండు లగ్నాలు ఒకరోజుననే పెట్టారు. మా నాయనగారూ వాళ్లూ తరలివెళ్లారు. కాని అప్పమ్మగారి నిస్తామనుకున్న పెళ్ళివారు ఏకారణంచేతనో లగ్నానికి రాలేదు.

మా తాతగారు తికమకలో పడ్డారు. రెండవ కూతురు పెళ్ళికాకుండా మూడో కుమార్తె కెలా చేస్తారు. అందుకని అప్పమ్మగారినే మా నాయనగారి

కిస్తామన్నారు. మా నాయనగారు అంగీకరించి ఆమెనే వివాహమాడారు. మా అమ్మగారు పూర్వకాలపుమనిషి. దేవతార్చనలు, పూజలు మొదలయిన వాటి యందు ఆసక్తి ఎక్కువ. దానధర్మాలకు ఆమెది పెట్టింది పేరు."

(ఆంధ్రప్రభ 31-10-1965)

మిత భాషియగు పంతులుగారు ఇంటిలోగూడ నెవ్వరితోడను విశేషించి మాటలాడెడువారు కారట. వేళకు మేడదిగివచ్చి స్నానాదికము ముగించుకొని భుజించి మరల మేడ యెక్కుచుండెడివారు.

పంతులుగారికి అయిదుగురు కుమారులును, ఇద్దరు కొమార్తెలును గలిగిరి. పెద్ద కుమారుడు వేంకటరత్నముగారు ఆరోగ్యలోపముగలవారై తల్లి దండ్రులకు చింతాహేతువై యుండెను. రెండవ కుమారుడు రాజారావుగారు కోఆపరేటివ్ సబ్ రిజిస్ట్రారుగా పనిచేసి ఉద్యోగవిరమణము చేసిన తరువాత పెద్దతనమున 1956 లో గతించిరి. మూడవ కొడుకు చిరంజీవరావుగారు ప్రస్తుతము అనకాపల్లియందు ఉన్నారు. నాల్గవవాడు విజయరాఘవరావుగారు. తండ్రికి గల సాహిత్యశక్తి కొంత వీరికి అబ్బినది. ఆంధ్ర రంగస్థలమునకు చిరపరిచితమగు "లోభి" నాటకమును వీరు వ్రాసిరి. వీరు 1943 లో చిన్నవయసులోనే మరణించిరి. అయిదవ కుమారుడు వేంకటరమణరావుగారు రివెన్యు ఇన్‌స్పెక్టరుగా పనిచేసి ప్రస్తుతము విశ్రాంతి గొనుచున్నారు.

పంతులుగారి పెద్దకొమార్తె శేషమ్మగారు. ఈమెను పంతులుగారు తమ మేనల్లుడగు ద్రోణంరాజు వేంకటరమణరావుగారికిచ్చి పెండ్లిచేసిరి. రెండవ యామె రమణమ్మగారు ఉపాధ్యాయవృత్తి యందుండి, ఉద్యోగ విరమణము పిదప పిఠాపురమున నున్నారు.

పంతులుగారి పుత్రవాత్సల్యముగూర్చి యీవఱకే ప్రస్తావించుటయైనది. కొద్దిగానో గొప్పగానో చదివి, ఉద్యోగార్హత సంపాదించుకొని నప్పటికిని ఉద్యోగములకు పోయినచో కుమారులు దూరమగుదురని వారిని పంపుటకు పంతులుగారు ఇష్టపడక పోయిరి. పాతికేండ్లు పైబడిన కుమారుని రాజారావుగారిని ఉద్యోగమునకై మొదట మద్రాసు పంపి కన్నుల నీరుపెట్టుకొని బేలపడిపోయిన

మెత్తని మనస్సుగల పంతులుగారి స్వభావమును పాదుకా పట్టాభిషేకము నందలి దశరథుని పాత్ర వారు నిర్వహించిన విధానము స్పష్టము చేయును.

ఉద్యోగముల వలనగాని, రచనల ప్రచురణము వలనగాని పంతులుగారు అధికముగనే ఆర్జించిరి. కాని ధనము నిలువచేయుట విషయమై వారెన్నడును ఆసక్తి చూపి యుండలేదు. వారి కుమారుడు వేంకటరమణరావుగారు ముందు పేర్కొనిన వ్యాసములో ఈ విషయమై ఇట్లు వ్రాసియున్నారు.

"మా నాన్నగారి జీవితములో ఒడుదుడుకులు లేవు. ఉన్నను కనిపించెడివి కావు. ఎప్పుడూ ఒకటే హుందాతనము ఇంట్లో వంట బ్రాహ్మణుడు, నీళ్ళ బ్రాహ్మణుడు, దేవతార్చనకు ఆచార్యులవారు, నౌకర్లు చాకర్లు—వీరందరితో ప్రతి దినము పెండ్లివారి ఇల్లువలెనే ఉండెడిది."

ఆ రోజులలో పిఠాపురములో వ్యయమునకు దివాణము తరువాత నిక వీరి యిల్లేయని చెప్పుకొందురు. ఆ కారణముచేత వారు ఆధునిక శ్రీనాథులై, అనుభవించినన్నాళ్లను బాగుగా ననుభవించి, తుది రోజులలో పేదరికమునకును, ఋణబాధకును లోనైరి.

## సాహిత్య సృష్టి :

పానుగంటివారికి పేరు తెచ్చిపెట్టినవి సాక్షి వ్యాసములే అయినను, తమ రచనలలో నాటకములే శ్రేష్ఠతరములని వారు భావించుచుండెడివారు. వ్యాసములు, నాటకములేకాక వారు కొన్ని ప్రహసనములు, చిన్న కథలుకూడ వ్రాసి యుండిరి.

పంతులుగారి రచనలలో తెలిసినంత వఱకు మొట్టమొదటిది సుసర్ల అనంతరావుగారి "శ్రీరామ జననము" అను నాటకములో వారు వ్రాసి యిచ్చిన ప్రస్తావన, మఱియు నందలి యొక దండకము. శ్రీరామ జననము 1888 లో జ మహేంద్ర వరమునందలి వివేకవర్ధని ముద్రాక్షరశాల యందు ముద్రిత

మైనది. దాని పీఠికలో పంతులుగారి సాహిత్య శక్తినిగూర్చి యిట్లు వ్రాసి యున్నారు.

"ఇంతటి చిన్నఁ దనమున నే యాంధ్రభాషయం దనేక గ్రంథములను జదివి, సకల జనాహ్లాద కరంబుగఁ గవిత్వ రచనా నైపుణి నందిన నా యత్యంత ప్రియమిత్రుండు పానుగంటి నృసింహరాయుఁడు నేనీ గ్రంథమును వ్రాయు నప్పుడెల్లఁ జేదోడు వాదోడుగ నుండి యచ్చటచ్చట యుక్తాంశములను దోపించుచు బాలుమాలనీక నా యొద్దన కూరుచుండుట చేత నే దీని నారంభించిన నెల దినముల కాలములోఁ బరిసమాప్తి నొందించితిని. ఈ నా చెలికానికిఁ గల భాషాభిజ్ఞాన మిందుఁ జేర్పఁబడిన ప్రస్తావనను బట్టియు రెండవ యంకమున మొదటి దండక మును బట్టియు స్థాలీపులాకన్యాయముగను, కొన్ని దినములలోనే ప్రచుర పఱుపఁ బడు "నిషధరాజ చరిత్ర" యను నాటకమును బట్టి విశేషముగను గ్రహింపనగు."

ఈ నిషధరాజచరిత్రము ప్రకటింపబడినట్లు కన్పట్టదు. శ్రీరామ జనన నాటకరచనాకాలమునకు లక్ష్మీనరసింహారావుగారి వయస్సు ఇరువది మూడేండ్లు. అప్పటికి వారు బి.ఏ. పట్ట పరీక్షకై చదువుచుండిరి. అనంతరావుగారి పీఠికలోనున్న ప్రస్తావనయన్న పదముచే నందలి నాంది పద్యములను పంతులు గారి రచన యనవచ్చునో, అనరాదో తెలియకున్నది. కాని ప్రస్తావనాంతర్గతమగు పద్యశైలిని బట్టి చూచినచో నాంది పద్యములను గూడ పంతులుగారే వ్రాసి యుందురని నిశ్చయించుట కాక్షేపణము ఉండదు. ప్రస్తావనయందలి ఋతు వర్ణనము పంతులుగారి ఆనాటి రచనకు మచ్చుతునకగా నిట ఉదాహరింప బడుచున్నది.

రంభా సమారంభ శుంభత్తిలోత్తమ ప్రముఖౌఘ వైలాస్య పరివృతుండు,
శస్తాంచిత విభూతి విస్తార నిస్తంద్ర సుమనోదిత ప్రభా శోభితుండు,
శుక ముఖ ద్విజ ఘటా సూక్తిచ్ఛటా నందితాస్తోక కర్ణ శోభాంచితుండు,
వన వాటి కావాస వర్తిత వరరూప లావణ్య తారుణ్య లాలితుండు

మాభిరాముండు కుసుమదామాభిరాముఁ డట్టి మాధవుఁ డీయెడ నవని యందు
సర్వ భూభవ పోషణశాలి యగుచు నభ్యుదయ మంది వర్తిల్లు నంచితముగ.

ఈ పద్యమున కవిత్వారంభ కాలసహజమగు శబ్దాడంబరము గోచరించు చున్నది. ద్వితీయాంకమున దండకము నిట్టే శబ్దప్రౌఢి కలిగి సుదీర్ఘమై యున్నది.

విక్టోరియా మహారాజ్ఞి పట్టాభిషేక మహోత్సవ వజ్రోత్సవ సందర్భమున (1879 జూన్) పంతులుగారు ఆంగ్లమున ఒక Ode వ్రాసినట్లు తెలియుచున్నది. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, పంతులుగారి బంధువులును గూడ ఈ విషయము తెలిపిరి. దీనికి అప్పటి బ్రిటిష్ ప్రభుత్వము వారొక ప్రశంసా పత్రమొసగిరి. ఇది ఇప్పుడెంత ప్రయత్నించినను లభ్యమగుటలేదు.

పుస్తక రూపమున లభ్యమగుచున్న పంతులుగారి తొలిరచన "శ్రీవిష్ణు నామమాల స్తోత్రము." ఇది సీస పద్యాత్మకమైన చిన్న పుస్తకము. 1899 లో ముద్రింపబడినది. దీనిని వారు రావు చెల్లయమ్మారావుగారికి అంకిత మిచ్చిరి. ఆమె వారిని ఇంకేదేని యొక ప్రబంధము వ్రాయుమని కోరిరి. పంతులుగారును మఱియొక ప్రబంధము వ్రాయవలెనని తలచుచున్నంతలో కాకినాడ నాటక సమాజమువారు పిఠాపురము వచ్చి నాటకము లాడుట, ఆ ప్రదర్శనములను తిలకించిన వారు శ్రవ్య ప్రబంధముకాక దృశ్యప్రబంధము వ్రాయవలెనని యభిప్రాయము మార్చుకొనుట జరిగినది. దానితో వారు "నర్మదాపురుకుత్సీయము" వ్రాయుట చిత్రముగా సంభవించినది. ఈ నర్మదాపురు కుత్సీయ నాటకమువలన పంతులుగారికి ప్రశస్తి లభించినది. కాళిదాసు, షేక్స్పియరులతో పోలికలుదెచ్చి విద్వల్లోకము వీపు తట్టినది.[1] దానితో లక్ష్మీనరసింహారావు గారు నాటక కర్తగా కుదురుకొనిపోయిరి. అప్పటినుండి 1913 వఱకు పంతులు గారు నాటకములే వ్రాసి, పదునొకండు నాటకములు పూర్తిచేసిరి.

---

1. "నర్మదాపురుకుత్సీయమును రచించినందులకు పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు తెలుగుదేశపు కాళిదాసనిపించుకొనినారు". పురాణము సూరిశాస్త్రిగారి నాట్యోల్లోకము. పుట 267.

"కానిపించెడి నొక్కచోటను గాళిదాసుని ధోరణుల్
మానిపించెడి షేక్స్పియర్ బహుమాన మొక్కొక కల్పనన్"
వేదాల రంగాచార్యుల వారి యనుమోదిక
నర్మదాపురుకుత్సీయము ; మొదటి ముద్రణము.

పానుగంటివారి తొలినాటకములు ముద్రితమగుటకు పూర్వమే పలుచోట్ల ప్రదర్శనభాగ్య మందినవి. పంతులుగారి యల్లుడగు డి. వి. రమణరావుగారు ముద్రణశాల నొకదానిని తణుకులో నెలకొల్పి వారి నాటకము లన్నింటిని అచ్చు వేయుట కారంభించిరి. నర్మదాపురుకుత్సీయము, సారంగధరనాటకము లప్పటికే అచ్చుపడియుండుటచేత "ప్రచండ చాణక్యమును" ముద్రించి "సర్వజన మనో రంజనీ గ్రంథమాల"లో మొదటి దానినిగా వెలువరించిరి. ఈ గ్రంథమాలలో రెండవది పాదుకా పట్టాభిషేకమయ్యెను. ఆ పిదప పిఠాపురపు ప్రభువువారు ద్రవ్యసహాయ మొనర్చుట ప్రారంభమైనందున కాబోలు ఈ గ్రంథమాల పేరు మఱుగువడిపోయినది.

రమణరావుగారు "సువర్ణలేఖ" యను వారపత్రిక కూడ నెలకొల్పిరి. ఇది 1905 లో ఆరంభమైనది.[1] 1913 లో పంతులుగారు దీనిలోనెక్కువ జోక్యము పెట్టుకొనిరి. వ్యాసములు, కథలు ప్రహసనములు ఆ పత్రికకు వ్రాయ దొడగిరి.

తత్పూర్వము పానుగంటివారు "మనోమహిమము" అను మూడంకముల చిన్ని రూపకము వ్రాసి యందు ప్రకటించిరి. 1911 లో అది పుస్తకరూపమున పునర్ముద్రితమయ్యెను. 1913 మార్చిలో పంతులుగారు సాక్షివ్యాసములు వ్రాయుట ఆరంభించి ఆ పత్రికయందు ప్రకటించిరి. ఈ వ్యాసములతో పంతులుగారి సాహిత్య జీవితమున, తెలుగు వాఙ్మయ చరిత్రమున నొక క్రొత్త అధ్యాయము ఏర్పడినదని నిశ్చయముగా చెప్పవచ్చును. మొత్తము ముప్పది యొక్క వ్యాసములను మాత్రమే ఈ సమయమున వారు వ్రాసిరి.

సువర్ణలేఖా పత్రికలో పంతులుగారు వ్రాసిన చిన్నకథలు తొలుత "సువర్ణ లేఖావారపత్రికా కథామంజరి" అను గ్రంథమాలలో ఒక్కొక్కటి యొక్కొక్క చిన్న పుస్తకముగా ప్రకటింపబడినవి. తరువాత నివియన్నియు 1917 లో "కథాలహరి" యను పేరిట సంపుటముగా వచ్చినవి. ఈ వారపత్రికలో బడిన

---

1. 15-3-1905 తేదీగల "కృష్ణాపత్రిక" లో సువర్ణలేఖ తొలిసంచిక తమ కార్యాలయమునకు చేరినట్లు తదధిపతులు వ్రాసియున్నారు.

ప్రహసనములన్నియును 1915 లో "హాస్యవల్లరి" యను సంపుటిగా సంగ్ర హింపబడినవి. 1911 లో పుస్తకముగా వచ్చిన మనోమహిమముకూడ ఈ హాస్య వల్లరిలో చేర్చబడినది.

సువర్ణలేఖ, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక మొదలగు వానిలో పడిన వివిధ వ్యాసములను కాకినాడలోని ఆంధ్రభాషా సంరక్షక సమాజమువారికి 1915 లో వ్రాసి యిచ్చిన ''విమర్శాదర్శ విమర్శాదర్శము" పేరిటి మూడు చిన్నపుస్తకములను కలిపి 1918 లో ''ప్రకీర్ణోపన్యాసములు" అను పేర నొక సంపుటము ప్రకటించిరి.

1913_15 ల నడుమ పంతులుగారు చాల విస్తృతముగా రచనలు గావించిరి. కథలు, ప్రహసనములు, వ్యాసములు ఎక్కువగా ప్రకటించిరి.

1915_20 ల నడుమ పంతులుగారు అయిదు నాటకములు వ్రాసిరి. వీనిలో మూడు అప్పుడును తక్కిన రెండు 1920 తరువాతను అచ్చొత్తింప బడెను.

1920 సెప్టెంబరు నెలలో పంతులుగారు మరల సాక్షిసంఘమును పున రుద్ధరించి, ఆంధ్రపత్రికా సారస్వతానుబంధమున రెండేండ్లపాటు వ్యాసములు ప్రకటించిరి. ఈ వ్యాసములు సాక్షి 2, 3, 4 భాగములైనవి. ఈ సాక్షివ్యాస ముల రచనాకాలము వారి పదునాఱవ నాటకమగు సరస్వతికిని, పదునేడవ నాటకమగు వీరమతికిని నడిమికాలము. 1923 లో వారు "వీరమతి" రచించిరి. అప్పటినుండి 1926 వఱకు వారు వ్రాసినది ఇంకొక్కనాటకమే. 1929_30 సంవత్సరములలో పంతులుగారు మఱల అనేక నాటకములు వ్రాసిరి. పద్మిని, మాలతీమాల, సరోజిని, రాతిస్తంభము, విచిత్రవివాహము, గుణవతి, మణి మాల, కాత్యాయని అప్పటి రచనలు. ఇవికాక రామరాజు, పరప్రేమ, చిన్న నాటకము, సుబ్బరాజు అని ఉన్నవి. ఇవి వారి సప్తతి పూర్త్యుత్సవముల నాటికి పూర్తియైనట్లు తలపవచ్చును. ఈ నడుమ 1927 సెప్టెంబరులో ఒకసారి, మఱల 1933 మార్చిలో నొకపర్యాయము వారు సాక్షివ్యాసములను పునఃపునః ప్రారం భించిరి. కాని రెండు పర్యాయములును అవి సక్రమముగా కొనసాగలేదు.

1930 ప్రాంతమున పంతులుగారు స్వీయచరిత్ర రచన మారంభించిరి. 1865–1908 ల నడుమ చరిత్రము నంతటిని వారు వ్రాసికొనినట్లు మధునా పంతుల సత్యనారాయణగారు "ఆంధ్రరచయితలు"లో వేర్కొనిరి. ఆ స్వీయ చరిత్రము ఇప్పుడు లభ్యముకాదు. చివరిరోజులలో లక్ష్మీనరసింహారావుగారే "నా జీవితచారిత్రము లోకమునకు దెలియనక్కరలేదు." అని చింపివేసిరని తెలియుచున్నది.

## తుది దశ :

పంతులుగారు శ్రీనాథునివలె ఆర్జించి, అనుభవించి, తుదకు అగచాట్లు పడిరని యీవలకే వ్రాయుట యైనది. పీఠికాపురాధీశులుగా నుండిన సూర్యా రాయబహద్దరువారే పంతులుగారిని అధికకాలము పోషించిరి. అభినవాంధ్ర భోజులు, అద్యతన కృష్ణరాయలు అను ప్రశస్తిగాంచిన సూర్యారాయ ప్రభువుల విద్యాపోషణము ఆంధ్రలోకము బాగుగా నెఱుగును. అట్టి మహారాజు ఇచ్చి నన్నాళ్లను మెండుగా దండిగా నిచ్చెను. తుదియందు పంతులుగారికిని, వారికిని వైషమ్యము లేర్పడినవి. మహారాజావారు సహృదయతతో ఇచ్చినప్పుడు ఎంత కోమలముగా నుండెడివారో, పట్టుదలవచ్చినప్పుడు అంత కఠినముగానుండెడి వారు అని వినికిడి. తమవద్ద ఎన్నడోచేసిన ఋణము నిమిత్తమై పంతులుగారి వేతనములో కొంతభాగము కోయించుటకు మహారాజావారు ఉత్తర్వులు చేసిరట.

పంతులుగారు తమ రచనలలో, ఇంక ననేక సందర్భములలో సూర్యా రావుగారి వదాన్యతనుగూర్చి కృతజ్ఞతాపూర్వకముగా, అభిమాన పురస్సరముగ చిత్రించియున్నారు. అట్టిది వారి మనస్సు విఱిగినది. పెట్టినప్పుడు పొగిడి, పెట్టనప్పుడు తెగడు అల్పస్వభావులను అనేక పర్యాయములు తీక్ష్ణముగా మందలించిన పంతులుగారు చివరిదశయందు నిష్కారణముగా ప్రభువును నిందించిరని భావింపలేము. ఏమయినను దైనందిన సంభాషణమున పానుగంటి వారు తమ ఆవేదనను వెడలగ్రక్కుచు, రాజాశ్రయ దుష్పరిణామములను గూర్చి మిక్కిలి వగచినట్లు చెప్పుదురు.

వృద్ధాప్యమువలన పంతులుగారు చివరి దినములలో అటునిటు పోయి సంపాదించుకొనలేకపోయిరి. చేతికి అందివచ్చిన కుమారులున్నను, విడిచి యుండవలసి వచ్చునని ఉద్యోగములకు పంపించకపోయిరి. మొదటినుండియు విభవముతో బ్రతికిన సంసారమయ్యెను.

1933 ప్రాంతమునుండియు శారీరకముగా, మానసికముగా వారి యారోగ్యము చెడిపోయెను. పరిస్థితుల ప్రాబల్యముచేత వారికి లోకముపై నేవగింపు పొడసూపెను. జీవితముపై విరక్తి కలిగెను. అందుమూలమున నొక విధమగు నున్మాదము సైతము వారి కేర్పడెను. సాక్షీవ్యాసములు చివరివి కొన్ని చదివినచో ఆ చిత్తవృత్తి బోధపడును.

## సప్తత్యుత్సవములు :

1935 ఏప్రిల్ 28 వ తేదీన పానుగంటివారికి సప్తతి పూర్త్యుత్సవము జరిగినది. కాని ఈ యుత్సవము జరుగవలసినంత చక్కగా జరుగలేదు. అప్పటికే పంతులుగారియందు మహారాజుగారికి అనుగ్రహము తప్పియుండుటయే అందులకు కారణము. ఈ ఉత్సవమునాటికి మహారాజుగారు కాని, వారి ప్రతినిధులుగాని, ప్రధాన రాజోద్యోగులుగాని పిఠాపురమున లేకుండ దాటుకొనిరి. సన్మాన సంఘాధ్యక్షులు స్వాగతోపన్యాసము చదువుటకైనను సభకు రాకపోవుట చేత వారి బదులెవరో పౌరుగూరివారు చదువవలసివచ్చినది. పంతులుగారిపై భక్తిగౌరవములు గలిగిన కొందరు యువకులు పట్టుపట్టుటచేత ఆ మాత్రమైన జరిగినది.

ఆ సభావృత్తాంతము ఈ విధముగా 30-4-1935 నాటి ఆంధ్రపత్రికలో వర్ణింపబడియున్నది.

పిఠాపురము, ఏప్రిల్ 28.

నేడు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారి డెబ్బదియవ జన్మదినోత్సవము పిఠాపురమున మిక్కిలి జయప్రదముగా, ఉత్సాహవంతముగా

జరుపబడెను. సన్మానసంఘమువారు శ్రీ పంతులుగారిని వారి ఇంటియొద్దనుండి బయల్దేరదీసి పురమున ఊరేగింపుటుత్సవమును జరిపిరి. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారుకూడ నుండిరి. మంగళవాయిద్య సన్నాయి మేళములతో నుత్సవము ఆర్. ఆర్. బి. హెచ్. ఆర్. హైస్కూలునకు చేరినది. అచ్చట పంతులుగార్ల ఛాయాపటములు తీయబడెను.

## గౌ ర వ స భ

పిమ్మట విద్యాలయమున గౌరవార్థముగా మహాజనసభ గావింపబడెను. సభకు వచ్చినవారిలో నీ క్రిందివారు కలరు. శ్రీ ఓలేటి వెంకటరామశాస్త్రులు, చిల్లరిగె జోగయ్యపంతులు (పిఠాపురం అసిస్టెంట్ దివాను) వెంపరాల సూర్య నారాయణమూర్తి శాస్త్రులు, పన్నాల మల్లిఖార్జునదీక్షితులు, నండూరి బంగారయ్య (బి.ఎ., బి.యల్. రాజమండ్రి) కౌరవరపు కామరాజు (ప్లీడరు, పెద్దాపురం) నిడుదవోలు వెంకట్రావు, తాళ్లూరి విజయరామయ్య, కొత్త వెంకట్రాజు, బారు గోవిందరావు, గొల్లకోట వెంకట్రామయ్యగార్లు.

శ్రీ నిడుదవోలు వెంకట్రావుగారి ప్రార్థనశ్లోకములతో సభ ప్రారంభింపబడెను.

స్వాగతోపన్యాసమున పంతులుగారి సాహిత్యసేవ యిట్లు ప్రస్తుతింపబడినది.

"పీఠికాపుర ప్రవేశద్వారమునందే[1] డెబ్బది సంవత్సరముల వయస్సు గడిచినను మేఘ గంభీరధ్వనుల తలదన్ను వాగ్ధోరణితో యావదాంధ్రదేశమును ఉఱ్ఱూతలూగిపోవునట్లు చేసిన మన పానుగంటి లక్ష్మీనరసింహరాయని అపూర్వ విలాస భాసురములగు సాక్ష్యుపన్యాస నాటక, ప్రహసన కోలాహలములు......

పానుగంటి లక్ష్మీనృసింహరాయని గూర్చి చెప్ప బూనుట సాహసము కాకపోదు. జగమెఱిగిన బ్రాహ్మణునకు జన్నిద మన్నట్లుండకమానదు. తెలుగు

---

1. పంతులుగారి మేడ పిఠాపురమున రెలుసేషన్ సమీపమున నుండెడిది.

భాషయందు నాలుగక్షరముల పదములు కలిపి ఉచ్చరింపగలిగినవాడు మొదలు నానాశాస్త్ర విజ్ఞాతవఱకు గల ప్రత్యాంధ్రుడును సాత్ముపన్యాసములను చదివి ఆనందించియుండుననియే మా నమ్మకము. మత సాంఘిక రాజకీయ విదేశ విజ్ఞానాంశములకును హాస్యరసముతో పైపూతపూసి ప్రత్యాంధ్ర వ్యక్తి హృదయమునను జొనిపి దేశమున కంతకును నూతన వికాసము, నవీనోత్సాహము, మాతృభాషాభిజ్ఞానమును జేకూర్చిన మహానుభావుడు. స్వదేశసంస్థానములందలి మంత్రిత్వమునను, గ్రంథకర్తృత్వమునను నిరుపమానమగు మేధాశక్తి నంతను వినియోగించి, తాను నీరసపడుచున్నను ఆంధ్రభాషకు పుష్టియు తాను వృద్ధుడయ్యును ఆంధ్రవిజ్ఞానమునకు యౌవనమును సమకూర్చి కవి యనుటకు సంపూర్ణ యోగ్యత బడసి, విమర్శన సామ్రాజ్య మూర్ధాభిషిక్తుడై ఎదురులేకుండ గ్రాంథిక భాషారంగమున నటించిన మహాశూరుడు. నవరసయుక్తముగా నలువది నాటకముల రచించిన[1] అసాధారణ కల్పనా చతురుడు. అట్టి కవిశేఖరుని సప్తతి పూర్త్యుత్సవమని మనమిచ్చట సమావేశమైతిమి....

ఈ ఉత్సవము లక్ష్మీనరసింహరాయనికి అని అనుకొనకుడు. ఇయ్యది ఆంధ్రశారదాదేవీ సమారాధనము. పదియవ సంవత్సరము మొదలు నేటిదాక ఆతని హృత్పద్మమున విరాజిల్లుచున్న ఆంధ్ర శారదాంబకు చేయుచున్న షష్టి పూర్త్యుత్సవముగాని అన్యముకాదు.''

పిదప శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు అధ్యక్షోపన్యాసములో పంతులుగారి నిట్లు కొనియాడిరి.

''ఈ నరసింహారావుగారు బి.ఏ. చదివినప్పటికిని తోడివారందఱు ఉన్నతోద్యోగముల బ్రవేశించియు, ప్రభుత్వోద్యోగముల బ్రవేశించియు విశేష ధనోపార్జనముచేసి యున్నను ఈయన ప్రభుత్వశాఖయందు ప్రవేశింపలేదు. ప్రతివారును పుట్టినతరువాత ఏదియో యొకవృత్తి చేయుదురు. ఈయన ఆంధ్ర సారస్వతము నభివృద్ధిచేయ, మాతృభాషాసేవచేయ ఈశ్వరాదేశముగా సమకట్టి

8. ఈ లెక్కలో పొరపాటున్నది.

తత్సేవనుచేసిరి..... ఈశ్వరాదేశము లేనిచో ఆయన యిట్టి మాతృభాషాసేవ చేయ నుద్యమింపరు.....

శ్రీ నరసింహారావుగారు వ్రాసిన సాక్షి మొదలైన గ్రంథములనన్నింటిని గురించియు వర్ణించుటకు నాకు సాధ్యముకాదు. ఆయన గ్రంథములన్నింటి యందు అన్ని రసములు నున్నవి. కాని ఆయన గ్రంథములలో విశేషము.... అందును సాక్షియందు హాస్యరసము సమృద్ధిగా ప్రకటింపబడుటచేత జనులను ఆనందభరితులనుగా జేయును. ఆ హాస్యరసమునందును బహు చమత్కారము ఉపయోగించిన సమర్థత వారి గ్రంథముల కాననగును....."

తరువాత పంతులుగారి నాటకములను గూర్చియు చిలకమర్తివారు ప్రశంసించిరి.

ఓలేటి వెంకట రామశాస్త్రిగారు సన్మానసంఘ పక్షమున పంతులుగారికి సన్మానపత్రమును, పట్టువస్త్రమును సమర్పించిరి. ''శ్రీ సూర్యరాయ విద్యానంద పుస్తక భాండాగార సభ్యుల పక్షమున తణికెళ్ల సత్యనారాయణగారు అభినందన పత్రమును జదివి సమర్పించిరి."

తమకు జరిగిన సన్మానమునకు పంతులుగారు ఆనాటి సాయంకాలపు సభలో బదులుచెప్పిరి. సభలో నండూరి బంగారయ్యగారు పంతులుగారి నాటక రచనను ప్రశంసించిరి. తమ యుపన్యాసములో పంతులుగారు వారిని అభినందించి, ఏనాటికైనను దమ నాటకములే ప్రధానములనియు, ఎడమచేతితో వ్రాయబడిన సాక్షిసంపుటములు కావనియు సెలవిచ్చిరి. పానుగంటివారి జీవితచరిత్ర క్లుప్తముగా వచించి మున్నంగి లక్ష్మీనరసింహశర్మగారు హృద్యముగా నుపన్యసించిరి. సాక్షిమహానాటకముపై చర్చించి, యదికూడ ఆంధ్రలోకము జీవించినంతకాలము జీవించునని తణుకు వాస్తవ్యులు పెమ్మరాజు రాజగోపాలుగారు పలికిరి. పంతులుగారి హాస్యరచన యందుండు క్రొత్తపోకడలను వర్ణింపుచు కూచి నరసింహముగారు గొప్ప యుపన్యాస మొసంగిరి. బహుమతు లొసగువేళ సహజహాస్యప్రవృత్తి గలవారగు పంతులుగారు "ఒక మతియుండి, అది సరిగా వినకుండిన బాధపడుచుండు నాకు బహుమతులనిచ్చి యేల బాధింతురు?" అనిరి.

సాయంకాలపు ఈ సభనుగూర్చిన పూర్తి వివరములతోడి ఆంధ్రపత్రిక సంచిక లభ్యముకాలేదు. పైవిషయము ఆ ఉత్సవమును తిలకించి వచ్చినవారు సంగ్రహముగా పత్రికలో వ్రాసిన లేఖ నుండి గ్రహింపబడినది.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు తమ స్వీయచరిత్రలో తాము ఏయే సభలయందు ఏయే తేదీలలో ప్రసంగించి యుండిరో వివరముగా వ్రాసికొని యున్నారు. పిఠాపురపు ఈ సభనుగూర్చిగాని, పానుగంటి లక్ష్మీనరసింహారావు గారినిగూర్చిగాని, ఒక్క యక్షరమైనను స్వీయచరిత్రమున లేదు. మహారాజా వారు వారికేదో కొంత సహాయము చేయుచుండుటయు, పంతులుగారియందు రాజానుగ్రహము తప్పియుండుటయు దానికి హేతువు లనిపించును.

పంతులుగా రప్పటికే మిగుల దుర్దశలో నుండిరి. దానినిగూర్చి సమగ్రముగా తెలుపుటకు 3–5–1935 వ తేదినాటి ఆంధ్ర పత్రికలో బడిన ఈ లేఖ భాగము చాలును.

## శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు

## పంతులుగారి ఆర్థిక దుస్థితి, జనుల కర్తవ్యము

శ్రీ పంతులుగారితో సుమారొక గంటకాలము వారి మేడమీద గడపి కష్టసుఖములు సంప్రదించుకొనిన తరువాత నీ హృదయవిదారకమగు విషయము మీకు విన్నవింపవలసి వచ్చినది. శ్రీపంతులుగారి ప్రస్తుత ఆరోగ్యస్థితి చాల బాధాకరముగా నున్నది. వారు అతిమూత్రవ్యాధితో మిక్కిలి బాధపడుచు మనస్సౌఖ్యముకూడ కోల్పోవుచున్నారు. బమ్మెర పోతనాదుల వరించిన దారిద్ర్యము శ్రీ పంతులుగారిని గూడ వరించి, బాధింపుచున్నది. అచ్చుపడి నిలవలో నున్న గ్రంథములన్నియు జప్తుచేయబడినవి. ఋణదాతలకు కొంత ద్రవ్యము తీర్పవలసియున్నది. జూన్ 29 వ తేదీకి సుమారొక వేయిరూపాయలైన తీర్మానింపకున్న జరుగగల విపరీత పరిస్థితులు విన్నంతమాత్రమున హృదయము నీరగుచున్నది.

"నాకెవరును దానధర్మము చేయనక్కరలేదు. తగ్గింపుధరలకు 50 సెట్లు పుస్తకములు అనగా 1050 రూ. కిమ్మత్తుగల పుస్తకములు 50 మంది కొని నా మానుషము కాపాడినను నాకు సివిలుఖైదు తప్పును." అని పంతులుగారు రుద్ధకంఠముతో వచింప నేరి హృదయము బాధపడకుండును ? ఆంధ్రావనియందే శ్రీమంతులైనను నూర్గురు ముందునకు వచ్చి తగ్గింపుధరలలో నున్న 25 పుస్తకములు అనగా 20 నాటకములు 5 సాక్షివాల్యూములు 25 రూ. కిమ్మతుకలవి 20_0_0 రూ. చొప్పున కొని యాదరించిన కవిసార్వభౌముడు కొంతకాలము మనలను, మన భాషను సేవింపగలడు. లేకున్న పాపము శమించుగాక! మన అలసత్వమున నీ మహాకవిశేఖరుని మన చేతులార పిచ్చివానిని జేయుటో లేక ఏమిచేయుటో జరిగిపోగలదు. కావున అస్మద్దేశీయ సోదరులారా ! ఈమాత్రము సానుభూతి వెన్వెంటనే చూపి వారి పవిత్ర దేహాత్మల గాపాడుకుందుముగాక !

—యర్రమిల్లి లక్ష్మీనారాయణశాస్త్రి.

అమలాపురం; 29_4_1935.

పంతులుగారి చరమదశ యిట్లు గడిచినది. వారు సృష్టించిన సాహిత్యమును పరిశీలించినచో వారి బుద్ధి, మనస్సు ఎంతతీవ్రముగా పనిచేసినవో ఎఱుగవచ్చును. అట్లు శక్తికి మించి పనిచేయుటచే నరములు బలహీనములై నిద్రలేమిచే ఎక్కువగా బాధపడిరి. పంతులుగారు కూర్చుండిన గదియందొకసారి కందిరీగవచ్చి గుయ్యిమని రొదపెట్టగా అది సహించలేక వారు ఆపాదమస్తకము వణికిపోయి గుండెలు దడదడలాడగా కుప్పకూలిపోయిరట. వారి శరీరమంత దుర్బలమైపోయెను.

పరిస్థితులు అనుకొననిరీతిగా మాఱిపోవుట, దగ్గరవారు దూరమగుట, తమకు రావలసినంత గుర్తింపు రాలేదను మనస్తాపమేర్పడుట_వీనితో పంతులుగారు మఱింత క్రుంగిపోయిరి. ఆ పరిస్థితులతోనే తీసికొని, 1_1_1940 తేదీన తెల్లవారుజామున వారు దేహము చాలించిరి. అప్పటికి వారి వయస్సు డెబ్బదియైదు సంవత్సరములు.

పంతులుగారి యస్తమయమునుగూర్చి 2_1_1940 నాటి ఆంధ్రపత్రిక యిట్లు ప్రకటించినది.

## ఆంధ్ర అడిసన్ నిర్యాణము.

పిఠాపురం, జనవరి 1. గత రెండు మూడు సంవత్సరముల నుండియు వయోభారముచే శరీరమందలి దౌర్బల్యముచే బాధపడుచు తమ 77 వ సంవత్సరమున[1] 1_1_1940 తెల్లవారుఝామున 2-30 గంటలకు స్వగృహమున భౌతిక దేహము చాలించి శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహం పంతులుగారు స్వర్గలోకమున కేగిరి. భార్యయు, కొడుకులు, కూతుండ్రు తదితర బంధువర్గము అవసానకాలమున దగ్గరనే ఉండిరి."

"వీరు వ్రాసిన....నాటకాలు వీరి కీర్తికి శాశ్వత చిహ్నాలుగా ఏర్పడియున్నాయి. వీరి నాటకరచనలో ఒక అద్భుతమైన వ్యక్తిత్వం అందరు కూడా అంగీకరించియున్నారు. పాఠకుల నత్యధికంగా నాకర్షించే అద్భుతశక్తి వీరి శైలిలో సహజంగానే ఉంది. వీరు వ్రాసిన సాక్షివ్యాసాలలోని రచనా కౌశలం నిరుపమానం. నాటకాలలోను సాక్షి వ్యాసాలలోను కూడా సరసమైన హాస్యం అత్యధికంగా ఉంటుంది....

సరససాహిత్య ప్రశస్త కవన కవిశిఖామణి అనేది వీరికి సార్థకనామమే. వీరి రామభక్తి నిరుపమానం. వీరు బి. ఏ. డిగ్రీని పడసినారు. ఆంధ్ర గీర్వాణ భాషాకోవిదుడు___"

అని సంపాదకీయములో ఆంధ్రపత్రిక శ్రద్ధాంజలి సమర్పించినది.

6_1_1940 నాటి కృష్ణాపత్రిక కూడ పంతులుగారి యస్తమయమును గూర్చి సంపాదకీయము వ్రాయుచు వారిని ఇట్లు కీర్తించినది.

"శ్రీ నరసింహం పంతులుగారు తెలుగు కవిత్వ సీమలలో వన్నె కెక్కిన వీరులు, ఆంగ్లభాషాకోవిదులు, రాజకీయవేత్తలు....

---

1. దీనిలో వయస్సు లెక్క పొరపాటు పడినది.

వీరి రచనలలో ఒక ప్రత్యేకత, మాధుర్యం కనిపించుతుంది. తంగేడు జున్నువంటి కవిత్వం, ధారాపూరితమైన శైలి, శిల్పసౌభాగ్యమైన రచన. అందుచేతనే వారి రచనలు ప్రజాహృదయాల నెంతో ముచ్చటగా ఆకర్షింప కలిగినాయి.

నరసింహంగారి రచనలలో ముఖ్యముగా హాస్యరసపోషణ కడు సున్నితంగా కనుపిస్తుంది. దానికి వీరు వ్రాసిన సాక్షి వ్యాసాలే సాక్ష్యం. ఈ వ్యాసాలకు ఆంధ్రదేశమంతటా అత్యధికమైన వ్యాప్తి కలిగింది. అఖండమైన స్వాగత మిచ్చింది దేశం. వీటిలోని హాస్యరసపోషణ వీరి రచన కొక ప్రత్యేకతను సమకూర్చింది.

వీరి నాటకములలోని రచనా సౌలభ్యము కళావైదగ్ధ్యము గమనించి వీరికి ఆంధ్ర కాళిదాసు అని బిరుద మీయబడింది. శ్రీ నరసింహముగారి మరణమువలన తెలుగునాడున కొక గొప్ప నాటకకర్త, భాషాసేవకుడు, రాజకీయవేత్త, కవిచంద్రుడు కరవై పోయినాడని చెప్పదగును."

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక ఈ సమయమున పంతులుగారినిగూర్చి యిట్లు వ్రాసినది.

"పంతులుగారు చిరకాలము నుండియు పరిషద్గౌరవ సభ్యత నంగీకరించియు, 1922 వ సంవత్సరమున పీఠికాపురమున జరిగిన యాంధ్ర సాహిత్య పరిషదేకాదశ వార్షికోత్సవమున కధ్యక్షపదవి నలంకరించియు బరిషత్తున కెంతేని యభ్యుదయ మొనగూర్చినారు....

పంతులుగారు పీఠికాపురాస్థానమున నాటక రచయితలుగా బ్రవేశించి రచియించిన నాటకము లమూల్యములు........సాక్షి సంపుటములందలి యుపన్యాసములకంటె నీ నాటకముల యందే పంతులుగారి ప్రతిభావిశేషము, కల్పనా పాటవము ప్రకటితము లగుచున్నవి...."

(సంపుటి 28, సంచిక 5.)

## సన్నిహితులు :

పంతులుగారి జీవితచరిత్ర సంగ్రహమునందు వారికి సన్నిహితులగు కొందఱు వ్యక్తులనుగూర్చి చెప్పుకొనవలసియుండును. అందు మొట్టమొదటి వారు పీఠికాపురాస్థాన ప్రభువులుగా నుండిన స్వర్గీయ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు.

సూర్యారావుగారు 5-10-1885 న జన్మించిరి. వీరి తండ్రి శ్రీ రాజా రావు వేంకట గంగాధర రామారావుగారు మరణించు సరికి వీరికి అయిదు సంవత్సరముల వయస్సు మాత్రమే యుండెను. పిఠాపుర సంస్థాన వారసత్వపు వ్యాజ్యములో గెలిచి వీరు మైనారిటీ తీరిన వెనుక 1906 అక్టోబరు 5 వ తేదీన రాజ్యము నప్పగించుకొనిరి. మైనరుగా నుండగా నప్పటి బ్రిటిష్ ప్రభుత్వము వీరి రాజ్యమును స్వాధీనమున నుంచుకొని వీరిని మద్రాసులో విద్యాభ్యాసమునకు పంపినది.

రాజావారి వివాహము 26-4-1906 న జరిగినది. ఆ సందర్భములో ప్రదర్శించుటకై పంతులుగారు కోకిల నాటకమును వ్రాసిరి. తరువాత జరిగిన పట్టాభిషేకము సందర్భమున ప్రదర్శించుటకు విజయ రాఘవ నాటకము వ్రాసిరి. అప్పటినుండియు ఇరువురికును సన్నిహితత్వము ఎక్కువ యయ్యెను.

రాజావారు ఆ పిదప నీతితో నిండిన నాటకమును వ్రాయుమని కోరగా పానుగంటివారు బుద్ధబోధ సుధ నాటకమును, హాస్యయుక్తమగు నాటకమును వ్రాయుమని కోరగా వృద్ధ వివాహ నాటకమును, మిగుల నవ్వువచ్చు నాటకమేదైన రచింపు మనగా కంఠాభరణమును వ్రాసి యిచ్చిరి.

దాదాపుగా పంతులుగారి పుస్తకములను అన్నింటిని రాజావారే అచ్చు వేయించిరి. సూర్యారావుగారు చేసిన యీ యుపకారమును పంతులుగారు బహు కృతజ్ఞతతో స్మరించుకొనిరి. 1922 వ సంవత్సరము జూన్ 3 వ తేదీన వీరికి మహారాజా బిరుదము లభించెను. ఆ సందర్భమున పంతులుగారు సాక్షిలో నొక వ్యాసమును కూడ వ్రాసియున్నారు.

మహారాజావారు సాహిత్య పోషకులు. అభినవ భోజులని, అద్యతన కృష్ణరాయలని ఖ్యాతి సంపాదించిరి. వీరు వీర గ్రాంథిక భాషావాదులు. పంతులు గారు తదనుకూలముగా గ్రాంథిక భాషావాద సమర్థనమునకై వ్యాసములు మున్నగునవి వ్రాసిరి.

మహారాజా వారు వృద్ధాప్యములో 6-3-1964 న స్వర్గతులైనారు.

రెండవ వ్యక్తి కూచి నరసింహముగారు. వీరిని పానుగంటి వారిని, చిలకమర్తి వారిని గలిపి సింహత్రయమను పేరిట వ్యవహరించుచు నండూరి బంగారయ్యగారు ఒక వ్యాసమును భారతిలో వ్రాసియున్నారు.[1]

కూచి నరసింహముగారును, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారును చిన్నప్పటి నుండియు సహాధ్యాయులు. వీరు 17-12-1866 తేదీన కృష్ణాజిల్లా కుంచెనపల్లి గ్రామమునందు జన్మించిరి. పుల్లమాంబ వీరి తల్లి, వెంకనార్యులు వీరి తండ్రి. 1873 లో వెంకన్నగారు పిఠాపురమున నివాస మేర్పఱచుకొనిరి. వెంకన్నగారి తమ్ములు రామయ్య, సుబ్బయ్య గారలు రాజాస్థానమునందు పరిహాసకులు, పౌరాణికులుగా నుండిరి. 1888 లో తత్త్వశాస్త్ర మైచ్ఛికముగా బి. ఏ. పట్టమునంది, నరసింహముగారు ఎలమంచిలి బోర్డు హైస్కూలులో ప్రధానోపాధ్యాయులుగా మూడేండ్లు పని చేసిరి. 1892 నుండి నరసాపురములో పనిచేసి, 1900 లో నూజివీడు హైస్కూలునకు వచ్చిరి. 1903 లో పిఠాపురము నందలి హైస్కూలునకు పానుగంటివారు పాలక కార్యదర్శిగా నున్నప్పుడు వీరిని పిఠాపురమునకు గొనివచ్చిరి. స్వగ్రామముపై గల యభిమానముచేత హెచ్చు జీతముపై నాహ్వానములు వచ్చినను, వీరు పిఠాపురము విడిచిపెట్టలేదు. పదునేడున్నర సంవత్సరము లచ్చట పనిచేసి 1920 లో నరసింహముగారు ఉద్యోగ విరమణము చేసిరి.

పంతులుగారి నాటకములలో మూడవదగు ప్రచండ చాణక్యము మొదలు కొని తక్కిన యన్ని నాటకములకును దాదాపు వీరు నాంది, ప్రస్తావనలు వ్రాసి

---

1. భారతి 12వ సంపుటము సంచిక 1. జనవరి 1935.

యిచ్చుచుండిరి. అట్లే కూచి నరసింహముగారు వ్రాసిన వనవాసి, రూపలత నాటకములకు పానుగంటివారు నాంది, ప్రస్తావన వ్రాసి యిచ్చిరి. నరసింహము గారు గౌరాంగ చరిత్ర మను పద్యకావ్యము వ్రాసిరి.

వీరును, పానుగంటివారును గలిసి "ఆనంద వాచక" పుస్తకములను వ్రాసిరి. చక్కని ప్రణాళికతో ఈ వాచక పుస్తకములు మిగుల బాగుండినట్లు చెప్పుకొందురు.

కూచివారు శ్రీరామ భక్తులు. శ్రీరాములవారు, సీతమ్మతల్లి అనియేగాని ఎన్నడును రాముడు, సీత అని ఎఱుగరు. ఉపాధ్యాయులుగా వారార్జించిన కీర్తి అనితరసాధారణమైనది. వీరు పానుగంటివారు గతించిన కొలది కాలమునకు 7-10-1940 న స్వర్గతులైరి.

మూడవ వ్యక్తి వంగూరి సుబ్బారావుగారు. వీరి స్వగ్రామము పశ్చిమ గోదావరిజిల్లాలోని సిద్ధాంతము అనునది. అయినను వీరు బహుకాలము పిఠాపురములో నుండిరి. వీరు వ్యాపార రంగములోనుండి సాహిత్యరంగములోనికి అడుగుపెట్టిరి. శతక కవుల చరిత్ర, ఆంధ్ర వాఙ్మయచరిత్ర వ్రాసిరి.

సువర్ణలేఖలో వసంతుడు అను ప్రచ్ఛన్న నామముతో వీరు "చెన్నపురి లేఖలు" ప్రకటించుచుండెడివారు. అప్పటినుండియు వీరికి పంతులుగారితో సాహచర్యము ఉండెడిది. సారస్వతానుబంధము ఆంధ్రపత్రికలో ప్రకటింప నారంభించినప్పటినుండియు కొంతకాలము వీరు "వసంత లేఖలు" అని వ్రాసిరి.

వీరికి పానుగంటివారన్న గల భక్త్యనురాగములు చెప్పనలవికాదు. వారి ప్రతిభ లోకమునకు సరిగా వెల్లడికావలెనని వారెంతయును ఆరాటపడిరి.

"సాక్షి స్వరూప స్వభావములు, మేధాశక్తి, బుద్ధివిశేషము, రసోదయ మగు వ్రాతలు, జన్మాదికములు వివరముగ తెలిసికొనగోరు వారుండకపోరు. ఇప్పు డుండకపోయిన ముందైన ఉండకపోరు. ఆ మహాత్ముని జీవితమును చదివి అతనిని ముందారాధించు దినములు రాగలవు." అని వంగూరి సుబ్బారావుగారి

విశ్వాసము. ఇచ్చట వారు సాక్షి వ్యాసకర్త యగు పంతులుగారిని దృష్టియం దుంచుకొని సాక్షియని కూర్చిరి. ఆంధ్ర పత్రిక యందలి సారస్వతానుబంధము నందు సాక్షి వ్యాసములు వ్రాయుట పంతులుగారు ఉపసంహరించిన సందర్భమున వెలువడిన 16 వ వసంతలేఖలో (9-9-1922 నాటి ఆంధ్రపత్రిక.) వారు ఇట్లు వ్రాసిరి.

ఆంధ్రపత్రిక అభివృద్ధికి వచ్చి విద్యాధికుల యందు బాగుగా ప్రచారమగుటకు సారస్వతానుబంధము ప్రారంభించుట మిక్కిలి యవసరమనియు, అందును పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిచే సాక్షివ్యాసములు వ్రాయించుట మఱియు నావశ్యకమనియు సుబ్బారావుగారు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి సూచించిరట. పానుగంటివారితో అట్టి ఏర్పాటుచేయుటకు నాగేశ్వరరావుగారు సుబ్బారావుగారినే నియోగించిరి. ఈ విధముగా 1914 లో ముగిసిన సాక్షిసంఘ కలాపములు, వ్యాసములు మఱల 1920 లో పునరుద్ధరింపబడుటకు సుబ్బారావుగారు కారకులైరి.

ఆ విషయమై యింతకు ముందు పేర్కొనిన పదునారవ వసంతలేఖయం దిట్లు వ్రాసిరి.

"సాక్ష్యపన్యాసములు ఆంధ్రపత్రికలో ప్రకటనము ఆరంభించుటకు నన్ను పరమేశ్వరుడు ఒక చీపురుపుల్లగా కార్యకారణ సంబంధమున చేసెనను సంతృప్తి పొంది యుండెడివాడను. సాక్షికి శ్రీపీఠికాపురాధీశ్వరులును, ఆంధ్రపత్రికాధిపతులును ప్రస్తుత దినములలో ఎవ్వరును ఏ కవికిని ఈయని ప్రతిఫలము ఇచ్చుచున్నారని సంతసపడుచు, ఆ ప్రతిఫలము నాకు ముట్టుచున్నట్లు మురియుచుంటిని."

సుబ్బారావుగారి వసంతలేఖలు మొత్తము 64. ఇవి నేటివఱకును గ్రంథరూపము దాల్చలేదు. ఈ లేఖలలో సాక్షిప్రభావము అపరిమితముగా కన్పట్టును. ఇవి వెలుగునకు వచ్చినచో సాక్షివ్యాసములయందు సూచితములైన యనేకాంశములను సరిగా నర్థము చేసికొనుట కవసరమగు వ్యాఖ్యానము లభింపగలదు.

పంతులుగారి జీవితచరిత్ర వ్రాయవలెనని, వారి సాహిత్య ప్రతిభను ప్రశంసించి, ఆధునికాంధ్ర సారస్వతమున వారికిగల సముచితస్థానమును తెలియ పఱచవలె ననియు పంతులుగారిపై తమ కున్నంత భక్తిగౌరవములను పదిమందికి కలిగింపవలెననియు సుబ్బారావుగారు తీవ్రముగా వాంఛించిరి. కాని దురదృష్ట వశమున పెద్దవయసు రాకముందే 1923 లో వీరు కాలముచేసిరి. వారే జీవించి యుండిన పంతులుగారికి ఒక బాస్వెల్ అయి ఉండెడివారే ;

## మఱికొన్ని విశేషములు :

పంతులుగారి జీవితచరిత్రమును వ్రాయుట కింతకన్న నెక్కుడు చారిత్రీ కాంశములు లభ్యమగుటలేదు. అంతటి అసాధారణవ్యక్తి గతించి, పట్టుమని పాతికేండ్లు కాకమునుపే వారి మాట మఱుగుపడుచున్నది. గట్టి ప్రయత్నము చేసిననేగాని వారి పుస్తకములుకూడ లభింపనట్టి స్థితి వచ్చినది. పంతులుగారితో పరిచయ భాగ్యము పొందిన వ్యక్తు లనేకులు ఇప్పుడున్నారు. ప్రయత్నము చేసినచో వారు పంతులుగారికి సంబంధించిన అనేక సన్నివేశములను జ్ఞాపకము చేసికొని చెప్పగలుగుదురేమొ. అట్టివి కొన్ని ఇచట పొందుపఱుప బడుచున్నవి.

పంతులుగారు శ్రీరామ భక్తులు. తారక మంత్ర జప పరాయణులు. ఆ భక్తియంతయును వెల్లువలై వారి రామాయణ నాటకముల రూపము తాల్చి నది. విజయ రాఘవ నాటకమున నొక పద్యము పంతులుగారు వ్రాసిరి. శ్రీరాము డెన్ని పర్యాయములు కొట్టినను రావణునికి పఱల మఱల తలలు మొలిచినవి. రాము డాలోచన భావమున రావణుని విడిచి ఈవలకు వచ్చెను. అంగదు డదిచూచి ఇట్లు వర్ణించెను.

"తల నెడమ ప్రక్కనకుఁ గొంత దార్చి వెలుప
లి కను దమ్మితోఁ బైకిఁ జూచి కటిమీఁద
నెడమ చేయి మడచి, కుడి మడమ పైని
విల్లు దాటించుచును వచ్చు మెల్ల నతఁడు."

ఈ పద్యము వ్రాయుటకు క్రిందటి రాత్రి వారికి శ్రీరామచంద్రుని మూర్తి యట్లు స్వప్నమున తోచెనట.

పంతులుగారు సంభాషణ కుశలురు. వారితో మాట లాడినంత సేపును ...నము నవ్వుచుండ వలసినదే. కాని వారెన్నడును చిరునవ్వు అయినను నవ్వి ఎఱుగరు. ఎదుటి వారిని పొట్ట పగులునట్లు నవ్వించుచు తాము కొఱకొఱలాడుచు చుఱచుఱ చూచుచుండెడి వారట. పంతులుగారిది తేలుకొండి స్వభావము. మాట లాడుచు, మాటలాడుచు అక్షేపణముగానో, పరిహాసముగానో ఎదుటి వారి కొక చుఱక తగిలింపక మానలేక పోయెడివారు. వారి ఎదుట పడుట యన్న ఎల్ల రకును భయము. మహారాజావారే కొంత ఒదిగి యొదిగి యుండెడివారట.

ఒక పర్యాయము మహారాజావారు ఇత్తుమన్న కొంత ద్రవ్యము చాల ఆలస్యమైనదట. ఒక రాజ భటుడు పైకమును గొనివచ్చి పంతులుగారికి ఇంటి యొద్ద నిచ్చెను. ఆలస్యమైనదన్న కోపము, విసుగు ధ్వనింపగా పంతులుగారు "ఇప్పటికి పంపించెనా ఆ ........" అని దురుసుమాట వాడిరట. మఱి రాజ భటుడు—వీలుకానప్పుడే కొండెములు చెప్పగల సమర్థత గలవాడు—ఇప్పుడు పోయి చెప్పకుండునా? పంతులుగారు తమ తొందరకు నాలుక కఱచుకొనిరి. కాని లాభమేమి? ఆ నాటి సాయంత్రము మహారాజా వారిని కలిసికొనుటకు పంతులుగారు మామూలుగా వెళ్ళిరి. "ప్రొద్దుట తాము పంపిన పైకము అందినది. కొంత ఆలస్య మైనదన్న కోపము, మఱికొంత అది అందక పోవుటచే కలిగిన సంకటము వలని విసుగు కారణములుగా నే నిట్లన్నానని భటుడు తమకు చెప్పియేయుండును." అని పంతులుగారు చెప్పిరి. మహారాజా వారు ఆ నిర్భయమునకు వెఱగుపడినను వెంటనే "అర్థమైనది. సరిసరి. మఱి మీయు ఫరవాలేదు." అని రట. అట్టివి వారిరువురి సమున్నత స్వభావములు.

క్రొత్త వారెవరైన నున్నప్పుడు చాల గంభీరముగ, ముభావముగ నుండుట వారికి అలవాటు. పరిచయము బాగుగా నేర్పడినచో నిక పట్ట శక్యము కాదు. శృంగారము మేళవించి చిత్ర విచిత్రమైన చమత్కార పూర్వక కథలు నోరూరగ చవులు పుట్ట వర్ణించి చెప్పుచుండెడివారు. పంతులుగారి సంభాషణ

ములో "నా యీ కావ్య పాత్రకు ఈ వ్యక్తి మూల ప్రకృతి" అని ఎన్నడును చెప్పకున్నను, ఛాయామాత్రముగా వారి సాక్షి, నాటకముల యందలి కల్పనలకు సంబంధించిన అనేక విశేషములు పొడగట్టు చుండెడివి.

పంతులుగారి రచనలలో స్థానిక వాతావరణము ప్రచ్ఛన్నమై మెండుగా నుండును. వారికి తారసిల్లిన యనేక వ్యక్తులు అటు నిటు మార్పులతో వారి గ్రంథములయం దెక్కినారు. విజయ రాఘవ నాటకములోని రావణుని ఆస్థాన వైద్యుడు, సరస్వతిలోని జయరామసింగు, కంఠాభరణములోని కృష్ణారావు, సాక్షిలోని మఱియు ననేక పాత్రములు, కొన్ని కొన్ని సన్నివేశములు వారి జీవితములో చూచిన వాని నుండి ఆవిర్భవించినవే యని చెప్పుదురు. సమకాలీన వృత్తాంతములను సహితము మనము వారి రచనలనుండి కనుపట్టవచ్చును. శిక్షితుడు మృతి చెందెనను నిశ్చయ మేర్పడు పఱకు ఉరిదీయ వలెనన్న క్రొత్త యోజ్ఞ కోకిలలో చోటు చేసికొనినది. సమావేశములను, సభలను ప్రార్థనతో ఆరంభించు క్రొత్త ఆచారము వారి కంఠాభరణమున ప్రస్తావింప బడినది. మహారాజాంతః పురములందలి దాసీ జనము స్వైరిణులు కాకుండ అరికట్టుటకై వివాహిత లనే నియమింప వలెనన్న మొక్కపాటి సుబ్బారాయుడు గారి సంస్కరణము సరస్వతిలో చర్చింప బడినది. అట్టివి కొన్ని మునుముందు సూచింప బడును.

పంతులుగారి చమత్కారము లప్పుడప్పుడు కొంచెము ఘాటుగా నుండును. వారు లక్ష్మీనరసాపురమున దివానుగా నున్న దినములలో నొక బీద బ్రాహ్మణుడు జమీందారిణికి విజ్ఞాపనము చేసికొనుచు, నా కీ సహాయము చేసినచో తమకు గయలో బ్రాహ్మణ సంతర్పణము చేసినంత, కాశీలో గోదానము చేసినంత ఇత్యాది పుణ్యము లభింప గలదు అని వ్రాసికొనెను. దానిపై పానుగంటివారు త్రిప్పి వ్రాయుచు "జమీందారిణి గారికి ప్రస్తుతము అంత పుణ్యము కావలసిన ఆవశ్యకము లేనందున దరఖాస్తు నిరాకరించుట యైనది." అని త్రోసి పుచ్చిరి.

కాకినాడలో ఒకసారి కంఠాభరణము ప్రదర్శించిరి. పానుగంటివారిని ప్రదర్శనానంతరము నాలుగు ముక్కలు చెప్పుడనిరి. వారు మాటలాడుచు

మధ్యలో నొక విసురు విసిరిరి. "సుబ్బలక్ష్మి, గంగాళమ్మ పాత్రలు బాగుగానే ఉన్నవి." అని. నాటకములోని పాత్రములు సుబ్బలక్ష్మి బంగారమ్మ : సుబ్బలక్ష్మి పాత్రధరించినయామె వక్షోజసంపద, బంగారమ్మ పాత్రధారిణి స్థౌల్యము పంతులుగారి మాటలయందట్లు ధ్వనించినవి.

ప్రతి దినమును సాయంకాలమగు సరికి తెల్లని యుడుపులు ధరించి పెద్ద యంచు జరీ ఉత్తరీయము వేసికొని వీరుకోటలోని కేగెడివారు. మహారాజావారితో కొంత తడవు ఇష్టాగోష్ఠి సలిపిన వెనుక దివాణపు బగ్గీలో తిరిగి పోవువారు. దివాణము ముందటి గులాబీతోటలో నొకపువ్వు—ఆ తోటలో పూలు కోయ గూడదని కఠిన నియమము-మహారాజావారు స్వయముగా కోసి వారి కిచ్చెడివారు. పంతులుగారి సాక్షి ఉపన్యాస విషయము లనేకములు ఈ ఇష్టాగోష్ఠి సందర్భమున ఆవిర్భవించినవే యందురు.

పంతులుగారి సరస్వతి నాటకము మహారాణివారు చదివించుకొని వినిరి. వానిలో కవలలోనిదగు సరస్వతి గోవర్ధనుని మాటవిని "ఈ తఁడు మాటలాడగ నేను మాటలాడి నట్లే యున్నది." అను కొనును. ఈ సందర్భము రాగానే మహారాణిగారు పంతులుగారిని ప్రశ్నించిరట—"ఎవరిమాట తీరు వారి కంత స్పష్టముగా తెలియునా ?" అని. దానికి సమాధానముగా ఆ మాటను సమర్థించుకొనుచు పంతులుగారు నిదర్శన పూర్వకముగ నొక పెద్ద "థీసిస్" వ్రాసి సమర్పించిరని సూర్యారావుగారి జ్యేష్ఠపుత్రులు రాజా గంగాధర రామారావుగారు తెలిపిరి. పంతులుగారి ప్రతిభ యట్టిది.

పంతులుగారు ఏక సంథాగ్రాహులు. వారు క్రొత్తపల్లి జగ్గారాయనింగారి యింటిలో పిల్లలకు ట్యూషను చెప్పుచుండిన దినములలో ఒక కవి ఎవ్వరో శతక మొక కొంత వ్రాసి ఆ వెలమ దొరలకు వినిపించిరి. పంతులుగారు ఈ ప్రక్కనే పిల్లలకు పాఠములు చెప్పుచు ఆ కావ్యగానమునం దొక చెవి ఉంచిరి. తరువాత నొకటి రెండు రోజులకు అగ్ని ప్రమాదము సంభవించి, కవి వ్రాసి పెట్టుకొనిన పుస్తకము కాలిపోయెను. ఆయనవచ్చి ఆ విషయము దొరగారితో చెప్పి వాపోవుచుండగా, పంతులుగారు వారితో "నాకు జ్ఞాపకమున్నంత వఱకు

ఆ పద్యములు నేను చెప్పెదను." అని తాము వినిన ఆ నలువది యేబది పద్యములు ఒప్పగించిరి. అంతట దొరగారు మిక్కిలి విస్మయపడి "నేను సన్మానించ వలసినది కవినా? మిమ్ములనా?" అని ప్రశ్నించిరట. అట్టిది వారి జ్ఞాపకశక్తి.

ఇంకొకపర్యాయము కోర్టువ్యవహారములు పరిశీలించుచు ఎవరో తెచ్చిన దస్తావేజు ఒక్కసారి మొదటినుండి తుదిదాక చూచి, కాగితములు క్రిందపెట్టి మొత్తము ఒప్పగించిరట. కూచి నరసింహముగారును, పంతులుగారును కలిసి అనిబిసెంటు ఉపన్యాసము వినివచ్చిరి. కూచివారు ఆ ఉపన్యాసమును, శబ్ద ప్రయోగ నైపుణ్యమును, శైలిని మిక్కిలి మెచ్చుకొనుచు, ఆమె యుపన్యాస మును మఱల వినవలెనని కోరిక కల్గుచున్నదనిరి. పంతులుగారు అంతట ఆ ఉపన్యాసము నంతటిని గడగడ వినిపించిరట. వారి మనస్సునకుగల కేంద్రీ కరణ, వారి అసమాన ప్రజ్ఞ యంతటివి.

ఆ కాలములో వెలువడుచుండిన ఆంధ్రాంగ్ల పత్రికలను వారు శ్రద్ధగా చదువుచుండెడివారు. జ్ఞాపకశక్తి అధికముగా గలవారు కావున ఎట్టి చిన్న అంశ మైనను కావలసివచ్చినప్పుడు చెప్పగలిగి యుండెడివారు. అందుచేతనే సాక్షి యందు ఏ స్వల్ప విషయమునైనను విపులీకరించి పంతులుగారు చెప్పగలిగిరి. ముందు వెనుక ఆలోచించుకొనకుండ అనర్గళముగ, మహాప్రవాహముగా సాక్ష్యుపన్యాసములను లేఖకులకు వారు చెప్పుచుండెడివారట.

లక్ష్మీనరసింహారావుగారికి బహుశాస్త్ర పరిచయము గలదు. వారి నాటక ములలో, సాక్ష్యుపన్యాసములలో ఈ వేత్తృత ద్యోతక మగుచుండును. సంగీ తము, జ్యోతిషము, వైద్యము, ఆధునిక రసాయనాది శాస్త్రములు మున్నగు వానికి సంబంధించిన ప్రస్తావన ఎన్నిచోట్ల యందో వారి రచనల కానవచ్చును. అపర తుంబురులని ప్రసిద్ధిగన్న తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారివద్ద పంతులు గారు కొన్నాళ్లు వీణ నేర్చికొనినారట.

మతత్రయమునకు సంబంధించిన విజ్ఞానము పంతులుగారు సాధించిరి. ఆ యా ప్రత్యేక శాస్త్రముల యందు నిష్ణాతులైన పండితులును కత్తియంచువలె పదునైన పంతులుగారి మేధాశక్తి నెదిరి నిల్చుటకు జంకు చుండెడివారు.

పంతులుగారిని అప్పటికప్పుడు వేదిక ఎక్కించినను, ఎట్టి విషయమును గూర్చియైన అనర్గళముగా నుపన్యసింపగలిగి యుండెడివారు. వారిని గూర్చిన విశేషములు సేకరించునెడ ఎవరిని గలిసికొనినను అప్రయత్నముగా ముందు వచ్చిన మాటలు ఇవియే. ''పంతులుగారా? మహానుభావుడు ! మహామేధావి!''

పానుగంటివారికి గల ఆహారపు టలవాట్ల గూర్చియు చెప్పుదురు. వారు సహజముగ మితభోజనులు. మజ్జిగ వారికి గిట్టెడిదికాదు. పాలుమాత్రమే అన్నమున పోసికొనెడివారు. ఎల్లప్పుడును గొంతు కూర్చుండి భుజించెడివారు. వారికి పొగచుట్టపై నెక్కువ ఆసక్తి ఉండెడిది. చివరి రోజులలో నల్లమందు అలవాటుకూడ అయినది. కాని తుది దినములలో మనసును నిగ్రహించి, రెండింటిని మానివేయగలిగిరి.

బాహ్య పూజాదికములయందు వారికి నిరసన లేకున్నను, వ్యక్తిగతముగా వారు ఆరాధన యుక్తభావనకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చినారు.

పంతులుగారి భావనలో నిశితత్వము ఉన్నది. ప్రతిభలో తీక్ష్ణతయున్నది. వారు సాత్త్వికగుణ ప్రధానులో, రాజసగుణ ప్రధానులో సులభముగా నిశ్చయింపలేము. వారు ఏది తలపెట్టిన, దానిలో లీనమై పోగలరు. పరస్పర విరుద్ధములగు గుణములు వారిలో మేళనము పొందినవి. ఆ వ్యక్తిత్వమే వారి రచనల కొక విశిష్టతను, విలక్షణతను ప్రసాదించినది.

## శత జయంత్యుత్సవములు :

1965 వ సంవత్సరము ఫిబ్రవరి 11 నాటికి పంతులుగారు జన్మించి నూరేండ్లయినవి. వారి కీర్తికి సముచితముగా, ఆ మహానుభావుని శతవార్షిక జయంత్యుత్సవములు జరుపుటకు పలువురు అభిలషించిరి. కాకినాడయందు రమణశ్రీగారు మున్నగువారు కలిసి మూడేండ్లకు పూర్వము నుండియు పానుగంటి సంస్మరణ సమావేశములను ఏర్పాటుచేసిరి. శతజయంత్యుత్సవ సంఘముకూడ బండారు తమ్మయ్యగారి అధ్యక్షతన ఏర్పాటు చేయబడినది.

హైదరాబాదులో డ్రామా ఎడ్యుకేషన్ సొసైటీవారు భారీయెత్తున ఉత్సవములను నిర్వహింప సమకట్టి ఆంధ్ర ప్రదేశ్ సాంస్కృతిక శాఖా మాత్యులగు యం. ఆర్. అప్పారావుగారికి ధనసహాయమునకై విజ్ఞాపన మొనరించిరి. కాని మంత్రిగారు అట్టి ఉత్సవ నిర్వహణమునకు ప్రభుత్వపక్షముననే యొక సంఘము నేర్పాటుచేయు నుద్దేశ మున్నట్లు వెల్లడించి, 1965 ఫిబ్రవరిలో మామిడిపూడి ఆనందంగారు అధ్యక్షులుగా, డా. పి. యస్. ఆర్. అప్పారావుగారు సమావేశ కర్తగా నొక సంఘము నియమించిరి. ఆ సంఘమున జయంతి శ్రీరామమూర్తి, రావూరి వెంకటసత్యనారాయణరావు, పండితారాధ్యుల నాగేశ్వరరావు, డా. ముదిగొండ వీరభద్రశాస్త్రి, బుద్ధిరాజు రాజభూషణరావు, ఎట్టోజు మాధవాచార్యులు, దేవగుప్తాపు విశ్వేశ్వరరావు, సుంకర కనకారావు, డా. తణికెళ్ల సత్యనారాయణ, వావిలాల గోపాలకృష్ణయ్యగారలు తక్కిన సభ్యులు.

ఈ సంఘ యాజమాన్యమున కార్యక్రమమునకు సాంస్కృతిక శాఖా మాత్యులు 16-2-1965 న ప్రారంభముచేసిరి. పంతులుగారి జన్మస్థలమగు సీతానగరమందు కాండ్ర పీరన్నగారి అధ్యక్షతన నొక ఆహ్వానసంఘ మేర్పడి 4-4-1965 న శత జయంత్యుత్సవములు నిర్వహింపబడినవి. హైదరాబాదులో ప్రభుత్వ సంఘాధ్వర్యమున, ఆంధ్ర ప్రదేశ్ నాట్యసంఘమువారి తోడ్పాటుతో 31-10-1965 న రవీంద్ర భారతిలో సమావేశము ఏర్పాటు చేయబడెను. పంతులుగారి తైలవర్ణ చిత్రము ఆవిష్కరింపబడినది. పాదుకా పట్టాభిషేకము, రాధాకృష్ణ నాటకములు ప్రదర్శింపబడినవి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య, సంగీత నాటక అకాడమీలు, విశ్వసాహితి, ఆంధ్ర సారస్వత పరిషత్తు, నాటక కళాపరిషత్తు, ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘము శ్రద్ధాంజలులు సమర్పించినవి. బెజవాడ గోపాలరెడ్డి, పసల సూర్యచంద్ర రావు, మొక్కపాటి నరసింహశాస్త్రి, రావూరి సత్యనారాయణ, బందా కనకలింగేశ్వర రావు, డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారలు పాల్గొనిన ఈ సభకు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు అధ్యక్షత వహించిరి. పిఠాపురమున రాజా గంగాధర రామారావు గారి అధ్యక్షతన సంఘమేర్పడి ఉత్సవము జరుపనున్నది. ఇంకను పెక్కు తావుల సంస్మరణ సమావేశములు ఏర్పాటు చేయబడినవి.

# పంతులుగారి నాటకములు

లక్ష్మీనరసింహారావుగారు బహు నాటకములు వ్రాసిరి. సంస్కృతాలంకారికుల ప్రకారము నాటకము దశవిధ రూపకములలో నొకటి. అయినను తెలుగున నీ పదము ఆ విశిష్టార్థమును కోలుపోయి రూపక మనుదానికి పర్యాయముగా సామాన్య వాచకమై నిలిచినది. ఇందు ఆ వ్యవహారార్థముననే ఆ పద మికమీద వాడబడుచున్నది.

పంతులుగారు వ్రాసిన నాటకముల సంఖ్యను నిర్ధరించుటలో పరిష్కరించుకొనవలసిన విశేషము లెన్నియైన నున్నవి. ఇంతవఱకును పలువురు పలు విధముల ఈ సంఖ్యను చెప్పి నాటకముల నామములను గూడ ఇచ్చియున్నారు. ఒకరిని జూచి యొకరు చెప్పుటచే ఎన్నియో తప్పు లెక్కలు, పేర్లు ప్రచారమునకు వచ్చినవి.

పంతులుగారి డెబ్బదియవ జన్మదినోత్సవ సందర్భముననే సన్మాన సంఘ పక్షమున జేయబడిన స్వాగతోపన్యాసమున నలువది నాటకములనినారు. సన్మాన సంఘమువారు సమర్పించిన సన్మాన పత్రమునందు ముప్పదిరెండు నాటకములని చెప్పబడి యున్నది. సభకు అధ్యక్షత వహించిన చిలకమర్తివారు 29 అని పేర్కొనినారు.

పంతులుగారు కీర్తిశేషులైనప్పుడు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక యిట్లు వ్రాసినది.

"పంతులుగారు పీఠికాపురాస్థానమున నాటక రచయితలుగా ప్రవేశించి రచియించిన నాటకము లమూల్యములు. వీరు రచియించిన నాటకము లించుమించు ముప్పది కలవు. ఇం దిరువదియాఱు ముద్రితములైనవి. అముద్రితము లింకను నాలుగు కలవు...." సంపుటి28, సంచిక 5.

పంతులుగారు దివంగతులయిన పిదప ఏ సందర్భములోనో 22-11-52 తేదీతో పిఠాపురాధీశులు సూర్యారావుగారు పంతులుగారిని గూర్చి యొక వ్యాసము వ్రాసియున్నారు.[1] దానిలో వారు 25 నాటకములను పేర్కొనిరి.

24-2-1965 నాటి ఆంధ్రప్రభ వారపత్రికయందు శ్రీనివాస చక్రవర్తి గారు తెలుగు నాటకకర్తలను శీర్షిక క్రింద పానుగంటివారిని గూర్చి వ్రాయుచు "షేక్స్పియర్ లాగానే పానుగంటివారు కూడా 33 నాటకాలు వ్రాశారు. వాటిలో పౌరాణికాలు ఏడు, చారిత్రకాలు నాలుగు, కాల్పనికాలు ఎనిమిది, సాంఘికాలు అయిదు ముద్రితమైనాయి. ఇవికాక ఇంకా తొమ్మిది నాటకాలు అముద్రితంగా ఉండిపోయాయి." అన్నారు.

ఇట్లే మఱికొన్ని భ్రమలు, సందేహములు ఏర్పడినవి. పంతులుగారు తమ నాటకములు అచ్చుపడినప్పుడు పీఠిక వ్రాసి, అందు సాధారణముగా ఆ నాటకము ఎన్నవదో, ఏ ప్రేరణమున దాని వ్రాసిరో, తెలుపుచు వచ్చిరి. కొన్నింటిలో రచనా కాలముకూడ నిచ్చియుండిరి. వారి నాటక పుస్తక పీఠికల నుండి సేకరించిన సమాచారమునుబట్టి నాటకముల అనుక్రమణిక యిది.

1. నర్మదా పురుకుత్సీయము
2. సారంగధర
3. ప్రచండ చాణక్యము
4. రాధాకృష్ణ
5. పాదుకా పట్టాభిషేకము (పట్టభంగ రాఘవము)
6. కోకిల
7. విజయ రాఘవము
8. వనవాస రాఘవము

---

1. అముద్రితమైన ఈ వ్యాసపు ప్రతిని కోకా శివనాథ శాస్త్రిగారు దయతో ఇచ్చియున్నారు. ఇది చివఱ అనుబంధముగా చేర్చబడినది.

9. విప్రనారాయణ (వైజయంతీ విలాసము)
10. బుద్ధ బోధ సుధ
11. వృద్ధ వివాహము
12. కల్యాణ రాఘవము
13.
14. ముద్రిక
15. పూర్ణిమ
16. సరస్వతి
17. వీరమతి
18. చూడామణి
19. పద్మిని
20. మాలతీమాల
21.
22.
23. సరోజిని
24.
25. రాతి స్తంభము
26. విచిత్ర వివాహము

ఇంతవఱకు పంతులుగారు పేర్కొని చెప్పిన నాటకములు. ఇవికాక లభ్యమగుచున్న పంతులుగారి నాటకములలో కంఠాభరణము, గుణవతి లేక ఇడాపంచమి, మణిమాల, రామరాజు, పరప్రేమ, సుబ్బరాజు లేక కానుగుచెట్టు, మనోమహిమము పంతులుగారు పేరు పెట్టని ఒక చిన్న నాటకము, అను ఎనిమిది యున్నవి. పై పట్టికలోని 22 తో కలిసి, మొత్తము ముప్పది నాటకములు అగుచున్నవి.

పేరయినను పెట్టని "చిన్న నాటకము" తరువాత వ్రాసి యుందురని వదలివేసినచో చిలకమర్తివారు చెప్పిన 29 అను సంఖ్య సరిపడుచున్నది. లేదా, 1911 లోనే రచియించినప్పటికిని తమ నాటకములలో ఒకటిగా పంతులుగారు లెక్క వేసికొనియుండని మనో మహిమమును గూడ లెక్కనుండి తొలగించినచో ఈ సంఖ్య 28 అగును. వ్యాపార ప్రకటనలో చేర్పబడియును అచ్చయి వెలుగు చూడని కాత్యాయని నాటకమును అప్పుడు గ్రహించి 29 నాటకములని చిలకమర్తివారు పేర్కొనినట్లు భావింపనగును.

వీనిలో కంఠాభరణము రచనాకాలమును బట్టి కల్యాణ రాఘవమునకును, పూర్ణిమకును నడుమదని తెలియుచున్నది. ఆ రెండింటి నడుమనున్న ఇదమిత్థమని తెలియనిది, పదుమూడు సంఖ్యతో నుండవలసినది మాత్రమే. అది కంఠాభరణమే యని నిశ్చయింపవచ్చును.

ప్రచండ చాణక్యము రెండవ కూర్పులో (1930) మహారాజశ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారి నూతన నాటకరాజములని వ్యాపారరీతి ప్రకటన యున్నది. అందున్నవి గుణవతి, మణిమాల, సరోజిని, కాత్యాయని, చూపు, విచిత్ర వివాహము అనునవి.

పంతులుగారి యిరువదవ నాటకమగు మాలతీమాల వెనుక పై నాటకములు ఒక వరుసలో నున్నట్లు గమనింపనగును. అనగా 21వది గుణవతి, 22వది మణిమాల అనుకొనిన 23వది సరోజిని సరిపోవుచున్నది. 24వది కాత్యాయని. 25వది చూపు అగుచున్నది. కాని రాతిస్తంభమును 25వది యని పంతులుగారు చెప్పిరి. నిజమునకు ఈ రెండును వేర్వేరు నాటకములు కావని రచనా కాలమున చూపు అను పేరు మొదటనుంచి అచ్చులో పేరు మార్చి రాతిస్తంభము అనిరని ముందు నిరూపింపబడును. 26వది విచిత్ర వివాహము మరల సరిపోవుచున్నది. కాని గుణవతి, మణిమాల పంతులుగారు కీర్తిశేషులైన వెనుక మహారాజావారు 1948 లో అచ్చు వేయించినారు. పంతులుగారు పీఠికలు వ్రాసికొని యుంచిరో లేదో కాని అచ్చయిన పుస్తకములందు మాత్రము లేవు.

కాత్యాయని అను నాటకముగాని, ఆ నాటకేతివృత్తము గూర్చి ముందు పేర్కొనిన వ్యాపార ప్రకటనలో చేసిన సూచనకు సరిపోవు మఱి ఏ నాటకముగాని అచ్చు పడినట్లు నిదర్శనములు లేవు.

ఇక మిగిలిన రామరాజు, పరప్రేమ, చిన్ననాటకము, సుబ్బరాజు అనునవి కూడ పంతులుగారి యనంతరము మహారాజావారిచే ప్రకటింపబడినవి. వీనికిని పీఠికలు లేవు.

మనోమహిమము అను మూడంకముల ప్రహసనప్రాయమగు నాటకము సువర్ణ లేఖలో వచ్చినదని పిదప పుస్తక రూపమున వచ్చినదని ఈవఱకే తెలుపబడెను.

పంతులుగారు మఱికొన్ని నాటకములను వ్రాసినట్లు కొందఱు భ్రమపడుటచేత, అంతటితో నాగక అట్టి పేరులకు ప్రచారము కలిగించుటచేత ఈ సంఖ్య నిర్ధరించుట కింత శ్రమయైనది. అట్టి వానినిగూర్చి పరిశీలింపవలెను.

ఆంధ్ర నాటక కర్తలు అను గ్రంథమున పానుగంటివారిని గూర్చి వ్రాసిన డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు, "ఆంధ్ర రచయితలు" అను గ్రంథము వ్రాసిన మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు, ఆంధ్రప్రభలో పానుగంటి వారిపై వ్రాసిన శ్రీనివాస చక్రవర్తిగారు వంటివారు కొంచెమించుమించుగా ఈ క్రిందివానిని నాటకములని పేర్కొనియున్నారు.

1. ఆనంద సాధు : ఇది వచన కథ. మొట్టమొదట సువర్ణ లేఖా వారపత్రికా కథా మంజరిలో 14వదిగా 1913 లో ప్రకటింపబడెను. పిమ్మట కథాలహరిలో చేర్పబడినది. దీనినే కొందఱు పొరపాటున ఆనందనాథ యనికూడ పేర్కొనిరి.

2. దుష్టప్రధాని : వచన కథ. సువర్ణలేఖా వారపత్రికా కథా మంజరిలో 13వది. కథాలహరిలో చేర్పబడినది.

3. విచిత్ర మరణము : వచన కథ. పై కథా మంజరిలో 7వది. కథాలహరిలో నున్నది.

4. విచిత్ర సమావేశము : వచన కథ. పై కథా మంజరిలో 5వది. కథాలహరిలో నున్నది.

5. ద్వాదశ యామిని : అన్నింటికంటెను చిత్రమైన యుదంతము గల నామమిది. పేరు వినియు వినగానే షేక్స్పియర్ వ్రాసిన "ట్వెల్త్ నైట్" నాటక నామమున కిది యనువాదమని చెప్పవచ్చును. ఇట్టి పేరుగల నాటకమును పానుగంటివారు వ్రాసిరని చెప్పినవారిలో డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావుగారు, శ్రీనివాస చక్రవర్తిగారు, డా॥ జి. నారాయణస్వామి రెడ్డిగారును ఉన్నారు. కూర్మా వేణుగోపాల స్వామిగారు పేరు చెప్పలేదు గాని తాము సంకలనము చేసి ప్రకటించిన "తెలుగు వాఙ్మయము-సంగ్రహ చరిత్ర" అను పుస్తకమున "తెలుగు నాటకాలు" అని ఒక వ్యాసము వ్రాయుచు, అందు "శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు ట్వెల్తు నైట్ అనువాదం వచ్చింది." అని వ్రాసినారు.

ద్వాదశ యామిని అలభ్య నాటకముగా డా. అప్పారావుగారు, అముద్రిత నాటకముగా శ్రీనివాస చక్రవర్తిగారు చెప్పియున్నారు. ఇక డా॥ జి. నారాయణ స్వామి రెడ్డిగారు యం.లిట్ డిగ్రీకొఱకు మద్రాసు విశ్వవిద్యాలయమునకు ముందు తాము సమర్పించిన పరిశోధన వ్యాసములో[1] దీనినిగూర్చి యిట్లు వ్రాసియున్నారు.

" He (Panuganti) has adopted Shakespeare mainly in two of his plays, Dwadasa Yamini and Saraswathi. "

ఈ మాటలను, కూర్మా వేణుగోపాల స్వామి గారి మాటలను బట్టి చూచి నచో వారిరువురు ఈ గ్రంథమును చూచియే యుండవలెనని అనిపించును.

---

1. The Influence of English on Telugu Literature with reference to Translations and Adoptations.

(అముద్రితము)

డా. రెడ్డిగారు తమ థీసిస్ చివఱ అనుబంధములో ద్వాదశయామినిని షేక్స్పియరునకు అనుసరణ నాటకముగా చూపించినను, తక్కిన పుస్తకములకు వలె దీనికి ముద్రణ పొందిన సంవత్సరమునుగాని, ఇతర వివరములను గాని పొందు పఱపలేదు.

కూర్మా వేణుగోపాల స్వామిగారు మఱియొక అడుగు ముందునకు వేసి దీని నుద్దేశించియే కావలెను తమ వ్యాసమునందు పానుగంటి వారి ట్వెల్త్నైట్ అనువాదము అనిరి.

పంతులుగారు షేక్స్పియర్ రచనలచే అమితముగా ప్రభావితులైన మాట నిజము. కాని స్పష్టముగా ఏ నాటకమును వారు అనుసరించిగాని, అను వదించిగాని యుండలేదు. మఱియొకటి—తమ నాటకములన్నింటిని 1900 మొదలు కొని 1930 వఱకు రచించిన వానిని అను పూర్వితో క్రమసంఖ్యలతో పేర్కొని యున్నారు. నిదర్శన పూర్వకముగా వానిని నిరూపించ గలిగినప్పుడు ఈ ద్వాదశ యామిని తత్పూర్వమో, తరువాతనో వ్రాసియుండ వలయును. తెలుగు నాటక రంగమున లబ్ధ ప్రతిష్ఠులై స్వతంత్రతాప్రియులుగా పేరు వడసి చివఱకు వారు అనువాదము చేసిరనుటయు పొసగ నేరదు. ఇది పంతులుగారి బాల్య రచన యను కొన వలెనా?

అట్లయినచో నర్మదాపురు క్షత్రియ మండలి పీఠికలో నాటక రచనకు తమకు తొలిగా ప్రేరేపణ కలిగినట్లు చెప్పుకొనక దీనిని ప్రస్తావించి యుందురు. అదియునుగాక ఆ పుస్తకము చూచినట్లు మఱి ఎవ్వరును ఎచ్చటను చెప్పనేలేదు. డా. రెడ్డిగారు గాని, గోపాలస్వామి గారు గాని దానిని చూచి యుండినట్లు నమ్మకము చాలదు అని చెప్పుటకు సాహసింప వచ్చును. ఇంతకంటె దీనిని గూర్చి గ్రంథము పెంచుట ఆవశ్యకముకాదు.

పానుగంటివారు దివంగతులైనప్పుడు ప్రధానవ్యాసములు వ్రాయుచు ఆంధ్ర పత్రిక, కృష్ణాపత్రిక కృష్ణతులాభారము అను మఱియొక నాటకమును పేర్కొన్నవి. పానుగంటివారు యిట్టి పేరుగల నాటకము వ్రాసినట్లు చెప్పిన వా రెవ్వరును మఱిలేరు, పానుగంటివారు అన్ని నాటకములు వ్రాయగా, అన్నింటిని

విడిచిపెట్టి ఆంధ్రపత్రిక ముందు వారు వ్రాసిన దొక దానిని, వ్రాయని యొక దానిని కలిపి చెప్పగా, ఆ ప్రమాదమే కృష్ణా పత్రికకు తరువాత ప్రాకినది అని ఆ రెండింటిలోని ఈ వాక్యముల కూర్పును చూచినచో గమనింపవచ్చును.

"వీరు వ్రాసిన విప్రనారాయణ, కృష్ణ తులాభారం మున్నగు నాటకాలు వీరి కీర్తికి శాశ్వత చిహ్నాలుగా ఏర్పడి ఉన్నాయి."

ఆంధ్ర పత్రిక 2—1—1940.

"వీరు వ్రాసిన విప్రనారాయణ, కృష్ణ తులాభారం, కంఠాభరణం, పాదుక మొదలైన నాటకములు తెలుగు నాటక రంగానికి అందమైన కానుకలు."

కృష్ణా పత్రిక. 6—1—1940.

ఉత్తర రామాయణ కథను నాటకముగా వ్రాయగలమని ముందు వారు ప్రకటించినను, ఆ సంకల్పము విరమించుకొనినట్లు ఆ పిదప వారు తెలిపిరి. అదే విధముగా బుద్ధబోధ సుధ వ్రాయునప్పుడు శంకర, రామానుజ, ఆనంద తీర్థ, చైతన్యాది మత కర్తల బోధనములు జనులకు సుబోధక మగునట్లు నాటకములు వ్రాయవలెనని తలచిరి కాని వ్రాయలేదు.

పై విధముగా చర్చించిన పిదప, పంతులుగారి నాటక రచనలు మొత్తము ముప్పది యని నిర్ధారణ చేయవచ్చును. ఇప్పుడు క్రమముగా ఆ యా నాటకములను గూర్చి కొంత విపులముగా తెలుపబడును.

# నర్మదా పురుకుత్సీయము

పానుగంటివారి మొదటి నాటక మిది. " దీనిని 1900 సంవత్సరము 27 వ యేప్రియల్ తేదీని ఆరంభించి, ఆ సంవత్సరమే 26 వ మేయి తేదీని ముగించితిని." అని వారు పీఠికయందు వ్రాసికొనిరి. ఈ నాటకము మొదట 1902 లో ఏలూరు మంజువాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను.

ఈ నాటకము వ్రాయునప్పటికి పంతులుగారు రావు చెల్లయమ్మారావు గారికడ ''మహామాత్యులు''గా నుండిరి. ఈ నాటకము ఆమెకే అంకితము చేయ బడినది. ఇంతకుముందు పంతులుగారు ''శ్రీ విష్ణు నామమాల" అను లఘు కావ్యమును వ్రాసి ఆ జమీందారిణిగారికి అంకితము చేసియుండిరి. దానికి సంత సించి ఆమె మఱియొక కావ్యమును వ్రాయుమని కోరగా వీరు దీనిని వ్రాసిరి. శ్రవ్యకావ్య పద్ధతినుండి దృశ్యకావ్య రచనమునకు మారుటకు హేతువును పంతులుగారు తొలి ముద్రణపు పీఠికలో ఇట్లు పేర్కొనిరి.

'' ఏ ప్రబంధమును రచియింతునని యాలోచించుచుండగ సుమారు నాలుగు మాసముల క్రిందట కాకినాడ నాటక సంఘము వారీ గ్రామమునకు వచ్చి నాటకములను బ్రయోగింప మొదలుపెట్టిరి. ఈ సంఘమువారిచే బ్రయోగింప బడిన నాటకములలో గొన్నిటిని చూచిన తర్వాత నేదయిన నొక నాటకమును రచియించు కుతూహలము చిత్తమం దంకురించెను. మా జమీందారిణిగారి పిఠాపురపు కోటలో నా సంఘమువారిచే నాటకముల గట్టింతురని వినినప్పటినుండియు శీఘ్ర మేదైన నొక నాటకమును జేసి యీ సంఘమువారిచే మా జమీందారిణిగారి యెదుట బ్రయోగింప నుద్దేశించి నర్మదా పురుకుత్సీయ మను నీ నాటకమును ఆ 1900 సం. 27 యేప్రియల్ తేదీని ఆరంభించి ఆ 1900 సం. 26 మేయి తేదీని ముగించితిని."

ఈ నాటకమువలన ప్రఖ్యాతి వచ్చుటచే వారు నాటకకర్తగా స్థిరపడినారు. 1909 వ సంవత్సరమున దీని మూడవ కూర్పు చేయించునాటికి పరిస్థితులు మారినవి. దానితో నాటకమందును మార్పులు కలిగినవి. కావున తొలి ముద్రణ ప్రతి ప్రత్యేకతగూర్చి ముందు తెలుపదగి యుండును. ఆ వెనుక నాటకమును గూర్చి వ్యాఖ్యానించుకొనవచ్చును.

## తొలి ముద్రణ ప్రతి ప్రత్యేకత

1. తొలి ముద్రణమున పీఠిక విపులమైనది. నాటక రచన గావించుటకు తమకు గల్గిన ప్రేరణమును గాని, అప్పటి సహాయాదులను గాని ముందు పేర్కొనినట్లు, 1909 నాటి ముద్రణమునందు పీఠికలో పానుగంటివారు పేర్కొనలేదు.

2. మొదటి ముద్రణమునందు ఈ నాటకమును చెల్లయమ్మారావుగారికి అంకిత మిచ్చుచు వ్రాసిన పద్యములు ఉన్నవి. ఇవికూడ 1909 ముద్రణమున తొలగింపబడినవి.

3. 1902 ముద్రణమున " మచిలీబందరు హిందూ మహా కలాశాల సంస్కృత ప్రధాన పండితులగు " వేదాల రంగాచార్యులవారి యనుమోదిక పద్యములు గ్రంథాంతమున ముద్రింపబడినవి. వీనిని మూడవ కూర్పులో విడిచివేసిరి.

4. తొలి ముద్రణము సమయమున పంతులుగారి యీ నాటకమునకు నాంది ప్రస్తావనములు వ్రాసి యిచ్చినవారు " ధారా కవితాధోరణీ రమణీయుడును, సంగీత సాహిత్య జ్ఞానసంపన్నుడును సర్వపథీన ధీసనాథుడును " అగు కాకరపర్తి వేంకటరాయ నామకులు. ఈ ప్రస్తావన విపులమైనది. 1909 నాటి కూర్పునందు దీనిని తీసివేసి సంగ్రహముగా పంతులుగారే నాంది, ప్రస్తావనలు వ్రాసికొనిరి.

5. అన్నింటికంటె ముఖ్యముగా, నాటకమందు కూడ అచ్చటచ్చట కొన్ని మార్పులు చేయబడినవి. ఇవి ప్రధానముగా సభ్యతను దృష్టిలో పెట్టుకొని

చేసినవే అనిపించును. పంతులుగారు మిగుల శృంగారి యని వారి గ్రంథముల లోని యనేక సందర్భములు స్పష్టము చేయును. తొలి నాటకమున నలి తొలి లేకుండ వ్రాసిన వాక్యములను కొన్నింటిని ఈ మూడవ కూర్పున సంస్కరించిరి.

ఉదాహరణమునకు :

''కార్యధూర్వహుఁ డగువాఁడు గాసిఁ జెందుఁ
గార్య భారంబు లేకున్నఁ గడు సుఖించు;
కఠిన పీనస్తని యలసగమన యగును
కన్నె కుచహీన కులుకుచు గంతులిడును.''

మూడవ కూర్పునం దీ పద్యము చివరి రెండుపాదముల నిట్లు మారినది.

''తలను బరువున్నవాఁడు బాధను దపించు,
లేని మానిసి నిదురను మేను మఱచు.''

అట్లే,

''నిక్కి పొగరెక్కువారిని నిగ్రహింపఁ
దగును; తల వ్రాల్చువారికిఁ దగునె శిక్ష
తరుణి చనులకుఁ గర విమర్దనము గాని,
వృద్ధ కుచముల కొక నమస్కృతియె కాదె ?''

పాదాక్రాంతములయిన వేటజంతువులను జంపలేకపోయితివని ఆక్షేపించిన విదూషకుని కిది పురుకుత్సుని సమాధానము :

1909వ ముద్రణమున ఈ పద్యము పోయి ఒకే ఒక్క వాక్యము వచ్చినది. "గర్వాత్ములకుఁ గాక సవినయులకు శిక్షయేల?"

మఱియొక విధమైన మార్పులు ప్రమాదము చేత కలిగిన ఛందో భంగములను సవరించు కొనుటకుగా జరిగినవి.

''మధువు నందిరువది యొక్కమారు భావ
నలను జేసిన వేపగింజ గతిగాగ.''

"వేప గింజలను బోలి" యని సవరణ. ఇంకను గొన్ని మార్పులు పద్యపుగతిని, భావ ప్రకటన రీతిని మెఱుగు పఱచుటకు చేయబడినవి.

"జన్మరాజసుఁ డచ్ఛప్రశస్త సత్త్వ
మెన్ని తపములఁ జేసిన నెటుల నొందు?"

"ఎనయు నెటులు?" అని మార్పు చేయబడినది.

"పిడుగు గోపురమునఁ బడుగాని యెపుడైనఁ
బిచుక మీఁదఁ బడునె పేర్మి సఖుఁడ."

"గూటఁ బడునె" యని మార్పు నందినది.

"భూభరంబు మోయు భూమీశు నీతని."

"భూభరంబు మోయు పురుకుత్సు నీతని...." అని మార్పు చేసిరి.

ఇంకను ఒకటి రెండు సవరణలు మొదటి ముద్రణపు ప్రతియందు చేసి యుంచిరి.[1] కాని ప్రమాద వశమున మూడవ కూర్పునందు అవి అచ్చు కాలేదు.

"ఏను రాజను మీరు మహానుభావు
లరు—ప్రమాదము నాది యావంతలోటు."

రెండవ పాదమున యతి భంగమైనది. ఇది వ్రాతలో నల్కాంతలోటు అని సవరించి యుంచిరి.

---

1. ఇక్కడ ఇంకొక మాట చెప్పవలయును. అకొండి వేంకటరత్నముగారు అనువారు పంతులుగారికి అప్పటిలో సహోద్యోగి; వారికి మిత్రులు. వీరు ఏ రోజున వ్రాసిన భాగము ఆ రోజున సాయంకాలము చూచుచు తమకు ఉత్సాహము గలిగించుచు మంచి మంచి యూహలు తమకు తోచునట్లు చేయుచు సాహాయ్యము చేసిరని పంతులుగారు తొలిముద్రణ పీఠికలో వారికి కృతజ్ఞత తెలిపినారు. వేంకటరత్నముగారి సంతకముతో నున్న ప్రతి పిఠాపురము శ్రీ సూర్యారాయ విద్యానంద గ్రంథ నిలయమున లభించినది. దానిలో పై సవరణలు వేంకటరత్నముగారు తమ దస్తూరీలో చేసికొని యున్నారు. అవే 1909 ముద్రణమునందు అచ్చులో నున్నవి.

6. 1902 నాటి ముద్రణమున చతుర్థాంకస్థ మైన అంతర నాటకము విపులముగా నున్నది. మూడవ కూర్పులోకూడ నున్న నటీ సూత్రధారులు మాత్రమేకాక, ఆ ప్రతిలో గర్గుడు, నగధీరుడు, కళావతి యను పాత్రలుకూడ ఎక్కువగానున్నవి. అంతర నాటక ప్రదర్శనము తొలి కూర్పులో నాందీ ప్రస్తావనములై కొంత నాటకముకూడ జరిగిన పిదప విఘ్నముకాగా, తరువాత మార్పులో నాందియై, ప్రస్తావన ముగియక మునుపే విఘ్నము సంభవించినది. ఇది ప్రదర్శన సౌలభ్యమునకై జరిగిన మార్పు.

తొలి ముద్రణమునందలి ప్రస్తావన కొంత విపులముగా నున్నట్లు చెప్పుట యైనది. ఇందు పంతులుగారిని గూర్చి విశేషముగా చెప్పబడినది. పైగా ఈ ప్రస్తావన ప్రబంధ శైలిలో నున్నది. అంతమున పాత్ర ప్రవేశ సూచన లేదు. కవి సామర్థ్యమును ప్రశంసించుచోట ఈ పద్యములు అందు ఉన్నవి.

'' అష్టావధాన శతావధాన విధాన
    లసమాన కవితా విలాస మూర్తి,
యనవద్య శబ్ద హృద్యాంగ్లేయ విద్యా వి
    రాజ దంభోధి పారంగతుండు,
హర్ష దాయక సంస్కృతాంధ్ర భాషాద్వయ
    స్తుత్య సాహిత్య నిస్తుల యశుండు,
మహిత మతత్రయ మార్గ ప్రదర్శ కుం
    డేకసంథాగ్రాహి లోక హితుఁడు

ప్రథిత శ్రీరావు చెల్లయాంబా కృపా వి
శేష సంలబ్ధ గౌరవ శ్రీయుతుండు
పానుగంటి కులాబ్ధి క్షపాకరుండు
ఆర్యలక్ష్మీ నృసింహరాయ కవివరుఁడు.

ఒక్కచోఁదేనె లొలికించు, నొక్కచక్కఁ
జక్కెరల ముక్కలను నించు, నొక్కప్రక్క
నాణెముగ సుధఁ జిలికించు, నవ్యభవ్య
కావ్య రచనల నీ మహాకవి వరుండు. ''

ఈ ప్రశంసలో పానుగంటివారు అష్టావధాన, శతావధానములు చేసిన వారని తెలియుచున్నది. ఈ విశేషము మఱి యెచ్చటను సూచింప బడి యుండలేదు.[1]

## నాటకేతి వృత్తము

పురుకుత్సుని కథ ఆంధ్ర మహాభాగవతము నందు సంగ్రహముగా ఇట్లున్నది.

"మాంధాత రెండవ కొడుకు పురుకుత్సు నురగ లోకంబునకు గొనిపోయి నాగ కుమారులు దమ చెలియలి నర్మద యను కన్యకను వివాహంబు చేసిరి. పురుకుత్సుండు నక్కడ ననేక గంధర్వనాథుల వధించి తన నాగలోక సంచరణంబు దలంచు వారికి నురగ భయంబు లేకుండ వరంబు వడసి తిరిగి వచ్చె."

దీనిని గ్రహించి, పంతులుగారు కొంత కథ కల్పించి నాటక మొనరించిరి. విష్ణు పురాణములోను, హరి వంశములోను ఉన్న అన్యాంశములను పంతులు గారు ఉపయోగించు కొనలేదు. ఈ నాటక మందలి కథా సంగ్రహము ఇది:

**ప్రథమాంకము :**

ఊర్ధ్వలోక వాసియగు చిత్రకేతుడు ఉరగలోక వాసియగు అంశుమంతుడు భూలోకమున విశ్వామిత్ర మహర్షి ఆశ్రమ పరిసర భూములందు కలిసికొనిరి. అచ్చటికి వేటకై వచ్చిన పురుకుత్సుడు ప్రమాద వశమున విశ్వామిత్రుని ఆశ్రమ మృగమును జంపెను. మహర్షి రాజునకు అధోలోక గమనము కలుగునట్లు శపించి, అది సుఖదాయకమగునట్లు పిదప అనుగ్రహించెను. ఉరగ రాజగు

1. మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసైన తరువాత క్రొత్తలలో రాజమండ్రి ట్రెయినింగు కాలేజి ఆవరణలో ఒకసారి, పురమందిరమునం దింకొకసారి పంతులుగారు శతావధానము చేసినారని వినికిడి.

మందారునికి నర్మదయను కొమార్తె పెండ్లియాడు కలది ఉండెను. అంశు మంతుడు ముని శాపముచే ఊహ పొడమిన వాడై, రాజును నర్మదతో కలుపుటకు తలపోసి ఆతనిని నాగలోకమునకు గొని పోయెను.

**ద్వితీయాంకము :**

అంశుమంతుడు ఊహించినట్లు ఉరగలోకమున నర్మదాపురుకుత్సులకు ప్రథమ సమావేశముననే పరస్పర మోహము కలిగెను. వారు ఇరువురును ఉంగరములు మార్చికొనిరి. తరువాత అంశుమంతుడు రాజానుమతి పొందకయే ఈ వ్యవహారము కొనసాగనీయరాదని పురుకుత్సు నతని పట్టణము చేర్చెను.

**తృతీయాంకము :**

నర్మద తన చెలికత్తెయగు నవమాలికతో కలిసి పురుకుత్సుని కలిసి కొనుటకై భూలోకమునకు వచ్చెను. రాజును కలిసికొనెను. కాని యింతలో నర్మదాపురుకుత్సుల "ప్రణయ నైశిత్యము" పరీక్షించుటకై ఇంద్రుడు ఆదేశించుటచే చిత్రకేతుడు నర్మదను ఊర్ధ్వ లోకమున కెత్తుకొని పోయెను. పురుకుత్సుడు పరివేదన పొందుచుండగా నారదుడు వచ్చి ఇంద్రు డొక నాటకమును ప్రయోగింపజేయుచు దానికి రాజు నాహ్వానించుచున్నట్లు తెలిపి కొని పోయెను.

**చతుర్థాంకము :**

శచి, ఇంద్రుడు నర్మదాపురుకుత్సులలో ఎవ్వ రెక్కువ ప్రేమగలవారు అను సంశముపై పందెము వేసికొనుటచే, తత్పరీక్షకై నర్మద నెత్తుకొని వచ్చుట జరిగినది. పురుకుత్సుడు వచ్చుట తోడనే నాటక ప్రయోగ మారంభమైనది. సూత్రధారుడు త్రిపురసుందరీ ప్రార్థనము చేయుచుండెను. త్రిపురసుందరీ విగ్రహముగా నర్మద నిలుపబడెను. విగ్రహ మనుకొనినదానియందు నర్మద పోలికలను గనుగొని పురుకుత్సుడు ఆవేదన పొందుటచేత ప్రయోగము విఘ్న మయ్యెను. ఇంద్రు డాతనిని భూలోకమునకు పంపివేసెను. అంత నర్మద ఇంద్రుని పాదములపైబడి, రాజుతో చేర్పుమని దీనముగా ప్రార్థించెను. ఇంద్రుడు సమయముజూచి పంపుదునని వర మొసగెను.

## పంచమాంకము :

రాజు విరహబాధచే అనారోగ్యము పాలయ్యెను. అట్టి సమయమున నర్మద ఇంద్రు నాదేశమున దేవ వైద్యుని వేషమున వచ్చెను. రాజు ననారోగ్యము పోగొట్టిన కోరిన దిచ్చుటకు పురుకుత్సుని పట్టపురాణి సుమతి వాగ్దానము చేసెను. రాజు కొంత వడికి నర్మదను గురుతించెను. ఇంతలో నర్మద తండ్రి మందారుడు వచ్చి కొమార్తెను నిందించి రాజుతో యుద్ధమునకు దలపడగా ఇంద్రుడు విశ్వామిత్రునితో కలిసి వచ్చి, మందారుని ఒప్పించి వివాహ మంగళము జరిపించెను.

## కాళిదాసు, షేక్‌స్పియరుల ప్రభావము :

ఆంధ్ర భాగవతమున స్వల్పముగానున్న కథను రూపకముగా పెంచుటలో పానుగంటివా రనేకములగు కల్పనలు చేసిరి. ఈ కల్పనలు చేయుటలో వారికి దారి చూపిన సాహిత్య మీ వఱకు ఉన్నదే. ముఖ్యముగా ఇందు కాళిదాసుని విక్రమోర్వశీయము యొక్క ప్రభావము గోచరించును.

" నర్మదాపురుకుత్సీయ మందలి నాయకుడు విక్రమోర్వశీయ మందలి పురూరవుని వంటివాడు. ప్రేయసి కొఱకు వానివలెనే యున్మత్తుడై విలపించుటయు జరిగినది. నామమునందే రెండు నాటకములకును సామ్య మున్నది. దాని వలెనే యిదియును ఉపరూపకజాతికి చెందిన త్రోటకము." అని డా. అప్పారావు గారు వ్రాసియున్నారు.

ఈ రెండు రూపకములకున్న ప్రధాన భేద సాదృశ్యము లీ క్రింద వివరింప బడును.

విక్రమోర్వశీయమున ఊర్వశిని పురూరవుడు రక్షింప వలసి వచ్చుట, తన్మూలముగా పరస్పర మోహము జనించుట యాదృచ్ఛికములు. నర్మదాపురుకుత్సీయమున నర్మదాపురుకుత్సుల ప్రథమ సమావేశము అంశుమంతునిచే ఏర్పాటు చేయబడినది. దీనికి విశ్వామిత్రుడు ఇచ్చిన శాపము ప్రేరేపక మగుట జరిగినది.

నాయికా నాయకుల పరస్పరాను రాగము ప్రకటీకృత మగుటతో ప్రథమాంకము విక్రమోర్వశీయమున ముగిసినది, కాని యిందు నాయికా నాయకుల కలయిక ద్వితీయాంకమున గాని లేదు.

ఊర్వశి పురూరవునికొఱకై భూలోకమునకు వచ్చినది. కాని కలిసికొని ఉపచార వాక్యములైన పూర్తి కాకుండునంతలో భరతముని వ్రాసిన నాటకమును ప్రయోగించుటకై పిలువబడినది. నర్మద అట్లే ఉద్యానవనమున రాజును కలిసికొనినది. కాని అంతలో ఇంద్రు నాదేశమున చిత్రకేతుడు ఆమెను ఊర్ధ్వ లోకమున కెత్తుకొని పోయెను.

ఉభయ రూపకములందును ఇంద్రానుగ్రహముచేతనే ప్రేమ ఫలోన్ముఖమైనది.

విక్రమోర్వశీయమునందు కథ ఔర్వశేయుని పట్టాభిషేక పర్యంతము విస్తరించి యుండగా, ఇట నది వివాహముతో ముగిసినది.

ఊర్వశిని పొందుటకు పురూరవుని, నర్మదను పొందుటకు పురుకుత్సుని స్వయముగా అనుమతించి అట ఔశీనరి, ఇట సుమతి మిక్కిలి ఉదాత్తతను ప్రదర్శించిరి.

ఊర్వశీ పురూరవుల వియోగము శాపజమై సంగమానంతరము కలిగినది. నర్మదా పురుకుత్సుల విరహము అట్టిది కాదు. వారి ప్రణయ ప్రగాఢత పరీక్షించుటకై ఇంద్రునిచే కల్పింపబడినది.

రెండు రూపకములందును పాత్రల కూర్పున సామ్య మున్నది. పురూరవ పురుకుత్సులు; ఊర్వశీ నర్మదలు; ఔశీనరీ సుమతులు; విదూషకులు; చిత్రరేఖా నవమాలికలు ఇత్యాదులు తుల్యస్వభావ ప్రాధాన్యములు గల పాత్రలు.

ఇందలి అంతర నాటకమున నర్మదను త్రిపురసుందరీ విగ్రహముగా నిలిపి, రాజు మనోభావములను పరీక్షించు ఘట్టము షేక్స్పియర్ విరచితమగు **Winter's Tale** లోని ఘట్టమును జ్ఞప్తికి దెచ్చుచున్నది.

ఎన్నడో చనిపోయినదని తాను నమ్ముచున్న తన భార్యయగు హెర్మాయిన్ ప్రతిమను చూచుటకై రాజగు లియోన్ టెజ్ తన పట్టణములోని పోలినా అను నామె యింటికి వెళ్లెను. నిజమునకు అక్కడ జీవించియున్న హెర్మాయిన్ విగ్రహముగా నిలుపబడి యుండెను. కథా సందర్భాదులు భేదించినను, ఈ పురుకుత్సుని ఇప్పటి చిత్తవృత్తి అక్కడి లియోన్ టిజ్ మనస్థితితో సదృశమైనది. లియోన్ టిజ్ అనుకొనును :

"What was he that did make it? See my Lord, would you not dream it breathed and that those veins did verily bear blood ?..."

"The fixture of her eye has motion in it as we are mocked with art, Let no man mock me for I will kiss her."

దీనినే పంతులుగారు విస్తరించి యున్నారు. గాలికి కొట్టుకొను కేతనము వలెనే పురుకుత్సుడు ఉత్కలపాటు పొందుట చక్కగా నిరూపింపబడినది.

రాజు అనుకొనును :

"ఎదుర నున్ననైన నిటుప్రక్క నటుప్రక్క
మున్న నన్నె జూచుచున్న యటులఁ
గానుపించకుంట నేనిది ప్రతిమ గా
దంచు నెంచెదను యదార్థముగను."
"ఊర్పు తావియె కాకున్న నువిద చనుల
నడిమి పైట నుంత చలింపబడుట యెటుల
ప్రసవ మంజరులను గప్పు పండుటాకు
చిఱుత గాలిని గదలిన చెన్ను మీర."

భవభూతి ఉత్తరరామ చరిత్రయందు తృతీయాంకమున రాముడును, వాసంతియు నొక ప్రక్కన మాట్లాడుచుండ తమస, సీత వారికి కనబడకుండ వినుచు అటనుండి గచ్ఛద్వ్యాఖ్య చేయుచున్నట్లు కూర్చెను. ఈ పద్ధతి పంతులు గారు అనేక సన్నివేశముల పెక్కు నాటకములందు వాడుకొనినారు.

అట్టి ఘట్టములు నర్మదా పురుకుత్సీయమునందు కూడ నున్నవి. ప్రథమాంకమున అంశుమంతుడును చిత్రకేతుడును రాజు వేటకు వచ్చినదాది శాపము పొందువఱకును తక్కినవారి కదృశ్యులై యుండి నడుమ నడుమ తమ యభిప్రాయములు ప్రకటింపుచుందురు. ఈ పద్ధతి తరువాత కోకిల, రాధాకృష్ణ మున్నగు నాటకములలో కాననగును.

ఉత్తరరామ చరితమునందలి మనోహర భావము లచ్చటచ్చట ఈ నాటకమందు సముదితములైనవి.

పాతాళమునుండి తిరిగి వచ్చిన పురుకుత్సుడు నర్మదను తలచికొని ఇట్లు విదూషకునితోడ పలుకును :

''నాదు కంటికి దీపంబు నాదు మదికి
నూఁత యొడలికి గంధంపు పూఁత నోటి
కమృత మగు దానిఁ బాయ ధైర్యంబు వోదె
పాపతో దృష్టి వో నసంబద్ధమగునె ? ''

ఇది భవభూతి ప్రసిద్ధ శ్లోకములలో నొకటి యగు నీ క్రిందిదానిని స్మరింప జేయుచున్నది :

ఇయం గేహే లక్ష్మీ రియ మమృత వర్తిర్నయనయో
రసావస్యా స్పర్శో వపుషి బహుళశ్చందన రసః
అయం బాహుః కంఠే శిశిరమసృణో మౌక్తికసరః కిమస్యా
న ప్రేయో యది పున రసహ్యో విరహః

ఇది పంతులుగారి మొదటి నాటక మగుటచేత దీనిని నిశితముగా పరిశీలించవలసి యున్నది. ఈ నాటకమును పఠింపగా ఈ క్రింది విశేషములు పొడకట్టును.

1. ఈ నాటక కథ స్వర్గ మర్త్య పాతాళములు మూటియందు జరిగినది. డా. అప్పారావుగారు చెప్పినట్లు ''ఇందు దప్ప మఱి యే యితర నాటకమునందును పంతులుగారు భూలోకమును విడిచి పైకిగాని, క్రిందికిగాని పోలేదు.''

2. ఈ నాటకమున సంస్కృత రూపకానుసరణము ఎక్కువగా నున్నది. కాళిదాసుని విక్రమోర్వశీయమును ఈ నాటకము దలపించుచున్నది. పంతులు గారికి అభిమాన పాత్రులలో ఒకడగు భవభూతి ప్రభావముకూడ ఇందు కన్పట్టు చున్నది. ఆంగ్ల నాటక కర్తలలో షేక్స్పియర్‌పై గల గౌరవమును తెలియనగును.

3. పానుగంటివారి రూపక రచనయందు విశిష్టమైన సంవాద కౌశలము, సన్నివేశ ఘటన చాతుర్యము ఈ నాటకమునందే బాగుగా కన్పట్టుచున్నవి.

4. ఉపమాలంకారమును విరివిగా వాడుట పంతులుగారి పద్ధతి. అదియు నిందే యారంభమైనది.

5. ఇందలి హాస్యము విదూషక పాత్రగతము. సంస్కృత రూపకముల పద్ధతిలోని వాడు ఈ విదూషకుడు.

6. మాత్రాచ్ఛందములను గాని నాటకమున ఉపయోగింపరాదను నియమమును ఈ నాటక రచనాకాలము నాటికే పంతులుగారు చేసికొని యున్నారు. కాని ఎటులో రెండు వృత్తములు ఇందు (1902 నాటి ముద్రణ; పుటలు 6, 65) చోటు చేసికొనినవి. వీనిలో మొదటిది 1909 నాటి ముద్రణమునందు తొలగింపబడినది. పైన చెప్పిన రెండు వృత్తములును అంతర నాటకము నందలి నాంది పద్యము కాక.

7. హాస్య పాత్రలు, ఉదాత్త పాత్రలను కూడ సమముగా ఉజ్జీవింపచేయ గల శక్తి ద్యోతక మగుచున్నది.

8. చతుర్థాంకమున అంతర నాటకమును జూచుటకు వచ్చినవారిలో సూర్యచంద్రులు, బృహస్పతి కూడ నుండిరి. ఈ అంతర నాటక ప్రయోజనము పురుకుత్సుని వలపు ఎంత గాఢమైనదో పరిశీలించుటకు గదా! ఆ భాగమున రచన మనోహరముగానే సాగినది. కాని నడుమ పైవారి సంభాషణములు అధిక మైనవి. అవికూడ సరసముగనే యున్నను, ప్రధానమగు ప్రయోజనమునకు అనావశ్యకములై పొందిక లేకుండ నుండిపోయినవి. ఈ లోపము ఇచ్చటినుండి యారంభమై వీరి చాల రచనలలో కన్పట్టుచునే యుండును.

సూక్ష్మముగా నొక్క మాటలో చెప్పవలెనన్న పంతులుగారు భవిష్యత్తులో నాటక కర్తగా ఎట్టి ప్రసిద్ధి పొందదగి యుండిరో, అట్టి ప్రసిద్ధిని ఈ నాటకమే సూచింపజాలి యున్నది. కావుననే నాటకము చదివిన వేదాల రంగాచార్యులవారు పంతులుగారికి ఇట్లు అనుమోదిక నొసంగి యున్నారు.

ఆంధ్ర సంస్కృత హూణ ప్రబంధ బంధు
రార్థ నిర్ధారణ పటిష్ఠులైన యమ్మ
హా కవీంద్రుల విపులతరానుభావ
మెల్లఁ దెల్లంబు సేసె నా యుల్లమలర.

కానిపించెడు నొక్కచోటను గాళిదాసుని ధోరణుల్,
మానిపించెడు షేక్స్పియర్ బహూమాన మొక్కొక కల్పనన్,
దీని కేదియు దీటు లేదని ధీరులెన్నఁగఁ బొల్చు నీ
పానుగంటి నృసింహరాయల ప్రౌఢ నాటక శైలి దాన్."

ఇంతకు మునుపు సంస్కృత, హూణ ప్రబంధ కర్తల ప్రభావము ఈ రచనపై ఎట్లు ప్రసరించి యున్నదో చూచినాము. ఆంధ్ర ప్రబంధ కర్త లను టలో వేదాలవారి యూహ ఏమై యుండును ? నాటక కథా సంవిధానమున పాఠ కులకు ఉత్కంఠ పెంచి క్రమక్రమముగా వారికి ఒక్కొక్క ముడిని విప్పి చకితులను జేయుటపై పంతులుగారికి ఆసక్తి మెండు. తరువాత, తరువాత సరస్వతి నాటకమున దీనికి పరాకాష్ఠ కల్పించినారు.

విశ్వామిత్రుని శాప వృత్తాంతము పిదప ఆ ముని "అధోలోక గతి స్వల్పకాలమైనఁ దప్పదు. తరువాత నూర్ధ్వలోకమునకుఁ బోయి యక్కడ నింద్రాది దేవతల దర్శించి ఓరిగి భూలోకమునకు వచ్చి ప్రాణాధిక యగు నీ దేవి వలన సూర్య సమానుఁడగు పుత్త్రుని గాంచి సుఖింతువు."అని అనుగ్రహించెను. విదూషకుడు దీనిని ద్రావిడ ప్రాణాయామమునకు పోల్చినాడు. ఇది తక్కిన యనేక కథలలోని శాపమువలె గాని, శాపమోక్షమువలె గాని లేదు. జరుగనున్న ఏదో పెద్ద కథ ముందుగానే తనకు స్ఫురించినవానివలె విశ్వామిత్రు డిట

మాట్లాడినాడు. ఈ ప్రారంభము సామాజికులకు అద్భుతమును, ఉత్కంఠను కలిగించును. ఇది పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయ ప్రారంభము వలె ఉన్నది. వేదాలవారు మనసున అట్లే భావించి యుందురు. సరస్వతి నాటకమున ఇట్లే చేసి, ఇంతకంటె ఈ పద్ధతిని మెఱుగు పఱచినపుడు వడ్డాది సుబ్బారాయ కవిగారు సూరనార్యునితో పోల్చి పానుగంటివారిని ప్రశంసించుట జరిగినది.

ఇంతవఱకును పాత్ర చిత్రణమును గొనియాడుటకు అవకాశము రాలేదు. ఉదాత్తత అనిన పంతులుగారికి మక్కువ ఎక్కువ. ''పూర్వమొకసారి నేనొక పిల్లిని వలచి ధైర్యమును గోల్పోయి....'' అని చెప్పెడు విదూషకుడు గూడ సమయము వచ్చినప్పుడు ఎంతటి ధీరుడు, ఉదాత్తుడు అయ్యెనో చూడుడు.

నర్మదను ఊర్ధ్వలోకమున కెత్తుకొనిపోగా, పురుకుత్సుడు దుఃఖితుడై ఆత్మహత్యా ప్రయత్నము కావించుకొనెను. అంతట,

విదూ : (చేయి పట్టుకొని) రాజా! ఏమి పని చేయుచుంటివి? నేను బ్రాహ్మణుఁడను. వయస్సు మీఱినవాఁడను. నీ తండ్రి కాలమునుండి కొలువు సేయుచుండువాఁడను. నీ సొమ్ము పెట్టుచున్నంతమాత్రమున నన్నింత యగౌరవ పఱతువా? లోకముగాని లోకమునకు నీవు ప్రయాణమై పోవునప్పుడు దగ్గర నున్న పూజ్యుఁడనైన నాతోఁ జెప్పి పోవలదా? ఇంత విశ్వాస హైన్యమా?

పురు : విప్రవర్యా! నమస్కారము. నేను పోయెదను. సెలవిండు.

విదూ : ఎందులకు?

పురు : నా కాంతను నేను దెచ్చుకొనుటకు.

విదూ : నాయకుఁడు స్వయముగా నాయికకొఱకు పోయి తెచ్చుకొను క్రొత్త వాడుక ఈనాడు కలిగినదికదా! ఇంత తెలియనివాఁడవు కనుకనే, ఆ కాంత నిన్ను వీడిపోయినది. ఇప్పుడైనను పూర్వాచరణము ననుసరించి చిర కాల సేవకుఁడనైన నన్ను దూతగఁ బంపుము. ఇక్ష్వాకు కులసంభవులకు సంధించిన బాణ ముపసంహరించుట మర్యాద కాదు. కాదు. ముమ్మాటికి కాదు. ఇదుగో! వేదఘోష పవిత్రమగు నా కంఠమును నీ బాణమునకు గుఱి యిచ్చితిని. ఏమీ! సంకోచించెదవేల?

పురు : ఆహా ! విప్రవర్యా ! నన్ను వంచించితివి కదా !

విదూ : నిన్ను నీవే వంచించుకొంటివి. వేనవేల కుటుంబముల కాకర మగు నూరిపై నిప్పు పెట్టదలచితివా ? కుసుమ సుకుమారమగు నీ మేనును జాణాగ్ని కాహుతి చేసెదవా ? ఇదిగో ! అగ్నిస్వరూపమైన గాయత్రి యిచ్చట వెలుగుచున్నది. అగ్ని నగ్నిలో ప్రవేశపెట్టుము.

పురు : బ్రహ్మహత్యా దోషము గట్టుకొందునా ?

విదూ : ఆత్మహత్య యంతకంటె దోషమని యెఱుగవా ?

మొత్తముమీద పాత్ర పోషణమున నిట్టి క్రొత్త వెలుగులను పంతులుగారు ప్రసరింప జేసినారు.

బహుశః కాళిదాసుని విక్రమోర్వశీయము నాదర్శముగా నుంచుకొనుట చేతను గాబోలు ఉపమాలంకారముల నెక్కువగా వాడుటను పంతులుగారు ఆరంభించినారు. పోలిక తెచ్చినచోట, ఏదో ఒక్క సమాన ధర్మమును దృష్టిలో పెట్టుకొనుట కాక ఒక విస్తృత భావమును. సన్నివేశమును సర్వాంగముగ పోలిక స్ఫురించునట్లు వ్రాయుట వారి రచనలలో కాననగును. పంతులుగారికి ఆంధ్ర కాళిదాసు అను ప్రశస్తి సంపాదించి పెట్టినవానిలో ఈ గుణ మొకటి.

పురుకుత్సుడు దేవరాజ సభలో నర్మదను ప్రతిమగా భావించినపు డను కొనిన యీ మాటలలో ఉపమా శోభ ఎట్లున్నదో గమనింపుడు.

"ప్రతిమ నంటు కోరిక ముందు వంక కడలు
వెనుకకును లాగ మది నడుమను గలంగె
తూల్ల యాస ముందునకును గాళ్ల నాచు
వెనుక లాగ స్రుక్కెడు హంస విధము గాగ."

"భయము, సిగ్గు, నెనరు, బలుశంక, సంభ్రమం,
బాశ, సంతసంబు లన్ని కలిసి,
చిత్రగతిని గ్రమ్మె చింతార్ద్రమౌ మది
జలదగత సురేంద్ర చాప మట్లు."

ప్రదర్శన సమయమున నటులు జాగ్రత్త వహించవలసిన ఘట్టములు కూడ కొన్ని యీ నాటకమున నున్నవి. ఒక పాత్రము వేఱొక పాత్ర చిత్త వృత్తిని, తదనుభావములను వర్ణించు ఘట్టము లున్నవి. ప్రదర్శన సమయముల ఆ యా పట్టుల అభినయము నవి నిబద్ధించి యుంచును. తృతీయాంకమున అంశుమంతుడు నర్మదా విరహవశుడయి యున్న రాజును ఇట్లు అభివర్ణించును.

"కన్ను లరమూసి చెక్కిటఁ గరము గ్రాల
శిరము నొకవైపునకు జేర్చి చిటుకు చిటుకు
మంచు కన్నీరు లొలికెడు నతఁడు గ్రాలు
వెలయ దైన్యంబు మూర్తీభవించినట్లు."

పంతులుగా రిట్టి రేఖా చిత్రములు గీసి ప్రదర్శించుట యం దెంతయు నిపుణులు. దాదాపుగా నన్ని నాటకములందును ఇట్టి సందర్భము లున్నవి.

ఈ నాటకమున విష్కంభములు లేకపోవుట యొక విశేషము.

# సారంగధర

పానుగంటివారి రెండవ నాటకము సారంగధర. ఆంధ్ర వాఙ్మయ సూచికయందు దీని తొలి ముద్రణము 1909 అని యున్నది. అది సరికాదు. 1909 నాటిది రెండవ కూర్పు.

ఈ నాటకము 1904 లో ఏలూరు మంజువాణీ ముద్రాక్షరశాలయందు మొదట ముద్రింపబడినది. ముఖపత్రము మాత్రము 1905 లో ముద్రింపబడెను. ఈ నాటక రచనా కాలమునాటికి నరసింహారావుగారు చెల్లయ్యమ్మారావుగారి కడనే యుద్యోగమునందు ఉండిరి. వారు ఈ నాటకము ఆమెకే అంకితము చేసిరి. తొలి ముద్రణములోని కృతి పద్యములు తరువాతి కూర్పునందు తొలగింపబడినవి.

పంతులుగారు ఈ నాటకమునకు మొదటి కూర్పున పీఠిక వ్రాసియుండ లేదు. తరువాతి కూర్పున పీఠిక యున్నను రచనాకాలము పేర్కొనలేదు. నాంది ప్రస్తావనలు పంతులుగారే వ్రాసికొనినట్లు కన్పించును. నాందిలో 12 పదము లున్నవి. కావ్యార్థ సూచనము చేయబడినది.

సారంగధర అయిదంకముల నాటకము. ఇందలి కథ జనవిశ్రుతమైనదే. ఇందలి రాజరాజనరేంద్రుడు వేంగిదేశము నేలిన రాజరాజనరేంద్రు డనియే పంతులుగారు గ్రహించిరి. నిర్దోషి యగు సారంగధరుని శిక్షించిన పాపమునకు పరిహారముగా రాజరాజనరేంద్రుడు నన్నయచే భారతము నాంధ్రీకరింపజేసి కృతి పొందవలయునని, పిదప శ్రీమద్రామానుజ భాష్యకారాచార్యులవారి కడ చక్రాంకితములు పొందవలసినదని మీననాథుడు ఆనతి యిచ్చును.

ఇందలి కథా సంవిధానము ఇట్లున్నది.

సారంగధరుని పావురాల యాట, పావురము చిత్రాంగి మేడపై వ్రాలుట, దానిని తెచ్చుటకై పోవ నాయత్తపడుచున్న యువరాజును సుబుద్ధి వారించియు విఫలుడగుట మొదటి యంకము; రెండవ యంకమున చిత్రాంగి సారంగ ధరునిపై వలపు ప్రకటించుట, సారంగధరుని తిరస్కారము; తృతీయాంకమున రాజరాజు చిత్రాంగి మాటలు నమ్మి సారంగధరునకు శిక్ష విధించుట, రత్నాంగి ప్రార్థనము మన్నింపకపోవుట. చతుర్థాంకమున కారాగారమున నున్న సారంగ ధరుని జూచి సుబుద్ధి, రత్నాంగి విలపించుట యున్నది. పంచమాంకము ఆరంభమగునరికి రాజునకు జరిగిన సమాచారమెల్ల తెలిసి సంసార పరిత్యాగము చేసి అడవికి బోయెను. అచ్చట మీననాథుని శిష్యులు సారంగధర చరిత్రము— అందును మీననాథుడు ఓషధీ ప్రభావముచే సారంగధరుని బ్రతికించిన ఘట్టమును, రూపకముగా ప్రదర్శించిరి. రాజు సజీవుడై యున్న కుమారుని కలిసికొనెను; చిత్రాంగిని క్షమించెను. ఇట్లు సర్వము శుభాంతమైనది.

పంతులుగారు ఈ నాటకమునందు కూడ అంతర్నాటకము కల్పించిరి. నర్మదా పురుకుత్సీయము నందుకంటె ఇందు అంతర్నాటకమునకు ఎక్కువ ప్రయోజనము కలదు. పంచమాంక మందలి విష్కంభమువలన రాజునకు వాస్తవము తెలిసి, చిత్రాంగికి శిక్ష విధించెనన్న యంశము తెలిసినది. అయిదే అంకములలో కథ ముగింపుచు పంతులుగారు సారంగధరుని కర చరణ ఖండ నము గాని, మీననాథుని రాక గాని, అంకములో కూర్పకుండుటచే రాజునకు సంతోషవార్త క్రమముగా తెలియుటకై అంతర్నాటకము మీననాథునిచే, నాటక కర్తచే ప్రయుక్తమైనది. పైగా అంతర్నాటకము ముగియువఱకును పానుగంటి వారు కథను సుఖాంతము చేయుచుండిరో లేదో సామాజికులకును తెలియదు.

ధర్మవరమువారి సారంగధర నాటక మింతకుముందే వెలువడినది. రాజు సారంగధరుని శిక్షించు ఘట్టమున దానిలోవలె పంతులుగారు ఇట న్యాయసభ తీర్పింపలేదు. "నా భార్యయొక్క రంకు; రంకు చేసినవాడు కడుపున బుట్టిన కొడుకు. నా భార్య వాదియు, నా కొడుకు ప్రతివాదియు, నేరము చెఱుపు నేరమును. సిగ్గులేక న్యాయకర్తను నేనా ? ఛీ, ఛీ, ఇందులో నుభయ కక్షలవారి యొక్క న్యాయవాదులౌనని, కాదని యుక్తి ప్రతియుక్తులతో వాదించవలసినదా?

సారంగధరుడు నా యిల్లు దూరినందులకు పారాజవానులు సాక్షులా ? ఛీ, ఛీ, యీ యూహ తప్పు. నేను నా రాజ్యమున సర్వ స్వతంత్రుడను. నా యిష్టమే చట్టము." అని నిశ్చయించుకొని, ఒక్క మంత్రితో మాత్ర మాలోచించి రాజు సారంగధరునకు శిక్ష విధించెను.

ఒక విధముగా జూచినచో ధర్మవరమువారు ఈ కథను రూపకముగా మలచిన పద్ధతి, పాత్ర చిత్రణ విధానము నచ్చక పంతులుగారు ఈ నాటకము వ్రాసిరేమో యనిపించును. రాజరాజనరేంద్రునిచే పై విధముగా చర్చింపజేయుట ఈ యూహకు ప్రోద్బల మిచ్చును. ధర్మవరమువారి నాటకములో తమకు నచ్చని యీ అంశమును సాక్షి మొదటి సంపుటములో "సారంగధర నాటక ప్రదర్శనము" లో గూడ కొంత వెక్కిరించిరి.

భావ్యర్థ సూచనముపై మిక్కిలి మక్కువతో పంతులుగారు మొదటి యంకమున శ్లేష నిమిడ్చి నాలుగు పద్యములు చెప్పించినారు. చేమకూర వేంకట కవి వలెనే చిత్రాంగీ సారంగధరుల సంభాషణమునందు ద్వితీయాంకములో చమత్కృతికై శ్లేష వాడినారు.

చిత్రాంగి : విశ్వామిత్రు నంతటివాఁడు మేనకను గూడఁడా ? మేనక పరస్త్రీ కాదా ?

సారంగ : కాదు; స్వస్త్రీ.

ఈ నాటకములో ప్రత్యేకము గమనింపవలసిన యంశము లివి. పంతులు గారు తొలుతగా విష్కంభము లిందు వ్రాసిరి. విష్కంభములలో హాస్యరసము నకు అధిక స్థానము కల్పించుట; ఏవో సూచ్య కథాంశములు చెప్పుటకు మాత్రమే ప్రవేశించినట్లు గాక పాత్రములు కొంత వ్యక్తిత్వము కలిగి యుండుట అనునవి పంతులుగారి నాటకములలో విష్కంభముల విశిష్టత. వీనికి బీజములు ఈ నాటక మందే చూడవచ్చును.

పంతులుగారు నర్మదా పురుకుత్సీయము మొదటి కూర్పున ఔచిత్యమునం దెట్టి దుడుకుతనము చూపిరో, అట్టిది యిందును చూడ వచ్చును.

రత్నాంగి రాజు పాదములపై బడి సారంగధరుని శిక్ష తగ్గింపుమని యాచింపుచున్నది. ఆయన వినకపోగా రత్నాంగి సవతి యగు చిత్రాంగి పాదములపై బడి దయ చూపుమని వేడెను.

రత్నాంగి : చెల్లెలా ! నీ పాదములకు మ్రొక్కుచున్నాను; నాకుఁ బుత్రదానముఁ జేయుము.

చిత్రాంగి : నీ కొడుకే నాకుఁ బుత్రదానముఁ జేయుట కారంభించినాఁడు. ఆ పుత్రదాన మేదో నీ కొడుకు నే యాచించుకొనుము.

మఱల కొంతసేపటికి కొడుకును దయ జూడుమని రత్నాంగి రాజును బ్రతిమాలుకొనెను. ఆయన కోపములో నిట్లనెను.

రాజు : వాఁడు నా కొడుకు గాఁడు — కాఁడు.

చిత్రాంగి : పతివ్రతా శిరోమణీ ! భర్తగా రేమనుచున్నారు?

ఇట్టి దూషణపూర్వక వ్యంగ్యము అనుచితము, అసభ్యము, అశ్లీలమును. సరిగా ఇట్లు మాట్లాడకపోయినను, ఇంతటి దుడుకుమాట కైకేయికిని ఉన్నది. పాదుకా పట్టాభిషేకమునందు, శ్రీరామ వనవాస గమనమునకై ఎల్లరును శోకించుచుండగా నారబట్ట లిచ్చి కైకేయి ఏమన్నదో చూడుడు : "మీఁదఁ బడవైచినది బట్ట కాని పాము గాదుగదా ! పోవునది వనమునకు గాని మఱణమునకుఁ గాదు గదా !"

నర్మదా పురుకుత్సీయమున మితిమీరిన శృంగారమే కాని ఇంత అసభ్యత లేదు. దానినే పునర్ముద్రణమున సంస్కరించిన పంతులుగారు మఱి దీని నేల సంస్కరింప లేదో ?

అప్రధాన పాత్రల సృష్టిలో పంతులుగారు ఇందు క్రొత్త పోకడలు చూపినారు. సారంగధరుని కర చరణములు ఖండింప నియమింపబడిన కంటక లవిత్రుల పాత్రలు ఆయన ప్రతిభను వ్యక్తము చేయును. సారంగధరుడు తన నాలుగు అవయవములను ఒక్కసారిగా ఖండించుటకు వీలుగా రాజు నలుగురు

తలారుల నిచ్చిన బాగుండునని పలుకును. అంతట ఇద్దరు తలారులలో ఒక్కడైన కంటకుడు ఇట్లు అనును. "సరి సరి. చాలులేవయ్యా! ఇంతటి భాగ్యము లోను నలుగురి పంపకములా? బాబూ! మాకేమి మళ్లా మాన్యములా? మా తల్లుల కడుపు చలువచేత మీ వంటివారు నెలకు బదిమంది వచ్చిన...."

కంటకుడు సందర్భశుద్ధిగా, తియ్యగా, మాటలు చెప్పుట చేతనైనవాడు కాడు. వాని మాటలు, భావము కటువుగా నున్నను వాని స్థితినుండి పరిశీలించి నప్పుడు వాడు అన్నమాటయు నిజమే యనిపించును. కాగా, ఇక్కడ నున్న సంభాషణము సంప్రదాయసిద్ధమైనది కాదు. ఒక క్రొత్తదనమును జూపుచున్నది. సారంగధరుడు సజ్జనుడు. నాటకమున సామాజికుల సానుభూతిని పొందు పాత్ర యది. అట్టి పాత్ర దురవస్థల బొందినప్పుడు రంగస్థలముపై అపుడున్న పాత్ర లన్నియు శోకావస్థలో నున్నట్లు చూపుట సాధారణముగా నెవరైన చేయు పని. కాని పంతులుగారు కంటకునివంటి తలారి మనసులో నుండదగు వాసవికమైన యూహమును బయట పెట్టించిరి.

కారాగారాధిపతి, కంటక లవిత్రులు — ఈ పాత్రల ప్రవర్తన అత్యుక్తిగా నున్నదని అనిపించవచ్చును. కాని సూక్ష్మముగా నాలోచించిన వారి మాటలు, ప్రవర్తన అసహజములు కావు అనిపించక మానదు. ఇట్టి పాత్రలను పానుగంటి వారు సృష్టించినది మొదట ఈ నాటకములోనే.

# ప్రచండ చాణక్యము

ప్రచండ చాణక్యము పంతులుగారి మూడవ నాటకము. దీనిని వారు 20-3-1903 న ఆరంభించి, 15-11-1903 నాటికి ముగించిరి. 1909 జనవరిలో డి. వి. రమణారావు అండ్ కంపెనీ వారిచే సర్వజన మనో రంజనీ గ్రంథ మాలలో తొలి పుస్తకముగా ఇది ప్రకటింప బడినది. దీనిని రాజమహేంద్ర వరమున యస్. గున్నేశ్వరరావు బ్రదర్సు వారి శ్రీ చింతామణీ ముద్రాక్షర శాలలో ముద్రించిరి.

"దీనిలోని కథ విశాఖ దత్త మహాకవి విరచిత ముద్రారాక్షస నాటక కథకు పూర్వగాథయై యున్నది. కాని యట్టి పూర్వగాథ యందు కొన్ని కొన్ని యమానుష కృత్యంబులు వర్ణింపబడి యుండుటచే ప్రస్తుతకాలపు జనుల కవి రుచియింపవని యెంచి యొక క్రొత్త మార్గముగ నీ నాటక కథను గల్పింపవలసి వచ్చెను. నందునకు మురయను దాని వలనఁ జంద్రగుప్తుఁడు గలిగెనని యాంగ్లేయ భాషలోనున్న యొక హిందూదేశ చరిత్రములోని యంశము ననుసరించి యీ కథను గల్పించి నాఁడను." అని నరసింహారావుగారు పీఠికలో వ్రాసిరి.

మౌర్య చంద్రగుప్తుడు చారిత్రక పురుషుడే యైనను, అతని గూర్చి యున్న కథలన్నియును సంపూర్ణముగా ప్రత్యంశమును వాస్తవము అనుటకు అవకాశము లేదు. వాని యాథార్థ్యమును గూర్చిన చర్చకు ఇట అవకాశములేదు. పంతులు గారు చేసిన మార్పులు మాత్రమే ముఖ్యమైనవి చెప్పవలయును.

చాణక్యుడు కూడ రాక్షసునితోపాటు నందునకు ఒక మంత్రి. చాణక్యునిపై రాక్షసునకు అసూయ. అతనిని సాధించుటకై రాక్షసుడు తరుణము కొఱకు ఎదురు చూచుచుండెను.

రాజ పత్నియగు సునంద జ్యోతిషికుని వలన మురాసుతుడగు చంద్ర గుప్తుడు రాజగునని తెలిసికొని తల్లిని, కుమారుని రూపుమాపుటకు నిశ్చయించెను. ఈ కుట్రలో రాక్షసుడు చాణక్యునిగూడ ఇరికించి, మురకు అతనికి సంబంధ మున్నట్లును, నిజమునకు చంద్రగుప్తుడు మురకు చాణక్యుని వలన పుట్టిన వాడే యనియు నందరాజును నమ్మించెను.

నందుడు ఆ మాటలు విశ్వసించి, మురా చంద్రగుప్తులకు దేశ బహిష్కార శిక్షయు, చాణక్యునకు ఉరిశిక్షయు విధించెను. అయినను నందుడు తాను బౌద్ధు డగుటచేత స్వయముగా జీవహింస చేయింప నొల్లక చాణక్యుని ఉరిశిక్ష అమలు చేయించుటకు తన సామంతుడగు పశ్చిమ పాంచాలపతి వద్దకు పంపించెను. చతురుడగు చాణక్యుడు అతనిని వశము చేసికొని కపటముగా నందుని ఉదయ పురమునకు రావించి అచ్చట తానే అతనిని వధించెను.

తరువాత చాణక్యుడు ఒక తంత్రము పన్ని రాజాంతఃపురము ప్రవేశించి, నందసుతులను కూడ స్వయముగా వధించెను. ఈ ఘోరకృత్యము రాక్షసుడే చేసి పారిపోయినట్లు ప్రవాదము పుట్టించెను. పాంచాల రాజగు యాదవసేనుని చాణక్యుడు యుక్తితో దారినుండి తొలగించి చంద్రగుప్తునకు పట్టాభిషేకము చేసెను.

“పంతులుగారి నాటకములలో నేను చదివి మనస్సులో చాల బాధ పడినది ఈ నాటక మొక్కటియే. విశాఖదత్తుని ముద్రారాక్షసమునకు పూర్వకథ యిది. ముద్రారాక్షసమందు రాక్షస గ్రహణము ముఖ్యముకాగా ఇందు నందవధమే ముఖ్యము. ఇందు ప్రధాన పాత్రములైన చాణక్య, రాక్షసు లిరువురును చాల అధమ ప్రకృతి కలవారుగా చిత్రించబడినారు. ముద్రరాక్షస మందలి రాక్షసుడు బేలతనము మొదలగు కొన్ని స్వల్పదోషములు కలవాడైనను చాల ఉదాత్తప్రకృతి కలవాడు. కాని యిందు తనకు ప్రతిస్పర్థియైన చాణక్యుని పీడ వదలించుకొనుటకు మురా చాణక్యులకు సంబంధము కలదని వాదు పుట్టించి, నందుని నమ్మించి, చాణక్యుని పరాభవింప జేయును. ముద్రారాక్షస పఠనము వలన నామనస్సులో నిలిచిన రాక్షసుడు తన ప్రాణము పోయినను ఇట్టి అవాచ్యములు పలుకడు.

శత్రువునెడ చాణక్యుడు నిర్దయుడగుట ప్రసిద్ధమే. కాని యిట్టి మహా దారుణములు స్వయముగా చేయునని నమ్మజాలకున్నాను. మొత్తముమీద సంభాషణములు ఆకర్షణీయముగా, బిగువుగా నడచినను సందర్భములు మాత్రము జుగుప్సావహములుగా నున్నవి. "

అని ఈ నాటకమును గూర్చి డా. అప్పారావుగారు పూర్వోక్తమగు తమ వ్యాసములో వ్రాసిరి.

స్థూలముగా ఈ అభిప్రాయమును అంగీకరింపక తప్పదు. ప్రఖ్యాతములగు రాక్షస, చాణక్యుల పాత్రలను పోషించుటలో పానుగంటివారు చేసిన మార్పులను అటుంచి, నాటకమును చదివినచో ఇది చక్కని నాటకము. కథా సంవిధానము, వస్తూన్మీలనము, రూపక శిల్పము మున్నగు వానియందు దృష్టి నుంచి చూచినచో దీనికి విశిష్టత యున్నది.

షేక్స్పియర్ మహాకవి వ్రాసిన చారిత్రక రూపకముల పద్ధతిని అనుసరించి కొంతవఱకు ఈ నాటకమును పానుగంటివారు వ్రాసిరి. డా. కె. వీరభద్రరావు గారు " తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము " అను తమ పరిశోధన గ్రంథమున 468–472 పుటలయందు ఈ నాటకమునుగూర్చి విపులముగా చర్చించియున్నారు. " వీరి నాటకములలో షేక్స్పియర్ నాటకములతీరు ననుసరించినది ప్రచండ చాణక్యము అను నాటకము. ఇది 1909 జనవరిలో వెలువడినది. కథా సంవిధానమునను, సన్నివేశ నిర్వహణమునను, లౌకికాను భవములను సూత్రప్రాయముగ చెప్పుటయందును శ్రీ పానుగంటి కవి షేక్స్పియర్ ననుసరించెను. " అని వారు అన్నారు.

పిదప డా. వీరభద్రరావుగారు ప్రచండ చాణక్యములోని కథా కల్పనకు, ఒథెల్లో నాటకములోని కల్పనకు గల పోలికను వివరించిరి. ప్రచండ చాణక్యములో వసంతుడు అను పేరుగల విదూషకుడు క్రమముగా నందునకు చాణక్యునిపై ద్వేషము కలిగించు ఘట్టమునకు, ఒథెల్లో లోని తృతీయాంకమున మూడవ రంగమునకు గల సాదృశ్యము నిరూపించిరి.

షేక్స్పియర్ విషాదాంత రూపకముల ఎట్టి సంభాషణ రచనా పాటవము కన్పట్టునో ఈ నాటకమున పంతులుగారు అట్టి పాటవమునే ప్రదర్శించిరి. రంగస్థలమున ఉద్వేగము గలిగించు మృతి, యుద్ధము మున్నగు వానిని ప్రదర్శింపరాదు అను ఆలంకారిక నియమమును పంతులుగారు ఉల్లంఘించిరి. నందవధము రంగస్థలముపైననే కూర్పబడినది.

ఈ నాటకమున పంతులుగారి కృషిని గూర్చి చెప్పవలసిన అంశములు కొన్ని యున్నవి. విష్కంభములను దీర్ఘములుగా వ్రాయుట వారి పద్ధతి. వానిలో కొన్ని చిత్రప్రకృతి గల పాత్రలను ప్రవేశపెట్టుటయు వారికి పరిపాటి.

పంతులుగారి మొదటి నాటకములో విష్కంభములే లేవు. సారంగధరలో ఒక్కటే విష్కంభము ఉన్నది. దానిలో పాత్రలగు శుభాంగి, లవంగి మొదటి సగమున సొంత గొడవలు చెప్పుకొని, మాటల ప్రస్తావన వశమున సూచ్యకథా సూచనముచేసి పోవుదురు. పంతులుగారి తరువాతి నాటకములలో సైతము కేవలము అర్థోపక్షేపణమునకు మాత్రమే వచ్చు విష్కంభ పాత్రములు అరిది. అట్టి పద్ధతి సారంగధరలోనే మొదలయినను దానికి విస్తృతి ప్రచండ చాణక్యములో కన్పట్టును.

తృతీయాంకము నందలి విష్కంభమునందు ఇందు శర్మ, భృంగారకుడు పాత్రలు. నందరాజ్యమున కనవచ్చుచున్న దుర్నిమిత్తములను గూర్చి వీరు ముచ్చటింప వత్తురు. వీరిలో ఇందు శర్మ నాటకమున కేవలప్రవేశము మాత్రమే కాక, కథా భాగమున కొంత ప్రాధాన్యముగూడ కలవాడు. ఇతడు చాణక్యుని మేనల్లుడు. ఈ విష్కంభము నడచిన స్థలము పాటలీ పురమునందలి ఒక వీధి. అంకమునందలి కథ ఉదయపురమున ఆ నాటికి మూడవ దినమున జరిగినది. ఇది యొక చిత్రమైన కల్పన. పంచమాంకమునందలి విష్కంభమున పాత్రలు ఇందు శర్మ, మైత్రేయుడు. ఈ ఇరువురును కథాగత పాత్రములే. దీనిని పంతులుగారు విష్కంభము అనివేసినారు గాని, నిజమునకు దీని వలన అంకమును దృశ్యములుగా విభజించినట్లే యైనది. ఇట్లే మఱికొన్ని నాటకములందు కూడ విభజనకు వీలుగా వ్రాసినను వారు మాత్రము దృశ్యములు అనలేదు.

ఇందుశర్మ ఒక విచిత్రసృష్టి. చిన్నదనమున తల్లిదండ్రులను పోగొట్టుకొని, మేనమామ వద్ద పెరిగినాడు. పొట్టకోసిన అక్షరము లేనివాడే కాని తెలివి తక్కువవాడు కాడు. మిక్కిలి గడుసువాడు కూడను. ఓదార్చువాడు ప్రక్కన లేనప్పుడు ఏడ్చుట మిక్కిలి కష్టము అని, భృంగారకుడు దొరికినదాక ఆగి తీరికగా ఆతడు ఏడ్చిన ఘట్టము అసహజము అనిపింపకమానదు. యథాతథముగా అట్లే జరుగక పోవచ్చును గాని, అట్టి విపరీత చర్యలకు మూలమగు ప్రకృతి మాత్రము అసహజము కాదు. ఇట్టి చిత్ర ప్రకృతిగల పాత్రలను పానుగంటివారు తరువాత తరువాత అనేకముగా సృజించిరి.

ఈ నాటకము చాణక్యుని ప్రచండతను చూపుటకు వ్రాయబడినది. అతడు వైరిజయ ప్రధానుడు, అయినను ఈ నాటకములో హాస్యరసము బహుళముగా నున్నది. సాధారణ హాస్యముతోపాటు సమయస్ఫూర్తితో కూడినది, ప్రతిభా సాధ్యమగునది కూడ నున్నది.

చాణక్యుడు శిష్యుడగు మైత్రేయుని పాటలీపురమునకు పంపి తనకు నంద సుతులను చంపుటకు అవకాశము ఘటించుటకు నియమించెను. మైత్రేయుడు వచ్చి ఇందుశర్మను సానివీధియందు కలిసినాడు. అతనితో చాణక్యుడు జీవించియే యున్నాడని చెప్పబోవుచు, రహస్యము కాపాడుదునని భగవద్గీత తలపై నిడుకొని ప్రమాణము చేయుమనును. ఇందుశర్మ భగవద్గీతను సానివాడ కేల తెచ్చితివని ప్రశ్నించెను.

అందుకు మైత్రేయుని సమాధానము ఇది :

" పేలు కురుపులు గల్గి సంపెంగనూనె
నున్న సాని కీల్గంటు విటోపభోగ్య
మౌనటులె దుష్టచిత్తము హరికథోప
రి వచన సహితమై జనప్రీతి జెందు. "

మైత్రేయుడు ఎందులకు చెప్పెనో పోయినది. ఇందుశర్మ బదులు ప్రశ్న ఇది. " అట్టి దిక్కుమాలిన వెలయాలు నీ కెక్కడ లభించెను ? "

మఱియొక ప్రౌఢమగు హాస్యకల్పన దూదేకుల శ్లేషకవి వృత్తాంతము. చాణక్యుడు ఇందుశర్మకు పశ్చిమ పాంచాలమునుండి లేఖ వ్రాసెను. అందు చాణక్యుడు వ్రాసినది ఈ ప్రకారము.

" ఉరిని బడయనున్నాడ నీ పురమునందు
కొడుకు పైనను నీవె యల్లుడవునైన
నీవె; నిను బెంచు నాకొఱ కీవుసేయ
వలయు నది యేదొ యయ్యది సలుపుమయ్య. "

దానిని శర్మ తలగడ యందుంచెను. ఒకప్పుడు అవసరము కొలది ఆ తలగడ ఏకించుటకు ఒక దూదేకుల శ్లేషకవిని పిలిపించినాడట. అతడు, " ఉరిని బడయను " అక్కడ కొక యేకేకి, " ఉన్నాడ నీ పురమునందు " అని వేఱుచేసి ఏకి, "ఉరిని బడయ నున్నాడ నీ పురమునందు" అని తిరుగ దోడి యేకి చాణక్యుడు జీవించి యున్నట్లు ఈ ఉత్తరమే చెప్పుచున్నది అనినాడట. ఈ వృత్తాంతము శర్మ మైత్రేయునకు చెప్పును.

రాక్షస, చాణక్యుల పాత్రలను పానుగంటివారు స్వేచ్ఛగా మార్చి రన్న మాట ఈ వఱకే చెప్పబడినది. ముద్రారాక్షస మందున్న రూపములను మనసులో నుంచుకొని ఈ నాటకమును చదివిన వారు డా. అప్పారావుగారి వలెనే భావింతురు. కాని ఒక్క క్షణముపాటు దానిని మఱచి ఈ నాటకము పఠించినచో కలుగు అభిప్రాయము భిన్నముగా ఉండును.

చాణక్యుడు ముద్రారాక్షసములో ఇట్లు చెప్పెను. " అథవా యేన మయా సర్వలోక ప్రకాశ నందవంశ వధం ప్రతిజ్ఞాయ విస్తీర్ణ దుస్తరా ప్రతిజ్ఞా సరిత్తోఽహ మిదానీం ప్రకాశీభవన్త మప్యేనమర్థం సమర్థః ప్రశమయితుమ్."

కాని ఇందు చాణక్యుడు అట్లు ప్రకాశముగా ప్రతిజ్ఞ చేయలేదు. పంతులు గారు చాణక్యునిచే ఇట గుప్తముగా, ప్రౌఢముగా చెప్పించిరి. తనకు ఉరిశిక్ష విధించుచున్నట్లు అతనికి తెలియదు. దేశత్యాగ శిక్ష యన్నంతవఱకే తెలియును. తనకు రాజు పరాభవము చేయుచున్నప్పుడు మనస్సులో అతని వంశచ్ఛేదము

చేయుటకు ప్రతిజ్ఞ చేసెను. చంద్రగుప్తుని ఆ సమయమున చూచి, అతని మాటలు వినునప్పుడే అభిమానము కల్గి ఎప్పటికైన ఆతనిని మగధ రాజ్యాధిపతిగా చేయుటకు సంకల్పించెను. వీనిని లోపల నుంచుకొని, వీడ్కోలు సమయమున రాజుతో ఇట్లు పలికెను—

"ఏను దూరమునకు నేగుచుంటిని; నీదు
రాజ్యవృద్ధిఁ గాంచఁ బ్రాప్తి లేదు,
నీవు బాగుపడుట నే జూడ నిటుమీఁద,
నీదు వంశవృద్ధి నేను జూడ."

ఈ నాటకమున చాణక్యుని ప్రచండత ప్రదర్శించుటలో కవి ఇందుశర్మ చేత ఒక వృత్తాంతము చెప్పించెను. చాణక్యుడు ఒక రోజున ముక్కుపై ఈగ వ్రాలినదని కోపముచే ముక్కు కోసికొనుటకు సిద్ధపడెనట. కథ వినుచున్న మైత్రేయునకు సందేహము వచ్చినది.

మైత్రే ఎందుచేత ?
ఇందు ముక్కుండుటచేత నీఁగ వ్రాలినదిగదా ! కోసిన యెడల——
అయ్యయ్యో ! మఱికొన్ని యీఁగలు వ్రాలునే ?
ఇందు ముక్కుమీఁద వ్రాలఁగలవా ?

ఇందుశర్మ మాటలు నమ్ముటకు వీలులేదు. కాని ఒకవేళ మేనమామను గూర్చి అతడే యీ కథ పరిహాసమునకు కల్పించినను, ఇది చాణక్యుని స్వభావమును మాత్రము సూచింపజాలి యున్నది.

ఇందలి తృతీయాంకమున నందుని పాత్ర బహు రమ్యముగా తీర్పబడినది. చాణక్యుడు క్రోధ వచనములు పల్కుచు తన్ను జుట్టు పట్టుకొని యీడ్చినప్పుడు నందుడు అతని కిట్లు చెప్పెను. "రోమ రోమ రూపమున కొక బాకు దీసికొని నీవు నన్ను పొడిచినను మురయెడల నీవు నాకు చేసిన ద్రోహమున కంటె నెక్కువ చేయజాలవు." పిదప వసంతకుని మాటలవలన నందునకు

నిజము తెలిసినది. అర్థోక్తిలో నందుడు అతనిని ఆపి "చాణక్యుడా! నమస్కరించుచున్నాను. క్షమింపుము. నాకు దగు శిక్ష జేసితివి." అని పలుకును. అయినను చాణక్యుడు చల్లపడక నందుని కాలితో తన్నెను. ఈ సన్నివేశమువలన చాణక్యునికంటె నందుడే ఉదాత్త పాత్రగా నిలిచిపోవును.

ఈ సందర్భమున ఇంకొక ఊహను వెలువరించుట తగియుండును. పంతులుగారు విపుల లోకానుభవము గల వ్యక్తి. ఆయన రచనలందు స్థానిక వాతావరణము ఇముడ్చబడి యున్నది. ఈ నాటకమున చాణక్యుడు అక్కడక్కడ అకారణముగా మనః ప్రజ్వలనమును పొంది బౌద్ధుడగు నందరాజును దూషించును. బ్రాహ్మణత్వ ప్రశంసయు కొంత శ్రుతి మించి కనబడును. పైగా అమాత్య చాణక్యుని అసూయచే పతనమొందించుట ఇందలి కథ. వారికి ఈ నాటక రచనా కాలముననో, కొంచెము ముందో సరిగా ఈ నాటక కథను ఇట్లు తీర్చుటకు కారణమైన ప్రేరేపణము ఏదో కలిగియుండునని తోచును. అది ఏమైయుండునో నిర్ణయించుటకు ఇప్పుడు అవకాశము చాలదు.

కథ చివఱలో నందసుతులను చాణక్యుడు చంపినట్లును, ఇంతలో రాక్షసుడు పాఱిపోయినట్లును చేసిరి. రాక్షసుడు కుటుంబముతో గూడ పారిపోవుటకవకాశము లేదు కావున కుటుంబమును ప్రాణసముడైన మిత్రుని స్వాధీనము చేసి పోయియుండును అని చాణక్యుడు ఊహించును. ఈ విధముగా నాటక కథను పంతులుగారు ముద్రారాక్షస కథతో కలిపిరి.

రాక్షసుడు ఒంటిగా పారిపోయినది వాస్తవమే కాని అవకాశము లేక కాదు కుటుంబము తీసికొనిపోవనిది. చంద్రగుప్తునిపై క్రోధముతో పగ దీర్చుకొనుటయందు తాను ఏమఱలేదని, కార్యరంగమునుండి పూర్తిగా వైదొలగలేదని తన పక్షము వారికి విశ్వాసము గలుగుటకే అని ముద్రారాక్షసమున స్పష్టమగును.

ప్రచండ చాణక్యము రూపకములలో ఏ వర్గముక్రిందకు చేరునన్నది పెద్ద ప్రశ్న. చంద్రగుప్తుడు గాని, చాణక్యుడు గాని ఎవరు నాయకుడన్నను ఇందలి కథలో చింతితార్థ సిద్ధి కలిగినది. కాని, ఇది కామెడీ కాదు. నందుడు విషాదాంత నాయకుడు అనవచ్చును. దీనిలోని రచనయును విషాదాంత రూపక

స్థాయిలో సాగినది. కాని నాయకుని మృతి తృతీయాంకములోనే జరిగినది. పంచమాంకములో నందసుతుల మృతివలన వంశచ్ఛేదము అగుటచేత, అదియును ఒక విధముగా నాయకుని చర్యలకు గలిగిన ఫలమే అగుచున్నది. షేక్స్పియర్ నాటకములలో జూలియస్ సీజర్ నాటకమున సీజర్ నడుమనే మృతి నందినను, అతడే నాయకుడుగా పరిగణింపబడినాడు. కొందఱు దీనిని ప్రతీకారాత్మక విషాదాంతము అని అందురు.

ఈ నాటకములో చెప్పుకొనదగిన మఱియొక విశేషము షేక్స్పియర్ విషాదాంత రూపకములలో వలె పంతులుగారు ప్రవేశపెట్టిన ఆధిభౌతిక వాతావరణము. భవిష్యత్తులో జరుగబోవు సంఘటనలకు అనుగుణముగా మనస్సుల యందు ఏర్పడు భయ సంభ్రమములు, దుర్నిమిత్తములు మున్నగునవి యిందు కూర్పబడినవి. తృతీయాంకమున వసంతుని మాటలు, విష్కంభమున భృంగారకుడు చేసిన దుర్నిమిత్త వర్ణనము అట్టివే.

కూచి నరసింహముగారు పంతులుగారి నాటకములకు నాంది ప్రస్తావన వ్రాసి యిచ్చుట ఈ నాటకముతోనే ఆరంభమైనది. ప్రస్తావనలో వారు భౌతిక శాస్త్ర సంబంధమైన రెండు ఉపమానములను వ్రాసిరి.

> " కలిత చిత్ర ప్రదర్శన కాచదీప
> యంత్రమున బెట్టు ప్రతిమ దా యవనికపయి
> స్ఫుటముగా గానిపించెడి పోల్కి నాకు
> దలచు మాత్రాన నటియె ప్రత్యక్ష మయ్యె. "

అని సూత్రధారుడు అనుకొనును. సూత్రధారుడు తన వసంత సంకీర్తనమును మెచ్చుకొన్నప్పుడు నటి అతనితో "దూరదర్శిని యద్దములవలె మీ శ్రోత్ర పుటంబులలో నొకటి నా లోపంబులఁ దద్వ్యతిరిక్తంబులుగఁ జేసి, రెండవది గుణంబు సహస్ర గుణంబుగఁ జేసె" నని పలుకును. పానుగంటివారిని ఇవి ఆకర్షించుటచేత తరువాతి నాటకములలో వారు ఇట్టి భౌతిక, రసాయనిక శాస్త్ర సంబంధులగు నుపమానములు అనేకములను తెచ్చి వాడిరి.

# రా ధా కృ ష్ణ

పంతులుగారి నాటకములలో ఉత్తమమైనవి కొన్ని ఎన్నిక చేయవలసి వచ్చినప్పుడు రాధాకృష్ణ నాటకము మొదట పేర్కొనదగి యుండును. ఈ నాటకము పంతులుగారి రచనలలోనే కాక, తెలుగు వాఙ్మయముననే ఉత్తమమైన వానిలో ఒకటి. ఇది సంగీత రాధాకృష్ణ, సంతోష రాధాకృష్ణ కాదు; పరమార్థ రాధాకృష్ణ నాటకము.

రాధాకృష్ణ పంతులుగారి నాల్గవ నాటకము. ఈ నాటకము వ్రాయుటకు లభించిన ప్రేరేపణమును వారు తొలి ముద్రణ పీఠికలో ఇట్లు పేర్కొనిరి.

"భక్తిరస ప్రధానమగు గౌరాంగ చరిత్రమును నాటకముగ వ్రాయుమని నా మిత్రులగు బ్రహ్మశ్రీ కూచి నరసింహముగారు నన్ను ప్రోత్సాహపరచి యాంగ్లేయ భాషయందు వ్రాయబడిన తచ్చరిత్రమును నాకొసగిరి. ఆ గ్రంథములోని యుపోద్ఘాతమును జూచుసరికి, రాధాకృష్ణ చరిత్రమును వ్రాయుటకు నాకు బుద్ధి పుట్టెను. అంతట గౌరాంగ చరిత్రమును ప్రబంధ రూపముగ వ్రాయుడని నేను నా మిత్రులను ప్రార్థింపగ వా రంగీకరించి వ్రాయ నారంభించిరి. నే నీ నాటకమును వ్రాసితిని."

పైన పేర్కొనబడిన ఆంగ్ల గ్రంథము ముఖర్జీ వ్రాసిన **Lord Gauranga** అనునది. కూచి నరసింహముగారు గౌరాంగ చరిత్రమును పద్యకావ్యముగ వ్రాసి 1912 లో ప్రకటించిరి.

పంతులుగారి ప్రచండ చాణక్యము 20-9-1903 నకు, 15-11-1903 నకు నడుమ రచింపబడెను. దాని తరువాత రాధాకృష్ణ; దాని వెనుక పాదుకా పట్టాభిషేకము. ఆ రెండింటి తరువాతిది అగు కోకిల 1906 మే నెలలో వ్రాయబడినది.

నడుమ నున్న నాలుగు, అయిదు సంఖ్యలు గల నాటకముల రచనా కాలము ఏలకో పంతులుగారు పీఠికలలో స్పష్టముగా ఇచ్చి యుండలేదు. రాధాకృష్ణ నాటకము మొదట 1909 లో డి. వి. రమణారావు అండ్ కో., వారిచే తణుకు శ్రీ సౌదామినీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

రాధాకృష్ణ నాటకము వ్రాసిన కాలము ఏదయినను, అది సార్వకాలికత సాధించుకొనినది. ఆంధ్ర నాటక వాఙ్మయ క్షీరసాగరమునకు ఇది ఉడురాజు. పంతులుగారి నాటకములలో దీనికి వచ్చిన ప్రశంస మఱి దేనికిని రాలేదు. ఈ నాటకమునకు ఇంతటి విశిష్ట ప్రాధాన్యము కలుగుటకు హేతువులు అనేకములు. వానిలో ఇవి ప్రధానములు—

1. రాధా చరిత్రము నిష్కళంకము చేయుట.
2. గౌడీయ వైష్ణవ మతానుసారముగ మధుర భక్తిరస పోషణము ఇందు చేయబడి యుండుట.
3. ఇందలి రచనా శిల్పము.

## రాధా చరిత్రము

పార్వతీ పరమేశ్వరుల వలె, సీతారాముల వలె, రాధాకృష్ణులు పవిత్ర దాంపత్య శృంగారము మూర్తీభవించిన రసమూర్తులు. కాని రాధాకృష్ణులను గూర్చిన కథలు తక్కినవారి కథల వలె ఒకరీతిగా లేవు. రాధ కృష్ణునకు మేనత్త యనియు, పరకీయ యనియు ప్రచారమైనది.

కృష్ణుని చరిత్రమును అభివర్ణించిన శ్రీ భాగవత, విష్ణుపురాణ, భారత, హరివంశాదులయందు రాధ పేరే లేదు. బ్రహ్మ వైవర్త పురాణమందు, బృహద్బ్రహ్మ సంహితయందు రాధ కృష్ణుని భార్య యనియే గాని, పరకీయ అని చెప్పబడలేదు. బ్రహ్మవైవర్తము నందయినచో వీరికి ఇరువురకును వివాహమయినట్లే యున్నది.

రాధకు ఆంధ్ర వాఙ్మయమున శ్రీకృష్ణదేవరాయల కాలములో ప్రవేశము కలిగినది. ఆ వెనుకకూడ కొంత కాలము సంస్కృత వాఙ్మయము నందుకంటె భిన్నముగనే రాధ పాత్ర చిత్రింపబడినది. గోపీనాథుని వేంకటకవి నాటినుండియు రాధ పాత్ర చిత్రీకరణమున మార్పు కలిగి "నీచ శృంగార రసాలంబయై యున్న రాధ శక్తి స్వరూపిణియు, మహా ప్రకృతియు నైపోయినది."[1] ఆధునికుల రచనలలో రాధ మాధుర్య మూర్తియై విలసిల్లినది. "వీని అన్నింటికంటెను జన సామాన్యమునందు రాధయొక్క ప్రాచీనానౌచిత్య క్షాళనమునకు మిక్కిలి తోడ్పడినది పానుగంటివారి పరమార్థ రాధాకృష్ణ నాటకము."[2]

## మధుర భక్తిరసము

ఆధునిక సాహిత్యమున మధుర చిత్తవృత్తికి ప్రాధాన్యము ఎక్కువ. తక్కిన నవరసములకన్న ప్రేమ, తద్రూపాంతరములకు విశేష ప్రాచుర్యము కలిగినది. "నవ్యాంధ్ర సాహిత్య వీధుల"లో తత్కర్తలు పేర్కొనినట్లు "వెనుకటి తరములో ఈ విధమైన భక్తి వాత్సల్యాదులకు పానుగంటివారి రాధాకృష్ణ ప్రసిద్ధి చెందినది."

భక్తిభావము, తదనుభావములును క్రొత్తవి కాకపోయినను చైతన్యుని కాలమునుండియు ఈ సంప్రదాయము ఉపాసన మార్గముగా భారతీయ సాహిత్యములందు బాగుగా ఎక్కినది అనుట నిర్వివాదాంశము. భారతీయ తత్త్వ శాస్త్రము అను పుస్తకమున స్వామి నిర్వికల్పానంద వివరించినట్లు "వైదిక సూక్తములందు మంద మందముగ నిక్వణితమైన భక్తి తంత్రులు ఆళ్వారుల తీవ్ర సాధనలచే ప్రతిస్పందితములై, శ్రీరామానుజ, మధ్వ, వల్లభ, నింబార్కులచే మీటబడి గౌడీయ వైష్ణవ దర్శన మను మధుర రాగిణిగ రూపొందినవి.

---

1 & 2. ఆంధ్రపత్రిక — శ్రీముఖ సంవత్సరాది సంచికలో 88-92 పుటలలో నున్న "ఆంధ్రులు-రాధ" అను వ్యాసము. వ్యాసకర్త సముద్రాల వేంకట రాఘవాచార్యులుగారు.

ఆళ్వారులయొక్కయు, శ్రీరామానుజునియొక్కయు ఆశా స్వప్నములు శ్రీచైతన్య దేవునియందు సఫలీకృతములై ఆసేతు హిమాచలము భక్తి తరంగములను లేవదీసెను."

రాధాకృష్ణ నాటక మూలమున అట్టి మధుర భక్తి తరంగములును, పరిపూర్ణముగా కాకున్నను గౌడీయ వైష్ణవ దర్శన సిద్ధాంతములును తెలుగు సాహిత్యమున ప్రతిష్ఠితములైనవి.

## రచనా శిల్పము

తెలుగు నాటకములందు ఉత్తమ గుణములు గలిగిన సంఖ్యేయములగు వానిలో ఒకటియైన దీనిని ఎందరో పండితులు ప్రశంసించి యున్నారు. దీనిని గూర్చి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన మాటలు ఇవి.

" .... .... సముచిత కథా సంవిధానమును, ఉక్తి ప్రత్యుక్తి చాతుర్యమును, ఉపక్రమ నిర్వాహ నైపుణ్యమును, ప్రసన్న రచనమును గలిగి యెప్పుడు నాటకములు సహృదయ రంజకములగును. అనన్విత కథా వస్తువును, పారసీ మట్ల పాటలును, అస్థాన పద్యములును, అప్రసక్త వర్ణనములును గలిగి కథాంశమునకు పోషకము గాక యెక్కడి కక్కడికే విడివిడియై పోవు పాత్ర ప్రవేశ సంభాషణాదికము గలిగి, పాత్రస్వభావోన్మీలనములు లేక కలగపులగమై యుండు నాటకములు సహృదయులను విసిగించును. అట్టి నాటకములు సమర్థులగు నటుల ప్రయోగ చాతురిని గూడ భగ్నపఱచునవిగా నుండును.

పయి సమాజమువారు (శ్రీ మైలవరము బాలభారతీ నాటక సంఘమువారు) మద్రాసులో ప్రయోగించిన నాటకములలో నిట్టి దోషములకు బాల్పడనివని చెప్పదగినవానిలో శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు రచించిన రాధాకృష్ణ, పాదుకా పట్టాభిషేకములు ప్రధానములు."

కళ — సంపుటి 2; సంచిక 4.

ప్రభాకరశాస్త్రిగారు ముక్తసరిగా దోష రాహిత్యమే తడివి సుడివినారు. ఇక పురాణము సూరిశాస్త్రిగారు తమ నాట్యాఒశోకములో దీని గుణములను ఎంతగా ప్రశంసింపవలెనో అంతగను ప్రశంసించి యున్నారు.

"నాట్యోచిత పాకవైఖరు లెటింగిన పలుకు టల్లికలందును, గాలిమూటలో చంద్రకాంతోపల శిల్పిత రూప సౌభాగ్యము గూర్చుటయందును, మాటమాటకు పట్టియున్న పరాగ సౌరభ సంపన్నతయందును, అన్నిటికన్న సభ్యతానేక సంపర్క భారమున వెన్ను విఱిగిన భారతీయ జీవిత సమస్యలకు నిక్కింపు లక్ష్య మేర్పఱచుటయందును, రాధాకృష్ణ నాటక మాంధ్ర నాటకకవుల యాశాంకురము లన్నిటికిని ఆదర్శమై, పోషక సాధనమై, రూప నిరూపణ హేతువై వెలుగుచున్నది. ఇందలి పాత్ర సంభాషణములు భారతీయుల ప్రస్తుత ఆధ్యాత్మిక పరితాపము నుచ్ఛ్వసించు వేదవాక్యము లనజెల్లును. పానుగంటివారి రాధాకృష్ణయం దాధునిక ఆంధ్ర నాట్యాదర్శము లన్నియు జీవస్ఫూర్తి నందినవి."

ఎందరినో ఇంతగా ఆకర్షించిన ఈ నాటక ప్రశస్తికి మఱియొక హేతువును కలదు. "నాటకముయొక్క ఉత్తమత్వము ప్రధానముగా ప్రదర్శనార్హతను బట్టి నిశ్చయింపవలయును. ఏలయన కవికృతమయిన నాటకము చతుర్విధాభినయాత్మకమగు నాట్యమున వాచకాంశము మాత్రమే కదా!" అని అభిప్రాయ పడువారున్నారు. అయినను నాటకములు సాహితీ ప్రధానము లనుమాట విస్మరింపవలసినది కాదు. ఒక నాటకము ప్రదర్శనానుకూలము కానంతమాత్రమున ఉత్తమమయినది కాదని త్రోసివేయ నక్కఱలేదు. నాటకములను శిష్ట సాహిత్యాంగములుగా కూడ ఎన్నవలసి యున్నది. రాధాకృష్ణ నాటకము ఈ రెండు విధములను ఉత్తమములు, అగ్రగణ్యములు అయినవానిలో ఒకటి. ఈ భావమునే దీనికి ప్రస్తావన వ్రాసి యిచ్చిన కూచి నరసింహముగారు సూత్రధారుని ముఖమున నిట్లు వెల్లడించి యున్నారు. "ఎన్నాళ్లకిట్టి నాటకము చదువు భాగ్యము నాకు లభించెను? చదివిన మాత్రముననే భక్త్యావేశముచేఁ బులకితాంగుడనై యానందబాష్ప పూరిత లోచనుండనైతిని. ఇంకఁ బ్రదర్శితమైనచో నీ నాటక మెట్లు శోభిల్లునో నే జెప్పజాలను."

## ఇతివృత్తము

ఈ నాటకము నందలి వృత్తము కడు కొద్దిది. శ్రీకృష్ణ ప్రేమస్వరూపిణి యగు రాధ ఆరాధన ఫలించి, కృష్ణుని సాన్నిధ్యము చేరుకొనుటయే ఇందలి కథ. కావున ఇందు ప్రధానమైనది రాధ భక్తియందలి వివిధ దశా పరిణామమును చిత్రించుటయే. ఆ భక్తి మహాభావమైన క్రమమును నిరూపించుటకు అనువైన సంఘటనములు కల్పించుకొనుటలో ఒక అవాంతర వృత్తాంతము నిందు నాటక కర్త సంయోజనము చేసినారు. సత్యభామ రాధ ప్రశస్తిని విని ఈర్ష్యా జ్వలనము పాలగుట, రాధ యుత్కృష్టతను అవగాహనము చేసికొనినకొలది ఆమె క్రమముగా రాధయెడ ఆర్ద్రిత, ప్రేమ, గౌరవము చూపుట రెండవ వృత్తాంతము.

కొందఱు విమర్శకులు ఈ రెండవ వృత్తమును చూచి, ఈ నాటకమునకు సత్యా గర్వభంగము అను నామాంతరము ఉంచవచ్చును అనిరి. అంతమాత్రమే కాక సత్యా గర్వభంగము అనుటయే సమంజసము అని ఆంధ్ర నట ప్రకాశికా కర్తలు పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారు భావించిరి.

"దృఢానురాగ మౌఢ్యంచేత తన నాథుడగు శ్రీకృష్ణుని కేవల శృంగార పురుషునిగా భావించే సత్యభామయొక్క భావ స్వరూపం ఈ నాటక ద్వితీయాంకమున మొలకెత్తి, తృతీయాంకమునుండి రాధా భక్తిస్వభావ సందర్శన కారణంగా చిగిరిస్తూ, ఆపైని క్రమక్రమంగా భక్తి యోగోన్ముఖంగా పుష్పిస్తూ చివరకు నారదోపదేశ పూర్వకంగా భక్తి ఫలభాజనమైనట్లు కథా ఫలితార్థము ఏర్పడుతూ ఉంది. ఆ రూపంగా ఏర్పడే కావ్యఫలం సత్యాదేవికి సంక్రమిస్తూ ఉంది. ఆ కారణాన్నిబట్టి కవిగారు ఉద్దేశించినదానికి భిన్నంగా సత్యభామ నాయిక అనబడాల్సి వస్తూ ఉంది. విశేషించి ఈ నాటకాన్ని సత్యా గర్వభంగం అంటే బాగుంటుందేమో అని తోస్తుంది."

కాని దీనికి సత్యా గర్వభంగము అను పేరు ఉంచకపోవుటలోనే పానుగంటివారి ప్రాజ్ఞత, ఔచితీ పరిజ్ఞానము, సంస్కారము వెల్లడి యగుచున్నవి. ఈ నాటక ప్రస్తావనలో సూత్రధారుడు నాటకమును పరిచయము చేయుచు నటితో అన్న మాట లివి.

"స్థూల సూక్ష్మ కారణ పరతుర్య తత్త్వ
మీ కథకు నాయకమణి; సంసృతి విపన్న
తారక చతుర్థ పురుషార్థదాయకంబు
బోటి యిపు డాడెడు నాటకంబు."

సత్యా గర్వభంగము అని నామకరణము చేయదగిన పాటి నాటకమునకు ఇంత ప్రశంస యేల? సామాన్యముగా చూచినప్పుడు సత్యభామ గర్వవతి వలె కన్పించుట, ఇందు తుద కామె గర్వము అణగిపోయినట్లు ఉండుట వాస్తవమే. కాని ఒక విధముగా చూచినచో, ఆమెది గర్వమనరాదు. సత్యభామకు కృష్ణునిపై ఉన్న ప్రేమ అగాధమైనది. రాజస స్వభావము కలదగుటచేత తనకన్న ఒరులు ఆతని ప్రేమింపగలరని కాని, అట్లు ప్రేమించుటకు అర్హత కలిగి యుండవచ్చు నని కాని ఆమె భావింప నేరదు. ఆమె ఈర్ష్యకు హేతువు ఈ స్వభావమే.

ఆ దోషమును ప్రక్షాళనము చేయుటకై శ్రీకృష్ణుడు ఈ నాటకము ఆడించు కొనెను. కావున సత్యా గర్వభంగము అనుటలో కొంత లౌకికదృష్టి ఎక్కువ యైనట్లు తోచును. నిజమునకు ఇది పరమార్థ రాధాకృష్ణ నాటకము. విమల భక్తి ప్రతిపాదకమైనది.

"భక్తిభావములు నిర్మల మనోవీధిని తాండవించిన గాని యీ నాటకము వ్రాయుటకు కాని, రాధాత్వము నొంది నటించుటకు కాని ఎంతటి అనుభవజ్ఞులును నేరరు." అనుట నిజము. అందువలననే సూత్రధారుడు నటిని ఇట్లు హెచ్చరించెను. "రాధాకాంత భక్తివంటి భక్తితో మన మీ నాటకముఁ బ్రదర్శింపవలెను."

ఇందలి నాయిక రాధాదేవి కాదని చెప్పుట సాహసము. భక్తి పథమున రాధ సాధించిన అభ్యున్నతిని, తత్ఫలితముగ కృష్ణునితో ఒకటి యగుటను ఈ నాటకము చూపుచున్నది. రాధ మహత్త్వమును స్పష్టము చేయుటకు, ఆమె సత్త్వాతిశయమును వ్యక్తముచేయుటకు రాజస స్వభావురాలగు సత్యాదేవి వృత్తాంతము అతుకబడినది

విపులమైన కథలేని ఈ నాటకమునకు ఒక కథవంటిది ఉన్నట్లు కనబడుటకు కారణము ప్రధానముగా ఇందలి సంఘటన చమత్కారము. ప్రధాన కథయగు రాధ వృత్తాంతము, అవాంతర కథయగు సత్యభామ వృత్తాంతములకు గల చక్కని అతుకు ఒక సంఘటనము. ఈ రెండు కథలందు ప్రధాన పాత్రలకు గల వైధర్మ్యము (Contrast) మూలమున ఇవి పరస్పర పోషకములు అగుచున్నవి. ఈ పృథక్కత్త్వములకు సామాన్య గమ్యము శ్రీకృష్ణానుగ్రహము.

ఈ పద్ధతినే వస్తూన్మీలనమున గూడ పంతులుగారు ఆదరించి యున్నారు. వివిధ సన్నివేశములందు పాల్గొనిన పాత్రలు ఆయా సందర్భములకు అనుగుణముగా నాలుగు మాటలు పలుకును. ఆ మాటలలోనే నాటకము పరుగిడును. తన్మూలమున చాలకథ జరుగుచున్నట్లు భాసించుచుండును. పానుగంటి వారి సంవాద కౌశలము అట్టిది. ఆకర్షకమగు కథ లేకుండగనే వట్టి సంఘటనలపై నాటకము నిర్మించుట, నిర్మించి నెగ్గుట సాధారణమైన పనికాదు. తెలుగులో ఇది యొక అపూర్వ పద్ధతి అనవచ్చును.

రాధ లలితా ద్వితీయయై కృష్ణాగమనమును ప్రతీక్ష సేయుచుండును. తుదకు కృష్ణుడు మఱియొక గోపిక ప్రసాదించిన నఖదంత క్షత చిహ్నములతో రాగా అతనిని చూచి, నొచ్చుకొని, మఱి చూడలేక వెడలిపోవును. ఇది ప్రథమాంక కథ. కృష్ణునకు సత్యభామతో వివాహము జరిగి, మధురా పట్టణములో నుండగా శారదుడు రాధ సందేశమును గొని బృందావనమునుండి అటకు పోయెను. అతనిని సత్యభామ చూచి, రాధను గూర్చి వేయి ప్రశ్నలు వేసి, తుదకు తాను బృందావనమునకు పోయి ఆమెను స్వయముగా చూడవలెనని తలచెను. ఇది ద్వితీయాంక కథ.

కృష్ణుడు వచ్చినప్పుడు తన్ను తాను ఎట్లు సమర్పించుకొన దగునోయని రాధ చెలులగు లలితా మధురలను క్రమముగా శారద, కృష్ణులుగా భావించి, సాధన చేసికొను చుండెను. వారికి తెలియకుండ అక్కడకు వచ్చియున్న శారద, కృష్ణులు దానిని చూచుచుండిరి. ఆ నటులను, ఈ ప్రేక్షకులను చూచుచు ఇంకొక ప్రక్కన సత్యభామ ఆమె చెలికత్తె తరళయు నుండిరి. తుదకు రాధా

కృష్ణులను నిందించి, సత్యభామ వారిని విడదీసి కృష్ణుని తనవెంట గొని పోయెను. ఇది తృతీయాంకములోని కథ. చతుర్థాంకమున రాధాదేవి భక్తి మహా భావముగా పరిణమించుట కూర్పబడినది. భావోన్మత్తస్థితిలో రాధ యమునలో గనిపించిన సంపూర్ణ చంద్ర బింబమును జూచి, కృష్ణుడని భ్రమపడి అందు దూకెను. ఒక ముని బాలకుడు ఆమెను రక్షించెను. నారదుడు ఆమెను శ్రీకృష్ణ సన్నిధికి చేర్చుట, సత్యభామ ఆమె సంసర్గమున మహా భక్తిమతి యగుటతో పంచమాంక పరిమితమైన యీ నాటకము ముగిసినది.

ఈ నాటకము నందలి 1, 3, 4 అంకముల కథ బృందావనమున, 2, 5 అంకముల కథ మధురలో జరిగెను. మొత్తము కథ జరుగుటకు ఎంతకాలము పట్టినదో స్పష్టమైన సూచన లేకున్నను, ఒక సంవత్సర కాలము దాటనిదిగా గ్రహింప వచ్చును.

## పాత్రచిత్రణము :

విపులమైన కథ లేకుండ, ప్రధానముగా సంఘటనములపై నిర్మింప బడిన నాటకమున పాత్రమండలికి ఒక విశిష్టత ఏర్పడియుండదగును. దానిని నాటక వస్తూన్మీలనమున కీలక పాత్ర వహించు ఒక సాధనము చేసికొనవలయును. కొన్ని యెడల ఒక దానితో నొకటి భిన్నములైనవి, మఱికొన్ని యెడల సదృశము లైనవి అయిన ప్రకృతులుగల వ్యక్తులు ఒకచోట చేరినప్పుడు జరుగు సంభాష ణాది వ్యవహారమువలె సహజముగా నాటకము సాగవలెను. ఇట్టి పాత్ర సంఘ టనమునందు చిత్రమైన చమత్కారము పొడమి నాటకము మఱింత ఆస్వాద్య మగును. అన్ని నాటకములందును ఇది సహజమే యైనను, ఇట్టి నాటకములందు అది మఱింత అవశ్యకము, ప్రముఖమును అగును.

ఈ విషయమును నిరూపించుటకు చక్కని ఉదాహరణము ద్వితీయాం కము. కృష్ణుని కొఱకై పోయిన శారదునకు సత్యభామ తారసపడెను. ఆమె నిగ్గదీసి రాధనుగూర్చి ప్రశ్నల వర్షము కురిపించెను. నిలువెల్లను రాధపై ఈర్ష్యగా ఉన్న సత్యభామ ఆమెనుగూర్చి ఎట్టి కటు వాక్యములు పలుకుటకైనను

వెనుదీయలేదు. ఇక శారదుడో పరిహాస ప్రియుడు. నోటికి వచ్చినట్లెల్ల మాటాడు అలవాటు ఉన్నవాడు. అయినను రాధనుగూర్చి సత్యభామ పలుకుచున్న కటు వాక్యములను సహింపలేకపోయెను. కాని సత్యభామను ఏమనుటకును వీలులేదు. మాటకుమాట పెంచుటకు ఇష్టములేక ఎక్కడ కక్కడ త్రుంచి వేయుటకు ప్రయత్నించి, ఆమె సాగనీయకపోగా తప్పని సరియై పైకి చిరునవ్వులు నవ్వును; చమత్కారముగా మాటాడును. కాని అంతరంగము నందలి గాఢమైన అసంతృప్తి అతని మాటలలో గోచరించును.

సత్య : శారదా ! రాధ బాగుగ నున్నదా ?

శార : అనగా నాకు తెలియలేదు. క్షేమముగ నున్నదో లేదో చెప్పవలెనా, లేక చక్కగ నున్నదో లేదో చెప్పవలెనా ?

తరళ : ఇప్పుడామె క్షేమము తెలియక బెంగ పెట్టుకొనుచుంటి మను కొంటివా ?

శార : సౌందర్యవతి యని పరితపించుచుంటిరా యేమి ?

సత్య : అది సౌందర్యవతి యైన తద్విరహమున నాథుఁడు పరితపింప వలె గాని మధ్యమున మాకేమి ? ప్రసంగమున సుందరియేనా యని యడిగితిమి. చెప్పరాదా ?

శారద : చెప్ప వీలులేదు.

సత్య : అనగ ?

శార : అసాధ్యమని.

ఆ పిదప సౌందర్యము అనగానేమి యను చర్చ వచ్చినది. శారదుని మాటలలో తప్పువట్టి సత్యభామ "అట్టి వక్ర స్వరూపులుగూడ సౌందర్య వతులని యేనా నీ యభిప్రాయము ?" అని అవహేళనము చేసినది. తడుము కొనకుండ శారదుడు "కుబ్జాపరిత్రాతయైన శ్రీకృష్ణుని కంటె మనకెక్కువ తెలిసినవారమా ?" అని ఎదురు ప్రశ్నవేసెను. సత్యభామ ముఖము గంటు పెట్టుకొని "నా నాథుని కంటి కంద తొక్కటిగనే యుందురేమో కాని—" అని

సాగదీసినది. శారదుడు అందుకొని "అట్టిచో నీ నాథుఁ డననేల? లోకనాథుఁ డనుము." అని బదులు చెప్పి ఆమె దురహంకారమును, దురభిమానమును, అసూయా పరతంత్రతను మొదలంట త్రుంచుటకు ప్రయత్నము చేసెను.

శారదుని మనస్సును బొత్తుగా అర్థము చేసికొనకుండ సత్యభామ ప్రసంగము పెంచెను. "రాధ పొడుగుగా నుండునా? లేక పొట్టిగా నుండునా?" అని అడిగినది. అతడు కావలెనని సూటిగా సమాధానము చెప్పక "హ్రస్వరూప దీర్ఘరూప నిర్ణయమునకు నేను వైయాకరణుఁడను గాను, గాని యొకసారి నీ నాథుఁడును, రాధయు నొకరియెదుట నొకరు నిలువబడిరి." అని ఆరంభముచేసి, ఆమె కోపము తెచ్చుకొనగా "ఒకరిద్దఱైన నసూయగాని వందల కొలదియైన నసూయ యేల?" అని మందలించెను. "శ్రీకృష్ణుని శిరస్థ మయూర పింఛము రాధా సౌందర్యాతిశయమును గూర్చి శిరః కంపము సేయుదానివలె నూగి యూగి యొక వంక కొఱగినపుడు శ్రీకృష్ణుఁడు తల వంచకయే రాధ తల యెత్తకయే యా పింఛమును గుదురు పఱచెను." అని చెప్పి ముగించెను.

దెబ్బతిన్న అహమును క్రమ్ముకొనుటకై సత్య లేని నవ్వు తెచ్చుకొని రాధ వీటికొంగ యని నిప్పుకోడి యని ఆక్షేపింప వలసి వచ్చెను. ఆమె ఇంకను ప్రశ్నలు కురిపించగా ప్రాణము కడపట్టిన శారదుడు మాట వరుసకు "అమ్మా! నీ వొకసారి బృందావనమునకు వచ్చి రాధను జూడరాదా?" అనెను. అదియే అనంతర కథా సంవిధానమునకు దారి తీసినది.

ఈ సన్నివేశమునందలి పాత్ర ఘటనము పాత్ర చిత్రణములే కథా గమనమును నిర్దేశించినవి. సత్యభామ—తూచి మాటాడ వలసిన మహారాజ కుమారి—నోటికి వచ్చినట్లెల్ల మాటాడుట; మామూలుగా నోటికి వచ్చినట్లు వదరు శారదుడు తూచి తూచి మాట్లాడుట—ఇట్లు ఈ యెడ తారుమారైనది. ఈ వైషమ్యము చమత్కార హేతువై ఈ సన్నివేశమును రక్తి కట్టించినది.

ఇట్టి మనోహర శిల్పమే ఈ నాటకమున ఇతర స్థలములందుకూడ చూడ వచ్చును. రాధ చెలికత్తెయగు లలితకుగాని, శారదునకుగాని రాధపై అనురాగాభిమానములు మెండు. కాని వారికి రాధాకృష్ణ దాంపత్యములోని అలౌకిక మహ

త్త్వము తెలియదు. ఆత్మార్పణ చేసికొనిన అనురాగాంబునిధి యగు రాధ నిష్క-పటతయు, సౌజన్యమును వారికి మౌగ్ధ్యమువలె కన్పట్టినది. నలుగురివంటి గడుసుది కాక పోవుట చేతనే రాధను శ్రీకృష్ణుడు ఉడికించు చున్నాడని వారు తలచి రాధపై మిక్కిలి సానుభూతి ప్రదర్శింప వత్తురు. ఈ లలితా శారదుల లౌకిక వైఖరి యెదుట రాధ అలౌకిక ప్రేమ, ఉత్తమత్వము అడుగడుగునను ప్రథమాంకమున ప్రత్యక్షమగు చుండును.

తృతీయాంకమునందు పంతులుగారు తమ పాత్రలను అన్నింటిని ఒక్కచో చేర్చిరి. లలితను శారదుడుగా, మధురను కృష్ణునిగా, భావించి రాధ అక్లేశముగ తన్ను తాను కృష్ణునకు ఎట్లు ఇచ్చు కొనవచ్చునో ఆడి చూచు కొనుచుండెను. ఇంతలో కృష్ణ శారదులు అటకు వచ్చిరి. వచ్చి వారిని కలవర పఱచకుండ తాము ప్రచ్ఛన్నముగా నుండి ఆ ఆటను చూచుచుండిరి. ఇంతలో సత్యా తరళలు ప్రవేశించి వారిని, వీరిని చూచుటకు అవకాశముగల ఒక స్థలమున రహస్యముగా ఉండిరి. సత్యభామ వచ్చినట్లు కృష్ణునకు తెలియును కాని ఆయనకు తెలియునని సత్యకు తెలియదు. ఈ విధముగా చమత్కారముగా తమ ప్రధాన పాత్రలను అన్నింటిని నాటకకర్త ఈ పతాక సన్నివేశమున ఒక్కచోట చేర్చి భేద సాదృశ్య పరిశీలనమునకు అనువగునట్లు సామాజికుల ముందు అమర్చిరి.

సత్యాదేవి మనస్సున పరివర్తనము పొందుటకూడ ఈ అంకముననే ఆరంభమైనది. సాత్త్విక మూర్తియగు రాధ రాజస మూర్తియగు సత్య తొలి సారిగా కలిసి కొనినది ఇచ్చటనే. రాధనుండి భర్తను వేఱుచేసి, తన పార్శ్వ మునకు ఆకర్షించుకొని సగర్వముగా "రాధా! చూచితివా! నా కాంతుఁడిపు డెక్కడ నున్నాఁడో! ఇంక నీతని నా ప్రక్కనుండి యెన్నడును వేఱు సేయకు సుమా!" అని పలుకు సత్యభామను, అందులకు ప్రత్యుత్తరముగా, నిరాడంబర ముగా "నాకుఁ గాంతుఁడు నా శిరమున నున్నాఁడు; నా హృదయమున నున్నాఁడు. అతఁడు నాలో నున్నాఁడు; నే నాతనిలో నున్నాను." అని చెప్ప గలిగిన రాధ—ఇట్లు ఈ ఇరువురను ఒక్కచోట తెచ్చి నిలుపుట ఎంతటి రసోల్లాస హేతువు అయినదో!

పాత్ర చిత్రణమును, వస్తూన్మీలనమును అభిన్నములుగా కలిసిపోయి తెలుగు నాటక రంగమునకు నూతనమగు ఒక శిల్పమును ఎట్లు లభింప జేసినవో ఇంతవఱకు వివరించుటయైనది. ఇక సూటిగా ఇందలి పాత్రలనుగూర్చి ఒకటి రెండు విశేషములు.

ఈ నాటకము నందలి పాత్రలు మొత్తము తొమ్మిది. కృష్ణుడు, శారదుడు, ఒక మునిబాలకుడు — ఇవి పురుష పాత్రలు. రాధ, సత్యభామ, లలిత, మధుర, తరళ — ఈ యైదును స్త్రీ పాత్రములు. వీనిలో శారదుడు, లలితా మధురలు, తరళ అనునవి కల్పిత పాత్రములు. మునిబాలకునకు ప్రాధాన్యము లేదు.

కావ్య రచనమున శ్రద్ధాళువైనవానికి కల్పిత పాత్రములను చిత్రించుట ఎంత కష్టమో, ప్రసిద్ధ పాత్రలను పోషించుటయు అంత కష్టమే. అందును నాటక రచయితకు గల అవకాశమే పరిమితము. పాత్రములు వాక్కర్మలందు తమ్ము తామే ఆవిష్కరించుకొనవలసి యుండును. పాత్రలను కాదని కవి వివరించున దేమియు ఉండదు.

ప్రసిద్ధ పాత్రముల గుణగణములు, శీల స్వభావములు సర్వజన విదితములు. కావున, వానికి ఎట్టి విధముగను భిన్నము కాకుండునట్లు పోషించుచునే కవి వినూత్నతను సాధింపవలసి యుండును. ఇది కత్తిపై సాము. ఇక కల్పితములగువానినిగూర్చి చెప్పనే అక్కఱలేదు. ప్రసిద్ధ పాత్రల సమూహములో ఇమిడిపోవునట్లు, ఔచిత్యమును పాటించుచు కవి వానిని పోషింపవలయును.

ప్రథమమున ఇందలి శారద పాత్రను గూర్చి పరిశీలింతము. ఇతడు కృష్ణుని వేడుక చెలికాడు. ఒక దృష్టితో చూచిన ఇది హాస్యము కొఱకైనది. సంస్కృత నాటకములలోని విదూషక పాత్రచ్ఛాయలు కొలదిగా ఇందు ఉన్నవి. పంతులుగారి చేతిలో ఇది ఇతరములగు ఉత్కృష్ట ప్రయోజనములను సాధించుటకు ఉపయోగింపబడినది.

పూర్వమే సూచించినట్లు, రాధయొక్క అలౌకిక ప్రేమ మహత్త్వమును, ఈర్ష్యా విలచిత్త యగు సత్యభామ దుడుకుతనమును, పౌరుష్యమును మనోజ్ఞముగా ప్రకాశింపజేయుటకు మొదటి రెండంకములందును పానుగంటివారు ఈ పాత్రను

ఉపయోగించిరి. తరువాతి అంకములలో శారదుడు మధ్య మధ్య భావవ్యగ్రతకు కొంత విరతిని కల్పించుటకే వినియోగపడినాడు. శారదుని పాత్రమున హాస్యపు పాలు ఎక్కువయే యైనను, అతడు కేవల హాస్యప్రియుడు కాడని ద్వితీయాంకమునుబట్టి స్పష్టమగును. పైగా సామాజికుల అభిమానమును చూఱగొన్న రాధపై ఒక విధముగా అభిమానము ప్రదర్శించువాడును, తన వాక్పారుష్యముచే, అసూయచే సామాజికుల సదభిప్రాయమునకు దూరమగు సత్యభామపై ఆక్షేపణ వాక్య బాణములు విసరువాడును అగుటచేత ఈ పాత్రము ఎక్కువగా మనసునకు హత్తుకొనుటకు అవకాశము కలదు.

లలితా మధురలు రాధ చెలికత్తెలు. తరళ సత్యభామ చెలికత్తె. ఈ ముగ్గురినిగూడ వ్యక్తిత్వము కలవారినిగా చేయుటకై పంతులుగారు ప్రయత్నించి, ప్రశంసార్హమగు కృతకృత్యత పొందినారు.

రాధాకృష్ణ భక్తులు శ్రీ రాధికకు అష్టసఖులు ఉన్నారని చెప్పెదరు. వారిలో లలిత పేరు కన్పట్టుచున్నది. మధుర అను పేరు అందు లేదు. ఈ నాటకములోని లలిత మిక్కిలి పరిహాస ప్రియురాలు. అంతరంగము మంచిదైనను, ఆక్షేపించుటకు ఎంతమాత్రమును తడుముకొనదు. గడుసరి కూడను. తృతీయాంకమున ఆమె ఉపనాటకమున శారద పాత్ర ధరించినది. అది ఆమెకు తగిన వేషమే అని చెప్పవచ్చును. మధుర ఇట్టిది కాదు. ఆమె పేరునకు తగినది. ఆర్ద్రభావసముపేత. ఆమెయందు చిలిపితనము లేదు. ఉదాత్తత ఎక్కువ.

కృష్ణుడు మధురనుండి బృందావనమునకు వచ్చుచున్నాడు. ఇక రాధ అతని చెంతనుండగా సఖులైన తాము ఎచ్చటనో ఎట్లో ఉండవలసినదేకదా అనుకొనిరి. ఆ మాటలు అర్థముకాక రాధ అదేమి యని తెల్లవోయినది. అందులకు వారు ఉభయులు ఇచ్చిన సమాధానములు పరిశీలించిన వారి అంతరము తేటతెల్లము కాగలదు.

లలిత : లుబ్ధునితో స్నేహము సొమ్ముపెట్టె వఱకే ! వైష్ణవునితో స్నేహము వంటయింటి వఱకే ! అటులే నీతో మా సహవాసము నీ నాథుని శయ్య వఱకే.

రాధ : అదేమి మాట ?

మధుర : కాకేమి ? భగవంతుని కంఠమునఁ బద్మమాలిక నర్పించిన రెండు చేతులును గలిసి ముకుళీభావము నొంది మాలికకును, విగ్రహమునకును దూరమున నుండుటలో ఆశ్చర్య మేమున్నది ?

ఎంతటి ఉదాత్త మనోహరమైన భావము !

ఈ లలితా మధురలతో ఒక చక్కని స్వారస్యమును పంతులుగారు సాధించి యున్నారు. ప్రథమాంకమున రాధతో ఉన్నది లలిత. తృతీయాంకమున లలితా మధుర లిరువురును; చతుర్థాంకమున ఒక్క మధుర మాత్రమే యున్నది. రాధ భక్తియందు మొదట లాలిత్యము ప్రధానమైనది. క్రమముగా అది లలిత మధురమై, తుదకు మాధుర్యమయ మైనది అని సూచించినట్లయినది.

తరళ ఏలినవారి మనసు అరసి తగిన మాటలు చెప్పి, వారు చెప్పిన దానికి ఊకొట్టు సాధారణ ధోరణి కలది. రుక్మిణిని పరోక్షమున నాలుగు మాట లని, రుక్మిణీ దాసీలపై తనకు గల అక్కసు తీర్చుకొని, సత్యభామవద్ద ఉన్న చనువుతో లేని గొప్పదనము వెలార్చుకొనుచుండును.

ప్రధాన పాత్రములలో కృషునిగూర్చి పెద్దగా చెప్పదగినది లేదు. పరిపాటి యగు పద్ధతినే ఈ పాత్రమును పానుగంటివారు చిత్రించినారు. కాని సత్యభామను తీర్చుటలో కొంత క్రొత్త కనుపించును. ఈ రీతి పాత్రలపై వారికి మక్కువ హెచ్చు.

అభిమానము, పట్టుదల సమ భాగములుగా ఏర్పడి ఆకృతిగొన్న కాంత సత్యభామ. ఈ పాత్ర చిత్రణమున వారు తీర్చిన క్రొత్త రేఖలు అతికినట్లు సరిపోయినవి. రాధా సంబంధము కృష్ణునకు ఆమె ఇంటికోడలుగా అడుగుపెట్టుటకు ముందు కలిగినదట. తాను ఆ యాటలు సాగనిచ్చిన ఇక తన విశేష మేమియు లేదట. అనురాగ బంధమున, బాహు బంధమున, ఆజ్ఞా బంధమున తాను నాథుని కట్టివైచెను. "రుక్మిణికి నేర్పు తక్కువ. రూపమున మాత్ర మంత విశేష మేమున్నది ?" అన్నంత దర్పము కలది యామె.

శారదుని అభిప్రాయములో సత్యభామ గేదెదూడ జాతిలోనిది. పాలు ఎక్కువ వదలి దూడను చెఱచు గోపాలునివలె అనురాగమును అమితముగా కన బఱచి కృష్ణుడు ఆమెను పాడు చేసెను.

కృష్ణుడు బృందా వనమునకు ఏగుటకు నిశ్చయించుకొనినప్పుడు అభిమాన ముతో ఆమె యనిన మాటలు చూడుడు. "రాధాపతీ ! నేనొక్క మాటను జెప్పు చున్నాను విను. నీవు రాధతో సరససల్లాపముల నాడుచుండ సత్యభామ పేరెత్తకుమా ! నా నవవధువు వలదు వలదనుచుండగాఁ దృణీకరించి నే నిచ్చ టకు వచ్చితినిసుమా యని యనఁబోకు సుమా !"

పానుగంటివారి సత్యభామ ముక్కు తిమ్మనగారి సత్యభామకు ప్రతి యన వచ్చును. పంతులుగారు శిరస్తాడన వృత్తాంతమును గూడ ఈ నాటకము నందు చేర్చినారు. సాగదీసి భర్తను దన్నిననేకాని సత్యభామ కాజాలదు అనినట్లు వారు భావించినారేమో ?

తృతీయాంకమున రాధా సన్నిధియందు సత్యభామకు కృష్ణుడు ప్రణమిల్ల వలసి వచ్చినది. రాధ కృషుని మహారాజ రూపము చూడనొల్లక అతనిని బాల కృష్ణాకృతిలో చూడగోరెను. కృషుడు ఆమెకు అదే విధముగా బాలకాకృతిలో కనుపించుచు కొంటెతనమున ఇట్లనెను.

"చెలువ ! వాల్గన్నులను గటాక్షించు మిపుడు
వీఁ డఖిల జగన్మోహన బాల లీలఁ
గలుగు రాధాధినాథుఁడో, కాక ముదిరి
మోటయిన సత్యభామావధూటి పతియొ."

ఈ చివటి భాగమునకు అర్థము చెప్పుటలో రెండు రకములుగా చెప్ప వచ్చును కదా ! ముదిరిమోటయినది సత్యభామావధూటి యైనను కావచ్చును. ఆమె పతియైన కావచ్చును. తన పేరు ఎత్తవద్దని అంతగా చెప్పినను అదిగో అననే అనినాడు. సత్యకు కోపము వచ్చినది. పై మాటలను తనకే అన్వయించు కొనినది. అంతవఱకు ప్రచ్ఛన్నముగా ఉన్న సత్య తటాలున ఈవలకు వచ్చి

కోపము చూపినది. ఆమెను బ్రతిమిలాడుకొనుచు, పతి పాదములపై బడెను. సరి; ఆమె తన్నినది. "మిత్రమా! మిత్రమాపది జానీయాత్ అనినాడు. లే, నాయనా! లే!" అని శారదుడు ఆతనిని లేవదీసెను.

రాధా పాత్ర చిత్రణమున నాటకకర్త పరమోత్కృష్ట రేఖ ఇక్కడ గీసెను. "ఎంత మహాపచారపు కృత్యము నీ పాపపు నేత్రములతోఁ జూడ వలసి వచ్చెను?" అని ఆమె సత్యతో అనెను. తనకు అత్యంతము ప్రేమాస్పదు డగు కృష్ణుని సత్య తన్నినప్పుడు కూడ నివ్వెరిముల్లంత ఆగ్రహము రాని ఆమె సత్త్వము ముందు సత్య రాజసము ఎంత బుసలు కొట్టినను తుదకు లొంగి పోవక ఎట్లు తప్పును? ఇటనుండి సత్య మనస్సు చిత్రముగా మారిపోవసాగెను. తుదకు రాధ మహత్త్వమును ఎఱిగి, ఆమె స్పర్శచే మహాభక్తు రాలైనది.

## రాధ - భక్తి వికాసము

రాధ పాత్రమును ఎంత వ్యాఖ్యానించినను సంపూర్ణముగా చెప్పినట్లు కానేరదు. సత్యభామ, కైకేయి, దేవదేవి వంటి పాత్రలను సృష్టించిన కవి రాధ వంటి పాత్రను ఇంత మనోహరముగ చిత్రీకరించునని నమ్మజాలము. పంతులు గారి అంతరంగపు లోతులలో నుండి, ఆధ్యాత్మిక పరితాపము లోనుండి, చెమర్చిన వారి కన్నుల ముందఱ సాక్షాత్కరించిన ముగ్ధ మనోహరాకృతి, అను రాగాంబునిధి రాధ, నారదుడు చెప్పినట్లు "జీవసంఘమం దుత్తమోత్తమ జన్మ." ఆమెకు శ్రీ కృష్ణుని యందు గల అనురాగము "ఐహికాసహ్య గర్హ్య వాంఛాన్వితంబుగాదు, పరమాత్మయందు రాగ ప్రపూర్ణ జీవునకు గల సంబంధ సిద్ధికాని."

ఆతడు ప్రభువు. ఆమె దాసి. నల్ల గలువలు చెవియం దుంచుకొనిన చంద్రోదయము కాగానే, అవి వికసించి, చెవి నంతటిని ఆక్రమించి ప్రాణనాథుని వాగమృతమును అనుభవింపనీయ వేమొ—కృష్ణుని కొఱకై సందేశము పంపించ వలె; రాధ రమ్మన్నది అనిన ఆజ్ఞవలె నుండునేమొ! నీకు అంగీకారమైన యెడల అని చేర్చినచో, తనకు అంగీకారము కాదని ధ్వనించునేమొ! అని సందేహపడిన ప్రేమనిధి, మృదుల హృదయ రాధ.

తారావళి ప్రసాదించిన నఖదంత క్షతములతో కృష్ణుడు రాగా చూచి, ఆతడెంత బాధపడినాడో యని తాను బాధపడి ఆ చిహ్నములతో ఆతనిని చూడ లేక వెడలిపోయినది. అసూయ, కోపము ఆమె ఎఱుగదు. భగవానుడే చెప్పి నట్లు "ఫలము గోరిన యనురాగ కలన గలుగుదానికి నసూయ యుండునుగాని నిష్ఫలాభిసంధిని ప్రేమించినట్టి రాధ చిత్తము నసూయ యెన్నడుఁ జెనక రాదు" కదా !

ఆమె ఆటలందు సైతము తన రాధాత్వమును విస్మరింప లేనిది. "నేనే రాధను. పూర్వజన్మముల రాధను ; వర్తమానమున రాధను ; భవిష్యజ్జన్మములలో రాధను ; పునః సృష్టిలో రాధను. నా పతి శ్రీకృష్ణుఁడు, శ్రీకృష్ణుఁడు, శ్రీకృష్ణుఁడు." అనిన భావోద్వేగము గలది.

భక్తి పరిపక్వమై భావము అనబడును. ఈ భావ సాధనయొక్క మహత్ఫలము మహాభావము అనబడు ప్రేమ. ఇదే జీవుని సహజస్థితి, ప్రాప్యము అని పెద్దలు వివరింతురు. ఇది అన్యాభిలాషిత శూన్యము, జ్ఞాన కర్మాద్యనావృతము.

కృష్ణ భక్తిరసము స్నేహముతో ఆరంభమై మాన, ప్రణయ, రాగ, అనురాగ, భావ, మహాభావములుగ పరిణతి నొందును. మహాభావపు పరాకాష్ఠ దివ్యోన్మాదము. ఒక్క శ్రీ రాధిక మాత్రమే దీనికి అధికారిణి. శ్రీకృష్ణుని యితర భార్యలకుగాని, రాధికా సఖులకు గాని దీనికి అధికారములేదు. పాంచ భౌతిక శరీరము ఈ మహాభావముయొక్క ఆవేగమునకు నిలువజాలదు. రాధికను గోస్వామి "మహాభావోజ్జ్వల చింతారత్నోద్భావిత విగ్రహ" యని వర్ణించినాడు. ఈ మహాభావము, దివ్యోన్మాదము కొంతవఱకు చైతన్య రామకృష్ణ పరమ హంసలలో మొగ్గ దొడిగెనని చెప్ప వచ్చును.

పానుగంటివారు గౌరాంగ చరిత్రలోని ఇట్టి మహా భావ ప్రకటమునకు సమ్మోహితులై దానిని రాధా పాత్ర గతముగా ఈ నాటకమున ఆవిష్కరించిరి. కావుననే ఇందలి పాత్ర సంభాషణములు "భారతీయుల ప్రస్తుత ఆధ్యాత్మిక పరితాపము నుచ్ఛ్వసించు వేదవాక్యములు" అనిపించినవి.

గౌరాంగుడు తన చివరి దినములలో పూరీక్షేత్రమున నివసించెను. ఒకనాటి వేకువజామున లేచి ఆయన స్నానార్థము సముద్ర తీరమునకు వెడలెను. సముద్ర జలములో నీలిమ ఆయనకు శ్రీకృష్ణునివలె భాసించెను. ఒడలు తెలియని పారవశ్యమున మనసు శ్రీకృష్ణుని వశముకాగా, ఆయన తనువు సాగరము పాలయ్యెను. తెల్లవారిన తరువాత జాలరుల వలలలోచిక్కి ఆయన కళేబరము ఒడ్డు చేరెను. పంతులుగారు ఈ నాటకమున రాధ చరిత్రమున అట్టి సంఘటనము కల్పించినారు. చతుర్థాంకమున రాధ దివ్యోన్మాదమున కృష్ణుని అన్వేషించుచు పోయి పోయి, నల్లని యమునలో సంపూర్ణ చంద్ర ప్రతిబింబము చూచి కృష్ణుడే యనుకొని భ్రమించి నదిలో ఉరుకును. ఇందలి ఈ అంకము అత్యుత్తమ భావ కవిత్వ మయము. చరాచర జగత్తును విస్మయానంద డోలలలో ఊపి వేయగల రాధా ప్రేమవాహిని ఉజ్జ్వల విజృంభణము, మహాభావమునకు పరాకాష్ఠయగు దివ్యోన్మాదము ఇందు నిరూపింప బడినవి. "పంతులుగారి నాటకములలో నాల్గవది; అందు చతుర్థాంకము." అని చెప్పుకొనదగును.

గౌడీయ సంప్రదాయాను సరణము ఉన్నను భక్తియొక్క వివిధ దశలను గాని, భక్తి రసమునుగాని అదే క్రమములో పానుగంటివారు పోషించిరి అనుటకు వీలులేదు. కవి మానసికానుభూతి ప్రధానముగా ఈ పోషణము సాగినది.

ఇక నారద పాత్రము ఒక్కటి మిగిలియున్నది. ఆ కాలపు నాటకపు పద్ధతులను గమనించినచో, నారద పాత్ర బీజ నిక్షేపమునకో, విస్తృతికో వాడుకొనుట పరిపాటి. పంతులుగారు ఇందు అట్టి అవకాశము ఉన్నను అట్లు చేయలేదు. పంచమాంకమున నారదుడు ముని బాలకునిచే రక్షింపబడిన రాధను వెంటకొనివచ్చి కృష్ణునకు సమర్పించెను. భక్తి యోగము నేర్చుకొన వలెనను కోరిక సత్యభామకు ఉదయించినప్పుడు నారదుడు ఆమెకు రాధను చూపి, భక్తినిగూర్చి కొంత వివరించెను. భక్తి సూత్రములు వ్రాసిన నారదుని అట్లు ప్రవేశపెట్టుట నిశ్చయముగా గొప్ప ఊహ—ఇది నాటక కర్త వివేకమును, ప్రౌఢత్వమును సూచించును. ఇట్టి నూతన మార్గముల ననుసరించుట పానుగంటి వారికి నాటక రచనయందు సుశిక్షితము, సంస్కృతము, ప్రౌఢము అగు ప్రజ్ఞా విశేషము సార్థకము చేసికొనవలెనను దీక్ష ఉన్నందులకు నిదర్శనము.

# పట్టభంగ రాఘవము

పానుగంటివారు శ్రీరామభక్తులు ; వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణ పుణ్య గ్రంథమును తెలుగున నాలుగు నాటకములుగా వ్రాసి జగన్నియామకుడగు శ్రీరామచంద్రుని తమ దృశ్యకావ్య నాయకునిగా నియమించుకొని, వారు ధన్యత చెంది తరించిరి.

పాదుకా పట్టాభిషేకము అను నామాంతరము గల ఈ నాటకము రామాయణ కథా క్రమము ననుసరించి రెండవది అయినను రచనాకాలమునుబట్టి రామాయణ నాటకములలో మొదటిది. పంతులుగారి నాటక రచనలలో ఐదవది. అయోధ్యా కాండములోని కథ ఇందు సంగ్రహింప బడినది. మొదటి ముద్రణ పీఠికలోకూడ రచనా కాలమును పానుగంటివారు ఇచ్చి యుండలేదు. దీని తరువాతి దగు కోకిల 1906 మే నెలలో వ్రాయబడినది. ఏడంకములగల ఈ నాటకము దశరథుడు శ్రీరామ పట్టాభిషేకమును తలపెట్టుటతో ఆరంభమై భరతుడు పాదుకలను అభిషేకించుటతో ముగిసినది.

పంతులుగారి రామాయణ నాటకములందున్న విశేషము — అడుగడుగున గోచరమగు వారి భక్తి పరవశత్వము. పట్టభంగ రాఘవమున శ్రీరామచంద్రుని సత్త్వ సంపద, ధీరోదాత్తత, ఐహిక వాంఛాలేశ దూరత ఋజువగును. అన్ని పాత్రములును గొప్పగా పోషింప బడినను, దశరథుని పాత్రకు పంతులుగారి లేఖిని వలన నూత్న జీవస్ఫూర్తి కలిగినది.

పట్టభంగ రాఘవమున రాముడు కేంద్రము, తక్కిన పాత్రములకు రామునకు గల అనుబంధమును ఆవిష్కరించుటయే ప్రధాన కృషి. పంతులుగారియు, వారి జనకులయు హృదయములందలి పుత్రవాత్సల్యము ఈ నాటక

మున దశరథుని రూపై నిలిచినది. వసిష్ఠుడు జ్ఞాన సంపన్నుడు. అతనికి రామునకు గల సన్నిహితత్వము జ్ఞానలక్షితము; కౌసల్యా దశరథులది వాత్సల్యభక్తి; సీతాదేవిది శృంగారభక్తి; లక్ష్మణునిది దాస్యభక్తి.

## దశరథ పాత్ర వైశిష్ట్యము

కౌసల్యా దశరథులు పున్నెముల ప్రోవులు — కౌసల్యా మాతృప్రేమము భగవంతునియందు చరితార్థమైనది. దశరథుడు ఆమెకన్నను బేలగుండె. శ్రీరాముని విడచుటచే ప్రాణములను విడచిన ఆయన హృదయ సౌకుమార్యము పంతులుగారు అవగతము చేసికొనినారు. వీరి రామాయణ నాటకములలో దశరథుడు రామునితో ఇన్నిమాటలు ఇట్లు పలుకని సమయము లేదు.

“ ముద్దుబొట్టె మొగమునకు మొగము వాచి
విన(దగిన పుణ్యకథ లెల్ల వినుచు మఱియు
నది యనక గుంట యనక మున్గంగ(దగిన
నీటి పట్టుల నెల్లను మునిగి మునిగి
యెక్కఁగా రాని గుట్టల నెక్కి యెక్కి
కన(బడిన రాళ్లకును మ్రొక్కి, కడకు యజ్ఞ
దైవదత్త వర ప్రసాదమున, లేక
లేక నిన్గాంచితిని బుండరీకనేత్ర. ”

పుత్రులకొఱకై తానెన్ని కష్టములు పడినది దశరథు డొక్క క్షణమేని విస్మరించినదిలేదు. అన్ని కష్టములుపడి తాను కన్న నల్గురు కొడుకులును ఆయన భాగ్య విశేషమున శ్రీ మహావిష్ణుని భుజ చతుష్టయమువలె నున్నారు. అయినను ఆయనకు శ్రీరామునిపై అధికానురాగము. “ అంచె చివఱ సమీపించు నశ్వము తన బరువు వేఱొక్క గుఱ్ఱంబుపైన( బెట్టునట్లు ” రాజ్యభారము అగ్రసుతునిపై పెట్టుటకు ఆయన యుత్సహించెను.

"శుభముచూచి సహించుట నా స్వభావముకాదు." అనిన మంథర దుర్బోధనముచే కైకేయి కోరిన వరములను పాటింపవలసి ఆయన అట్టి అగ్ర సుతుని అరణ్యముల పాలొనరింప వలసెను.

"సతాం కేనా పి కార్యేణ లోకస్యారాధనమ్ మతమ్
తత్పూరితం హి తాతేన మాంచ ప్రాణాంశ్చ ముంచతా"

అని భవభూతి నాటకమున శ్రీరామునిచే అనిపించినాడు. అట్లు శ్రీరాము నకు ఆదర్శమగు రీతి దశరథుడు ప్రాణత్యాగము చేసియైన ధర్మ పరిపాలనము చేసెను. ఇట్టి దశరథుడు పానుగంటివారి ప్రతిభా చక్షువునకు ఇంకను స్ఫుట ముగా కనబడినాడు.

దశరథుడు మిగుల గంభీరుడు. జీవితము పూలబాటవలె సాగిపోవలెనను ఇచ్ఛ కల సుకుమార హృదయుడు. అట్లు సాగినన్నాళ్లను అంతటి గంభీరమూర్తి యొకడుండడు. మఱల ఏ స్వల్పము వ్యతిక్రమము కలిగినను అంత కలవరపడి పోవువాడు, అంత బేలయై పోవువాడు ఇంకొకడు కలుగడు. దశరథుడు లౌక్యుడు. అనగా తననుగూర్చి పరులు దురభిప్రాయ పడకూడదు. ఎట్టి పొరపును తన యెదుట కలుగరాదు. అందులకై ఎన్ని తీయని మాటలనైన చెప్పి సర్దివేయ గలడు. స్థూలముగా పానుగంటివారి దశరథుని స్వభావ స్వరూపము ఇట్టిది.

శ్రీరామ పట్టాభిషేకము నిశ్చయించి నప్పటినుండియు దశరథుడు మంచి పనికి అంతరాయములు మెండుగదా అని భయపడుచునే ఉండెను. మనసు పట్టలేక "పట్టాభిషేక కార్యము నెఱవేరునుగద !" అని గురువగు వసిష్ఠ మహర్షిని ప్రశ్నించెను. త్రికాలజ్ఞుడగు ఆయన ఏమి చెప్పవలయును ? "పురుష ప్రయత్నముచేత" అని చెప్పి ఆ మహానుభావుడు చల్లగా తప్పుకొనెను. అందలి సూచన ఎఱుగని దశరథుడు ఆ పలుకు పరిహాసముగా నెంచి, "పురుష ప్రయ త్నము గాక యిందున స్త్రీ ప్రయత్నమే మున్నది ?" అని బదులాడును. కాని తీర ఆయన పట్టాభిషేకము వార్త చెప్పుటకు పోవుసరికి కైకేయి కోపగృహము ప్రవేశించి యున్నది. ఆమె స్వభావము అతడు ఎఱుగును. కాని ఆ నాడు ముంచు కొని రానున్న ఉపద్రవము మాత్రము పసిగట్టలేక పోయెను.

వా రిరువురనుగూర్చి అతనికి ఉన్న అభిప్రాయములు చూడుడు.

" మొదలె మూతి ముడుపుగల ముదిత, యందు
పైనఁ గొఱకొచ్చు వలె గూని బానిస యెదొ
నన్ను గుఱిచి ముట్టించు, నంతటను బుస్సు
మనుచుఁ బ్రేలును మందు కాయవలె నబల.
కఱకువాయి, వక్రగాత్ర నైల్యము లున్న
గూనిదాసి, కొఱుకరాని కొయ్య
దీనిఁజేరి పంటచేనిఁ గొడవలి లా
గునను నాదుగొంతు గోయు నెపుడొ. "

కైకేయి క్రోధ మందిరమున నున్నది. మందిర మార్గమున ఆమెచే బలాత్కారముగ ఊడ బెఱుక బడి క్రిందపడియున్న కచభారాలంకారములగు ప్రసవములు ఉండెను. వానిని చూచుటతోడనే ఆయన మనస్సెంత బాధపడెను!

" నెలత లలితములౌ మిమ్ము నేలగొట్టఁ
జెలికిఁ గోపము నామీఁద; శిక్షమీకుఁ
గలిగె నింద్రియ లోలు రకారణముగ
నిటులు పరమ పూజ్యులను బాధింత్రు గాదె. "

కలికి " కలకల నగవులఁ బలుకునపుడె గుండె లరచేతిలో నుంచుకొను " తాను ఇపుడు కొఱకొఱలు, రుసరుసలు పరగ నెటులు బ్రతుకు వాఁడనని ఆందో ళన పడెను. ఆ సందర్భమున దశరథుని నోటివెంట వచ్చిన ఈ స్వగత వాక్య ములు చూచిన ఆయన ముమ్మూర్తుల మనముందు ప్రత్యక్షము కాగలడు.

" రేపటి మహోత్సవం బేమి? రేయి నిప్పు
డిట్టి ప్రారబ్ధమేమి? హా! యెటులు కలిగె
నిద్ది యెట్టు కడతేఱునో యెవ్వఁ డెఱుగు
నేమిసేయుదు దైవమా యిప్పు డేను?

ఏమి సేయుట కేమున్న దింతి కెట్టు
లైనఁ గోప శాంతి సేయంగ వలయు
లేక యుండిన జీవము ల్నిలుపఁ గలనె?
నెలఁత క్రేగన్ను నా యసువులకు నెలవు.
కోపహరణ వాక్య కోటికిఁ గ్రొత్తగా
వెదకు కొనగ వలెనె? వేయి పలుకు
వల్లె వేసి కొనిన పాఠమున్నది కదా?
యొప్పఁ జెప్పువాఁడ నువిద కడను."

అట్టిది వారి దాంపత్యపు తీరు.

దశరథుని చమత్కార సంభాషణములు పనిచేయలేదు. అశనిపాత మైనది. "జగమనంతుడు లేక నిల్వవచ్చును; గాలిలేక జీవులు బ్రతుక వచ్చును గాని రామునివిడచి యీ కట్టె యొక్క గడియ యైన నిల్వఁబడదు, పడదు, పడదు." అని దశరథుడు స్పష్టము చేసినను లాభము లేకపోయినది. "రామ భరతులు గన్న పుత్రకులు నీకుఁ గోసలాత్మజ లే దనుకొనుము, కాళ్ల కాటికినిఁ జాచినాఁడ నన్ గరుణఁజూడు మ"న్నను లాభము లేకపోయినది.

రాముని పంపించు తరుణ మాసన్నమైనది. దశరథుడు కైకేయిని కసి తీర తిట్టినాడు. ఉగ్రమూర్తి యైన లక్ష్మణుడు తనను చంపినను బాగుండును— రాముని వనవాసము తప్పునని యెంచినాడు. రామ పట్టాభిషేకము భంగమైన దనుటకంటె రాముడు తనకు దూరమై పోవ నున్నాడని ఆయన పడిన బాధ వర్ణనాతీతము. తనపై కత్తి దూసిన లక్ష్మణునితో ఆయన అనిన మాటలు చూడుడు.

" .... వధ్యుండనైన నన్ వధము సేయు
నాతఁడేడీ? లక్ష్మణా! తండ్రి! నీకింత
కాలంబునకు దయ గల్గె; నిదె కి
రీటము లోక సంప్రీతిఁజేసెడు రాము
తలమించు మిదె నాదు తలను పంచి

నాఁడఁ గాని యెటులో చెప్పవాఁడ విను శి
రంబు గిరగిర దొరలుచు రాము పాద
ములను బడవలె; తెలిసెనా ? మోడ్చుకేలు
వట్టితిని; ఊః యిఁ కాగ కబ్బాః యిదేల ? ”

చివఱకు తప్పనిసరియై రాముని అడవికి పో నను్జ్ఞ ఇచ్చినాడు.

“ జనులు కొందఱు చంద్రాస్త సమయమందుఁ
జత్తు రేను జావను రామచంద్ర ! నీవు
వనికిఁ బోవుదనుక, మృతిఁ బడసి దుఃఖ
శాంతి నొందెద వెంటనే చనుము వనికి. ”

శ్రీరామచంద్రుడు దైవమన్న స్ఫురణము ఒక్క వసిష్ఠుని వాక్యముల లోనే, తక్కిన యెడల అతడు ఉత్తమ పురుషుడుగానే గోచరించు చుండును.

శ్రీరాముడు అడవికి పోవ సిద్ధమగు చుండెను. కౌసల్య దుఃఖము ఆపు కొనలేక పోయినది. “ వషిష్ఠ భగవానుఁడా ! మీ రాజు యిచ్చిన పట్టాభిషేక ముహూర్తము వృథ పోగూడదు. కావున శ్రీరామ భద్రు నిప్పుడే పట్టభద్రునిఁ జేసి మమ్ముఁ గృతార్థులఁ జేసి రక్షింపుము. ” అని మ్రొక్కినది. అందులకు ఆ మహర్షి సమాధానము.

“ ఇరువదైదేండ్ల నుండియే యీ మహాత్ము
నెఱుఁగుదువు నీవు; నేనో యనేక హాయ
నముల నుండి తలచి, మననము చేసి,
భక్తిఁ బ్రేమించి, పూజించి, బహు విధముల
సేవఁ జేయుచు నితని సచ్చిదమల స్వ
రూప చరణ సందర్శన రూఢ మతిని
గర్హ్యమగు పురోహితతను గాంచి రఘు కు
లమును గనిపెటు యుంటి విమలచరిత !

ఇతని పైన నీ అనురాగమే యధికమొ ?
రామనామ సంస్మరణ పూర్వకముగ జప
మాలఁ ద్రిప్ప నరిగి పోవు వ్రేళులు గల
ముదిమిగడ్డపు ముని రాగము ఘనమొ కను.

ఇంతి పౌట బావురం చేడ్చుచుంటి
వేను పురుషుండ నందుపై ఋష్యుదార
నాముఁడను బెద్దఁ గాన లోలో మఱిగెద
నితని విశ్లేష మెవఁడు సహింపఁగలఁడు ?"

"శ్రీరాముడు వచించు ప్రతి వాక్యమును గీతా వాక్యముల స్ఫురింప జేయుచుండును" అని ఈ నాటకమును గూర్చిన వ్యాపార ప్రకటనలో (కృష్ణా పత్రిక, 7-2-1909) చెప్పినది అతిశయోక్తి కాదు. అడవికి పోవుచు ఆ భగవానుడు ప్రజలకు చేసిన విజప్తి చూడుడు.

"సృష్టియంతయు నొక్క చిత్రనాటక మిందుఁ
గలుగు పాత్రల లోపలను భూపుఁ
డని ఘనతయు భృత్యుఁ డని న్యూనత యును లే
దింతెైన; వాఁడీతఁ డితఁడు వాఁడు
కాలాను వశమునఁ గాగవచ్చు: నెవ్వఁడే
వేషానఁ దన కథ వినికి బాగు
గాఁజేయు నాతఁడే ఘనుఁడు, సామాజికుల్
దేవతల్ మనకు; నా భూవరసుత

వేషమైనది; ముని కథ వినికి చేయ
నుంటిఁ బై యంకమున నింతె యుర్విజనుల
బ్రదుకు; గంధమొ బుగ్గియొ ప్రామి యొక్క
గంతిడి తెర దాఁటి చనుట కంటెఁ గలదె ?"

వైరాగ్య మూర్తియై ప్రకాశించుచు ఇచ్చట శ్రీరాముడు చెప్పిన ఈ మాటలలో As you Like It నాటకమునందు షేక్స్పియర్ జాక్వెస్ పాత్ర చేత చెప్పించిన

"All the world is a stage
And all men and women merely players,
They have their exits and their entrances
And one man in his time plays many parts."

అన్న పలుకులకు ఎంతయు మెరుగు వచ్చినది.

ఈ విధముగా చెప్పుచు పోయిన నాటకము అంతటిని తిరుగ వ్రాయ వలసియుండును. శ్రీమద్రామాయణ పవిత్ర గాథ నాటకముగా వ్రాయుట ఒక మహోదార బాధ్యతగా భావించి భాషలో, భావప్రకటనలో ఉదాత్తతను ఆరాధింపుచు పంతులుగారు ఈ నాటకమును కూర్చిరి. ఒక విధముగా చూచినచో శ్రీమద్రామాయణ గాథ యందు ఈ నాటకమున కూర్చిన ఈ భాగమే పంతులు గారికి మిక్కిలి ప్రీతిదాయకమైన దేమో అనిపించును.

ఉత్తర రామ చరితమునందు భవభూతి కరుణ రస పోషణమున అనితర సాధ్యమగు ప్రతిభను కనబఱచినాడు. అచ్చట అది ధర్మవీరమునకు పోషక మైనది. అదే విధముగా ఈ నాటకమున పంతులుగారు కరుణమును పోషించు టలో తత్సదృశమగు గాథ నైపుణ్యమును చూపినారు.

కైకేయి పాత్రను వారు సాంప్రదాయిక పద్ధతిలోనే పోషించిరి. కాని సంస్కరించినది లేదు. సూత్రధారుడు ఈ పాత్రను గూర్చి, మంథరను గూర్చి యిట్లు పలికెను.

" మృదుల సురభిళ మల్లికా మిళిత మాల
సుమ్మి యిందలి పాత్ర వర్గమ్ము గాని,
దానిలో నుల్లి పూవులు దవిలె రెండు
వక్రచారిత్ర మంథరా వనిత, కైక.

అయినను వారి దూఱనేల?

మేని చెమ్మట చేతఁ దెమ్మెరల హోయి
గులక ఱాలచే వజ్రాలకు గల విలువ
చూడఁబడునట్లె రఘురాము సుగుణ వితతి
ప్రకటితంబయ్యె వీరి వక్రత్వమునసె."

## వాల్మీకి అనుసరణము

పంతులుగారు ఈ నాటకము వ్రాయుటలో వాల్మీకి రామాయణము నుండి మాత్రమే కాక రంగనాథ రామాయణము నుండి కూడ సహాయము పొందినట్లు కన్పట్టును. ఈ సందర్భమున ఒక మాట చెప్పుట అప్రస్తుతము కాదు. పంతులు గారి నాటకములలో కొన్ని వ్యాఖ్యాన సహితములుగా ప్రకటించ వలసిన ఆవశ్యకము కలదు. ఇదియు అట్టివానిలో ఒకటి.

"అవధ్యో వధ్యతాం కోవా కోవా వధ్యో విముచ్యతామ్
దరిద్రః కో భవాత్వాఢ్యో ద్రవ్యవా న్యఽ ప్యకించనః"

కైక కోపము పోగొట్టుటకై దశరథుడు ఆమెను ఇట్లు అడిగి నట్లు వాల్మీకి వ్రాసెను. రంగనాథ రామాయణమునను ఇట్లే యున్నది. కాని పంతులుగారు దీనిని కొద్దిగా మార్చి రసవంతము ఒనర్చినారు.

"అబల నీయరి యగు సుగుణాభిరాము
నెవని వేగంబు కానఁ ద్రోయింప వలయు?
భవదనుగ్రహ పాత్రుఁ డౌ భాగ్య నిరతు
నమరవిభు నెవనిఁ జేయంగ వలయు?"

దానికి వెంటనే ఆమె సమాధానము— "సెబాస్, సెబాస్, నేను గోరిన వీ రెండే."

పంతులుగారి వాక్యములు కొన్ని వాల్మీకి రచన స్మరింప జేయును. కాని యథాను వాదములు గావు.

" జగ మనంతుఁడు లేక నిల్వగనుగలదు,
గాలి లేక జీవులు బ్రతుకంగ వచ్చుఁ
గాని రాముని విడిచి యీ కట్టె యొక్క
గడియయైన నిల్వఁబడదు, పడదు, పడదు. "

అని దశరథుడు కైకతో ఆక్రోశించినాడు. వాల్మీకి గ్రంథమున ఇట్లున్నది.

" తిష్ఠే ల్లోకో వినాసూర్యం, సస్యం వా సలిలం వినా,
నతు రామం వినా దేహే తిష్ఠేత్తు మమ జీవితమ్. "

రాముడు కైకేయి వరముల సంగతి విని, క్రింద అపస్మృతి లో పడి యున్న తండ్రిని చూచి "తండ్రి నావంక నేల చూడఁడు? " అని ప్రశ్నించెను

కైకేయి : నీ వింక శీఘ్రముగ వెడల లేదని యాతఁ డిబ్బంది పడు చున్నాఁడు. నీ వెంత శీఘ్రము వనమునకుఁ బోయిన నాతని డెంద మంత శీఘ్రముగ నిష్కలుషమగును.

ఇది కొంత మృదువుగనే ఉన్న దనవలెను. వాల్మీకి రచనలో కైక ఇంకను నిష్ఠురముగానే చెప్పినది.

" యావత్త్వం నవనం యాతః పురాదస్మా దభిత్వరన్
పితా తా వన్నతే రామ స్నాస్యతే భోక్ష్యతేపి వా. "

పై మాటలు రాముడు పూర్తిగా నమ్మలేదు. ఆమె అనుమతి సంపాదించి " నాకు నీ యాజ్ఞ యొకటియు, తండ్రిగారి యాజ్ఞ యొకటియునా ? తండ్రిగారిని ఈ స్వల్ప కార్యమునకు బాధింపక నాతో చెప్పియుండ వలసినది. " అన్నట్లు మనవి చేసెను. వాల్మీకి రామాయణమున ఇది వాచ్యము చేయబడ లేదు.

ఇట్లు ఎన్నేని చెప్పవచ్చును. కైకేయి మంథరాదుర్బోధనము వినుటకు ఒడబడుటలో ఒక చిత్రము జరిగినది. అది వాల్మీకి రచనలో ఉన్నది. మంథర ఎంత ప్రయత్నించియు రామునిపై కైకకు ద్వేషము కలిగింపలేక పోయినది. సపత్నీ మాత్సర్యము కలిగింప నెంచి కృతకృత్యురాలైనది. ఇది దాదాపుగా అందఱును వ్రాసినదే. భాస్కర, రంగనాథ రామాయణ కర్తలు గాని, పంతులు గారు గాని గ్రహింపని ఒక్క విషయము వాల్మీకి చేసెను. అన్నియును చెప్పి మంథర చివఱకు ఒక్క ముక్క అనినది.

"దర్పా న్నిరాకృతా పూర్వం త్వయా సౌభాగ్య వత్తయా
రామ మాతా సపత్నీ తే కథం వైరం న యాతయేత్ ?"

ఈ ఆయుధము కైకపై పని చేసినది. కైక తాను తన దౌష్ట్య ఫలమునకే జంకినది. మునుపు ఒనరించిన దిట్టతనము ఆమెను వెనుదిరిగి పోనీయ లేదు. మన సత్త్వ నిరూపణ పద్ధతికి అత్యంత ప్రాధాన్యము ఇచ్చు పానుగంటివారు దీనిని ఎట్లు వదలిరో ఆశ్చర్యముగా ఉన్నది.

రామ వనవాసము వార్త విని పౌరులు శోకింపుచు ఇట్లనిరి.

"వనం నగరి మే వాస్తు యేన గచ్ఛతి రాఘవః
అస్మాభిశ్చ పరిత్యక్తం పురం సమ్పద్యతాం వనమ్.
బిలాని దంష్ట్రిణ స్సర్వే సానూని మృగ పక్షిణః
త్యజన్త్వస్మ ద్భయా ద్భీతా గజా స్సింహావనాన్యపి
అస్మత్త్యక్తం ప్రపద్యన్తాం సేవ్యమానం త్యజన్తుచ
తృణ మాంస ఫలాదానాం దేశం వ్యాళ మృగద్విజమ్
ప్రపద్యతాం హి కైకేయీ సపుత్రా సహబాన్ధవైః

పంతులుగారు ఈ మాటలను కడుపు మండిన దశరథుని చేతనే పల్కించిరి.

"రాముఁ డడవి కేగ రాజ్యంబు వల్ల కా
డౌను, నక్కలును వృకాలి నీకుఁ
జెలికత్తె లగుదురు; జీలుగు ట్రీ తువ్వ
ల్గబ్బిలాల్ లీలా శుకములు నీకుఁ
జికిలింతలును బొమ్మ చెముడుచె ట్లుద్యాన
ములు, ఘూకరుతి మేలు కొలుపు నీకు
నన్ను బుగ్గినిఁ జేయు తిన్నె పంచాస్య పీ
ఠము; నాపుసుక కిరీటమును నీదు
సుతు నికగు; నాకసమె గొడు గతని కిట్టు
లీ శ్మశానంబు నతఁడేలు నెపుడు నీదు
వెడ నుడుల మీఱ కఖిపార విద్యఁ బర్యు
పాసనముఁజేసి బ్రదికెడు భ్రష్టు పోల్కి."

పట్టభంగ రాఘవ కథ నాటకములుగా వ్రాసిన వారు చాలమంది ఉన్నారు, వారిలో ధర్మవరము కృష్ణమాచార్యులు గారు, కోలాచలము శ్రీనివాస రావుగారు ప్రసిద్ధులు. ఈ నాటకము వ్రాయుటలో ముప్వురి దృక్పథముల లోను భేదము లున్నవి; ముప్వురి రచనా శిల్పము లందును భేదమున్నది. తక్కిన వారు ఇద్దరును ప్రదర్శన దృష్టిలో నిడుకొని అంకములను రంగములుగా విభజించుకొని కథా ప్రధానముగా వ్రాసినారు. సంవాద కౌశలము, పాత్ర మనస్తత్వ నిరూపణము ప్రధానముగా పానుగంటివారు తీర్చినారు.

పంతులుగారి నాటకములోని ఉదాత్తత తక్కినవారి రచనలలో లోపించినది. లక్ష్మీ నరసింహారావుగారి నాటకములోని రస పరిప్లుతియు, కావ్యత్వమును తక్కిన వానిలో లేవు.

నాలుగు, అయిదు సంఖ్యలుగల నాటకములను వ్రాయుటతో పానుగంటి వారు కాళిదాసు, భవభూతి మహాకవులు సంస్కృత నాటక వాఙ్మయమున వలె తాము తెలుగు నాటక వాఙ్మయమునందు సమున్నత స్థానమును గెలుచుకొనినారు.

పంతులుగారి నాటకములలో ఎక్కువ పర్యాయములు ముద్రణ భాగ్యము పొందిన పుస్తకము ఇది. 1958 లో పదవకూర్పు వచ్చినది. పట్ట భంగ రాఘవము మొదట సర్వజన మనోరంజనీ గ్రంథమాలలో రెండవదిగా 1909 ఏప్రిల్ ప్రాంతమున వెలువడినది.

ఇచ్చట ఈ గ్రంథమాలను గూర్చి ఒక మాట చెప్పవలసి యున్నది. 1909 జనవరి నుండి నెల కొకటిగా ఈ గ్రంథమాల పేరున పుస్తకములు వెలువరించవలెనని దీని సంపాదకులగు డి. వి. రమణారావు అండు కో., వారు తలచిరి. దీనిలో మొదటిది 1909 జనవరిలో వెలువడిన ప్రచండ చాణక్యము. పాదుకా పట్టాభిషేకము రెండవదిగా నాలుగు నెలల తరువాత ముద్రించి విడుదల చేసిరి.

రాధాకృష్ణ తరువాత నాలుగు నెలలకు వచ్చినది; కాని ఎందుచేతనో గ్రంథమాలపేరు పెట్టలేదు. పిదప కోకిల మఱునెలలోనే వచ్చెను. మొదటి సారిగా సూర్యరాయ ప్రభువువారు కోకిలకు ద్రవ్య సహాయము చేయుచు, అంతకు మునుపే వెలువడిన రాధాకృష్ణ కయిన వ్యయముకూడ ఒసగినట్లు కోకిల పీఠికవలన తెలియును.

రంగస్థలమునగూడ ఈ నాటకము పొందినంత ప్రచారము వారి ఏ ఇతర నాటకమును పొందలేదు. దీని నామాంతరమగు పాదుకా పట్టాభిషేకము అను పేరుననే ఇది జన విశ్రుతమైనది.

# కోకిల

మూఁడవ నాటకమగు ప్రచండ చాణక్యమునందు షేక్స్పియర్ మహాకవి చారిత్రక, విషాదాంత దృశ్యకావ్యముల పద్ధతులను అనుసరించిన పంతులుగారు తమ ఆరవ నాటకమగు కోకిలలో సుఖాంత నాటక పద్ధతులను గ్రహించిరి.

కోకిల నాటకమును 1906 వ సంవత్సరమునందు మే నెలలో, పీఠికా పురాధీశ్వరులగు సూర్యారావు బహద్దరువారి వివాహ మహోత్సవ సందర్భమున[1] వ్రాయుటజరిగెను.

ప్రస్తావనయందు కూచివారు దీనిని నాటిక అని పేర్కొనిరి. "గ్రంథ కథయంత కవిమనః కల్పితంబు, చిత్రముగఁ జిత్తబంధంబుఁ జేయుఁజుండి." అని సూత్రధారునిచేత వారు చెప్పించినారు. ఈ ప్రస్తావనలో కూచివారు దృశ్య కావ్యములకు, కవిసృష్టికి సంబంధించిన అంశములపై కొంత చర్చను ఇమిడ్చి నారు. "కవి ముఖ్యోద్దేశము ద్రష్టలకుఁ జదువువారికిఁ గవితానంద మొసంగుటయే యైనను సూక్ష్మబుద్ధి గలవారలు దీనిలోఁ గావలసినన్ని సత్యములు గ్రహింపవచ్చును." అని కవికృతులపై సాధారణముగా, ప్రత్యేకించి ఈ నాటకమును గూర్చి, సూత్రధారునిచేత అనిపించిరి. అట్లే, నటిచేత "ఈ కవికి శుభమగుగాక, జ్ఞాన వృక్షంబునకు వేరుఁబుర్వులనియుఁ బతులకు బంగారు సంకెలలనియు మేకవన్నెపులు లనియు, మఱియు నిట్టి నిందా వాక్యముల పాల్పేయఁబడి వర్ణింపఁబడు మాస్త్రీ జాతిలోఁ గూడ యోగ్యురాండ్రున్నట్లు కనఁబఱచి నాఁడు." అని పలికించిరి.

---

1. వివాహము 26-4-1906 అని దాసరి లక్ష్మణస్వామిగారి "నా జీవిత యాత్ర."

## షేక్స్పియర్ ప్రభావము

షేక్స్పియర్ కామెడీలలో అన్యవేష ధారణము (Disguise) నకు ప్రాధాన్యము ఎక్కువ. పంతులుగారు ఈ నాటకములో ఆ అంశమునకు ప్రవేశము కలిగించిరి. కావుననే నటి చమత్కారముగా "స్త్రీ పాత్రంబులుఁ, బురుష పాత్రంబులుఁ, బురుషస్త్రీ పాత్రంబులు, స్త్రీపురుష పాత్రంబు లన్నియు సిద్ధముగా నున్నవి....ఈరాత్రి గడు విచిత్రమైన రాత్రి, ఆడువానిని మగదానినిఁ జూచెడు రాత్రి." అని చెప్పినది. ఈ విధముగా ఈ నాటకమునందు పంతులు గారు చూపిన క్రొత్త లక్షణములు ప్రస్తావనలో చర్చింపబడినవి.

ఇందలి కథా సంవిధానము, సన్నివేశ కల్పనము మిక్కిలి విచిత్రమైనవి. ఇవి ఎంత కవి మనః కల్పితము లన్నను, ఈ కథా నిర్మాణమున షేక్స్పియర్ కథలలోని వైచిత్ర్యపు ప్రభావము పడకపోలేదు. స్థూలముగా ఆ ప్రభావము ఇట్లున్నది.

కోకిల వసంతులు, బుద్ధిమతీ మోహనులు—వీరి ప్రేమ బంధములందలి వైషమ్యము ఈ నాటక కథకు బీజము. కోకిలా వసంతులు పరస్పరము ప్రేమించు కొనిరి. మోహనునకు కోకిలపై భ్రమ; బుద్ధిమతియందు అనాదరము. బుద్ధిమతికి మోహనునిపై అపార ప్రేమము. ఈ భాగము Midsummer Night's Dream లోని ప్రేమికుల జంటలను జ్ఞాపకము చేయుచున్నది.

స్త్రీ పురుషులు అన్యోన్య వేషధారణము ఒనర్చినపుడు ఏ వేషమున ఉన్నారో వారుగా నెగ్గిపోవుచుండుట, దానివలన గలుగు భ్రమ ప్రమాదికములు కూడ షేక్స్పియర్ కామెడీలలో తఱచు కననగు విశేషము. ఇదికూడ ఈ కథ లోని మలుపులకు హేతువు ఐనది.

షేక్స్పియర్ కామెడీలలో నాయక పాత్రలకన్న కథలో నాయికా పాత్రలకే ఎక్కువ ప్రాధాన్యము. పెక్కు నాటకములలో నాయక పాత్రలకు ఆకార పుష్టియే. నాయికలపై వల్లమాలిన వలపు కలిగియుండుటయే వారియందు

కనుపట్టు మొదటి విశేషము. మంచివారై యుండుట రెండవది. కథ సుఖపర్యవసానము నొందుటకు నాయికల కృషియే యుండుటయు కలదు. ఈ లక్షణము గూడ కొంతవఱకు కోకిలలో కన్పట్టును.

పంతులుగారు నవనవోన్మేష ప్రతిభావంతులు కావున మక్కీకి మక్కీగా కథను దింపలేదు. షేక్స్పియర్ సాహిత్యముచే ప్రభావితమైన మనస్సుతో క్రొత్త కథలను ఊహించి నాటకములకు పథకములు వేసినారు.

## ఇతివృత్తము

వసంతుడు శ్రీపుర రాజపుత్రుడు. విజయపుర ప్రభువగు రుద్రదేవవర్మ ఇతడు చిన్నవాడైయుండగా తండ్రి విధేయతకు పూటకాపుగా కొనితెచ్చి కారాగారమునం దుంచెను. వర్మ కొమార్తె కోకిల అట్టి వసంతుని వలచెను. ఇరువురును రహస్యముగా పారిపోయి వివాహము చేసికొన దలచిరి.

మోహనుడు అనువాడు కోకిలను జూచి భ్రమించి యుండెను. దొంగ చాటుగా అతడు కోకిలా వసంతుల సంభాషణలను విని, చీకటి వేళ తానే వసంతు డైనట్లు భ్రమ కొలిపి, కోకిలను తీసికొనిపోయెను. పోవుచు తనను ప్రేమించి యున్న బుద్ధిమతిని వసంతునికి అంట గట్టి పోయెను.

అడవిలో మోహనుడు కోకిలను బలాత్కారము చేయబోగా శ్రీపురపు సేనాధిపతి అగు విజయ సారథి యాదృచ్ఛికముగా అటకు వచ్చి, మోహనుని బంధించి శ్రీపురమునకు పంపెను. బుద్ధిమతీ వసంతులు మఱికొంత సేపటికి అచటే వచ్చిరి. జరిగిన పొరపాటు తెలిసికొని పరస్పర ప్రియాన్వేషణము చేసికొనుచు చీలిపోయిరి. ఆ బుద్ధిమతిని చూచి సేనాపతి మోహనునిచే బలాత్కరింప బడిన యువతిగా భావించి, సైనికుల తోడ్పాటుతో ఆమెను తమ రాణి వద్దకు పంపించెను. తరువాత అతనికి కోకిల పరిచారిక అగు భ్రమరిక తారసిలగా, దానిని వలచి తన యింటికి పంపెను.

బుద్ధిమతి శ్రీపురమున రాణి పాల్యవర్గమున చేరిన కొలది కాలమునకే వసంతుని తండ్రియగు వృద్ధరాజు మరణించెను. పిదప అచ్చటి వారు ఏనుగును అలంకరించి, రాజు కాదగిన వానికై అన్వేషింప బంపగా, అది పురుష వేష మున నున్న కోకిలను రాజుగా ఎన్నెను. పురుష రూపమున నున్న కోకిలను వివాహము ఆడవలసినదిగా రాణి బుద్ధిమతిని ఒత్తిడి చేయ సాగెను.

వసంతుడు తల్లి యొద్దకు పోయి, తనను ఎఱిగించుకొని, రాజై కోకిలను అన్వేషింప వచ్చును గదా అని శ్రీపురము పోవును. కాని అప్పటికి రాణి "నేనే వసంతుడను" అని పలువురు వచ్చి రాజ్యమును అల్లకల్లోలము చేయ వచ్చునని భయపడి, వసంతుడను అని వచ్చిన వాని నెల్ల శోధనము లేకుండ చంపుమని సేనాపతికి ముదల యిడెను. అందుచేత వసంతుడు సేనాధిపతి సహాయముతో దాసీ వేషము తాల్చి, పురుష వేషమున నున్న కోకిలను గుర్తింప నేరక ప్రత్యర్థిగా భావించి హత్యా ప్రయత్నము చేసి పట్టుబడెను.

ఇంతలో సార్వభౌముడైన రుద్రదేవ వర్మపై యుద్ధము చేసి విజయ సారథి ఆయనను బందీగా కొని వచ్చెను. శ్రీపురపు రాణి రుద్రదేవ వర్మను, స్త్రీపై అత్యాచారము చేయ ప్రయత్నించిన మోహనుని, హత్యా ప్రయత్నము కావించిన స్త్రీ రూపధారుడగు వసంతుని, తనకు కోడలగుటకు అంగీకరింపని బుద్ధిమతిని ఉరిదీయుటకై ఆజ్ఞాపించెను. తుది క్షణమున కోకిల స్త్రీ రూపములో బయల్పడుటతో అందఱకు మరణ శిక్ష తప్పి కథ సుఖాంతమగును.

ఈ కథ మిక్కిలి రమ్యమైనది. ఎచ్చటి కచ్చట ముందేమి జరుగునో యను ఉత్కంఠ ముఖ్యముగా పోషింప బడినది. దానికి తోడు పాత్ర చిత్రణము కూడ కడు నేర్పుతో చేయ బడినది.

ఉదాత్త పాత్రలతో పాటు అధమ ప్రకృతిగల పాత్రలను; ప్రధాన పాత్రలతో పాటు అత్యల్ప ప్రాధాన్యము గల పాత్రలను కూడ సమముగా పోషించు శక్తి గలవారు అన్న పేరు ఈ నాటకమందు విశేషముగా పంతులుగారు తెచ్చుకొనినారు.

## పాత్ర చిత్రణ నైపుణ్యము

ఇందలి సేనాపతి విజయసారథి, అతని తోడునీడ జగన్నాథుడు ఎన్నటికి మఱపురాని పాత్రలు. వీరితో చక్కని హాస్యమును పంతులుగారు సమకూర్చినారు.

విజయసారథి ఆత్మస్తుతి ప్రియుడు, పైగా చిత్రమయిన ఊహలు కలవాడు. అట్లని బుద్ధి విశేషము కలవాడు కాడు. యుద్ధవీరునకు దానితో పని యేమున్నదిగనుక ? ఆ ఇరువురి సంభాషణము ఎంత చమత్కారముగా ఉండునో చూడుడు.

విజయ : .... హా హా హా ! అనేక యుద్ధములలో అవలీలగ జయమొందిన నేను— తుపాకి గుండ్లు వర్షింప వడగండ్ల వానలోఁ దిరుగు—

జగ : దున్నపోతు వలె—

విజయ : మహిషరాజ మనిన నంతకంటె మృదుతరముగ నుండును గాదా ?

విజయసారథికి దాసి భ్రమరికను చూడగానే వలపు కలిగెను.

విజయ : భ్రమరికా ! దగ్గఱగ రమ్ము.

జగ : (అపవారించి)

పైకి బండారము మఱి లోపల లొటార
ముండు దాసిని దవ్వుననుండి చూడఁ
దగును ; దరికి చేర నసహ్యమగును; నాట
కమును రంగంబునను నిల్పి కాంచినట్లు.

విజ : (అపవారించి) అది దూరమున నుండుటచే నాకు దృష్టి బాగుగ నానుట లేదు.

జగ : (అప) మీ కలవాటే గాదా ? ఒంటి కంటిని గురి పెట్టి చూడుడు.

తరువాత జగన్నాథుని సారథి ఇట్లు బ్రతిమాలెను.

విజ : (అప) మేము యోధుల మగుటచే వీరరస ప్రధానులము. మాకు శృంగార రస మూరక నంజుడునకు మాత్రమే కాని, యంత కంటెఁ గాదు. నేను వలచితినని దానితోఁ జెప్పుట; అది కొంత బిగియుట, వాక్యోప వాక్యము లూరక తీఁగ సాఁగుట నా కిష్టము కాదు. రంజక మంటింప ధామ్మ మని పేలు తుపాకి వలెనే యతిలఘువుగ దీనిని నాకు సమకూర్ప వలయును.

జగ : (అప) ఎంత సేపు ! ఘటకము వలె మూడు ముక్కలలోఁ గడతేర్తును.

విజ : (అప) ఘటక మను నాయుధ విశేషము నే నెప్పు డుపయోగింప లేదే !

జగ : (అప) అది ఆయుధ విశేషము గాదు. ఆర్థిక విశేషము.

చతుర్థాంక ప్రారంభమును ఎంత చమత్కారముగానో చేసినారు. ఈ అంకమున నిందితులకు ఉరిశిక్షను అమలు చేయుటకు ప్రయత్నించు కథాభాగము ఉన్నది. అయినను ఇది కామెడీ కనుక, దీని నంతటిని హాస్యరస బహుళము గానే పంతులుగారు నడిపినారు. ప్రారంభమున ఇది సారథి, జగన్నాథుల అప వారిత సంభాషణము.

విజ : జగన్నాథా ! సేనాధిపతి యుండుట చేతను—ఎవరు ?

జగ : సేనాధిపతి.

విజ : వట్టి సేనాధిపతియా ? సార్వభౌముని రాష్ట్రి మవలీల నపహరించి, యాతని గ్రహించి — ఏది !

జగ : ఆతని గ్రహించి.

విజ : జగదేక విఖ్యాతి నొందిన సేనాధిపతి — అట్టి సేనాధిపతి యుండుట చేతను, ప్రాణాపహరణోద్యోగ మిచ్చుట జరుగుట చేతను—

జగ : అయ్యో ! అటులనుచున్నారు. ఉరిదీయునది మీరేనా ?

విజ : ఛీ !

జగ : క్షమియింపుడు. తీయఁబడువారు మీరేనా ?

విజ : ఛీ ! ఛీ ! ప్రాణాపహరణోద్యోగ మిచ్చట జరుగుట చేతను జనసంకులమై యుండుట చేతను, వాద్యఘోష సమన్వితమై యుండుట చేత, నీ స్థలము యుద్ధరంగము వలెఁ బ్రకాశించుచున్నది సుమా !

జగన్నాథుడు గడుసువాడు, సేనాపతి మాటమాటకు ప్రతిధ్వని నీయలేక రెండు అడ్డదిడ్డమైన ప్రశ్నలు వేసినాడు. దానితో విజయసారథి విసుగుకొని అతని ప్రతిపద సమర్థనమునకు ఎదురు చూడకుండ ముగించినాడు.

సంభాషణములు నడపిన తీరు గొప్పగా నున్నది అను మాట పంతులు గారి నాటకముల గూర్చి ఎచ్చటను ప్రత్యేకించి చెప్పనక్కఱలేదు. ఆద్యంతము ప్రతి పదము రసవంతమై ఒప్పుచుండును. అయినను జరిగిన పొరపాటును తెలిసికొనిన పిదప బుద్ధిమతీ వసంతుల నడుమ జరిగిన ఈ సంభాషణము గూడ ఉదాహరింపదగి యుండును.

వసంతుడు : చూడు ! నీకంటెఁ జక్కని దానిని జూచిన యెడల మోహనుడు దానిపై మనసు దగులునట్టి యస్థిరానురాగయుతుఁడు కాడు గదా !

బుద్ధిమతి : నాకంటెఁ గోకిల చక్కనిదా ! నీకంటి కది యెట్లగపడునో నా నాథుని కంటికి నేనట్లు కానబడుదు నని నీ వెఱుఁగవా ? నీ కంటె గుణవంతునిఁజూచిన యెడలఁ గోకిల యాతని మోహించునంతటి చంచల చిత్త కాదు గద ?

వసంతుడు : క్షమింపుము. నీ నాథుఁడు గుణవత్తరుఁ డైనందులకు సంతసించితిని.

బుద్ధిమతి : నీ కాంత నాకంటెఁజక్కని దైనందులకు మఱింత సంతసించితిని.

రెండు పాత్రములు సంభాషించునపుడు ఒక పాత్రకు సుదీర్ఘ స్వగతములు వ్రాయుటచేత, నాటకము చదువుకొనునప్పుడు బాగుగానే యుండును. కాని ప్రదర్శన సమయమున దానివలన కలుగు నిబ్బందులు తెలియనివి కావు. పాత్ర

స్వభావ ప్రకాశనము, మనోధర్మ నిరూపణము—వీనిపై గల మక్కువతో పంతులుగారు తెలిసియు ఈ ఇబ్బందులు కలిగించిరి. మొదటిసారిగా కోకిలలో స్వగత వాక్యముల దైర్ఘ్యము శ్రుతి మించినది.

అయినను కోకిల రంగస్థలముపై పెక్కు పర్యాయములు ఆడబడినది. పద్మశ్రీ స్థానం నరసింహారావుగారి బృందము దీనిని ప్రదర్శించినది. వారు కొన్ని స్వగతములు తగ్గించియు, కొన్నిచోట్ల వచనమునకు బదులు పాటలు పద్యములు పెట్టియు ఆడిరి. ఈ పాటలు, పద్యములు (వృత్తములు సహితము) కోకిల నాటకమున అనుబంధముగా నాల్గవ కూర్పునందు అచ్చు వేసినారు. వీనిలో కొన్ని పద్మశ్రీ స్థానమువారే స్వయముగా వ్రాసిరట.

ఈ నాటకములో రసాయనికాది శాస్త్ర సంబంధులగు ఉపమానములు విరివిగా ఉన్నవి. ఉదాహరణమునకు ఈ పద్యము వసంతుడు బుద్ధిమతితో చెప్పినది చూడవచ్చును.

"దంపతులు మీరు మేమును దారసిల్ల
నీ వరుఁడు గోకిలను బట్టె, నేను నిన్నుఁ
బట్టితిని ; తప్తలోహంబు వారిఁజేర
నినుము వాఃప్రాణ మారుతాశిని గ్రహించు
జల పవన మాయనోషతఁ జెలగిపోవు.

# విజయ రాఘవము

లక్ష్మీ నరసింహారావు గారి ఏడవ నాటకము విజయ రాఘవము. దీనిని పంతులుగారు కోకిల పూర్తిచేసిన వెంటనే ప్రారంభించిరి. జూలై నెలలో మొదలుపెట్టి 4–10–1906 న ముగించినారు. సూర్యారావు బహద్దరు వారు మైనారిటీ తీరి ఆ మఱునాడు అనగా 5–10–1906 న రాజ్యమును అప్పగించు కొనిరి. వారి పట్టాభిషేక మహోత్సవము 17–2–1907 న జరిగెను. ఆ సందర్భములో ప్రదర్శించుటకై ఈ నాటకము వ్రాయబడెను.

ఎనిమిది అంకములు, 300 పుటలుగల ఈ పెద్ద నాటకము 1909 లో తణుకు శ్రీ సౌదామినీ ముద్రాక్షరశాలలో ముద్రింప బడినది. ఇందులో శ్రీమద్రామాయణములోని యుద్ధకాండ కథ సంగ్రహింప బడినది. పంతులు గారి రామాయణ నాటకములలో ఇది రెండవది.

పానుగంటివారి నాటకములలో ఇంత పెద్ద నాటకము ఇంకొకటి లేదు. బహుపాత్రల విషయమున కూడ ఇది అగ్రస్థానము వహించును. ముప్పది మూడునకు పైగా ఇందు పాత్రములున్నవి. ఈ నాటకము అచ్చుకాక మునుపే ప్రదర్శింప బడుచు వచ్చినది. విజయరాఘవము నందలి గుణము లెట్లున్నను, రంగస్థలముపై ప్రదర్శించుటకు ఇది మిక్కిలి పెద్దదిగాను, విసువు కలిగించు నదిగాను ఉన్నదని నాటక కర్తయే అభిప్రాయ పడిరని తెలియుచున్నది. అందుచేత కొన్నిచోట్ల దీనిని రెండు భాగములుగా జేసి రెండు రాత్రులలో ప్రదర్శించుట జరిగినది.

కథను గ్రహించునప్పుడు దీనిలో కొన్ని అంశములను అవాల్మీకీయ ములను రంగనాథ రామాయణమునుండి గ్రహించిరి.

1. రావణుడు విభీషణుని సభలో తన్ని వెడల నడచుట రంగనాథ రామాయణములో ఉన్నది. ఈ నాటకములో తన్నుటకు సిద్ధపడినట్లు మార్చినారు.

2. కాలనేమి వృత్తాంతము

3. సులోచన భక్తి

4. రావణుడు పాతాళ హోమము చేయుట

5. అంగదుడు హోమమునకు విఘ్నము ఆపాదించుటకై రావణుని యొద్దకు మండోదరిని ఈడ్చుకొని వచ్చుట ఇట్టివి.

విజయ రాఘవమును గూర్చి ప్రత్యేకించి చెప్పుకొనవలసిన అంశములు అనేకములు కలవు. ప్రదర్శనకు క్లిష్టతను కలిగించు ఈ నాటకము చదువుకొనుటకు అమందానందమును కలిగించ నసుటలో సందియము లేదు.

వింశతి భుజములతోడి దశగ్రీవుని, కంటిలో నలుసులవలె పడిన క్రోతులను కొనగోటితో తీసి పృష్ఠముపై తుడుచు కొనుచున్న కుంభకర్ణుని రంగస్థలముపై చూపుట ఎట్లు సాధ్యమగును ? కాని చదువుకొనునప్పుడు ఈ దశగ్రీవుని రూప గాంభీర్యము, కుంభకర్ణుని మహాకాయ స్ఫూర్తి, వారి పరాక్రమాదులు కన్నులయెుందల కట్టి ఆనందమును కలిగింపజాలును.

ఈ నాటకములో రాక్షస పక్షమున పంతులుగారు మహోదరుడు, దీర్ఘకాయుడు, ద్విజిహ్వుడు అను మూడు పాత్రలను కల్పించినారు. వీరు వరుసగా రాజబంధువు, రాక్షసవైద్యుడు, పురోహితుడును ఐనవారు. వీరు నాటకమున నామమాత్రముగ కాక కొంత ప్రాధాన్యము కలవారు.

ప్రథమాంకమున రావణుని పరివేష్ఠించి వీరు పరస్పరము అసూయాపరులై కొండెములు చాటుగా చెప్పుచు, పైకి మాత్రము కల్లబొల్లి మాటలు చెప్పుచు, వెడనవ్వులు నవ్వుచు, లేని ఆపేక్షలు కనబఱచుచు, అటు పక్షము వారికి ఒక మాట, ఇటు పక్షమువారికి ఇంకొక మాట చెప్పి ఇరు పక్షములకు భేదము పెంచుచు, తాము మాత్రము ఇరువురకును అనుకూలముగానే ఉన్నట్లు నమ్మించుచు కనబడుచున్నారు. వీరికి స్వార్థముకన్న ఎక్కువయైనది లేదు.

వీరి పిడకలాట ఈ రామాయణ దృశ్యకావ్యమున కొంత అధికముగానే ఉన్నదని అంగీకరింపక తప్పదు. అయినను వీరిని కడునిపుణముగా కథోన్మీలనమునకు వాడు కొనుటలో పానుగంటివారు వెలితి చేయలేదు. రెండవ అంకమునకు ముందున్న విష్కంభములోను, ఆ పిదప యుద్ధ వర్ణనమును పరోక్షముగా చేయించుటలోను, నాటకమున కొంత హాస్యము సమకూర్చుకొనుటలోను కూడ ఈ మూడు పాత్రములును అక్కఱకు వచ్చినవి.

వీరిలో మహోదరుడు తన రసజ్ఞతకు, గుణగ్రహణశక్తికి, వదాన్యతకు, భోగేచ్ఛకు—అన్నిటికి మించి తన పెద్ద ద్రోణమువంటి కడుపునకు—చాలినంత ఆదాయములేక రాజబంధువుగా పడి తినుచునే రావణుడు చచ్చి ఆ లంకారాజ్యము తనకు అధీనము కావలెనన్న యేడుపు కలవాడు. కోళ్ల పందెములు మున్నగునవి అతని "రసజ్ఞత" కు నిదర్శనములు. ఇతడు అయిన అన్నిచోటుల అప్పులు చేసి తుదకు ఎగగొట్టి చిట్టచివఱకు లంకాపురి చేరుకున్నాడట!

ఇక ద్విజిహ్వుడు కల్ల నవ్వువాడు, బొల్లి యేడ్పులవాడు, పడుచువాడు, పొట్టివాడు, అట్టె చిఱ్ఱుమనెడి వాడు, జీడి మామిడిపండు రంగువాడు. కటిక దొంగవాడు. రాజకరుణయు కాంతానురాగ లీలవోలె పంచు కొనరాదను గట్టి నమ్మకము గలవాడు. పైగా ఇతడు ఆధునిక కవియట కూడ! తుదకు అసుర వీరు లందఱును ఆహవ సమయమున కత్తులు, గదలు పూనగా, ఇతడు గంటము పూని " విజయ రావణము " అను ప్రబంధమును వ్రాయదొడగెను. రావణుడే ఓడినచో? " విగత జయముగల...." అని అర్థము చెప్పుకొనవచ్చును అని అతని ముందు చూపు. ఈ విజయరావణము నందలి కవిత్వము శబ్దాడంబర ప్రధానమైన నీరస కవితారీతిని ఆక్షేపించుటకే అయినను, అందలి వర్ణనములు అర్థోపక్షేపకములై, సూచ్యకథా సూచనకు ఉపయోగించినవి.

యుద్ధ వర్ణన ప్రధానమయిన ఈ దృశ్య కావ్యములో యుద్ధము నంతటిని సామాజికులకు తెలుపుటకు ఏ రెండు పాత్రలచేతనో సాంప్రదాయిక పద్ధతిని వర్ణింపజేయుచు పోయిన, ఇక నాటక రక్తినిగూర్చి అడుగవలసిన పనిలేదు. పంతులుగారు అందుచేత ఒక క్రొత్త పద్ధతిని దీనిలో ప్రవేశపెట్టిరి.

అంకస్థ కథను బహు సంఖ్యాకములగు చిన్ని చిన్ని రంగముల మాలికగా చేసి, యుద్ధ రంగమునందు ఒక చిన్న స్థలమును ఎన్నుకొని పర్యాయమున ఉభయ పక్షముల వీరులు అచ్చటికి వచ్చుచు పోవుచున్నట్లు వారు కూర్చిరి. ఈ చిన్ని రంగములను ఒకదానితో ఇంకొకటి అతుకుటలో వారు ఎన్నియో పోకడలు పోయిరి.

శ్రీరామ మహత్త్వ ప్రకాశనము పరమార్థముగా పెట్టుకొనిన పంతులుగారు ఆ విషయమున కృతకృత్యులైనారు. రామచంద్రుని ధీరోదాత్తతను ఎంత స్పష్టముగానో హత్తుకొనునట్లు వారు చిత్రించినారు.

రావణుని వధకు కొంచెము పూర్వము ఆతని తొమ్మిది తలలు, పదునెనిమిది బాహువులు తెగిపడిన పిదప అట్టి రావణుని చూచి అంగదుడు అపహసించెను. రాముడు వారించెను. అప్పుడు అంగదుడు పలికిన మాటలు :

"కనుగొల్కులైన నెఱ్ఱన గాకయుండ, నా
యని గట్టిగానైన నఱవకుండ,
నొదలు చెమ్మటచేతఁ దడిసెనైనఁ గాకుండ,
సిగ ముడి యైనను జెదరకుండఁ,
గోప చిహ్నము లేమి దీపింపకుండ, ర
ణోత్సాహ దశయైన నొదవ కుండఁ,
బల్లెత్తు పలుకైనఁ బగతుర నాడక
యుండ, మూల బలంబు రెండు గడెల

లోన లీలగాఁ గడతేర్చి దానవాధి
పతికి నిట్టులు చేసి, యెవ్వండు సేసె
నో యటంచు నుండుఁ దటస్థు నోజ నహహ!
ఇట్టి యద్భుత చారిత్ర మెచటఁ గలదు?

ఇట్టి గొప్ప రచన ఈ నాటకములో పెక్కు పట్టుల నున్నది.

తాను అగ్ని ప్రవేశముచేసి, తన స్వచ్ఛతను చాటుకొనవలసి యున్నది అను మాట సీతాదేవికే స్వయముగా తోచునట్లుగా రాముడు చేసిన భాగము అతి రమణీయము. లక్ష్మణుడు దుష్టశిక్షణమైనది కనుక ఇక శిష్టరక్షణ చేయవలెనని విన్నవించెను. రాముడు శిష్టత యేదో తేలనిమ్ము అనెను.

లక్ష్మణుడు : ఇది మన దేశముగాదు. ఇక్కడ సీత నెఱిగిన వారు లేరు. ఎవ రామె సువృత్తతను గూర్చి యిచ్చట మీకు బోధింతురు ?

రాముడు : వెఱ్ఱివాఁడా ! మన గ్రామమున నొక పంచభూత గణము నిక్కడ నొకటి యున్నదా ?

సీత : (లేచి) మహాప్రభూ ! నే నగ్నిఁ బ్రవేశింతును. నాకు వేగమ సెలవిమ్ము.

## రావణ పాత్ర చిత్రణము

రావణుని పాత్ర విషయమై పంతులుగారు సముచిత శ్రద్ధ కనబఱచియు, కనబఱుపలేదని చెప్పవచ్చును. ప్రథమ, ద్వితీయాంకములయందు మహోద రాదులు ఎట్లు ఆడించిన అట్లు ఆడునట్టి వ్యక్తిగా రావణుడు ఉన్నాడు. తుదకు మహోదరుడు చెప్పిన స్త్రీ వశ్యపు తంత్రములను ఆచరణలో పెట్టుటకు మార్జాల నాసాగత పాషాణములు తన నోళలో పెట్టుకొనుటకు సైతము ఇందు రావణుడు సిద్ధపడినాడు.

ఇంతగా రావణుని దిగజార్చుట యుక్తముగాలేదు. కాని పంతులుగారు రావణునిచే ఇట్లు పలికించి, అతని విపరీత చర్యలను సమర్థించుటకు యత్నించిరి.

" సములు లేరు, స్వోద్యోగి సఖ్యములు ముప్పు
గాన జ్ఞాన శూన్యుల తోడ మాన రహిత
సేవకుల తోడ సఖ్యంబు సేయుటెట్లు
తప్పు ? భూధవు బాధ భూధవున కెఱుక. "

ఇటువంటి రచనలో పంతులుగారికి గల నిగూఢమగు ఆశయము ద్వివిధముగా తోచును. ఇది అప్పుడప్పుడే యుక్త వయస్కుడయిన నూతన ప్రభుని పట్టాభిషేకమునకై వ్రాయ బడినది. ఆయనకు ఇది హెచ్చరికగా తోచును. రెండవది పంతులుగారు ఎక్కువ భాగము రాజాస్థానములలో తిరుగాడిన వారు. అచ్చటి వాతావరణములోని దొసగులు మున్నుగునవి వారికి అనుభవమే. అట్టి వానిని కావ్యమార్గమున చూపి అధిక్షేపించుటయు వారి అభిలాష.

తక్కిన కథలో రావణుని పాత్ర గాంభీర్యమును, ఉద్ధతిని, ప్రశంసార్హముగా వారు పోషించిరి. మండోదరిని అంగదుడు ఈడ్చుకొనిరాగా, ఆమెను విడిపించుటకై లేచిన రావణుని పాతాళ హోమక్రియకు విఘ్నము కలిగినది. ఆ సమయమున రావణుడు అన్న పల్కులు రావణుని హృదయము నెంత సరిగా చూపుచున్నవో.

“ కాంతపైఁ బ్రేమమే దీని కంత మొదలు,
కాంతపైఁ బ్రేమమే దీని కంత చివఱ ;
లలన లందలి వల పాపదలకు మొదలు
నఖిల నాశన కర మదె యగును దుదకు. ”

రావణుడు ఎఱుక లేనివాడు కాడు, చిట్ట చివఱకు

“ ఈవు లోకపితవని, సీతా వధూటి
లోక మాతయం చెఱుగుదు ; నీకు నింత
చేసితినిగాన నిటకు వేం చేసినావు ;
కాక యుండినఁ బీఠంబుఁ గదలిచెదవె ? ”

అని రాముని ప్రశ్నించినాడు. “ బ్రహ్మహత్య యని సంకోచమేల ? నేను ప్రవర్తించిన రీతి బ్రాహ్మణార్హమా ? ” అని హెచ్చరించినాడు. రావణుడు జ్ఞానవంతు డైనందులకు రాముడు సంతోషించెను.

రామ, రావణ తత్త్వములకు గల భేదమును పంతులుగారు చక్కగా నిరూపించుటకు ప్రయత్నించిరి. ఇంద్రజిత్తు రణరంగమున మాయసీతను నఱికి మనస్సులు ఖేదపెట్టగా, లక్ష్మణుడు మిగుల కోపించి, సర్వరాక్షస నాశనార్థము బ్రహ్మాస్త్రమును అభిమంత్రించుటకు సమకట్టెను. అప్పుడు రాముడు తమ్ముని వారించి ఇట్లు బోధించును.

" లక్ష్మణా ! దుర్మార్గునికి ముందు జన్మమునకైన బుద్ధి వచ్చుటకై తగు శిక్ష సేయ వలయును. కాని యెటులో హానిచేసి పగ దీర్చుకొనుట మన పని గాదని యెఱుఁగవా ? మన కొకనిపైన పగ యేమున్నది ? అట్లే కానిచో నింద్ర జిత్తునకు మనకు భేద మేమున్నది ? "

మూల కథయందు రసోద్దీపితములగు ఘట్టములను నాటకీయముగా పెంచుటలో పంతులుగారు విశేషకృషి చేసిరి. ఇంద్రజిత్తు ఆంజనేయుని సమక్ష మున మాయ సీతను నఱుకు ఘట్టము అటువంటి వానిలో ఒకటి.

ఈ నాటక ప్రదర్శనమును తిలకించి పంతులుగారికి ఉత్తరము వ్రాయుచు, రంగారావుగారు అనువారు చెప్పిన ఈ మాటలు మిక్కిలి ఉచితముగా పొందికగా ఉన్నవని భావింపనగును.

"The mind must be a very poor mind indeed that should complain of the mere length of the drama or imagine that al bloodshed and violence being left behind the scenes, only their progress should be indicated by pronouncements on the stage. The real grand point of the drama is from an artistic view of the struggle between evil and good."

# వనవాస రాఘవము

ఆరణ్య, కిష్కింధ, సుందర కాండములలోని కథ ఆధారముగా నిర్మించబడిన ఈ నాటకము పంతులుగారి రామాయణ నాటకములలో కాలక్రమమును, కథా క్రమమును గూడ అనుసరించి మూడవది. మొత్తము నాటకములలో ఎనిమిదవది. 1908 వ సంవత్సరము సెప్టెంబరు 26 న ఆరంభించి, నవంబరు 19 న దీనిని వారు ముగించిరి.

పంచవటియందు శూర్పణఖ పరాభవ వృత్తాంతము, ఖరదూషణాదులు ఎత్తివచ్చుట వఱకు ప్రథమాంకమునందు ఉన్నది. ఖరదూషణాది రాక్షసవధము, దానితోపాటు రావణుడు మారీచుని ప్రేరేపించుచున్న వార్తయు ద్వితీయాంకస్థ విష్కంభమున సూచింప బడినవి. అంకమున మాయ మృగమును తరుముకొని పోయిన రాముని జాడ చూచి వచ్చుటకై సీత పోరు పడలేక లక్ష్మణుడు పోవుట, రావణుడు కపట సన్యాసి వేషమున సీతను వంచించి అపహరించుట వివరింప బడినవి. విష్కంభమున జటాయువు మరణము, రాముడు ఉన్మత్తత విలపించుచుండుట సూచింపబడిన పిదప, తృతీయాంకమున రాముని వ్యథ, కబంధ వధ వర్ణింపబడినవి.

చతుర్థాంక విష్కంభమున రామ సుగ్రీవ మైత్రి, వాలి వధ చెప్పింప బడిన పిదప అంకమున ఎన్నాళ్లకును సీతాన్వేషణమునకు దొరకొనని సుగ్రీవునిపై లక్ష్మణుడు అలుగుట, అతడు తన అపచారమునకు పశ్చాత్తప్తుడై, కపులను నలుదిక్కులకు ఉరికించుటయు వర్ణింపబడినవి.

పంచమాంకమునందు ఒక అంతర్నాటకము కూర్చబడినది. దీని వలన ఆంజనేయుడు సీతను కనుగొని లంకాదహనము చేసి వచ్చిన వృత్తాంతము రామాదులకు ఎఱిగింప బడినది. ఈ నాటక మందలి కథాసంవిధానము ఇది.

దీనిలో ప్రశస్తమైన అంశము అంత విపుల మగు కథను నేర్పుగా ఐదంకములలో ఇముడ్చుట. దీనికి ముందు వ్రాసిన విజయ రాఘవము ఎనిమిది అంకములుగా కూర్పబడినది. అందలి పాత్రల సంఖ్యయును అత్యధికము. దానిపైన వచ్చిన సూచనచే కాని, స్వకీయాలోచనతో గాని, ఇందు అంకముల సంఖ్యను, పాత్రల సంఖ్యను నిపుణముగా పానుగంటివారు తగ్గించి యున్నారు.

మొదటి అంకము చివఱ ఖర దూషణాదులచే నేపథ్యము నుండియే చిన్న ప్రసంగము చేయించి, శ్రీరామునిచే " ఖర దూషణాదులారా ! మీరు ముందునకు రావలదు. ఇచటి ప్రదేశము యుద్ధమునకు అనుకూలముగా లేదు. మిమ్ముఁ గొంచుటకు రాముఁడనైన నేనే యటకు వచ్చుచున్నాను." అనిపించి అంకము ముగించిరి. అట్లే ద్వితీయాంకము చివఱ జటాయువుచే నేపథ్యము నుండియే " ఛీ, దురాత్మ ! ఆగు ! ఆగు ! ఇదిగో ! వచ్చుచున్నాను. " అని పలికించి రావణునే రంగస్థలము నుండి నిష్క్రమింపజేసి జటాయు పాత్ర వేష ధారణమునకు అవసరము లేకుండ ముగించిరి.

వాలి వధ మొదలగు వృత్తాంతమును అంతయు సంగ్రహము చేసి విష్కంభము వ్రాయుట చేత వాలి పాత్రము ఒకటి తగ్గినది. మఱియొక అంకమునకు ఆవశ్యకము లేకపోయినది. శబరి వృత్తాంతము సంపూర్ణముగ విడిచి పెట్టబడినది.

మఱల పంచమాంకము నందలి అంతర్నాటకము వలన మఱియొక అంకము వ్రాయవలసిన అవసరము తీఱిపోయినది.

అంశుమాలి, శరభుడు అను రెండు వానర పాత్రములను ప్రవేశపెట్టి పెద్ద కథను విష్కంభములో చతుర్థాంకమున పంతులుగారు చెప్పించినారు. అచ్చముగా సూచ్యాంశములను మాత్రమే వారు గబగబ చెప్పినచో మొగము మొత్తును. కావున శరభునికి ఒక వృత్తాంతమును కల్పించినారు. శరభునికి ఒక భార్య. ఆ భార్యను వాలికి అంటగట్టి, రాజుగారి షడ్డకుడు అనిపించుకొనవలెనని వాని తాపత్రయము. ఆ ఆలోచన నెఱవేరకుండ వాలిని రాముడు చంపినాడుగదా అని శరభునికి రామునిపై మిగుల కోపము వచ్చెను. అదియును గాక ఎవరైన

నేమి రామునకే.... అనుకొనుటకు రాముడు పరసతీ విముఖుడయ్యెను. అందుచేత తనకు పనికిరాడని మఱింత కోపము. రాముడు సీత కొఱకు అన్వేషింప చేయుచున్న ప్రయత్నము కార్య రూపము తాల్చినచో రావణుని ఉనికి తెలియును గదా ; తన భార్యను రావణునకైన అంటగట్టి తన కోరిక నెరవేర్చు కొనవచ్చునేమో యని తుదకు వానికి కొంత ఆశ. ఈనడుమ జరిగిన జరుగుచున్న వృత్తాంతములను ఇమిడ్చి పంతులుగారు అర్థోపక్షేపణము చేసిరి. అదియటుంచి, వాలి వధము విషయమున శ్రీరాముని ప్రవర్తనను గూర్చిన ధర్మాధర్మములను నిరూపించు భిన్నవాదములపై ఇట వారు చర్చ నడిపించిరి.

ఈ ప్రాసంగిక వృత్తాంతము శ్రీమద్రామాయణ కావ్యపు ఉదాత్తతకు అనుగుణమైనది కాదు అన్నంత వఱకు ఎవ్వరైన అంగీకరింప వలసియే యుండును. కాని పానుగంటి వారి లోకజ్ఞత, హాస్యకల్పన, చమత్కృతి మున్నగు వానికి ఇది చక్కని తార్కాణమై వెలయును. ఇందలి శరభుని పేరు మాత్రమే వాల్మీకి కృతియం దున్నది. ఇంత పెద్ద విష్కంభము—ముప్పది పుటలకు విస్తరించి యున్నది—పంతులుగారు ఇంకెక్కడను తమ నాటకములలో కూర్చలేదు.

అవాల్మీకీయములైన అంశములను కొన్నింటిని పంతులుగారు రంగనాథ రామాయణము నుండి స్వీకరించి యున్నారు. వానిలో ముఖ్యమైనట్టిది లక్ష్మణుడు సీతాదేవి నిర్బంధముచే మాయలేడిని వెంబడించిన శ్రీరాముని సాయము పోవుచు, పర్ణశాల ముందఱ గీత గీచి దానిని దాటి పోవలదని సీతకు చెప్పి పోవుట.

రాముని యందు భవిష్యత్తును గూర్చిన జ్ఞానమును ఆరోపించుట, రాముడు సీతా వియోగ వశమున దుర్వ్యథచే మూర్ఛాగతుడై యుండ లక్ష్మణుడు పట్టలేక దైవమును దూషించుట అను క్రొత్త అంశములను వారు చేర్చినారు.

శ్రీరామచంద్రుని పాత్ర పోషణము ఇందు తక్కిన మూడు రామాయణ నాటకములలోకన్న భిన్నముగా నున్నది. తక్కిన వానియందు ఆయన సౌమ్య గాంభీర్యాద్యుత్తమ పురుష లక్షణములు కలవాడుగా చెప్పబడెనేకాని యిందు

భగవదంశ సంభూతుడనని ఏ కొంచెమో రామునకు ప్రత్యభిజ్ఞానము ఉన్నట్లు పొడగట్టును. రామాయణ కథా స్రవంతి మలుపులు అన్నియును ఎఱిగియున్న కవి ఉత్కంఠచే మనసు నిలుపుకొన జాలక భవిష్యత్కథా సూచనముపై ఆదర మున పాత్రములచేత కొంచెము ఎక్కువగా పలికించుట వలన ఇట్లు అనిపించును.

ఆరంభముననే రాముడు సీతతో "లక్ష్మణుని నే నెడబాయ వచ్చును. నీ వెడబాయ వచ్చును. నిన్ను నే నెడబాయవచ్చును." అని చెప్పెను. తరు వాత శూర్పణఖ ప్రవేశింపగా దానికి కథ చెప్పుమని లక్ష్మణునకు ఆనతి యిచ్చెను. లక్ష్మణుడు ప్రచ్ఛన్నముగా కాలము గడపుకొనక వృత్తాంతము వీల బయటపెట్టవలెనని సందేహింపగా, రాముడు ఇట్లు అనును.

"జరుగ నున్న రామ వన వాసంపు నాట
కమున కీ కాంత రాక బీజమగు జమ్మ,
కాన మన యుదంతంబు నిష్కపటముగను
వ్యక్తపఱచినఁ గాని పై యంక మెట్లు?"

రావణుని పాత్ర యొకటి ఇందు చక్కగా పోషింప బడినది. అప్రయ త్నముగనే అతడు తాను సీతాపహరణము చేయ బోవునపుడు తనది హానిప్రద దుష్ట ప్రయత్నము అనుకొనెను. అయినను క్షణమాత్రమున ఆ తలపు త్రోసి వేసి, గాంభీర్యమువహించెను. రావణుని గూర్చి రామునిచే చివఱ పంతులుగారు చెప్పించిన అభిప్రాయము "ఈతఁడు మహానుభావుఁడై యుండవచ్చును. కాని శాప వశమున భక్తి జ్ఞానములు నిలుకడ లేక యున్నవి. పాపము; నా శిక్షనను భవించి ముక్తుఁడే యగును. లేకున్నఁ బాప శేషమున కింకొక్క జన్మయెత్తి కడ తేఱి దైవ సాన్నిధ్యమున నుండవలసిన వాఁడుగాఁ గానిపించుచున్నాఁడు."

రాముడు ఊహించినట్లుగా పలికిన ఈ పలుకులలో జయవిజయుల శాప వృత్తాంతము స్మరణమునకు వచ్చి, ఈ ఘట్టమును ఆస్వాద్యమానము చేయును. పంతులుగారు అనేక స్థలములయందు ఇట్టి రీతిగా సంభాషణములు రచించి, గత భవిష్యద్వృత్తాంతములను తోపించుచు ఈ నాటకము వ్రాసిరి.

ఒక్కొక్కచోట ఈ పద్ధతి తాత్కాలికముగా రమ్యముగా ఉన్నను పరిశీలించి చూచిన యెడల, సరిగా అతుకక పోవుటయు కలదు.

తాను కపట సన్యాసి వేషమున వచ్చినప్పుడు, సీత ఆందోళిత మనస్కయై యుండి తన వంక చూడక పోగా, రావణుడు ఆమెను ఇట్లు ప్రశ్నించెను.

రావణుడు : అతిథులగు తపశ్శాలురను నిర్లక్ష్యముగఁ జూచిన కాంతల కెట్టి యవస్థలు సిద్ధించెనో యెఱుఁగుదువా ?

సీత : ఎఱుఁగుదును. నా కట్టి భర్తృ విశ్లేషమును గటాక్షింపఁకుఁడు.

ఈ సంభాషణము వలన కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము నందలి శాప వృత్తాంతము స్ఫురించును కాని ఆ వృత్తాంతము రామాయణ కథ తరువాతిదికదా !

రామాయణ మహాకావ్య మందు వాల్మీకి వ్రాసిన కొన్ని భాగములకు వ్యాఖ్యాన ప్రాయముగా నుండు రచనయును ఈ రామాయణ నాటకములందు కన్పట్టుచున్నది. చతుర్థాంక విష్కంభమున అంశుమాలి శరభునకు ఒక వృత్తాంతమును చెప్పెను.

సుగ్రీవుడు స్వల్పమగు ఒక అపరాధమును రాముని యెడ చేసెనట.

" సుగ్రీవుఁడు రామలక్ష్మణుల సమీపించి యొక వృక్షశాఖను విఱిచి రాముని కాసనముగా నిచ్చి యొక్క వృక్షశాఖను విఱిచి తన కాసనముగఁ జేసికొని యూరకుండెను. లక్ష్మణు నెడల నిట్లు తూష్ణీ భావమున నుండ, నంతలో మహా బుద్ధి శాలి యగు నంజనాసుతుఁడు తటాలున నొక కొమ్మను విఱిచి లక్ష్మణుని దానిపైఁ గూర్చుండఁ బెట్టి, మఱియొక శాఖను విఱిచి తాను దానిపైఁ గూర్చుండెను. తన్ను గౌరవించి నప్పటికిఁ దన దాసుఁడగు లక్ష్మణుని నిర్లక్ష్యముగఁ జూచిన సుగ్రీవుఁ డపరాధి యని రామభద్రుఁడెంచి యాతనికిఁ దగు ప్రాయశ్చిత్త మొనర్చి, బుద్ధి చెప్ప నిశ్చయించు కొని, ద్వంద్వ యుద్ధమున నాతని నుపేక్షించి వాలిచేఁ దాడన మొనర్పఁ జేసెను. భగవంతుని నిందించిన నాతఁడు సహించును గాని తద్దాసుల నగౌరవ పఱచిన నాఁతడు సహింపఁడు. "

తుదకు లక్ష్మణుని చేతనే గజపుష్పలత మెడఁ గీలింపఁ జేయుట ఏల యనగా—"తనచే వెనుక పరాభవింపఁ బడిన లక్ష్మణుఁడే తనకు గష్ట దశోత్తర ణార్థమైన సాధన మీ రీతిగా నగుటవలన సుగ్రీవుని మనస్సు పరిపాక దశ నొందు నని కరుణా సముద్రుఁడైన రామ భద్రుఁ డిట్లు చేసెను.

వాల్మీకి రామాయణమున ఈ కార్యకారణ విశేషము లేమియును లేవు. అటనున్న దెల్ల-

"తత స్సపర్ణ బహుళాం ఛిత్త్వాశాఖాం సుపుష్పితామ్.
సాల స్యాస్తీర్య సుగ్రీవో నిషసాద స రాఘవః
లక్ష్మణా యాథ సంహృష్టో హనూమాన్ ప్లవగర్షభః
శాఖాం చన్దన వృక్షస్య దదౌ పరమ పుష్పితామ్."

రాముడు బాణము వేయక పోవుటకు కారణము సుగ్రీవునితో వారి అన్న దమ్ముల పరస్పర రూప సాదృశ్యమే యని చెప్పెను. లక్ష్మణునిచేత గజపుష్పి గురుతుగా వేయించెను.

ఇది పంతులుగారు స్వయముగా చేసిన వివరణమో లేక సాంప్రదాయిక మగు వ్యాఖ్యాతల దృక్పథమో తెలియదు. ఏదైనను ఈ వివరణము ఒక సొగసు గానే ఉన్నది.

అంతర్నాటకమును గూర్చి ఒకటి రెండు మాటలు చెప్పవలసి యున్నది. దీనిని కూర్చుటవలన శిల్పవిషయికముగా కలిగిన ప్రయోజనము ఈ వఱకే చెప్పుట యైనది. కాని అంతర్నాటకము ప్రదర్శింప బడుచున్నప్పుడు సామాజికు లుగా కూర్చుండిన పాత్రములు మధ్య మధ్య ప్రసంగింపుచుండిరి. ఇట్లు వ్రాయుట సంప్రదాయ సిద్ధము. వీరు మాటలాడు కొనునప్పుడు అంతర నాటకము ఆగినట్లే యుండును. పంతులుగారు ఈ నాటక ప్రదర్శన సమయమున సామాజిక పాత్రల చేత విపుల ప్రసంగములను చేయించిరి. ఇది ప్రదర్శనలో రక్తిని భంజించుటయే కాక సౌలభ్యమును చెఱచును.

# విప్రనారాయణ చరిత్రము

తమ తొమ్మిదవ నాటకమునకు కూడ పంతులుగారు పాదుకా పట్టాభి షేకమునకు వలె రెండు పేరులు ఉంచినారు. విప్రనారాయణ చరిత్రము అనునది దీని ప్రసిద్ధ నామము. ప్రస్తావనలో కూచి నరసింహముగారు మాత్రము దీనిని "వైజయంతీ విలాసము" అని పేర్కొనిరి. ఈ నాటకము 6-12-1908న ప్రారంభించి 12-1-1909 నాటికి వారు ముగించిరి.

విప్రనారాయణుని చరిత్రమును పంతులుగారు సారంగు తమ్మయ్య వ్రాసిన వైజయంతీ విలాస ప్రబంధమును చదివి గ్రహించిరి. పంతులుగారు నాటకము వ్రాయునప్పటికి చదలువాడ మల్లయ్య వ్రాసిన ప్రబంధము అచ్చు కాలేదు. వైజయంతీ విలాసమునందలి కథలో కడపటి భాగము కొంత కాలానుగుణముగ మార్చినట్లు పానుగంటివారు పీఠికలో చెప్పిరి. వారు ఇట్లు చెప్పినను, నిజమునకు ప్రబంధమునుండి ప్రధాన సన్నివేశములను దక్క గ్రహింపలేదు.

వైజయంతీ విలాసమునందు కథా సంవిధానము ఇట్లు ఉన్నది. విప్ర నారాయణుని జన్మము, శ్రీరంగసేవకై అతడు తోట పెంచుట, దేవదేవి యను వేశ్య తన అక్కయగు మధురవాణితో గూడి చోళేంద్ర రాజసభలో నృత్యగాన నైపుణ్యము చూపుట, రాజు మెప్పువడసి తిరిగి నిజపురమునకు పోవుచుండుట అనునవి ప్రథమాశ్వాసమునందలి విశేషములు. దేవదేవి, మధురవాణి విప్ర నారాయణుని ఆరామమును జొచ్చి అతని చూచుట, ఇరువురును విప్రనారాయణుని చలితుని జేయుటను గూర్చి పందెము వేసికొనుట, దేవదేవి విప్ర నారాయణుని వంచించి, అతనికడ దాసిగా చేరుట, క్రమక్రమముగా "ఆ విప్రోత్తము వజ్ర పంజరనిభంబై, నిశ్చలంబైన సద్భావంబు" కరగుట ద్వితీయాశ్వాసమున వర్ణింపబడినవి.

విప్రనారాయణుని పతనము, దేవదేవితో అతడు సుఖించుట, తుదకు అతడు దేవదేవి యింటికి పోవుట, అచ్చట వేశ్యామాత అతనిని అవమానించుట, అతడు తిరిగి తన తోటకు చేరి, తన కోర్కె తీర్చుమని రంగని ప్రార్థింపగా, రంగడు తన బంగారపు గిన్నెను గొంపోయి విప్రనారాయణుని శిష్యుడనని ఆ వేశ్యమాతకు దానిని ఇచ్చుట తృతీయాశ్వాసమున గల విశేషములు. చతుర్థాశ్వాసమున వేశ్యమాత విప్రనారాయణుని పిలిపించుట, బంగరు గిన్నెకొఱకై వెతికింపగా అది దేవదేవి యింట దొరకుట, గిన్నె విప్రనారాయణుడు పంపినట్లు తెలిసికొని అతనికి శిక్ష విధించుట, సభలో రంగనాథుడు ప్రత్యక్షమై అతని నిర్దోషిత్వమును వెల్లడించి, అతనిని ఆళ్వారును జేయుట వర్ణింప బడినవి. ఈ చివటి రెండు ఆశ్వాసములను పంతులుగారు బాగుగా సంస్కరించిరి.

ఈ కథాంశములలో పంతులుగారు చేసిన మార్పులలో ముఖ్యములైనవి యివి.

1. దేవదేవి, మధురవాణి చోళ రాజేంద్రుని సభనుండి తిరిగి వచ్చుచున్నట్లు నాటకమందు చెప్పలేదు. విప్రనారాయణుని పూలతోటలో వీరిని ప్రవేశ పెట్టుటతో పంతులుగారు నాటకారంభము చేసిరి.

2. విప్ర నారాయణుని వశీకరించు తలపుపైన దేవదేవి, మధురవాణి వేసికొనిన పన్నిదము ప్రబంధమున ఇట్లు ఉన్నది. మధురవాణి దేవదేవితో

"నీవే కా దిప్పురిలో
నే వేశ్యాపుత్రియైన నీతని విటునిం
గావింపఁ జాలె నేనియు
నా వేశ్యకు నీళ్లఁ గట్టియలు నే మోతున్"

అనిన దేవదేవి యిట్లనియె.

"అప్పరో—నీకు నే గట్టియలును నీళ్ల
నెంత మోచినఁ గాని నా కెగ్గులేదు;
నిన్నుఁ బనిగొనఁగా నాకు నీతిగాదు
వేఱ పన్నిద మొకటి గావింపుమ" నిన.

"నీవీ వైష్ణవు విటునిం
గావించిన లంజెతనపు గడన విడిచెదన్
గావింపలేక యుండిన
నీవున్విడిచెదవె" యనినవెలతుక యొప్పెన్

ఇది నాటకమున :

దేవదేవి : .... నే నీతని భ్రష్టుని చేసి క్రోతినివలె వేశ్యావీధి నాడింపక పోయినయెడల నా వేశ్యావృత్తి వదులుకొని నీకు మరణ పర్యంతము దాస్యము చేయుదును. అట్లు చేసిన యెడల నీవు నా కట్లాచరింతువా ?

3. దేవదేవి విప్ర నారాయణుని వంచించుటకు మొదట అతని కడ చేరినప్పుడు తాను శూద్రాంగననని చెప్పి, పిదప అతడు గ్రుచ్చి యడుగగా వేశ్యనని చెప్పినట్లు ప్రబంధమున నున్నది. తనకు విరక్తి కలిగిన హేతువు వివరింపుచు ఒక ఏకాదశినాటి రేయి పల్లవుడు ఒకడును లేక మనో వికలత్వమున వాడవాడల విటాన్వేషణము కావించుచు విష్ణు భవనాంగణ మంటప వేదికను సుఖాసీనతనుండి జాగరము సేయు సుధీజనులు అర్థదీప్తిగా భాగవతమును పఠియింపగా అందు పింగళాఖ్యానము విని, వేశ్యాభవము ఇట్టిది కదా అని తనకు రోత తోచెనని చెప్పెను.

నాటకమునందలి కారణము ఇట్లు కాదు. దేవదేవి తాను వేశ్యననియే చెప్పినది. తల్లి వృత్తికి ప్రోత్సహింపుచుండుట తాను ఆ పోరు పడలేక కుమిలి పోవుచుండుట ఆదినుండి జరిగినట్లు తెలిపినది. ఇట్లుండ ఒకనాడు తనకు స్వప్నమున "శొన్నవణ్ణం శైద పెరుమాళ్ దాసుడు" సాక్షాత్కరించి విప్ర నారాయణుని సేవింపుము." అని చెప్పి పంపె ననెను. ఆ క్రిందటి ఉదయము తాను సాష్టాంగపడినను విప్రనారాయణుడు ఆశీర్వదింపని హేతువున రాత్రి కావేరిలో దిగి ప్రాణత్యాగము చేయజూచుచుండ నిద్రావస్థలో ఎవరో శ్రీరంగేశ్వరుని ఆలయములోనికి తీసికొని పోయిరని, అంతట శ్రీరంగేశ్వరుడు "మాలా కైంకర్యమునకై తెల్లవారిన పిమ్మట వచ్చు విప్రనారాయణుని మేము పంద లింతుము." అని చెప్పినట్లును వివరించెను.

4. వర్షాకాలమున ఒకనాడు పెద్దవర్షము కురియుచుండగా, అంతకు మునుపు నుండి మారిపోవుచుండిన విప్రనారాయణుడు దేవదేవికి "అంగీకారము అయినను, కాకున్నను" కవయనెంచెను. దేవదేవి "మీరు వైష్ణవులు, నన్ను అంటఁదగునె" అన్నట్లు నిగూఢముగ ఎత్తి పొడుచుచుండెను. అయినను, అతడు బుద్ధి తెచ్చుకొనలేదు. దినములు కల్పములుగా, రేలు నిముషములుగా అతడు ఆమెతో గడపుచుండెను. ఇది ప్రబంధ కథ.

నాటకమున విప్రనారాయణుడు అంత పతనము కాలేదు. అతని మనసు మంచిది. భక్తి తగ్గినది. అంతమాత్రమున నాటకమున అతడు సామాజికుల కన్నులముందఱ అల్పుడు కాడు. వేశ్యా వాటికలో మాధవుడు అను వానితో విప్రనారాయణుడు తాను దేవదేవిపై అనురాగముతో వచ్చితినని చెప్పుచుండగా, శ్రీనివాసుడు వారించును. దానికి అతడు "నా దోషమున నేను కాంతానురాగుఁడను గావలసి వచ్చెను గాని యసత్యవాది నగుటకు నాకేమి కర్మము ?" అని పల్కును. ఈ రీతి ఉదాత్తతవలన విప్రనారాయణునిపై సామాజికులు సానుభూతిని కోల్పోవరు.

మధురవాణికి తుదియందు దేవదేవి ఇట్లు చెప్పెను. "ఆయన బ్రహ్మచర్య వ్రతమునకు భంగము కలుగఁజేయ వలయునను దురుద్దేశముతోఁ గౌగిలించుకొనుసరికి నా యొడ లాపాదమస్తకము భగ్గుభగ్గున నిప్పులలోఁ గాల్చినట్లు మండిపోయెను. నిలువునఁ గాలి పోవుచుంటినను మహా భయముచే నేనుండఁ జేతులు దమంతతామె పట్టువదలి పోయెను. వెంటనే యొడలి మంట చల్లారెను." ఇట్లుగా విప్రనారాయణుని పరిశుద్ధత రంగనిచేత రక్షింపబడెను.

5. వేశ్య మాతచే తిరస్కరింపబడిన విప్రనారాయణుడు తన ఆరామము చేరి, ఈ తుచ్ఛవాంఛకై శ్రీరంగని వేడుట, ఆయన బంగారుగిన్నె వటుని రూపమున తీసికొనిపోయి విప్రనారాయణుని పేరుచెప్పి దేవదేవి ఇంట ఇచ్చుట ఆదిగా గల వృత్తాంతము ప్రబంధమునందే కాని నాటకమున లేదు. వేశ్యమాత నాటకమున విప్రనారాయణుని సాలగ్రామము ఉంచుకొనెడి సంచిని అపహరించి, దానిని ఇమ్మని అడిగిన అతనిని కాలి చెప్పుతో కొట్టినది. అది రంగడు తన్నినట్లుగా భాసింప విప్రనారాయణుడు మఱల భక్తుడయ్యెను.

6. వైజయంతీ విలాస ప్రబంధమున లేనిది నాటకమున ఒక కల్పనము గలదు. దేవదేవి పశ్చాత్తప్తయై పోవుచు నిచుళాపుర భూపాలునికి ఒక లేఖ వ్రాసి అంపినది. అందు విప్రనారాయణుడు అను మహా భక్తుడు తమ సానివీథిలో ఉన్నట్లు తెలిపి, అతనిని గౌరవ పురస్సరముగా తీసికొనిపోయి అతని వనము చేర్పింప వలసినదని ఆమె కోరెను. దానిని పాటింపక రాజు నిదురింపగా శ్రీరంగేశ్వరుడు రాజునకు స్వప్నమున దర్శన మిచ్చి "మదీయ భక్తాగ్ర గణ్యుడగు విప్ర నారాయణుకు తిరుక్కరంబనూర వేశ్యా వీథి సున్నాడు. నీ విప్పుడు పోయి ఆతనిని మా పల్లకిలోనుంచి సమస్త వైభవములతో తెల్ల వారకుండ మా సన్నిధికి తీసికొని రావలయును." అని ఆజ్ఞాపించెను. అందు చేత ఆరాజు వచ్చి విప్ర నారాయణుని తీసికొని పోవుటతో నాటకము ముగిసినది.

## పాత్రపోషణము

వైజయంతీ విలాస ప్రబంధమున విప్రనారాయణుని సారంగు తమ్మయ్య ఇట్లు వర్ణించినాడు.

" సాత్వికత్త్వము పురుషత వహించినరీతి,
వినయంబు మూర్తీభవించి నట్లు,
కరుణ మనుష్య విగ్రహముఁ దాల్చిన పోల్కి,
జ్ఞానంబు సాకారమైన పగిది,
సత్యంబు పురుష వేషము ధరించిన లీలఁ,
దాల్మి శరీరవంత మగు భాతి,
శాంతంబు మానవజన్మ మెత్తిన జాడ,
హరి భక్తి తను నొంది నట్టి సరణి,

సకల కళ్యాణ గుణరత్న జలధి యగుచు,
వెలయు శ్రీ వైష్ణవాచార విమల బుద్ధి,
భగవ దష్టాక్షరీ మంత్ర పరమ జప ప
రాయణుండైన విప్ర నారాయణుండు. "

నిజమునకు ఈ ఉత్తమ గుణములు ఆప్రబంధములో కన్న నాటకమందు చక్కగా నిరూపింప బడినవి. విప్ర నారాయణుని పరిచయము చేయుచునే ప్రబంధకర్త అతనిని జనులు "తొండరడిప్పొడి" అని పిలుచుచున్నట్లు వ్రాసెను. అంతమున శ్రీ రంగేశుని కరుణచే ఇతడు ఆళ్వారు అయ్యెను.

పంతులుగారు ఈ భాగమును ఉచితముగా మార్చి తుదకు దివ్యోన్మాద వశమున అతడు నేలపై పడి దొరలుచు, "మహాత్మా ! నీ దివ్య వైభవ దర్శన మపేక్షించి యిచటికి వేంచేయు భక్తుల పాద పరాగము నాకుఁ బాదాది శిరః పర్యంత మంటి యెట్లు ప్రకాశించు చున్నదో ! భక్త పాదరేణువులచే నీ సన్నిధానమున నిట్లు పవిత్రుడనుగఁ జేయఁ బడిన నే నింతటి నుండి భక్తాంఘ్రి రేణు వను నామము ధరింతును." అనుకొని నట్లు వ్రాసినారు.

ప్రబంధమునందు దేవదేవి వచ్చి శూద్ర కులము దానను, అనాథను అని తెలుపుకొనగా, విప్రనారాయణుడు ఇట్లు కసరుకొనెను.

"తల్లి, దండ్రి, యన్న దమ్ము లెవ్వరు లేక
యొంటి మింటి నుండి యుట్టి పడితె ?
యింతి యింత కాల మెందుంటివి విరక్తి
కిని నిమిత్త మేమి యొనరఁ జెపుమ !"

ఆమె తాను వేశ్యనని తెలుపగానే అతనికి అనుమానము పొడమినది.

"కాకులు రావిపండ్లు దిని క్రక్క శిలామయ దేవ మందిరా
నీకములందు రావులు జనించును సజ్జనచిత్తవృత్తి య
వ్యాకుల లీల జాతి గుడి వంటిది, లోకములోన వేశ్యలుం
గాకుల వంటి వార లటుగావునఁ బ్రమాదము చేరనిచ్చినన్."

అని ప్రబంధమునందు పలికినాడు. ఇంత దూరము తెలిసిన వాడు గనుక నే ప్రబంధ విప్రనారాయణుడు అంతగా చెడినాడు. నాటకములో దేవదేవి చెప్పి నట్లు నిష్కల్మష హృదయుడు, బహు భూత దయా యుక్తుడు, స్త్రీ పురుష

భేదమే ఎఱుగని వాడు. కాని స్వల్పస్తుతి ప్రియత, అత్యమాయికత మొదలగు కొన్ని లోపములు గలవాడు. వీని మూలముగనే దేవదేవి అతనిని లొంగదీయ గలిగినది.

విప్రనారాయణునకు నాటకమున భక్తి భంగము ప్రధానముగా మన స్థైర్యము తగ్గుటచే కలిగినది. నిరంతరము దేవదేవి సన్నిధియందు ఉండుటచేత అతని మనస్సులో అజ్ఞాత పూర్వమైన అనుభవము బయలు దేరినది. దానిని అతడు దేవదేవితో కూడ చెప్పెను. ఆమెయు సమయము కనిపెట్టి తనకును మనోవికారము కలిగినట్లు చెప్పెను. దేవదేవి ఏమయిన ఒక్క మాట అనినచో ప్రాణత్యాగము చేయుదునని బెదరింపసాగెను. మెత్తని మనస్సుగల అతడు అది వినలేడు. ఈ జాలి మనసు చేతనే అతడు మొట్టమొదటనే ఆమెను దూరముగ పంపలేకపోయెను.

## పానుగంటి వారి మానస పుత్రి

విప్రనారాయణుని కంటెను ఈ నాటకమున ఎక్కువ ఆకర్షించునది దేవదేవి. నాటకము నందలి దేవదేవి ఒక ప్రత్యేకసృష్టి. నాటకము దేవదేవి ప్రవేశముతోనే ఆరంభమైనది. ప్రవేశించిన పది క్షణములలోనే ఈ దేవదేవి పది కాలములపాటు నిలిచిపోవు పాత్ర అని స్థిరపడి పోయినది.

షేక్స్పియర్ సుఖాంత నాటకములందు నాయక శబ్దార్హులు లేరు; నాయి కలే ఉన్నారు అని కొందఱు విమర్శకుల అభిప్రాయము. కొంతవఱకు పాను గంటివారి నాటకములకును ఇది వర్తించును. పంతులు గారికి పురుష పాత్రముల పైన కన్న స్త్రీ పాత్రములపైన అభిమానము ఎక్కువ. అందును దేవదేవి వారికి "మానస పుత్రి."

"ఆత్మ గౌరవము లేని వాని కిహము నందుఁ బరము నందు, గూడ దుర్గతియే." ఇది దేవదేవి సిద్ధాంతము; మతము. కాని ఈ ఆత్మ గౌరవము ముదిరి ఆమెలో అహంభావము వఱకును వచ్చినది.

మన కావ్యములలోని స్త్రీలు అందఱును సాధారణముగా నోటి మెతక వారు. అణకువ అనేకాభరణముల పెట్టు అని నమ్మినవారు. దేవదేవి ఇందుకు పూర్తిగా విరుద్ధమైనది. ఎంతసేపును ఎదుటి వారిని ఆక్షేపింప బూనుట, తన మాట నెగ్గించుకొన చూచుట ఆమెకు సహజగుణములు. పాదరసము వలె పరుగిడు బుద్ధి, పదనైననాలుక ఆమెకు ఉపకరణములు. అచంచలమైన ఆత్మ విశ్వాసము, అఖండమైన తదేకనిష్ఠ ఆమె బలము.

విప్రనారాయణుని లోబఱుచుకొన వలెనను పట్టుదల ఆమెకు నిమేష మాత్రమున కలిగి క్షణ క్షణ విజృంభమాణమై, ఇంటికైన పోయి రాకుండ ఉన్నదున్నట్లుగా కార్యరంగమున దూకునట్లు చేసినది. విప్రనారాయణుని లోబఱచుకొనిన పిదప, చివఱి నిముషమున చేసిన శ్రమ ఫలోన్ముఖమైనప్పుడు నిష్కల్మషమైన వైరాగ్యముతో సర్వసంగ పరిత్యాగము చేసి యోగిని కాజాలినది. కథకు ఆద్యంతముల నున్న ఈ సంఘటనములను దృష్టిలో నుంచుకొని పంతులుగారు ఈ పాత్రను అసమానముగ, మనోజ్ఞముగ రూపొందించిరి.

తమకు తోచవలసినదే కాని, ఇట్టి తత్త్వము కలవారు తక్కిన వారు తల పగుల గొట్టుకొనినను వినునది లేదు. దీనికి తోడు సులువుగ ఆక్షేపణము చేయునట్టి మనఃప్రవృత్తి, దానిపై అందుకు తగిన సమర్థతకూడ ఉండెనేని ఇక చెప్పనే అక్కఱలేదు. ఇది కేవలము తల బిఱుసు దనము అనియును అన లేము. అసాధారణ ఆవేగముతో నిండిన చైతన్యము గలవారు అట్లేయుందురు.

మధురవాణి "ఇది విప్రనారాయణుఁడను భాగవతోత్తముని పుష్పవనము." అని అనగానే వట్టి పుణ్యమునకు "మనము మాత్రము భాగవతోత్తమలము కామా ?" అని విఱుచుకొని పడినది. అవలగ్నబంధము, వెనుక బిగికచ్చ, కాళ్లకు గజ్జెలు, చేతిలో తాళపు చిప్పలు, నోట కావేరిరంగని పదములు తెయితెక్కలు ఉభయ సామాన్యమే కనుక భాగవతోత్తము డనగా పణ్యస్త్రీప్రాయుడు అని తీర్మానించినది. పైగా ఆమె అనినది. "అతఁడు దేవదాసుఁడు ; మనము దేవదాసులము. అతని యేడుపు పరపురుషాను సంధానము కొఱకు ; మన యేడుపు పరపురుషాను సంధానము కొఱకు."

విప్ర నారాయణుడు దారిన బోవుచు శిష్యుడు శ్రీనివాసునితో "రంగఁడే రంగఁడు" అని నేను చేసిన గ్రంథమును నీవు విందువా ?" అనగానే ఆ ఒక్క వాక్యమును బట్టుకొని, చీల్చి చెండాడి మధురవాణికి వివరించినది.

"నేను జేసిన గ్రంథ మనుచున్నాఁడు. ఈతని కింక నహంకారము వదల లేదు. నీవు విందువా? యనుచున్నాడు. ఒకని మెప్పునింక నపేక్షించు చున్నాడు. ఈతడుఁ స్తుతిప్రియుఁడు. ఈతని కింకఁ బూర్ణముగా భక్తి కుదురలేదు." ఈ మాటలలో దేవదేవి విలక్షణ మేధా శక్తి ద్యోతకము అగుచున్నది.

మధుర వాణితో ఘర్షణపడుట మూలముగా విప్రనారాయణునిపై మొదటనే ఆమెకు సమదృష్టి ఏర్పడి యుండక పోవుట నిజమైనను, అతని మతసిద్ధాంతములను, ఆచారములను సహింప లేకపోయినది. ఆచారానుసారము విప్రనారాయణుడు దురభిమానిని, అధముడను అని నిందించుకొనుట చూచి రెచ్చిపోయినది. "దైవదివ్య మంగళ విగ్రహ ప్రతిబింబముగ నీ నర దేహము నిర్మింపబడినది. ఏలన్మహా తేజః పవిత్ర స్ఫులింగమైన యాత్మ యీ దేహమున నుంచబడినది . అందుచే స్వనిందాపరుఁడగు వాఁడు దైవనిందా పరుఁడు. ఆత్మ ఘాతుకుఁడైన వాఁడు దైవఘాతుకుఁడు." అని మధుర వాణితో ఆమె ఆవేశ పూర్వకముగా అనినది.

నమస్కరించిన తనను చూడనందులకు విప్రనారాయణనిపై పగ పట్టినది. "నోరు తెఱచి ఆశీర్వదింప కూడదా ? నోరు తెఱచునరికి రంగఁడూచి పుచ్చు కొని యొకటి నోటిపై వాయించునా ?" అని ప్రశ్నించినది. "అతని కున్నంత భక్తి యాతని కున్నది. నాకు తగినంత భక్తి నాకున్నది. అతని హృదయమున నొక రంగఁడు నా హృదయమున కొక రంగఁ డున్నాఁడా ?" అని సవాలు చేసినది.

అడుగడుగునను ఇట్లు దేవదేవి తీవ్ర ప్రకృతి కొట్టవచ్చినట్లు కన్పట్టును. సాక్షీ వ్యాసములు సాకల్యముగా చూచినచో పానుగంటివారి ప్రతిభ సర్వమును దేవదేవి పాత్ర సృష్టియందెట్లు వినియోగపడెనో గమనింప వచ్చును.

## శిష్యుడు శ్రీనివాసుడు

ఇందలి శ్రీనివాసుడు కల్పిత పాత్రము. వైజయంతీ విలాసము నందు శిష్యుడే లేడు. రంగడు వటుడై విప్ర నారాయణుని కూర్మి శిష్యుడనని చెప్పుకొని తన బంగారు గిన్నెను వేశ్యమాతకు ఇచ్చెను. ఆ సంగతి నేర విచారణ సందర్భమున వేశ్యామాత జియ్యరుతో చెప్పగా విప్ర నారాయణుడు ఆ మాట నిజము కాదని సభయందు ఇట్లు తెలిపెను.

" నా కెక్కడి శిష్యుఁడు ? నే
నే కాకిని, లెస్సఁ దెలియుఁ డిది నిజమైనన్
శ్రీ కాంతుని గిన్నియ నే
నీ కాంతకుఁ దెచ్చియిచ్చు టిదియును నిజమే. "

పానుగంటివారు శ్రీనివాసుడు అను ఈ శిష్యుని ఏకాకి అగు విప్ర నారాయణునకు తోడుగా ఇచ్చి, చమత్కారముగా దేవదేవిచేత ఇట్లు అనిపించినారు. " పణ్యస్త్రీ కొక్క బానిస, పుణ్యస్త్రీ కొక్క పూర్వ సువాసిని, శ్రీరంగ దాసున కొక్క శిష్యుడుఁ లేకున్న గ్రంథమే నడువదు గదా? "

శ్రీనివాసుడు సామాన్యుడు కాడు. దేవదేవి వంటి దానిని సైతము గడగడలాడించినాడు. విప్ర నారాయణుని యందున్న స్వల్ప లోపముల వలన ఆస పడినను, " జాగిలమువలె " అతని కాచియున్న యీ శిష్యుని తలచుకొనిన భయము హెచ్చుచున్నది అని ఆమె అనుకొనెను. " వీఁడు గంగ్రడ ముండ కొడుకు; యథేష్ట వృత్తికి వేశ్యమాత వలె నడ్డుపడు చున్నాఁడు. " అని ఆమె విసిగికొన వలసినంత ఆటంకమైనాడు.

శ్రీనివాసునకు విప్ర నారాయణునిపైనున్న భక్తి గౌరవములు అసామాన్యములు. విప్ర నారాయణుడు భ్రష్టత నొందుచుండగా వాపోయినాడు; వారించినాడే గాని, విడిచిపోలేదు. దేవదేవి అడుగుపెట్టి నప్పటి నుండియు ఆమెపై అతనికి అనుమానమే. ఆచార్యుడు పతితుడు కాకుండుటకు పడదగిన శ్రమ పడినాడు.

ఒక్క మాటలో ఈతని గూర్చి చెప్పవలెననిన ఇతడు తెలివి తేటలలో, వాక్చాతుర్యములో, లౌకిక ప్రజ్ఞలో దేవదేవికి సమఉజ్జీ కాగల ప్రత్యర్థి. కాని దేవదేవిముందు వీని నైపుణ్యము నిరుపయోగ మగుటకు ఒక చిన్న విశేషము కలిగినది. ఆమె ప్రజ్ఞలో నిలుకడ ఉన్నది. శ్రీనివాసుడు అవస్థానుకూలముగ ఆవేశమును సంయమనము చేసికొన జాలడు. ఆ కారణముచే బలా బలములు చూచుకొనక శత్రు సైన్యములోనికి చొచ్చుకొనిపోవు శూరుని వంటి వాడైనాడు.

దేవదేవిని బహిష్కరించుటకు శ్రీనివాసుడు ఎట్లొ చచ్చిచెడి గురువు గారిని ఒప్పించెను. ఆ సంతోషములో తల మున్కలయి, ఆ వార్త ఆమెకు చమత్కారముగా చెప్పనెంచెను. దేవదేవి దానిని ముందే పసికట్టెను. తృతీయాంకమున ఈ సంభాషణము ఇట్లు ఉన్నది.

శ్రీని : (ప్రవేశించి) దేవదేవీ! దేవదేవీ!

దేవ : (నేపథ్యమున) శ్రీనివాసా!

శ్రీని : ఆ! ఇచ్చటకు రమ్ము.

దేవ : ఎందులకు?

శ్రీని : ఎందులకో వినుటకే.

దేవ : (ప్రవేశించి) ఏదీ! వినఁదలచితిని. శీఘ్రముగఁ జెప్పుము.

శ్రీని : శీఘ్రముగఁ జెప్పుట కది మంచిమాట గాదని సంకోచించుచుంటిని.

దేవ : నీవు సంకోచింప నక్కఱలేదు. నేను గీడును సంకల్పించుకొనియే యిల్లు వదలి యిటఁ జేరితిని.

శ్రీని : ఆ....ఆ! నీవు సంకల్పించుకొనిన కీడేమి?

దేవ : ఆత్మహత్య. అది సాగినదికాదు. అంతవఱకు సిద్ధపడియున్న దానికి నీ కీడు మాటలెక్కయేమి?

శ్రీని : నీ విటకు వచ్చి యైదు మాసములు దాటినది కాబోలు నేమి?

దేవ : అయిన నేమి?

శ్రీని : పాపము ! నేటితో నీకు గురుసేవా ఋణము తీరిపోయినది.

దేవ : రంగ రంగ రంగా ! గురువుల వా రాకస్మికముగ పరమ పదించినారా ?

గురువుగారిపై భక్తియున్న శ్రీనివాసునకు ఇది తల తిరిగెడు దెబ్బ. దానితో తలక్రిందులయి పోయినాడు. శ్రీనివాసుడు ఇంకేమి చేయగలుగును ?

దేవదేవికి, శ్రీనివాసునకు పరస్పరము అసహన భావమున్నది. శ్రీనివాసుడు దానిని క్షణక్షణము వెలిగ్రక్కును. హరుడు గరళమువలె దేవదేవి దానిని గొంతులో ఇడుకొని యుండెను. దాని సెగలు అప్పుడప్పుడు కొంచెముగా సోకునట్లు మాత్రము చేయును. పైన గీతపెట్టినచోట (నీకీడు—మాట) కొంచెము మార్చి పలుకుటలో కావలసినంత అర్థభేదము.

నివాసుని పాత్ర ఒక హృద్యమగు నట్టి పాత్ర. ఈ నాటకములో పంతులుగారు ప్రవేశపెట్టిన ఈ పాత్ర తరువాతి వారికి విధాయకమైన దనుటలో వారి గొప్పతనము నిరూపిత మగుచున్నది.

ప్రబంధకర్త విప్రనారాయణుని మనస్సు కరగుటను ఇట్లు చమత్కారముగ వర్ణించెను,

> "ఆ విప్రోత్తము వజ్ర పంజర నిభంబై, నిశ్చలంబైన స
> ద్భావం బంగన సాహచర్యగుణ సంపర్కంబునన్ లోహమై,
> గ్రావంబై, దృఢదారువై, తరుణవృక్షంబై, ఫల ప్రాయమై,
> పూవై, తన్మకరందమై కరగెఁ బోఁ బో నీళ్లకుం బల్చనై."

ఇట్టి క్రమమును పంతులుగారు గొప్పగా చిత్రించి, నాటకమును మనస్తత్వ చిత్రణ ప్రధానముగా చేసియున్నారు.

తుదిక్షణమున విప్రనారాయణుని భక్తి నిలిచినప్పుడు శ్రీనివాసుడు దానిని వర్ణించిన పద్ధతి చూడుడు.

" ఐహికాపేక్ష దిగలాగి నప్పు డితని
భక్తి మెల్లనఁ గ్రుంకి, యా పట్టు దైవ
కృపను వీడ హఠాత్తుగా నెగసెఁ బైకిఁ
గ్రుంగ లాగి విడుచు చెట్టు కొమ్మవోలె. "

వైజయంతీ విలాస ప్రబంధకర్త వ్రాసిన పద్యమువలె ఇది నాటక కథను అంతటిని సూచించు సంకేతమై ఉన్నది.

తక్కిన పాత్రలలో మధురవాణి, వేశ్యా మాత, మాధవుడు అను నొక విటుడు, నిచుళాపురిపు రాజును ఉన్నారు. అవి సాంప్రదాయికముగా చిత్రింపబడిన సహాయ పాత్రలు.

ఈ నాటకము భక్తుని కథ యగుటచేత దీనిలో కొంత దైవ ప్రాధాన్యము కలిగినది. తుదిని నిచుళాపుర భూపాలునకు కలలో కనబడి శ్రీరంగేశుడు విప్రనారాయణుని సత్కరింప వలసినదిగా సాయించెను. అట్లే విప్రనారాయణుని కౌగలించిన దేవదేవికి ఒడలు ఆపాదమస్తకము మండుట దైవ ప్రభావమని ఆమె భావించెను.

ఈ నాటకము రంగస్థలమున పెక్కు పర్యాయములు ప్రదర్శింపబడినది. పాత్రలసంఖ్య అత్యల్పముగా నుండుట, హాస్య, భక్తిరసములు ప్రధానములుగా నుండుట మూలముగా దీని ప్రదర్శనము సుకరమగును. ఈ నాటకము వలననే తెలుగునాట తొండరడిప్పొడి యాళ్వారు చరిత్రము విశేష ప్రచారము కాంచినది.

మహాభక్తురాలగు రాధ, మహాభక్తుడగు విప్రనారాయణుడు—వీరి చరిత్రము లందలి దుర్గాథా దోషములను పోగొట్టి గౌరవస్థానము కల్పించిన పానుగంటి వా రెంతయు ప్రశంసా పాత్రులు, ధన్యులు.

# బుద్ధ బోధ సుధ

పదియవ నాటకమగు బుద్ధ బోధ సుధను పంతులుగారు 10—10—1909న మొదలుపెట్టి, 10—1—1910 న ముగించినట్లు పీఠికలో చెప్పినారు. శ్రీ బుద్ధ శంకర రామానుజానందతీర్థ చైతన్యాది మతకర్తల బోధనములు జనులకు సుబోధకములగునట్లు నాటకములు వ్రాయవలెనని వారు సంకల్పించి మొదట దీనిని వ్రాసిరి. తక్కిన నాటకములు వారు వ్రాయుట విరమించుకొనిరి.

ఈ నాటకమున పది అంకములు ఉన్నవి. ఇది 1910 లో తణుకు శ్రీ సౌదామినీ ముద్రాక్షరశాలయందు ముద్రింప బడినది. పీఠిక చివర 4—6—1910 తేదీ ఉన్నది. అప్పటికి వారు ఆనెగొందిలో ఉండిరి.

నాందీ ప్రస్తావనలు వ్రాసియిచ్చిన కూచి నరసింహముగారు ప్రస్తావనలో ఈ నాటకమును గూర్చి, బుద్ధమత ప్రాశస్త్యమునుగూర్చి వారి అలవాటు ప్రకారము తడవు చర్చింపజేసిరి. తుదకు సూత్రధారునిచే ఇట్లు హెచ్చరిక చేయించిరి.

"ప్రతి కుటుంబమునను బాలురు, వృద్ధులు, స్త్రీలుఁ బురుషులు దీనిఁ బురాణముగ భారత, భాగవత, రామాయణముల వలెఁ బఠించిన శ్రేయోభివృద్ధి గాంతురు. ఆమూలాగ్ర శాంత రసపూర్ణమైన నాటకము, సమంజస ధర్మబోధకము, సంసృతి సాగర తరణ సాధన సన్నీతి మార్గదర్శకము."

"బుద్ధ గురువును గూర్చియు, బౌద్ధమతము
గూర్చియును మనవారలు గొంతకొంత
తెలిపిరేగాని లెస్సగాఁ దెలుపలేదు ;
ఈ కొఱతఁ దీర్చె నీ సత్కవీశ్వరుండు."

అనియు పంతులుగారిని వారు అభినందించిరి.

"భగవద్దత్తమైన నీటి నర్ఘ్య రూపముగ భగవదర్పితము చేసి శిష్టులు చరితార్థులైనట్లు లీ కవి దైవదత్తమైన బుద్ధిని బుద్ధాచార్య మహా పురుషునికై విని యోగ పఱచి ధన్యుఁడైనాఁడు. బుద్ధమతము దూష్యమను దురభిప్రాయమును దొలగింప వలతిఁయగు గ్రంథమును దృశ్యప్రబంధ రూపమున నాంధ్ర దేశ మున కొసగి పుణ్యము గట్టుకొనినాఁడు. అతనికెప్పుడు శుభమగుగాక !"

అని పారిపార్శ్వకుని చేత కూడ కూచి వారు కవిని గూర్చి ప్రశంసా వాక్యములు పలికించిరి.

పంతులుగారు ఈ నాటకమును వ్రాయుటకై ఎన్నో గ్రంథములను సంపా దించి చదివినట్లు చెప్పినారు.

**Diologues of the Buddha**

**Rhys David's Buddhism**

**Sayana Madhavachari's Sarvadarsana Sangraham**

**Rhys David's Buddhistic India**

**Lakshmi Narasa Naidu's Essence of Buddhism**

అనునవి అందులో కొన్ని.

ఈ నాటకమున స్త్రీ పాత్రలు లేవు. కథా శరీరము కూడ అత్యల్పము. ఇది సందేశ, సంవాద ప్రధానమైనది. అందును జటిలమును, క్లిష్టమును అగు మత ధర్మములను గూర్చిన సంవాదములు. సుబోధకము కావలసిన దృశ్య కావ్యరచనకు ఇది ఎంత ప్రతిబంధకమో గుర్తించి ఈ నాటకము చదివినచో లక్ష్మీనరసింహారావుగారి గొప్పతనము తేటతెల్ల మగును. అట్టి గౌరవ యుక్త మగు విషయమును నాటక శిల్పమున నొదిగించి, సంభాషణములలోనికి అనువ దించి సుబోధకమగునట్లు వారు ఈ నాటకమును వ్రాసిరి.

మొదటి అంకమున బుద్ధుడు యోగాభ్యాస పద్ధతి నిష్ప్రయోజనమని నిశ్చయింపగా, శిష్యుడగు కౌండిన్యుడు ఆ మాటలు నచ్చక విడిచిపోవును. రెండవ అంకము బుద్ధుడు జ్ఞానసిద్ధిని గాంచుట. ఇరువదిమూడు పుటల ఈ అంకము ఏక పాత్రాత్మకము. మూడవ అంకమున బుద్ధుడు ఆనందునితో గూడి వారణాసిలో యశుడు అను జూదరిని ధర్మమార్గమునకు మరల్చు వృత్తాంతము ఉన్నది.

నాల్గవ అంకమునందు పూరాణకస్యపుడు మున్నగు వివిధ మతావలంబులు కలిసి బుద్ధుని చంపించుటకు నిశ్చయించుట. అయిదవ అంకమున వారి ప్రోత్సాహముచే నరహంతయైన అంగుళిమాలుడు, నరమాంస భక్షకుడైన అలవకుడు బుద్ధుని పైకిపోయి ఆయన సద్బోధలవలన సన్మార్గులగుట. అంబష్ఠాచార్యుడు బుద్ధుని కలిసికొని, వితండ వాదములు సలిపి తుదకు విజితుడు అగుట ఆరవ అంకము.

అజాతశత్రుడు బుద్ధునియెడ ముందు తాను చేసిన అన్ని అపచారములను మన్నింప వేడి, ఆ మహాత్ముని ఉపదేశములను వినుట తక్కిన నాలుగంకములలోను ఉన్నది.

ఈ నాటకములోని వేదాంత సంబంధాంశములను చర్చించుట పెద్ద విషయము, అప్రసక్తము కూడ అగును. నాటక శిల్పమును గూర్చి అనినచో ఒక్కటే మాట పైన చెప్పబడినది. చదువుటకు గాని, ప్రదర్శించుటకు గాని యిది సర్వసులభ మగునది కాదు. విశిష్ట సామాజికుల కొఱకు వ్రాయబడినది. పంతులుగారి తార్కిక ప్రతిభకు ఇది నిదర్శనము.

చివరి అంకములలో బుద్ధునిచేత పంతులుగారు కొంత అతివ్యాప్త ప్రసంగములు చేయించినారు. బుద్ధునితోపాటు, తాముసు తన్మత ప్రాశస్త్యమును ఉగ్గడించు ఉబలాటము కలవారు అగుటయే అందులకు కారణము. అందును బహుదేవతారాధనము, విగ్రహారాధనము మున్నగు అంశములను గూర్చి నవమాంకములో 241—243 పుటలలో వ్రాసిన పెక్కు వాక్యములు పెద్ద మార్పులేకయే

సాక్షి మూడవ సంపుటమునందు "కాల స్వరూపుడు" అను వ్యాసమున తరువాత చేర్చినారు. సూటిగా, సంగ్రహముగా చెప్పవలెను అనిన ఈ నాటకములో బుద్ధుడు తన సిద్ధాంతములనే గాక, తరువాతి కాలమున వానికి చేయబడిన వ్యాఖ్యానాదులను గూడ చేర్చి ప్రసంగించెనా అనిపించును. బుద్ధమత సిద్ధాంతముల ఔత్కృష్ట్యమును, ప్రాశస్త్యమును వ్యాపింప జేయుటకై పవిత్ర దీక్షతో పంతులుగారు ఈ నాటకము వ్రాయనెంచుటచే ఇట్టి లోపము కలిగినది.

ఏ అంకమునకు ఆ అంకముగా ఈ నాటకము చూచిన ఇది చక్కని ఏకాంకికల సంకలనము అనిపించును. పంతులుగారు బుద్ధుని జీవితము కన్న సందేశమునకే ప్రాధాన్యము ఇచ్చి ఎన్నుకొని బుద్ధబోధ సుధ నాటకమును చేసినారు.

పాత్ర చిత్రణ నైపుణ్యము దృష్టితో ఇందలి దేవదత్తుని పాత్ర ముఖ్యమైనది. బుద్ధుని చంపించుటకు లోన ఇష్టము కలవాడై, పైకి కపటపు మాటలు, కల్లబొల్లి యేడుపులుగా అభినయించిన వాడు దేవదత్తుడు. ఈ సంశ్లిష్ట పాత్ర లౌక్యము చక్కగా పంతులుగారు నిరూపించిరి. తరువాతి నాటకములలో వారు ఇట్టి పాత్రలను ఇంకను సృష్టించినారు. సరస్వతి నాటకములోని మాధవ వర్మ, వీరమతిలో పార్వతి యిట్టివారే.

బుద్ధ బోధ సుధ తెలుగు నాటక వాఙ్మయములో ఒక ప్రయోగాత్మక కృషి అని చెప్పి ముగింపవచ్చును.

# వృద్ధ వివాహము

ఇది నాలుగంకముల నాటకము. పంతులుగారి నాటకములలో పదునొకండవది. "నీతితో నిండిన నాటకమును వ్రాయుమని శ్రీశ్రీ పీఠికాపురపు రాజావారు కోరఁగ వృద్ధ వివాహమును వ్రాసితిని. శ్రీ బుద్ధ నాటకమగు వెంటనే 16-1-1910 తేదీన మొదలు పెట్టి 10-2-1910 తేదీని ముగించితిని." అని వారు పీఠికలో వ్రాసికొనినారు.

తణుకు శ్రీ సౌదామినీ ముద్రాక్షర శాలలో 1910 లో ఇది ముద్రింపబడినది. దీని పీఠిక 28-8-1910 న ఆనెగొంది నుండి పంతులుగారు వ్రాసిరి.

ప్రస్తావనలో ఇది "పరిహాస జీవనమయిన ప్రహసనమే అయినను, గ్రంథకలిత బహుళ సద్బోధన ప్రభావ్యాప్తి చేత దివ్య నాటకముల కింతఁ దీసిపోదు." అని స్పష్టము చేయబడినది. "కర్కశ గ్రంథపఠన విక్లాంత చిత్తమునకు విశ్రాంతి నిచ్చి హాయినిఁ బొనర్చు నద్ది హాస్యప్రధాన కావ్యంపునవ్వు." అని ఇందలి హాస్య ప్రయోజనము కొనియాడ బడినది.

రామశాస్త్రి అను వృద్ధుడు యోగ్యురాలయిన తన ద్వితీయ భార్యను నిష్కారణముగ అనుమానించుచు, ఆమె యెడ అనుచితముగా ప్రవర్తించుచుండును. తుదకు మనోవ్యథతో మంచమెక్కి మరణించును. పిదప ఆ ద్వితీయ భార్య కాంతమ్మ తన యాస్తినంతటిని బాలికల పాఠశాలలు మున్నగు వానికి వెచ్చించి, సంఘసేవయందును, ఉత్తమాశయ ప్రచారమునందును తన కాలము గడపును.

మొదటి మూడు అంకముల యందలి కథకు, తుది అంకము నందలి. సన్నివేశమునకు నడుమ ఆరేడేండ్ల వ్యవధి ఉన్నది. మొదటి మూడు అంకము

లందలి ధోరణి ప్రహసన ప్రాయముగా ఉన్నది. చివరి అంకము కేవలము ఉపన్యాస మయము. దీనిలో నాటకీయత లోపించినది. ఈ నాటకము ఆదర పాత్రమగుటకు కారణము ఇందలి పాత్రపోషణ నైపుణ్యమే.

జీవిత చరమదశలో వివాహము చేసికొని, తనకు సౌఖ్యము లేకపోగా పసిబాలిక జీవితము నాశనము చేయు వారలకు రామశాస్త్రి, ప్రాతకాలపు మూఢ విశ్వాసములు గల ఆడువారికి కామమ్మ (రామశాస్త్రి అన్న కూతురు) వివేచన కలిగి ఇట్టి వారిని ప్రతిఘటించు యువతరమునకు ముకుందశాస్త్రి, కన్న పిల్లలను కక్కుర్తికి వృద్ధులకు ఇచ్చి, సిగ్గు ఎగ్గు లేక కూతురు అల్లుడు వీరి ఆస్తికి అంగ లార్చు నైచ్యము గల వారికి సుబ్రహ్మణ్యశాస్త్రి వీరు ప్రతినిధులు.

## స. సా. సా.

ఇంకను ఇందలి యొక విచిత్ర పాత్ర సహజ పండిత సాతాని సాంబయ్య. (స. సా. సా.) ఇతడు వైద్యుడు. సాతానులలో ఇట్టి పేరు ఉండదు. ఇతని మొదటి పేరు తిరు వెంగళయ్య. వైద్యుడు అగుటచేత మృత్యుంజయార్థక మగు సాంబ నామము పెట్టుకొనెను. ఇతడు మంత్రశాస్త్ర వేత్తగా నటించు వంచనా శిల్పి. తనకంటె వైద్యమునకు వేఱు గతిలేని అమాయకులగు ప్రజలను బుట్టలో వేసికొని సంపాదించిన పరువుతో, ధనముతో బ్రతుకుచుండిన వాడు. ఇతడు నాటకమున తృతీయాంకమున వచ్చును. ఆధివ్యాధులతో ఉన్మత్తుడైన రామశాస్త్రి ఇతనిని ఈడ్చుకొని పోయి బావిలో బడద్రోయును. నచ్ఛీలములేని ఇతని ఈ దుర్మరణము సామాజికుల సానుభూతిని పడయదు. అతని మృత్యుంజయత్వపు బండారము ఇట్లు బయట పడినది.

ఇందలి ఆదర్శవంతమైన పాత్ర వృద్ధుడగు రామశాస్త్రి ద్వితీయ భార్య యగు కాంతమ్మ. భర్త పెట్టిన కష్టములను ఓర్పుతో భరించిన ఉత్తమ శీల. చివరకు ఆమె విగత భర్తృక యైన పిదప ప్రజోపయోగ కృత్యములందు జీవిత శేషమును గడపెను. తనతోపాటు సవతి కుమారుని కూడ సంఘ సేవకుని చేసెను.

చతుర్థాంకమున స్త్రీ విద్యావశ్యకత, బాల్య వివాహ నిరాకరణము, వృద్ధ వివాహ ఖండనము, కన్యాశుల్క నిరసనము, వివాహబంధ పవిత్రత మున్నగు అంశములపై కాంతమ్మ, ఆమె సవతి కుమారుడు పేరయ్య వీరి ఉపన్యాసములు, సందేశములు ఉన్నవి.

వితంతూద్వాహమును గూర్చిన ప్రస్తావనము కూడ ఇందులో ఉన్నది. వితంతు వివాహము దూష్యము కాదనియు, కాని అదియే సంఘ సంస్కార మునకు ప్రాతిపదిక అని, అదియే ప్రశస్తమైన పద్ధతి అని భ్రమపడుట ఉండ రాదు అనియు పేరిశాస్త్రి ముఖమున పంతులుగారు స్పష్టము చేసిరి.

ప్రస్తావనలో నటి చేసిన చర్చకు బదులు చెప్పుచు సూత్రధారుడు దీనిపై అభిప్రాయము ఇచ్చెను. కాంతమ్మ వితంతు పునర్వివాహము చేయదగునని ప్రచారము చేసినది. కాని తాను చేసికొనలేదు. మనస్సు నిగ్రహించుకొని నీతితో ఉండగలిగినప్పుడు పునర్వివాహము అవశ్యకము కాదు. కాని వివాహము తప్పని భావించి, సంఘము గర్హించు అవినీతి చర్యలతో, వాని దుష్పరిణామములతో జీవితము గడపుకంటె పునర్వివాహము మేలు అని కాంతమ్మ ఆశయమైనట్లు సూత్రధారుడు విశదీకరించును.

## వీరేశలింగము గారి ప్రభావము

ఈ నాటకమును గూర్చి ముఖ్యముగా చెప్పుకొనదగిన అంశము ఇంకొ కటి కలదు. సంఘ సంస్కరణోద్యమము ఆంధ్ర దేశమున బాగుగా పాతుకొను చుండిన రోజులు అవి. కందుకూరి వీరేశలింగముగారి సంఘ సంస్కార కృషి జగద్విదిత మైనది. ఈ నాటకము దానికి తోడుపడుచున్నది. వీరేశలింగముగారు చేసిన కృషి ఫలించుట కూడ దీనిలో సూచింపబడినది.

సాంబయ్య తన వైద్యశాస్త్ర పరిజ్ఞానమును వెల్లడింపుచు తలయు తోకయు లేని మాటలేవో చెప్పగా కాంతమ్మ శారీర శాస్త్రమునకు కేవల విరుద్ధములైన మాటలు చెప్పుచున్నావేమి అని సవాలు చేసెను. కొమార్తె ఈ వివేకమునకు

అబ్బురపడిన తండ్రితో ఆమె ఇట్లు తెలియజెప్పును. "పంతులవారాంగ్రీక రించిన దానిఁ జూచితిని." ఆమె చివఱ ఇచ్చిన ఉపన్యాసములందు కూడ ఆమెకు వీరేశలింగము పంతులుగారి సాహిత్యముతో గల విశేష పరిచయము కానవచ్చును.

ఇంతకుముందు పది నాటకములలో పంతులుగారు నిపుణముగా సమ కాలీన జీవితచ్ఛాయలు అట నట స్ఫురింప జేసినను, పూర్తిగా సమకాలీన కథను, పాత్రలను గ్రహించి నాటక నిర్మాణము చేయలేదు. అట్టి పద్ధతిలో ఇది తొలి ప్రయత్నము. కాని, వీరేశలింగము పంతులుగారి రచనలు ఇటువంటివి అంతకు మునుపే వెలువడి యున్నవి. పాత్ర పోషణమున, సంభాషణ రచన మున పంతులుగారి కళాత్మక ప్రతిభ దీనిలో కానవచ్చినను ప్రాథమికముగా వీరేశలింగము పంతులుగారి ప్రభావము ఇచ్చట ఉన్నట్లు గమనింప వచ్చును.

రచనా ప్రణాళికను గూర్చి ఇందు అధికముగా చెప్పుకొన వలసినవి లేవు. ఎక్కువగా గద్యముననే నాటకము వ్రాసినను పానుగంటివారు దీనిలో పద్యము లను కూడ వ్రాసియున్నారు.

# కల్యాణ రాఘవము

కల్యాణ రాఘవము శ్రీమద్రామాయణములోని బాలకాండము నందలి కథను మలచిన నాటకము. కథా క్రమమున మొదటిదే అయినను, కాలక్రమమున పంతులుగారి రామాయణ నాటకములలో చివరిదైనది. పంతులుగారు ఆనెగొంది సంస్థానమున నుండగా 1910 లో ఈ నాటకమును ఆరంభించి మొదటి అంకము మాత్రము వ్రాసిరి. 1915 జనవరిలోగాని తక్కిన అంకములను వారు పూర్తి చేయలేదు. అప్పుడు ఉయ్యూరు సంస్థాన ప్రభువులగు శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారి ప్రోత్సాహముచే దీనిని ముగించినట్లు పీఠికలో వ్రాసిరి. పిఠాపుర ప్రభువుల ద్రవ్యసహాయముచే దీనిని 1915 లో తణుకు శ్రీ సౌదామినీ ముద్రాక్షర శాలయందు ముద్రింపించిరి.

ఇది ఆరంకముల నాటకము. ఇది తుది నాటకము అగుటచేత మొత్తము రామాయణ నాటకములు నాల్గింటినిగూర్చి ప్రస్తావనలో సూత్రధారుని ముఖమున లేఖక, పాఠక, ద్రష్టృ, ప్రదర్శకాదులకు అందఱికిని ఇవి ఉభయ తారకములు అని సూచివారు ప్రశంసించిరి.

పుత్ర కామేష్టి ముగిసిన పిదప దశరథుడు మువ్వురు భార్యలకును పాయసము పంచి ఇచ్చుటతో ఆరంభముచేసి ఈ నాటకమున ద్వితీయాంకమున పానుగంటివారు శ్రీరామ జననమును వర్ణించిరి. తృతీయాంకమునందు సవన సంరక్షణార్థమై విశ్వామిత్రుడు రామలక్ష్మణులను యాచించి తీసికొని పోవు వృత్తాంతము, చతుర్థాంకమున తాటక, సుబాహులవధ అభివర్ణింపబడినవి. మిథిలాపురమున ధనుర్భంగము గావింపబడుట పంచమాంకమునందు, షష్ఠాంకమున అయోధ్యలో దశరథుని అభినందించి, విశ్వామిత్రుడు వీడ్కొనుటయు కూర్పబడినవి.

కల్యాణ రాఘవము కమనీయ నాటకము. రంగస్థలముపై దీనికి ఏల ప్రాధాన్యము, ప్రాచుర్యము రాలేదో ఆశ్చర్యమగుచున్నది. శ్రీరామ మహత్త్వ మును విపులీకరించు పట్టభంగ, వనవాస, విజయ రాఘవములను వ్రాసిన వెనుక దీనిని వ్రాయుటచేత పంతులుగారికి దీనిని అత్యంత మనోహరముగ నిర్మించు అవకాశము లభించినది. ఆ శ్రీరామ మహత్త్వ బీజములు, తక్కిన లక్ష్మణాది పాత్ర స్వభావముల ప్రాతిపదిక ఇందు నిపుణముగ నిక్షేపింపగలుగుటకు ఇదే కారణమై ఉండును.

## నాటకీయతకు పరమావధి

ఈ నాటకములోని నాటకీయత మిగుల ప్రశంసార్హమైనది. నాతి విపుల ముగ వ్రాయుచు, రసోచిత వాక్య గుంభనము చేయుచు, కల్యాణ రాఘవమును వీనుల విందుగా, సహృదయ తర్పణముగ పంతులుగారు రచించియున్నారు.

స్థూలముగా ఈ నాటకమునందలి కథను చూచినచో నాటకీయతకు తక్కువ అవకాశము మాత్రమే ఉన్నది. కాని పంతులుగారు రసపోషణ సంవిధాన చక్రవర్తులై ఇందు సామాజిక హృదయములను స్పందనము చేయించు నాట కీయతను గూర్చినారు.

నాటకీయత అనగా ఇందలి తృతీయాంకమును చెప్పవలయును. విశ్వా మిత్రుడు రాజుకడకు వచ్చెను. దశరథుడు ఉపచార వాక్యములు చెప్పుచు తానై ఋషికడకు సేవింప పోవనిది దోషమని ఒప్పుకొని క్షమింప వేడెను. కాని తాను రాకపోవుటకు గల కారణమును సవినయముగా మనవి చేసికొనెను.

" శ్రీ రఘూద్వహుఁ డిట వెలసినది మొదలు
కనుల కఱవు దీర నతనిఁ గాంచుటందు,
వీను లలరఁగఁ బలుకులు వినుట యందు,
నును బులక లూరఁ దొడఁ బెటి కొనుట యందుఁ

గ్రొంజవులు దేర ముద్దిడు కొనుట యందు,
మురువు మురువుగఁ జెక్కిలి పుడుకు టందుఁ,
దనువు హాయిగఁ గౌఁగిలి గొనుట యందు,
నొక నిమున మాతనిని గానకుండు నపుడు

రామ ! రఘువీర ! రాఘవా ! రామచంద్ర !
యనుచు నోరారఁగాఁ బిల్చు కొనుట యందు,
నటు నిటును నాతని వెదకు లాడుటందుఁ,

దెరపి లేదు, తీరిక లేదు, విరతి లేదు,
ఆపుదల లేదు, తుద లేదు, హద్దు లేదు,
అలపు లేదు, సొలపు లేదు, నిలుపు లేదు,
చాలు చాలు లే, దిఁకనరి సరియు లేదు.

సర్వరాజ్య తంత్రంబులు చప్పఁ బడియెఁ,
గొటకొ అనుచును సుమంత్రుఁడు గొణఁగు కొనియె,
వహ్ని తంత్రంబులును జల్లఁ బడియె, మౌని
విభుని యూరుపు కాసంత వెచ్చబడియె.

ఇన్నియేల ? రాముని గాంచి యింత గాఁగఁ
బ్రాఁకు లాడెడు నే నెట్లు రాము విడిచి
దివికిఁ బోదునో యనుచు సందియము దోఁచు
నెవరు లేరుకావున నంటి నిట్లు మీకు."

ఈ అంకమునందు జరుగనున్న దానికి ఇది ఎట్టి భూమిక ? ఈ మాటలు విని మౌని అదరి పడెను.

రాముని పంపజాలనని దశరథుడు, పంపుమని విశ్వామిత్రుడు దీర్ఘ సంఘర్షణ పడలేదు. పానుగంటివారి దశరథుడు పరమ లౌక్యుడు, చమత్కారి గదా !

"మీరే దశరథుఁడను కొనుఁడు. నేనే విశ్వామిత్రుఁడను. నేనే మీ రాము నడిగితిని. ఎఱుఁగక యిచ్చెద నని మీరు పలికితిరి. అట్టి స్థితిలో మీ రిట్లు మనసులో గుబ్బెటలు పడుదురా లేదా ?" అని ప్రశ్నించి తన మనసులో నున్న సందేహములను అన్నిటిని వెడల బోసెను. విశ్వామిత్రుడును తానే ఆ స్థితిలో దశరథుడై ఉండిన ఎట్లు తలచునో చెప్పుచు అతని సందేహములకు సమాధానము చెప్పెను. ఇది ఒక చక్కని కల్పన. నాటకీయతకు పరమావధిగా ఈ సన్నివేశము తీర్చ బడినది.

మఱియొక సన్నివేశము పేర్కొనదగినది శ్రీరామ జననమునకు సంబంధించిన ఘట్టము. శ్రీరాముడు పుట్టుటకు ముందు కౌసల్య తన గర్భములోని మహా తేజమునకు నిలువలేక పోయినది. దశరథుడు సుఖప్రసవము ఎట్లు అగునా అని లోలోన బెగడొందుచు, "శ్రీ శేష శయన పరబ్రహ్మణే నమః అని భగవద్ధ్యానము చేయగానే కౌసల్య—ఆసన్నప్రసవ అగునది పర్యంకముపై నుండి లేచి, "ధనుస్సు—ఏదీ ధనుస్సు ?" అని దుష్ట శిక్షణ సూచన చేయుచు అర్చినది. పెద్దలో, పేరటాండ్రో అని దశరథుడు అల్లాడి పోయెను. ఉన్నవాని ఉన్నట్లుగా వసిష్ఠుని పిలుచుకొని రావలసినదిగా సేవకులను ఆదేశించెను. ఆయన వచ్చెను.

కొట్టుకొనుచున్న గుండెలతో దశరథుడు మొరపెట్టుకొనెను.

దశ : మహానుభావా ! నమస్కారము. మహాసముద్రమునఁ బడియున్నాను. కౌసల్య వంకఁ జూడుఁడు. అదేమి ?

వసి : (నవ్వుచు) మహాసముద్రమున నీవు పడి యుండుట కాదు. మహా సముద్రమునఁ బడియున్న యాతఁడు మన యింటి కింక విచ్చేయును. ఈ దినమే సుదినము. నీ బ్రదుకంతయు నిందుకొఱకే, నా జపమంతయు నిందుకొఱకే !

దశ : మహాత్మా ! కౌసల్య కేమియు నాపత్తు లేదు గదా ?

వసి : (నవ్వుచు) దేవతల యాపత్తు లిఁక నణఁగి పోవును. ఋషుల యాపత్తు లిఁకఁ దీఱును. లోకముల యాపతులు మాయమగును.

అదే విధముగ శ్రీరామచంద్రుడు అవతరించిన వెంటనే, ఆ పురిటి శిశువును గొనివచ్చి అమితోత్సాహముతో దశరథుడు మహర్షికి చూపించెను. ఆ శిశువును చూచి మురిసిపోవుచున్న దశరథుని మాటలు ఇవి :

" అరగ మూయు నపుడె యంతంతలౌ కనుల్
విప్పినప్పుడెంత గొప్పలగునొ ?
మూట గాఁగఁ బండు బుడుతఁ డింతగ నుండ
సాగియుండ నెంత సోగయగునొ ? "

కాని వసిష్ఠుడు—గర్వ్యమగు పురోహితతను గాంచి ఇంత కాలము రఘు కులమును గనిపెట్టుకొని యున్న వసిషుడు—రామనామ సంస్మరణ పూర్వకముగ జపమాల త్రిప్పగా అరిగిపోయిన వ్రేళులు గల ముదిమి గడ్డపు ముని వసిష్ఠుడు—అట్టి వసిష్ఠుడు తానేమి చూచెను ? ఇవిగో ! ఆ మహర్షి సత్తముని మాటలు :

" ఇది కన్ను, ఇది ముక్కు. ఇది చెవియని నాకేమియు విస్పష్టముగఁ గాన వచ్చుటలేదు.

కనులు మిఱుమిట్లు గొల్పి, పుల్కల నొసంగి,
మోద బాష్పములను వెల్బు పూర్ణ విమల
శాంత గంభీర తేజంబు—స్వల్ప పూర్వ
పరిచయముగల యదియె—చూపట్టె నాకు. "

ఒకే ఆలంబనము. ఒకే సన్నివేశము. ఒకే క్షణము కాని రెండు దృక్పథములు. రెండు విధముల అనురాగ వాహినులు. రెండు రకముల రస మహాప్రవాహములు.

ఈ సమ్మేళనముకంటె, ఈ సమన్వయముకంటె గొప్ప నాటకీయత ఎచ్చట ఉండును ?

అట్లే, తాటకాదుల వృత్తాంతము. చిన్న లక్ష్మణుడు ఏదయిన కథ చెప్ప వలసినదని విశ్వామిత్రుని అడిగెను. ఆయన తాటక కథ చెప్పుచుండెను. చెప్ప వలసిన పూర్వకథ ముగింపు వేళకు ఆ సమీపమున తాటక ఉనికి గురు తింపబడెను.

అహల్యా శాప విమోచన వృత్తాంతమును ప్రత్యక్షముగా పంతులుగారు కూర్చలేదు. జనక శతానందులకు విశ్వామిత్రుడు శ్రీరామచంద్రుని గొప్పతన మును వివరించుచు నడుమ ఈ వృత్తాంతమును చెప్పెను. ఇందువలన నాటక మున ఇంకొక అంకము కూర్చవలసిన అవసరమా తప్పినది. వృత్తాంతమును వినినవారు అహల్యాసుతుడగు శతానందుడును, రామునికి పిల్ల నిచ్చుచున్న మామగారు జనకుడును అగుటచేత ఔచిత్యము మిన్నుముట్టుట యను ప్రయోజన మును కలిగినది.

**బాల రామ ఖులు**

భ్రాతృభక్తిపరుడగు లక్ష్మణుని పాత్ర ఈ నాటకమున పొడిమాటలలోనే పొందికగా పోషింపబడినది. విశ్వామిత్రుడు సుకుమారులగు రాజకుమారులను తెచ్చి అడవులలో బెట్టి ఇబ్బందులు పెట్టుచున్నందులకు నొచ్చుకొనుచు మాటా డెను. శ్రీరాముడు తగిన మర్యాద నెఱపుచు "స్వామీ! మీరట్లానతీయఁ దగునా? మీరు గటాక్షించిన బలాతిబల విద్యలవలన మాకు క్షుత్పిపాసా బాధలు లేవు. బడలికయులేదు." అని మఱికొంత ప్రసంగించెను. లక్ష్మణుడు అందు కొని "రామభద్రున కేమియుఁ గష్టములు లేకపోవుటచే నాకేమియులేవు." అని పలుకును.

విశ్వామిత్రుడు అన్నదమ్ములగు సుందోప సుందుల గూర్చి చెప్పెను.

విశ్వా: సుందోప సుందులని—

లక్ష్మ: ఊ—అన్నదమ్ములా?

విశ్వా: అవును, నీకెట్లు తెలిసెను?

లక్ష్మ : పేళ్లను బట్టి. నాకు మా తండ్రి యుప రాముఁడని పేరేల పెట్టలేదో ?

రాము : తమ్ముఁడా ! కథ వినవేల ?

లక్ష్మణుని ఆ మాత్రపు మాటకారి తనముకూడ అతి ప్రసంగమగునని, పెద్దలను అధిక్షేపించినట్లు వచ్చునని మితభాషి, వినీతుడు అయిన శ్రీరాముని భావము.

ఇట్లు వ్రాయుచు పోయిన నాటకము అంతటిని తిరుగ వ్రాయవలసి వచ్చును. సంప్రాప్త యౌవనులగు రామలక్ష్మణులను మనము ప్రత్యక్షము చేసి కొనగలము. దానినిబట్టి పంతులుగారు వారి బాల్యమూర్తులను గొప్పగా ఊహించి నిరూపించ గలిగిరి.

ఇక దీనిలో వసిష్ఠ విశ్వామిత్రులకు ఇరువురు శిష్యులను ప్రవేశపెట్టి కొంత ప్రసంగము చేయించిరి. వీరు సూచ్యకథ సూచించుటకు, కొంత హాస్యము కొఱకు వచ్చినవారు. వీరి మాటలు నవ్వు వచ్చినను, నిజమునకు తక్కిన నాటకము లందలి సూచ్యకథా పాత్రముల వలె నిండైన సృజనాత్మక ప్రతిభా జన్యులుగా వీరు కన్పట్టరు. వీరి సంభాషణముల వలన అన్యథా ఉదాత్తము అగు నాటకమునకు గ్రామ్యత కలిగినది.

ఈ నాటకములలో రామునిచేత పంతులుగారు అరణ్యమున నాగరక, ఆటవిక జీవితముల వ్యత్యాసమునుగూర్చి ప్రసంగము చేయించిరి. భాస మహాకవి నాటకము యజ్ఞ ఫలమునకూడ ఇటువంటిదే చర్చ ఉన్నది. ఈ నాటక రచనా పరిసమాప్తి వేళకు భాస నాటకములు బయల్పడి యుండుటచే ఒకవేళ పంతులుగారు దానిని చదివి యుండవచ్చును.

మొత్తము మీద కల్యాణ రాఘవము పానుగంటివారి ఉత్తమ నాటకములలో ఒకటి అనుటకు ఎట్టి సందేహమును లేదు.

# కంఠాభరణము

ఆంధ్ర నాటక వాగ్దేవికి కంఠాభరణము అని పేరు వడసిన నాటకము కంఠాభరణము. ఇది ఆరంకముల నాటకము.

" మిగుల నవ్వు వచ్చు నాటక మేదైన రచింపుమని శ్రీశ్రీ పిఠాపురాస్థాన ప్రభువులగు మ. రా. రా. శ్రీశ్రీ రాజారావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారు నా కొసంగిన యాజ్ఞ ననుసరించి యొకకథను గల్పించి కంఠాభరణము అను పేర నీ నాటకమును 3-4-'17 తేదీ నారంభించి, 10-5-'17 తేదీని ముగించితిని." అని పంతులుగారు మొదటి ముద్రణ పీఠికలో వ్రాసినారు.

ఈ నాటకము మొదటి సారిగా రాజమహేంద్రవరపు శ్రీ విద్యానిలయ ముద్రాక్షర శాలలో 1917 లోనే ముద్రింపబడినది. హాస్యరస ప్రధానమగు నీ నాటకము చాలకాలము బహు ప్రదర్శనములు వడసినది.

నాటకపు ప్రస్తావనలో హాస్య ప్రయోజనములు వివరింప బడినవి. మొదటిది దుఃఖమయమైన లోకమున ఉత్కటమగు చింతలపాలై యున్నవారిని కొంత సేపయిన నవ్వించి కుందుబాపుట. రెండవది ఛాందసాచారములతో తాము శ్రమపడి ఇతరులను శ్రమ పెట్టు వారిని, ధర్మ కర్మములను వీడి మనసు వచ్చినట్లు తిరుగువారిని, అర్థమే పరమార్థమని నగుబాటులు పొందువారిని బయట పెట్టి, సుప్రహసన పాత్రములుగ చేసి, బాగోగులను విభజించి చూపి నీతి కఱపుట.

ఈ నాటకమునకు ఈ రెండు ప్రయోజనములు ఉన్నవి. అందు రెండవ దాని బట్టి ఇది Commedy of Manners గా ఉద్దేశించినట్లు స్పష్టము కాగలదు. కాని కొందఱి అభిప్రాయమున ఇది వట్టి ప్రహసనము. అది న్యాయము, సమంజసము గాదు.

## సంశ్లిష్ట ఇతివృత్తము

ఈ నాటకము నందలి ఇతి వృత్తము మిగుల సంశ్లిష్టమైనది. అయినను, పఠనసమయము నందుగాని, ప్రదర్శన సమయమునందుగాని కథ అర్థము చేసి కొనుటలో ఎటి కిషతయును ఉండదు.

సోమావధాని, అతని భార్య బంగారమ్మ, మఱదలు సుబ్బలక్ష్మి యాత్రార్థముగా పోవుచు ఒక పట్టణము వచ్చిరి. అచ్చట ఒక ఆడుది సర్కస్ చేయుచుండగా, ఆడువారిద్దరును అవధాని కిష్టము లేకున్నను చెప్పకుండ పోయిరి.

ఆ పట్టణములోనే కృష్ణారావు అని వేపారి పంతులు ఒకడు పుస్తె కట్టి నప్పుడు తప్ప భార్య మొగము మఱల చూడకుండిన వాడు, వేశ్యాను రక్తుడు సుందరి అను పేరుగల తన వేశ్యతో సుబ్బిశెట్టి అను కోమటి షష్ఠి పూర్త్యుత్సవ మునకు పోవును. అతని మామగారు శ్రీనివాసరావు ఎటులైన అల్లుని దారికి తెచ్చు కొనుటకు ప్రయత్నించు చుండెను. అతడు ఒక తురక భటుని వేషమున వచ్చి కృష్ణరావును కొట్టి, సుందరిని ఈడ్చుకొనిపోవును. అట్లు ఈడ్చుకొనిపోయినవాడు సుబ్బిశెట్టి భటుడే అనుకొని కృష్ణరావు పోయి సుబ్బిశెట్టిని కొట్టి, అతడు తాను ఏమియు ఎఱుగను అని చెప్పినను నమ్మక హామీగా అతని కంఠాభరణమును గ్రహించును.

ఈ లోపుగా ఒక పిచ్చివాడు, రామశాస్త్రి అను పేరుగలవాడు హడావిడి చేసి, సర్కసునకు పోవుచు దారి తప్పి అల్లాడుచున్న బంగారమ్మను, సుబ్బ లక్ష్మిని చీల దీసెను. బంగారమ్మ ఒక బండి ఎక్కి పారిపోయెను. సుబ్బలక్ష్మి మఱి యొక్కదిక్కునకు పోయి సుబ్బిశెట్టి యింటి పంచలో తల దాచుకొనెను. అప్పటికి సుబ్బిశెట్టి సుందరిని సరసమునకు పిలిచి యుండెను. ముసుగు పెట్టు కొని పండుకొనియున్న సుబ్బలక్ష్మిని సుందరి అని శెట్టి భ్రమ పడెను.

సుబ్బిశెట్టిని మోసగించి పిచ్చి రామశాస్త్రి లోపల దూరెను. సుబ్బలక్ష్మి రామశాస్త్రి బారినుండి తిరుగ తప్పించుకొని, తురక వేసములో పారిపోయి కృష్ణా రావు భార్య అగు రుక్మిణి వద్ద ఆశ్రయము పొందెను. కృష్ణారావు ఆ వేసమున

ఉన్న సుబ్బలక్ష్మిని తరుముకొనిపోయి రుక్మిణిని కలిసికొనెను. అతడు ఆమెను వేశ్య యనుకొనగా, ఆమెయు తదనుకూలముగా ప్రసంగించుచు కృష్ణారావు వెంటనే భార్యను తెచ్చుకొనునట్లు అంగీకరింప జేసెను.

సుబ్బిశెట్టి కంఠాభరణమును కృష్ణారావు లాగుకొనినాడని ఫిర్యాదు చేయగా నబాబు భటులు కృష్ణారావును పట్టుకొనిరి. అతనిని కొట్టినందులకు తురక వేషముననున్న సుబ్బలక్ష్మిని, కంఠాభరణము కృష్ణారావు వద్ద స్వీకరించిన రుక్మిణిని, సుందరిని ఈడ్చుకొనిపోయి కృష్ణారావు ఇచ్చిన ఆస్తిని తిరుగ వ్రాయించుకొను ప్రయత్నము చేసినందుకు శ్రీనివాసరావును, పిచ్చివానికి బదులుగ పొరపాటున సోమావధానిని రాజభటులు బంధించిరి. విచారణ సమయమునకు బంగారమ్మ, రామశాస్త్రి వచ్చిచేరిరి. అతని ఉన్మాద మొక వైద్యుడు పోగొట్టెను.

సుబ్బలక్ష్మి భర్త అప్పటికి పదునెనిమిది ఏండ్ల క్రితము చదువు నిమిత్తమై నవద్వీపమునకు పోయెను. అచ్చట ఎవరో అతనికి చేతబడి చేయగా, మతి పోయెను. పండ్రెండేండ్లు చూచి, అతడు తిరిగి రాకపోవుటచేత, మృత తుల్యుడుగ ధర్మశాస్త్రము ప్రకారము నిశ్చయించి సోమావధాని మఱదలికి కేశఖండనము చేయించెను ఇప్పుడు రామశాస్త్రి సుబ్బలక్ష్మి భర్తయే అని గురుతు పట్టిరి. కథ సుఖాంతమైనది.

ఈ నాటకములో సన్నివేశ సంయోజనము, సునిశిత వ్యంగము, పాత్ర చిత్రణము మూడును ముప్పేటలుగా పెనవేసికొని పోయినవి. అందుచేత ఇది విశేషము రమణీయముగా నుండి ఆకర్షించును.

మొదటి అంకము చూచిన, సుబ్బలక్ష్మి, బంగారమ్మ సర్కసునకు పోనెంచుట, సోమావధాని మొండిగా వారించుట తప్ప ఇందు కథయే లేదు. కాని సోమావధాని పాత్ర పోషణరీతి వలన ఇది మనోజ్ఞమై నిలిచినది.

సోమావధాని క్రొత్త ప్రాతల నడుమ మనిసి. సాంప్రదాయికాచారాను సరణము అతని యందలి ఆడంబరము. ఛాందస విశ్వాసమునకు అతడు మారు రూపు. లౌకిక జ్ఞానము అతనికి పూజ్యము. దిక్కుమాలిన కాగితములపై కోపము

కొలది అక్షర స్వీకారమును మాని వేసినవాడు సోమావధాని. తనకు తోచదు, ఎదుటివారు చెప్పిన వినడు. పంతులుగారు సృష్టించిన జీవ చైతన్య వంతములగు పాత్రలలో ఇది ఒకటి. ఈ పాత్ర హాస్యరసాలంబన మైనది. కాని అతని మూర్ఖత నవ్వుతోపాటు జాలికూడ కలిగించును.

అతనికి పెద్ద పెద్ద మాటలను ఉపయోగించి మాటలాడుట ఒక అలవాటు. ఆ శబ్దముల స్వరూపముగాని, అర్థముగాని అతనికి తిన్నగా తెలియదు. షెరిడాన్ రచించిన Rivals నాటకములోని Malaprop చేతవలె సోమావధానిచే పంతులు గారు మాటాడించినారు. Rivals లో కన్న ఇందులో విశేషము ఏమనగా పట్టణములో అవధానికి బస ఇచ్చిన వేంకటశాస్త్రిచేత పట్టుదలగ అతని వాగ్దోషములు దిద్దించినారు. ఎట్టిరీతి ప్రేక్షకులకైన సులభముగా ఈ దోషములు, వాని వలని చమత్కృతి తెలియుటకై పంతులుగారు ఈ పని చేసినారు.

సోమావధాని చేసిన వాగ్దోషములు మచ్చునకు కొన్ని ఈ క్రింద ఈయబడినవి :

| | | |
|---|---|---|
| ఆధ్యానము | ఆహ్వానము | అనుటకు |
| పాత్రస్నానము, ప్రాయచ్ఛిత్వము | ప్రాతఃస్నానము, ప్రాయశ్చిత్తము | |
| భవిష్యద్వృత్తాంతము | పూర్వవృత్తాంతము | |
| సూచాలు | తూచాలు | |
| మీ మాంసములు | మీమాంసలు | |
| శ్రద్ధాంత పూర్వభక్ష్యములు | సిద్ధాంత పూర్వ పక్షములు | |
| | తారతమ్యము | |
| మాంగళ్య వ్యచ్ఛత్తి | మాంగళ్య విచ్ఛిత్తి | |
| శిష్టాచార విపన్నులు | శిష్టాచార సంపన్నులు | |
| వృషః కాలము | ఉషః కాలము | |
| పునస్సంతానము | పునస్సంధానము | |

వీనిలో కొన్ని ఒక మాటకు బదులుగా వేఱొక మాట వాడినవి ; కొన్ని అనవసరమగు అక్షరములు చేర్చినవి ; మఱికొన్ని ఉచ్చారణ గాంభీర్యము కొఱకు వాడినవి. కొన్నికొన్ని మనసులో ఒక ఊహ పెట్టుకొని, దానినేమో పెద్ద మాటలలో ఇముడ్చుటకై పూర్తిగా విరుద్ధార్థము వచ్చునట్లు మాట్లాడినవి. ఇటువంటివి మంచి వ్యంగ్యమునకు వీలు ఇచ్చినవి.

సుబ్బలక్ష్మి భర్త పండ్రెండేండ్లు దేశాంతరము నుండి తిరిగి రాకపోవుట చేత "విధి విరోధముగ" ఆమె తల వెండ్రుకలు తీయించినట్లు చెప్పును. అవధాని మనసులో ఉన్నమాట "విధి విధేయము" అని. అట్లే అతడు భారత భాగవత, రామాయణ కథలనుండి పాత్రములను కలగపులగము చేసి మాట్లాడెను. అంతట వేంకటశాస్త్రి "భారతము, భాగవతము, రామాయణము మూడును గట్టకట్టి, తోటఁ బొడిచి రసము తీసితిరే !" అని ఆక్షేపించగా అమాయకుడగు సోమావధాని సమాధానము— "అగ్నికార్యము చేతిలో నున్న వానికి అన్ని పురాణములు గూడ దగ్ధపటలన్యాయము."

నలుగురు కూతుండ్రకు, నలుగురు కోడండ్రకు వైధవ్యము ఏ "జంఘ మరణముల" చేతనో కలిగినచో, పరామర్శ దినములలో తల దాచుకొనుటకు ప్రచ్ఛన్నముగా కూరుచుండి ఓదార్పు మాటలు వినుటకు ఎనమండ్రకును ఎనిమిది కొట్టులు ఎవరి పేరుమీదుగా వారికి కట్టించి, ఇక తన భార్యకు "మాంగళ్య వ్యచ్ఛిత్తి" లేదని వినుట చేత, దానికి ప్రత్యామ్నాయముగా తాను ఘటశ్రాద్ధము పెట్టుకొనుటకు వీలుగా ఘటశ్రాద్ధ "భర్త కుటీరము" ఒకటి, ఎవరికైన రోగము వచ్చినప్పుడు పడవేయుటకు రోగగృహము నొక దానిని[1] కట్టించి యుంచినాడు.

1. పిఠాపురములో ఆ రోజులలో ఒక పెద్దకుటుంబము వారు అయిదుగురు అన్నదమ్ములు ఉండిరట. అందఱును ఒకే యింట వేఱువేఱు భాగములందు ఉండుటచే ఎప్పుడైన అవాంతరము వచ్చిన అందఱును ఇల్లు పాడు పెట్టుట కష్టమని ఒక రోగగృహము ఒక మూలఉంచిరట. దానిని పానుగంటివారు అతిశయోక్తులతో నాటకమునకు ఎక్కించినారు అని వినికిడి.

ఈ ఘన కార్యము లన్నియును అతడు వేంకటశాస్త్రికి చెప్పి, "ఇట్టి కర్మములోని కల్పన నా నాడు కలిగిన నూతనాప్రతిష్ఠ." అని సగర్వముగ చెప్పుకొనును !

వేంకటశాస్త్రి చే పట్టుదలగ వాగ్దోషములు దిద్దించుటలో కూడ ఒకటి రెండు చోట్ల పంతులుగారు అత్యంత చమత్కారము సాధించినారు. సుబ్బలక్ష్మి భర్త బ్రతికియున్నట్లు ధర్మశాస్త్రము అంగీకరింపదని పంద్రెండేండ్లు గడచిన తెల్లవారగనే ఆమెకు కేశఖండనము చేయించినట్లు చెప్పి, అతడు ఇట్లు అనును.

సోమా : కర్మవిషయము వచ్చినప్పుడు మా యింట నొంట దయా దాక్షిణ్యములు లేవు. ఏ కర్మ యెప్పుడు జరుగ వలయునో, యేలాగున జరుగ వలయునో సూచాలు తప్పకుండగా——

వేంక : తూచాలయ్యా ! కాని ఆమె భర్త బ్రతికియే యున్నాడేమో !

ఒక చెంపన సుబ్బలక్ష్మి విషయమున సోమావధాని ప్రవర్తనకు నొచ్చుకొనుచు కూడ వేంకటశాస్త్రి అంతకంటె అతని వాగ్దోషము దిద్దుటకు ఎక్కువ ప్రాధాన్యమును ఇచ్చును.

పంచమాంకమునందు పిచ్చివానిని పట్టుకొన వచ్చిన రాజభటులు పొరపాటున సోమావధానియే పిచ్చివాడు అనుకొని అతనిని బంధించుటకు సిద్ధపడిరి. సోమావధాని ఆచార పరుడయ్యెను.

సోమా : ఉండు. ఉండు జందెము మెడకు జుట్టుకొని "ప్రాణభరణము" చేయుదును. జాగ్రత్త !

వేంకట : ప్రాణహరణ మని సెలవీయవలయును. భటులారా ! మీరీ బ్రాహ్మణునేల పట్టుకొందురు ?

అవధాని ఛాందసకర్మిష్ఠి. తురక భటులు "దృశించిన" ప్రాణహరణము చేసికానియే తీరును. అట్టి సంకట సమయమునందు కూడ ముందు అతని మాటలు దిద్ది, ఆ తరువాతనే వేంకటశాస్త్రి భటులను వారించెను !

సుబ్బిశెట్టి షష్టిపూర్తి ఒక రసవంతమైన ఘట్టము. సుబ్బిశెట్టి షష్టిపూర్తి ఆడంబరము, అప్పటి ఆశు కవిత్వ కార్యక్రమము వినోదము కలిగించుట తోపాటు నాటి పద్ధతులను అపహసింపుచున్నవి.[1]

తృతీయాంకము నందు కూడ సుబ్బలక్ష్మి, రామశాస్త్రి—వీరి గోష్ఠి. పైకి ఇది హాస్య జనకముగా కన్పట్టినను, ఎంత నిశితమగు వ్యంగ్య వైభవముతో పంతులుగారు సమకాలిక సమాజమును అపహసించిరో పరిశీలించిన ఈ నాటక ప్రయోజనము విదిత మగును. ఇట్టి రచన అనితర సాధ్యమైనది. వారికున్న వివిధ శాస్త్రజ్ఞానమును ఇది చాటును.

ఇక ఆ నాటి మత పరిస్థితులు కొన్ని సందర్భముల యందు ఎంత దిగజారినవో తెలిసికొనుటకు ఈ క్రింది యుదాహరణ చాలును.

రామశాస్త్రి : తత్త్వేవాహం జాతునాసం అను శ్లోకములో ద్వైతముగా కనఁబడుచున్నదిగదా? త్వమేవాహం అను దానిలో నద్వైతము స్పష్టముగా సున్నదిగదా! ద్వైతాద్వైత మత సంబంధ సాంకర్య సన్నివేశమునకు హేతుభూతత్వమైన కారణమేమి?

సుబ్బలక్ష్మి : ద్వైతులు నిలువు బొట్టువారు. అద్వైతు లడ్డు బొట్టువారు. ద్వైతులలో మగవారు తఅచుగఁ జుట్ట కాల్తురు. అద్వైతులలోఁ దఱచుగాఁ బొడుము పీల్తురు. వారిలో నాడువారు కచ్చ బోసి బట్ట కట్టు కొందురు.

---

1. పంతులుగారు చిన్నప్పుడు ఒకటిరెండు పర్యాయములు అవధానము చేసినప్పటికీ, వారికి ఆశుకవిత్వము నందు అంత ఆదరము లేదు. పిఠాపురపు మహారాజా వారికి కూడ అట్లె అని అందురు. ఒకసారి కొప్పరపు కవులు పిఠాపురము వచ్చి, మహారాజావారి సమక్షమున ఆశు కవిత్వము చెప్పినారట. వారికేదో కొంత పారితోషికము ఇప్పించి, ప్రభువు సభను వీడి వెడలి పోజొచ్చిరి. పారితోషికము చాలదని కొప్పరపు కవులు అడ్డు పడిరట. అది మర్యాద కాదని అప్పటి దివాను మొక్కపాటి సుబ్బారాయుడుగారు వారిని వారింపగా ఆయనపై విఱుచుకొని పడినారట. ఈ ఉదంతమును దెచ్చి, పంతులుగారు ఇచ్చట ఈ రూపమున అతికినారు.

వీరిలో నడ్డు కట్టాచారము. వారిలో వితంతువులు రాత్రియం దడుకులే గాని తినరు. వీరిలో మినప రొట్టె మొదలైనవి తిందురు. వారు పచ్చడులు చేయు టలో సమర్థులు. వీరు కూరలలో గట్టివారు. వారి కేకాదశీ నియమము, వీరికి శివరాత్రి నియమము.

ఈ నాటక మందలి ప్రధాన పాత్రలలో ఏ కొంచెమో కొసవెఱ్ఱి లేని వారే లేరు. ఎవరి వెఱ్ఱి వారికి ఆనందము.

కృష్ణారావునకు చిన్నప్పుడే మేనమామ కూతు నిచ్చి వివాహము చేసెను. అతడు మంచివాడే, అజ్ఞుడు కాడు. కాగా గౌరవము కొఱకు వేశ్యాకృష్ణు డయ్యెను. ఉన్న ఆస్తి యంతయు ఊడినది. తుదకు మామగారు పూనుకొనుట చేత, యాదృచ్ఛికముగా భార్య రుక్మిణి కలిసి, అతని బండారము అతనికే తెలియునట్లు చేయుట చేత అతని కాపురము కుదుట పడినది.

## కోకిల చిన్నకథ

పంతులుగారు సువర్ణ లేఖలో మొదట, ఆ పిదప సువర్ణ లేఖా వార పత్రికా కథామంజరిలో ఒకటిగా " కోకిల " అను 16 పుటల కథ ప్రకటించిరి. ఈ చిన్న పుస్తకము 1913 లో అచ్చుపడిన పిదప నాలుగేండ్లకు దాని చుట్టును మఱికొంత కథ అల్లి ఈ నాటకమును పంతులుగారు వ్రాసిరి.

కోకిలలో కథానాయకుడు విశ్వనాథుడు కృష్ణారావువలెనే పరిణయ మాడిన భార్యను తిరిగి చూడక విముఖుడై, వేశ్యాప్రియుడై యుండినవాడు. కోకిల కథలో అతని మనసు మార్చినవాడు వారకాంత వేషమున తారసిల్లిన అతని బావ మరది కృష్ణారావు. సాని వేషమున అతడు తనను చేరదీసిన విటుడు బాగు పడెనని పేరు తెచ్చుకొన వలెనని వాదించి, విశ్వనాథుడు తన భార్యను తెచ్చు కొన వలెననియు, లేకున్న తన పొందు లభ్యము కాదనియు చెప్పి అతని కాపు రము నిలువ బెట్టెను. కంఠాభరణమునందు భార్య యగు రుక్మిణియే తాను సాని అని అతడు పొందిన భ్రమను వృద్ధి పొందించి పైవిధముగా వాదించును.

వేసారులలో ఐశ్వర్యవంతుడగు ఒక బందుగుని దృష్టిలో ఉంచుకొని ఆ కథను పానుగంటివారు వ్రాసినట్లు చెప్పుదురు.

ఈ నాటకమునందలి శృంగార హాస్యములు అక్కడక్కడ కొంచెము మితి మీఱినట్లు ఒప్పుకొనక తప్పదు. ముఖ్యముగ సుబ్బలక్ష్మి రామశాస్త్రి కలిసిన యెడ లంకిణి ఆంజనేయుల సంవాదము కడగాని, సుబ్బిశెట్టి సుందరికి వ్యాపార రహస్యములను బోధించు కడగాని రంగస్థలమున సద్యః ఆకర్షించునుగాని యోచించి చూచిన యెడ కొంచెము అతిగా ఉన్నదని అనిపించును. దీనిని ఒక పెద్ద లోపముగా భావింప నక్కఱలేదు.

సంభాషణలు వ్రాయుటలో సహజముగ నిపుణులైన వారు పంతులుగారు, ఇక దీనిలో ఎన్ని సొగసులు పోయిరో !

సుబ్బలక్ష్మి రామశాస్త్రి రెండు చెవులను పట్టుకొని యీడ్చినది.

రామశాస్త్రి : చెవుల బిగింపుచేత కైమని శ్రుతితారకములో పడినది. అహాహాహా ! మా భారతమునకుఁ గర్ణపర్వమే యారంభము. అయినను శల్య పర్వములోనికి పోడుచుచున్నది. అబ్బ, అబ్బ, ఈ స్త్రీపర్వమే బెడిసి కొట్టిన యెడల మాకిఁక స్వర్గారోహణ పర్వము తప్పదు.

సాంప్రదాయికముగా కొన్ని కొన్ని పాత్రల గూర్చి స్థిరపడిన ఊహలుండును. అట్టివానిని పోషించుటలో ఆ ఊహలు పరిహరింపకుండ క్రొత్తదనము చూపుట గొప్ప. సుబ్బిశెట్టి, నవాబు పాత్రములు అట్టివి.

కోమటి యుక్తికి, పిసినారితనమునకు ఎట్లు పేరో, నవాబు పరిపాలన విషయమున గ్రుడ్డితనమునకు అట్లు. సుబ్బిశెట్టిని ప్రత్యక్షము చేయు ఘట్టములు ఈ నాటకమునందు అనేకము ఉన్నవి. కృష్ణరావు తాను వక్తగాని హేతువుచేత సుబ్బిశెట్టిని గూర్చి ప్రశంసచేయుచు కాగితములు ఒత్తించి సభలో పంచిపెట్టెను. అతడు అది చదువుట పూర్తికాగానే శెట్టి గుమాస్తా వెంకటప్పయ్యను పిలిచి చెప్పెను :

" అందఱి చేతులలో నుండు కాగితములను దీసి గల్లాపెట్టె ప్రక్కనున్న బుట్టలో జాగ్రత్త పఱుప్రుము. ధనియాలని ఇంగువయని, పొట్లములకు వారికే యుపయోగించును. మనకు గావలయునా యేమి? "

నవాబు విచారణ అంతయు ముగించెను. సోమావధాని బంగారమ్మను పరిగ్రహించునట్లును, కృష్ణరావు రుక్మిణిని స్వీకరించునట్లును సెట్టికి కంఠాభరణము లభించునట్లును నిర్ణయములు చేసెను.

నవాబు: రంగాచారీ? ఇంత మొకద్దమాకు మొదటి సబబ్ క్యా?

రంగా: ఏమున్నది? బంగారమ్మ, సుబ్బలక్ష్మి యీ గ్రామమునం దప్పిపోవుట మొదటి కారణమని తోచుచున్నది.

నవాబు: థూ, థూ! అది కాదు బే ధానికి సబబ్. మొకద్దమాకి పహిలే సబబ్ కనిపెట్టవలసినది అఖల్ మన్ది.

రంగా: వారిద్దఱు తప్పిపోవుటకు సబబేమున్నది? సర్కసుచూచుట కిల్లు తప్పిపోయినారు.

నవాబు: బస్, బస్, ఇకనేమి? పహిలే సబబ్ సర్కస్. జవాన్, సర్కసువాలీకి పకడ్‌కర్ కచ్చేరికి లావ్. ఉస్కూ బేషక్ మారుంగా.

సుఖాంత మగుచున్న దీనిలో సర్కసువారికి దెబ్బలు తగిలించుట ఏల అని కడపటి ఆట కానిచ్చుకొని నాలుగు దినముల క్రిందటనే వారు ఊరు విడిచి పోయినట్లు చేసిరి.

ఇదే విధముగా సోమావధాని పాత్రను స్పష్టము చేయుటకుకూడ ఒక్క వాక్యము చాలియున్నది. సర్కసునకు పోవలెనని బంగారమ్మ పట్టుపట్టినది.

బంగారమ్మ: మీ మఱదలు సుబ్బలక్ష్మి చూడ వలయు నని యను చున్నది. తల చెడినది మొదలు గుమ్మము దాటి యెఱుఁగదు. వేడుక పడు చున్నది.

సోమావధాని :  తల యింకను జెడకుండ నున్నదానవు నీవు మాత్రము గుమ్మము దాటి యెఱుఁగుదువా ?

ఎంత సరసుడో ! ఎంత మాటలాడ నేర్చినవాడో !

పంతులుగారు గ్రాంథిక భాషా వాదులు. నీచ పాత్రల చేత కూడ వారు ఎచ్చటను వ్యావహారిక ప్రయోగము చేయించలేదు. కాని ఈ నాటకములో మాత్రము వ్యావహారిక సౌలభ్యము వారు పాటించిరి. "నీకూ నాకే కాదమ్మా" "చుట్టుకోవలసినది" మొదలగు ప్రయోగములు ఉండుట విశేషము.

ఈ నాటక కథ అంతయు నాలుగు రోజులలో జరిగిన వృత్తాంతము. ఇందు హాస్యరస పోషణమున పానుగంటివారు చూపిన నేర్పు అనితర సాధ్య మనియే అనవచ్చును.

మొట్టమొదట ఇది అప్పటి యువరాజా వారగు రాజా గంగాధర రామా రావుగారి ఎనిమిదవ జన్మదినోత్సవ సందర్భముగా 1-11-1917 న ప్రదర్శింప బడినది.

# ము ద్రి క

ముద్రిక పంతులుగారి పదునాల్గవ నాటకము. దీనిలో ఆరు అంకములు ఉన్నవి. ఇన్నరు పైటిలు తప్ప తక్కిన గ్రంథము రాజమండ్రి శ్రీ విద్యా నిలయ ముద్రాక్షర శాలలో 1923 లోను, ఇన్నరు పైటిల్ పిఠాపురము శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలలోను ముద్రింప బడినది.

దీని పీఠిక చాల చిన్నదిగా ఉన్నది. దీనిలో రచనా కాలముగాని, నాందీ ప్రస్తావనలు లేకపోవుటకు గల కారణముగాని పేర్కొనిలేవు. తరువాతి ముద్రణములో దీని పీఠికను ప్రకటనకర్తలు తొలగించుట చేత, ఇది ఎన్నవ నాటకమో నిర్ధారణ చేయుటకు అవకాశము లేక డా. పి. యస్. ఆర్. అప్పారావుగారు "ముద్రిక నాటకమునకు నాందీ ప్రస్తావనలు లేవు, ఇది చివటి రచనమై యుండు నేమో ?" అని తమ వ్యాసమున అనుమానించిరి.

దీని తరువాతి నాటకము అగు పూర్ణిమ రచనా కాలము 1919 అనిపించును. కావున ఇది కంఠాభరణ రచనా కాలమగు మే, 1917 నకు 1919 కిని నడుమ వ్రాసినది కావలయును. అయినను ఇది తరువాతి నాటకములగు పూర్ణిమ సరస్వతి నాటకములకు తరువాత 1923 లో ముద్రణ పొందినది.

సుమారుగా ఆ ప్రాంతముననుకూచి నరసింహముగారు—అప్పటికి మూడేండ్లు ముందు ఉద్యోగ విరమణ చేసిరి — నేత్ర వ్యాధి ఏర్పడుట చేత పిఠాపురము వదలి పెట్టి, కొన్ని మాసములు సమీపమున సముద్ర తీరస్థమగు ఒక గ్రామమున బస చేసి, పూర్తిగా విశ్రాంతి తీసికొన వలసి వచ్చినదని తెలియుచున్నది. ఆ కారణము చేతనే కావచ్చును, దీనిలో నాంది ప్రస్తావనలు లేకుండ ముద్రించుట జరిగినది.

## క్రొత్త రాణి

పానుగంటివారు ఇంతకు పూర్వము సువర్ణ లేఖలో ఒక కథ వ్రాసిరి. క్రొత్తరాణి అను ఆ కథ చిన్న పుస్తకముగా ప్రకటింపబడినది; కథాలహరియందు 12 వ కథగా చేర్చబడి యున్నది. ఇది యథాతథముగా ముద్రిక నాటక రూపమును తాల్చినది.

నాటకమున కనకపురపు రాజు సేతు మాధవుడు స్త్రీ వ్యామోహ పరాయణుడై, అసభ్యముగా ప్రవర్తించుచుండెను. అతని ప్రవర్తన సహింపలేని రాణి ఇందుమతి భర్త ప్రవర్తన మార్చుటకై సుందరి అను దాసి సహాయము అపేక్షించెను.

మాధవుడు తీర్థమునకుపోయి ఒక క్రొత్త కన్నెను బలవంతముగా తెచ్చెను. ఆమెను రాణిగా చేసికొననున్నట్లు ఇందుమతికి తెలిసెను. సుందరి రాజును, అతని ఇష్టసఖుని కలిసి తాను క్రొత్తరాణి పరిచారిక యైనట్లు నమ్మించెను. విముఖురాలగు తన రాణిని ఒప్పింతునని చెప్పి, ఒక రాత్రి తోటలో సంకేతము ఏర్పఱచి, ఇందుమతిని చీకటిలో తీసికొనిపోయి క్రొత్తరాణి యనట్లు మోసగించి రాజునకు పరిచయము చేసెను. ఆమె రాజు హృదయమును ఎఱిగి, అతనికడ ఆనవాలుగా రాజ ముద్రికను గ్రహించెను.

ఇక క్రొత్త కన్యయగు మానవతిని చూచుటకై పురుష వేషమున రాణిని సుందరి తీసికొని పోయెను. సార్థక నామధేయురాలగు ఆమె మనస్సు తెలిసికొని రాణి, తాను రాజు నన్నట్లుగా కొంత తడవు మాటలాడి, పశ్చాత్తాపము ప్రకటించి, తన అంతః పురమునకు గొనిపోయెను.

ఆ వెనుక సుందరి రాజ ముద్రికను ఉపయోగించి, వంచనము నడిపి, సంకేతము ఏర్పఱచి, రాజును రప్పించి ఒక చీకటి కొట్టులో బంధించెను. కొన్ని గంటల బంధనము తరువాత, ఇందుమతి అతని విడిపించి చీవాట్లు వేసెను. రాజునకు తల తిరిగి బుద్ధిమంతుడై ఆమె చెప్పినట్లెల్ల నడతునని వాగ్దానము చేసెను.

తుట్టతుదకు మానవతి ఎవ్వరో కాదని, ఇందుమతి చెలియలే అని స్పష్టమాయెను. ఆమెను తన భర్తకు ఇచ్చి వివాహము చేసి, ఇందుమతి సన్న్యసించెను.

క్రొత్తరాణి కథ తంజావూరు దేశపురాజు కథగా చెప్పబడినది. రాజునకు పేరుపెట్టలేదు. అక్కడ రాణికి క్రొత్తగా తన భర్త తెచ్చిన కాంతపై కోపము వచ్చినది. భర్త చంపినట్లుగా లోకమునకు అగపడునట్లు చేసి, దానిని చంపవలెనని యోచించి, రాజ వస్త్రములను దాల్చి, క్రొత్త రాణికి వర్తమానము చేసెను. కాని ఆమె మాటల వలన ఆమెకు ఇష్టము లేకుండ బలాత్కారముగా తేబడినట్లు తెలిసికొని వధించు తలపు మానెను.

చివఱకు ఆమె తన చెల్లెలని తెలియగానే, తనకు సంతానము లేనందున ఆమెను తన భర్తకు ఇచ్చి, వివాహము చేసెను. ఒక సంవత్సరమునకు రాజునకు క్రొత్త రాణియందు పుత్రుడు కలిగెను.

ముద్రిక నాటకములో ప్రాత రాణి సన్న్యసించినట్లు మార్చి, రాజు పాత్రమున అతని హీన సంస్కారము అచ్చుపడునట్లు స్పష్టీకరించిరి.

ఈ నాటకము నామము కూడ కంఠాభరణము నామము వంటిదే. ముద్రిక సాహాయ్యమున సుందరి రాజును లొంగదీసినది కనుక ఈ పేరుపెట్టిరి. పంతులుగారి తక్కిన నాటకములలో వలె దీనిలోను పాత్ర స్వభావోన్మీలనమునకు ప్రాధాన్యము గలదు.

రాజునకు గల స్త్రీ వ్యామోహము అను అవగుణమును విశదముగా చేయుటకు ఇందు ప్రయత్నము జరిగినది. ఈ రాజు తెలివి తక్కువ వాడుగా గారాబముగా పెరిగివాడుగా కనుపట్టును. కొంత వఱకు మృచ్ఛకటికములోని శకారుని వంటి ప్రకృతి గలవాడు.

ఇందుమతి, మానవతి పాత్రములు ఉదాత్తములైనవి. ఇందుమతి ధారాళమగు అంతః కరణము గలది. మంచితనము అసమర్థతగా పరిణమించిన స్థాయి వఱకు గలది.

పంతులుగారికి కోటలలోని వ్యవహారములు, దాస దాసీ జనము పద్ధతులు క్షుణ్ణముగా తెలియును. వారు సృష్టించిన దాసీ పాత్రములకు ఆ కారణముచేతనే విశిష్టత వచ్చినది. అట్టి విశిష్ట పాత్రలలో సుందరి ఒకతె. రాణి యందలి గౌరవాభిమానములతోపాటు ఆమెకు సానుభూతియు అధికము.

ఈ నాటకములో కథాగమనము కంటె సంభాషణ వైచిత్రియే ఎక్కువ. రాజు తుదిని హఠాత్తుగా మంచివాడై పోవుట, ఇందుమతి తన చెల్లెలు మానవతి యుక్త వయస్కురాలగు వఱకు పుట్టి పెఱుగుచున్నదని వినుటయేకాని ఒక్కసారియు చూచి ఉండకపోవుట అను అంశములు సులభముగా నమ్మదగినవి కావు. నాటకములో రాజు పాత్రను మొదటి నుండియు అధమ ప్రకృతిగల వానిగా చిత్రించి తుదిని ఒక్కసారిగా మార్చివేయుట జరిగినది.

ఈ నాటకమున ఒక్క విష్కంభము కూడ లేదు. కథా సంవిధానము అల్పముగను, కథాగమనము అలసముగను ఉన్న ఈ నాటకము నందలి అంకములలో అత్యధిక భాగము విష్కంభ ప్రాయమైన రచనగానే తోచును. అనగా ఒక విష్కంభములో చెప్పించుటకు తగిన అంశమును ఒక అంకముగా ప్రధాన పాత్రల సంభాషణమునందే చెప్పించిరి. ఇది ఒక నవీన శిల్పము అని భావింపనగును.

ఇది వచన నాటకము. బొత్తుగా పద్యములు లేకపోవునేమో అని భయపడినట్లుగా సేతు మాధవునకు ఇందు తృతీయాంకమున మూడు చోట్ల గీతములు వ్రాసినారు.

# పూర్ణిమ

పానుగంటివారి పదునేనవ నాటకము ఇది. "వీర్యవంతులు పురుషులు వినిన నోడలు జల్లుమను నట్టి బీభత్స చండ కృత్యములను, శోకావహావృ గృత్యములను నిండు" నాటకము. కష్ట శిష్ట ప్రపంచ నాటకపు ప్రతిబింబము పూర్ణిమ.

తమరచించిన రూపకములలో ఇది పదునేనవది అగుటచేత దీనికి పూర్ణిమ అను పేరు పెట్టి పంతులుగారు దీనిలోని మరణములు అన్నియును పూర్ణిమనాడు జరిగినట్లు వ్రాసిరి.

వీరి నాటకములలో దుఃఖాంతములలో ఇది మొదటిది. తక్కినవి సరోజిని (23), రాతి స్తంభము (25), కాత్యాయని (24) పరప్రేమ అనునవి.

పూర్ణిమ వ్రాయునప్పటికి పంతులుగారి వయస్సు 54 అని ప్రస్తావనలో చెప్పబడినది. అనగా ఇది 1919 లో వ్రాయబడినది. కాని మొదటి ముద్రణము 1922 లో డి. వి. రమణారావు గారిచే రాజమహేంద్రవరము శ్రీ విద్యానిలయ ముద్రాక్షరశాలలో కావింపబడినది. దీని పీఠికలో కవి "రాజస్థాన కథావళి" లోని ఒక కథ తీసికొని రచించితి నని చెప్పిరి.

పూర్ణిమ ఏడంకముల నాటకము. ఇందలి కథ స్థూలముగా ఇది:

భట్టి రాజ్యపు రాజు విజయరావు, వరాహపుర రాజు సోమనాథదేవుడు, వీరిరువురకు నడుమ చిరకాల క్రోధము ఉండెను. సోమనాథుడు తన కొమార్తె యగు సర్వమంగళను భట్టి యువరాజు దేవరాజునకు ఇత్తునని నమ్మించి, వారిని పిలిపించి, పెండ్లి పందిరి క్రింద వారితో వచ్చిన ఎనిమిది వందల మందిని వధించెను. ఆ దారుణ కృత్యములలో విజయరావు కూడ బలియయ్యెను. చని

పోవుటకు ముందు విజయరావు కుమారుని ఆ రాజ్యపు భటుని దుస్తులతో తప్పించుకొని పోవలసినదని, సోమనాథుని రక్తముతో తనకు తర్పణము ఇమ్మనియు కోరెను.

దేవరాజు తప్పించుకొని పోవుచు, ఆ పట్టణ మందలి ఒక గృహిణిని శరణు చొచ్చెను. ఆమె సోమనాథదేవుని పురోహితుడగు చంద్రశేఖరస్వామి భార్య. అనపత్య యగు నామె దేవరాజు ఎవరో తెలిసికొని గూడ పుత్రవాత్సల్యముతో రక్షించుటకు బాస చేసెను. చంద్రశేఖరస్వామి ఇంటికి వచ్చి సమస్తము తెలిసికొని, మల్లగుల్లములు పడసాగెను. ఇటు అతిథి, అటు రాజు, ఒక నిర్ణయమునకు అతడు రాకమునుపే సేనాపతి అగు శ్రీకంఠదాసుడు తప్పించుకొని పోయిన దేవరాజుకొఱకై ఇల్లిల్లు వెదకుచు సందేహనివృత్తి చేసికొనుటకు పురోహితుని ఇంటికి వచ్చెను. స్వామి, కాత్యాయని దేవరాజు తమ బంధువు ఐనట్లు నమ్మించిరి. పిదప దేవరాజు ఇల్లు విడిచిపోయెను.

రాజాజ్ఞపై శ్రీకంఠదాసుడు భట్టి రాజ్యమునకు పోయి వశము చేసికొనెను. దేవరాజు తల్లి శారద పురుషవేషముతో తప్పించుకొని ఒక మహారణ్యము చేరుకొనెను. అది దొంగల రాజ్యము. వారి నాయకుడు పులినోట పడుటచేత దొంగలు ముందు కనబడిన బాటసారిని నాయకునిగా చేసికొన నిశ్చయించిరి. వారికి పురుష వేషమున నున్న శారద కనబడెను. మఱికొంత సేపటికి దేవరాజు వచ్చి వారికి చిక్కెను. వారు అతనిని కాళికకు బలి యిచ్చుటకు ప్రయత్నించు నంతలో శారద స్వయముగా వచ్చి కుమారుని గురుతించెను. జరిగినదంతయు తెలిసికొని, కుమారుని వారికి రాజుగాచేసి, తాను సహగమనము చేసెను.

అచ్చట వరాహపురమున కాత్యాయని సోమనాథుని కొమార్తెయగు సర్వమంగళను కలిసి ఆమె మనస్సులో దేవరాజుపై ప్రేమ చిగురింప జేసెను. ఇంతలో శ్రీకంఠదాసుడు భట్టి రాజ్యమునుండి తిరిగివచ్చి, రాజును కలిసి, పురోహితుని ఇంట జరిగిన కథ వివరించెను. క్రూరుడగు సోమనాథుడు శ్రీకంఠదాసుని దూషించి కారాబద్ధుని చేసెను. పురోహితుని, భార్యను బాధించి చంపుటకై గొంతువఱకు గోతిలో పూడ్పించెను. కాని దేవరాజుచే పంపబడిన దొంగలు సమయమునకువచ్చి వారిని రక్షించి దేవరాజు కడకు చేర్చిరి.

కాత్యాయని సర్వమంగళకు ఒక లేఖ వ్రాయుచు, ఆమె దేవరాజునే వివాహము ఆడదగుననీ, తండ్రివలన త్వరలో గండము కలుగునని భవిష్యత్తు వినుటచే ఆరాటపడుచున్న తాను ఆమె సిద్ధమయిన వచ్చి తీసికొని పోవుదునని కబురుచేసెను. సర్వమంగళ అందులకు అంగీకరించెను.

దేవరాజు తాను ప్రచ్ఛన్నముగా నుండి, సోమనాథదేవునకు ఒక రాయబారము పంపెను. తమది చిన్న రాజ్యము అగుటచేత, బలవంతుడగు అతనికి తాము సామంతులు అగుటకు అంగీకరింప వలసినది అని దాని సారాంశము. అతడు ఉప్పొంగిపోయెను. ఆ రాయబారము తెచ్చిన వారితో కాత్యాయని రహస్యముగా వచ్చి సర్వమంగళను వెంట కొని పోయెను.

చివఱి అంకములోని కథ తరువాత పదునైదు మాసములకు జరిగినది. సర్వమంగళకు కవల మగశిశువులు జన్మించిరి. తాము రాజ్యము పాలించుకొన లేకుండుటచే తమ కేమయిన భృతి ఒసగి రాజ్యము వశము చేసికొన వలసినదని ప్రచ్ఛన్నముగా నున్న దేవరాజు మఱల సోమనాథునకు రాయబారము పంపెను. అతడు ససైన్యముగా వచ్చి, దేవరాజు మాయ వాగుఱలో చిక్కెను. సైన్యము నశించెను.

సోమనాథుడు ఒంటరిగా సర్వమంగళ పరిచారికయగు పద్మినిని కలిసికొని, దానివలన రహస్యములన్నియు తెలిసికొనెను. కోపముతో దానిని చంపెను. దేవరాజు సోమనాథుని చంపబోవగా, అతడు ఒకచో జపము చేసికొనుచున్న చంద్రశేఖరస్వామిని శరణు జొచ్చెను. స్వామి ఆ అపాత్రునకు అభయమిచ్చి తుదకు అతనిచే హత్య కావింపబడెను.

సోమనాథుని తిరుగ పట్టుకొని, చంపబోవు వేళకు సర్వమంగళ అడ్డము వచ్చి, తండ్రిని రక్షింపుమని కోరెను. దేవరాజు అంగీకరింపకపోగా ఆమె కొడుకైనను, కూతురైనను అతనికి తానే గనుక కత్తిపట్టుకొని దేవరాజును ప్రతిఘటింప సిద్ధపడెను. దేవరాజు ఆమె సాహసమునకు మెచ్చుకొని సోమనాథదేవుని విడచుటకు తలచునంత అతనికి మరణించిన తండ్రి రూపము కనులముందు ప్రత్యక్షముకాగా శివమెత్తిన వానివలె అతనిని చంపుటకు పరుగెత్తెను. ఇంతలో

కాత్యాయని వచ్చి, తనభర్తను హత్య కావించిన ద్రోహిని చంపుటకు అడ్డు పడుచున్న కాత్యాయనిని దూషించెను. ఇరువురును పెనగులాడుచుపోయి ఒక నేలబారు కూపములో పడి చనిపోయిరి.

దేవరాజు మామను వధించి, తండ్రికి రక్తతర్పణము ఇచ్చి, భార్య మరణించిన వార్తవిని, తన శిశువులకు సంరక్షణము ఏర్పాటుచేసి ఆత్మహత్య కావించుకొనెను.

## రాజాస్థాన కథ

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రాజాస్థాన కథావళిని అనువదించినారు. దానిలో రెండవ భాగమున 140_144 పుటలలో దేవరాజుకథ ఉన్నది. అందలి కథాంశములకును నాటక కథకును చాల భేదము ఉన్నది.

జసల్మీర్ సంస్థాన పాలకులు భట్టి కులమువారు. ఆ వంశములో రావు టన్నోకుమారుడు బిజీరావు. ఇతడు ప్రాత పగలకై వరాహులను కయ్యములలో తరిమి కొట్టెను. వరాహులు అతని ధాటికి ఆగలేక సంధికై ప్రార్థించిరి. తమ వంశపు ఆడు పడుచును బిజీరావు కుమారుడగు దేవరాజునకు ఇచ్చి శాశ్వతమైత్రి కుదుర్చుకొందుమని వర్తమానము పంపిరి. నిష్కల్మషమైన మనస్సుతో అతడు వివాహమునకు పోగా విందు సమయమున వరాహులు అతనితో వచ్చిన ఎనిమిది వందల మందిని, అతనిని వధించిరి. పిదప భట్టి వంశమువారి కోటకు పోయి అచ్చట ఆ బాలవృద్ధము వధించిరి.

ఈ సందడిలో దేవరాజు తప్పించుకొని, వరాహప్రభువునకు గురుడు, అప్పుడు అయిన ఒక యోగి మఠమున దాగెను. ఆయన అతనిపై జాలి తలచి, మెడలో జందెమువైచి, తన పంక్తిని భోజనముపెట్టి వరాహభటుల కనుగ్రామి, రక్షించెను. కొన్నాళ్లు యోగి మఠమున దేవరాజు ప్రచ్ఛన్నుడైయుండి, ఒకనాడు యాదృచ్ఛికముగా తన కంటబడిన సువర్ణముచేయు దివ్యౌషధమును యోగిసొత్తును అపహరించి కొనిపోయెను. ఆ పోవుట అతడు మేనమామ ఇంటికి పోయెను.

అప్పుట అతడు అదృష్టవశమున బ్రతికి బయట పడివచ్చిన తల్లిని కలిసి కొనెను. మేనమామ అతనికి ఆశ్రయము ఇచ్చుటకు మొదట జంకినను, అతని ప్రార్థన మన్నించి అతనికి కొంత ఎడారి స్థలమును ఇచ్చెను. దేవరాజు ఆ చోట తనకు లభించిన సువర్ణ కరిణిచే బంగారము చేసి బలమగు కోటను ఒక దానిని నిర్మించెను.

దేవరాజు మేనమామ అతనిని బలపడనీయరాదని భావించి కోట నిర్మాలము చేయుటకు ఎత్తిరాగా, కపటోపాయముచేత వారిని వంచించి, దేవరాజు అతని వీరులను నూటయిరువది మందిని చంపెను.

తరువాత కొన్నాళ్లకు పూర్వపుయోగి అతని కడకువచ్చి, అతడు తనపట్ల చేసిన ద్రోహమును మన్నించి శిష్యునిగా చేసికొనెను.

ఈ దేవరాజు తొమ్మిదవ శతాబ్దము వాడు.

పానుగంటివారు ఎట్టి ముడి కథను స్వీకరించి, రమ్యమగు నాటకీయ సంఘర్షణము గల కథను సృజించినారో తెలియుచున్నది కదా ! చంద్రశేఖర స్వామి భార్య, దొంగల రాజ్యము, సర్వమంగళ వివాహము—ఇన్ని కల్పించి విషాదాంత నాటకమునకు వలయు సంఘర్షణలను అనేకముగా కూర్చి కథకు ఆద్యంతములు ఏర్పఱచిరి.

ఈ కథ విషాదాంతము అగుటకు మానవుని చర్యలకన్న విధి విలాసము హెచ్చు కారణము అనిపించును. ఈ భావమునే చతుర్థాంకము చివఱ పంతులు గారు చంద్రశేఖరస్వామిచేత అనిపించినారు.

" ఇతని నతఁడీడ్చు, వేఱొకఁ డతని నీడ్చు,
నంద అందఱు నీడ్పు కయ్యంబె జగతి ;
యందఱు స్వతంత్ర రాజు లూహములయందు,
బానిసలకంటె బానిసల్ పనులయందు. "

తొలి భాగమునందలి యాదృచ్ఛిక సంఘటనలే ఇందలి చివఱి సగమును నడపినవి. కాని అంతయును విధి విలాసమే అని నెట్టి వేయుటకు వీలులేదు. దేవరాజు పారిపోవుచు చంద్ర శేఖరస్వామి యింటనే ప్రవేశించి, కాత్యాయని మఱుగు చొచ్చుట యాదృచ్ఛికము గావచ్చును. కాని ఆ సందర్భమున వారి వారి ప్రవర్తనములకుగూడ పూర్తిగా వారి బాధ్యత లేదనరాదుగదా! అయినను బుద్ధిః కర్మానుసారిణి యనవచ్చును. కాని అది పరమార్థపు మాట.

## విషాదాంత పాత్రలు

పాత్రలలో ఎక్కువ భాగము విషాదాంత నాటకానురూప గాంభీర్యము (Tragical Magnitude) తో నిండి యున్నవి. దేవరాజు పరాక్రమశాలి, శక్తి యుక్తుడు కాని పసి మనస్సు వానికి పోలేదు. పితృ విశ్లేష దుఃఖమునకు వెఱచి తండ్రి సన్నిధిలో మరణింతునని పల్కెను. తల్లియగు శారదకు సహగమన మునకై అనుమతి నిడజాలక ఆత్మ హత్యకు కడగెను. అట్టివానిపై అతనితండ్రి మహాభారమును మోపెను. ఇందుచే దేవరాజు పాత్ర సానుభూతి పాత్రమగును.

చంద్రశేఖరస్వామి సోమనాథదేవుని పురోహితుడు. అతిథిగా వచ్చిన దేవరాజును ఏమి చేయవలయునో అని అతడు మథనపడిన ఘట్టమున అతని ఔన్నత్యము గుర్తింప వచ్చును. ఇతడు లోకజ్ఞుడు, విజ్ఞుడు. తనను గోతిలో ప్రాతిపెట్టించిన సోమనాథ దేవునకు అభయమునిచ్చి కాపాడిన మహావ్యక్తి. అట్టి వాడు కృతఘ్నుడైన ఆ రాజుచే నీచముగా హత్య కావింపబడినాడు.

సర్వమంగళ ధర్మమునకు కట్టువడి కొంత, కాత్యాయని ప్రోత్సాహము చేత కొంత దేవరాజును వివాహమాడెను. కాని భర్త తండ్రిని చంపబోవు నప్పుడు వలదని ప్రాధేయపడి, అతడు విననప్పుడు "నన్ను భార్యగా నెంచకు. ఇక నీవు నన్ను బావగా భావింపుము." అనిన ధీరవనిత. మృతుడైన తండ్రి పట్ల పుత్ర ధర్మమును నెఱవేర్చుకొనుట ఆవశ్యకముగా ఎట్లు దేవరాజు భావించెనో, అట్లె తనకును పితృదేవునిపట్ల ధర్మమును పాలించుకొనవలసిన అవసరము ఉన్నట్లు చాటి ఆమె క్రొత్త సంఘర్షణము ప్రవేశపెట్టినది.

ఇట్లు ఒక టొకటిగా చెప్పుటకంటె విషాదాంత నాటక ప్రయోజన సిద్ధికి అనుగుణమైన పాత్ర చిత్రణము ఇందు కలదని చెప్పుట ఒప్పును. ఎంత ఉన్నతులు, ఎంత ఉదాత్తులు, ఎంత సంస్కారయుక్తులు నిష్కారణము మట్టిపాలై పోయిరో అనిపించును.

పంతులుగారి నాటకములలో మనస్తత్వ నిరూపణమునకు ప్రాధాన్యము మెండుకదా! కొన్ని నాటకములందు దీనిపై శ్రద్ధ ఎక్కువ యగుటచేత నాటక ప్రదర్శన సౌలభ్యము, రక్తి భంగము పొందుటకూడ జరిగినది. అట్టి లోపము ఇందు లేదు. విషాదాంత నాటకములకు అత్యావశ్యక శోభాహేతువగు భావ సంఘర్షణ (Inner Sruggle) ఇందు బహు నిపుణముగా ఆద్యంతము పాత్రల యందు పంతులుగారు చిత్రించినారు.

ఆధి భౌతిక వాతావరణము (Supernatural element) కూడ పంతులు గారు ఇందు చొనిపి యున్నారు. తల్లి సహగమనమును భరింపలేక దేవరాజు ఆత్మహత్య చేసికొన బూనునప్పుడు, సర్వమంగళ తండ్రిని సంరక్షించు కొనుటకై ప్రతిఘటింపగా, దేవరాజు నిర్ణయము శిథిలము అయినప్పుడు మృతుడైన ఆతని తండ్రి రూపము ఆతనికి ప్రత్యక్షమైనట్లు చూపిరి. కాని ప్రదర్శన సమయమున మృత రూపము అవసరముకాదు. సత్యమైనను, భ్రమయైనను అది దేవరాజున కొక్కనికే కనిపించును.

విషాదాంతము అనుటతో ఈ నాటకమును సరిపెట్టుట కుదురదు. దాదాపుగా ప్రధాన పాత్రములన్నియు ఇందు మరణించినవి. ఒక్క సప్తమాంకముననే ఇందు సోమనాథుడు, అతని సేనాపతి, పద్మిని, సర్వమంగళ, కాత్యాయని, చంద్రశేఖరస్వామి, దేవరాజు మరణించిరి. ప్రస్తావనలో సూత్రధారుడు చెప్పినట్లు ఇది బీభత్స, చండకృత్యములతో నిండినది.

# సరస్వతి

పది అంకములు నిండుగా పంతులుగారు వ్రాసిన నాటకములు మూడే ఉన్నవి. వానిలో సరస్వతి రెండవది. ఇది పంతులుగారు వ్రాసిన నాటకములలో పదునాఱవది.

పానుగంటిలక్ష్మీనరసింహారావుగారు ఈ సరస్వతి నాటకమును అప్పటి పీఠికాపురపు యువరాజు గంగాధర రామారావుగారు పదేండ్ల పసితనమున కోరిన కోరికపై వ్రాసిరి. యువరాజుగారి జన్మదిన వార్షికోత్సవమున (తేదీల ప్రకారమైనచో నవంబరు 21 న) మొదటిసారిగా ప్రదర్శించుటకు దీనిని వ్రాసినట్లు ప్రస్తావననుబట్టి తెలియుచున్నది.

దీనికి పూర్వము వ్రాసిన ముద్రిక, పూర్ణిమ నాటకములకన్న ముందుగా ఇది 1920 లో మద్రాసు ఆనంద ముద్రణాలయమున మొదటిసారి ముద్రింపబడినది.

పంతులుగారి కథాలహరి చదివించుకొని విని ఆనందించుచు పసితనముననున్న యువరాజుగారి కోరికపై వ్రాసిన ఈ నాటకము నందలి కథ విచిత్రము మాత్రమేకాక విస్తారము కూడ ఐనది. కథాలహరిలో "సౌఖ్యకర సమావేశము" అను కథ చదువుచున్నప్పుడే గంగాధర రామారావుగారు వారిని నాటకము రచింపవలసినదిగా కోరియుందురు. ఆ కథయే ఈ నాటకముగా రూపొందినది.

మొదట ఆ కథను సంగ్రహించి చెప్పినచో నాటకముగా రూపొందుటలో వచ్చిన మార్పులు సులభముగా తెలియును.

## సౌఖ్యకర సమావేశము

సుందరేశ్వర పురపు రాజు శ్రీమంతరావు. అతని రెండవ పెండ్లి భార్య అతనిని తృణప్రాయముగా చూచుచుండెను. శ్రీమంతుని మొదటి భార్య ఒక పురుష శిశువును, స్త్రీ శిశువును కవలను గని సూతికచే మరణించెను. శ్రీమంతుని జ్ఞాతియగు పరమేశ్వరరావు మగ శిశువును అపహరింపజేసి, చంపుటకు ఆనతి ఇచ్చెను. చంపుటకు తీసికొనిన దాసికి చేతులురాక, చంపితినని బొంకి ఒక క్షత్రియ కాంతకు ఆ శిశువును కృష్ణుడు అనుపేర పెంచుకొన నిచ్చెను. స్త్రీ శిశువు పెరిగి పెద్దదియయ్యెను. ఆ పిల్లను సవతి తల్లి తన తమ్మునికి కట్టబెట్ట జూచెను.

ఆమె కృతపరిచయుడైన ఒక అందుగుని వలచి అతనితో కలిసి పారి పోవుచుండగా సవతితల్లి తమ్ముడు మధుసూదనరావు భటులతో వెంబడించి, ఆ క్షత్రియ యువకుని తలబ్రద్దలు కొట్టించి, రాజ పుత్రికను బంధించెను. కృష్ణుడు ఆ దారిన పోవుచుండగా ఆమె తన వృత్తాంతము కాగితముపై లిఖించి అతనికి విసరివేచెను. అతడు తన దుసులు ఆమెకు కటుకొననిచ్చి తప్పించి తన యింటికి పంపెను. మధుసూదనరావును తాను ఆడు వేషములో కలిసికొని చంపివేసెను.

రాజపుత్రిక పురుష వేషమున, కృష్ణునిపెంచిన కాంతయింటికి పోవగా, అచ్చట పరమేశ్వరరావు భటులు కృష్ణుని వెదకు కొనుచువచ్చి, ఆమెను కృష్ణుడే అని భ్రమించి, బంధించి కొనిపోయి ప్రధానునకు ఒప్పగించిరి. తాను ఆడుదానను అని ప్రధానుని భార్యతో చెప్పి, ఆమె విడుదల పొంది వైద్య వేషమున తండ్రికి హఠాత్తుగా కలిగిన ఉన్మాదము మాన్పుటకు వచ్చెను.

కృష్ణుడు ఇంటికి తిరిగివచ్చి, తాను పంపిన కాంతను ఎవరో అపహరించిన మాట తెలిసికొని స్త్రీవేషమున పోయి పరమేశ్వరరావును వధించెను. అడవిలో తలపగులగొట్టబడిన శ్రీమంతుని కొమార్తె ప్రియుడు పరమేశ్వరరావు సేనాపతిచే రక్షింపబడి, ఉపసేనాపతియై యుండెను. పరమేశ్వరరావును చంపిన కృష్ణుడు స్త్రీవేషములో ఉండగా అతడు చూచి తన ప్రేయసి అనుకొనెను. అందఱును శ్రీమంతుని సన్నిధిలో కలిసికొనిరి.

కథలోని ఈ క్రింది ముఖ్య పాత్రములు నాటకమున ఇట్లు మారినవి.

| | | |
|---|---|---|
| మధుసూదనరావు | — | జయరామసింగు |
| కృష్ణుడు | — | గోవర్ధనుడు |
| శ్రీమంతుడు | — | రాగవర్ధనుడు |
| భాగీరథి | — | నంద్యాల పార్వతమ్మ |

నాటక కథా విమర్శనమునకు విస్తారమగు ఈ కథను కొన్ని భాగములుగా విభజింప వచ్చును.

## I. రాగవర్ధనుని కథ

రాగవర్ధనుడు రామపురపు రాజు. మొదటి భార్య కమల మొదటి కాన్పు తన పట్టణమునందే జరిగి అక్కడకు రాకపోవుటచే, రెండవసారి తన పినతండ్రి కొడుకును, కాశీపురపు రాజును అగు మాధవ వర్మ యింట పురుడు పోసికొనుటకు భార్యను పంపెను. ఆమెకు ఆడుపిల్ల పుట్టినదనియు, మూడవ దినమున కమల మరణించినదనియు మాధవవర్మ వార్తనుపంపి, కమలను ఆమెతో వచ్చిన ఒక దాసిని ఒక భూగర్భ గుహలో దాచివేసెను. నిజమునకు కమల కవల గనినది. రెండవ శిశువు మగశిశు వగుటచేత వానిని చంపుమని అతడు ఒక దాసికి ఇచ్చెను. ఆదాసి చేతులురాక శిశువును రహస్యముగా పెంచెను.

రాగవర్ధనుడు మణుల పెండ్లి చేసికొనెను. ఆమె తమ్ముడు జయరామసింగు ఒక వెఱ్ఱిసొర బుద్ధివాడు. సవతి కూతురగు సరస్వతిని వానికి ఇప్పించి, తరువాత రాజ్యమును అతనికి కట్టబెట్టనెంచి ఆమె ప్రయత్నించెను. సరస్వతి ఆమె బాధలు పడలేక పారిపోయెను.

జయరామసింగు రాగవర్ధనునకు విసముపెట్టి చంప దలుచుకొనెను. తాను అక్కడనే ఉన్న అనుమానము కలుగునని, అతడు మంచినీటిలో విసము కలిపి పారిపోయెను. పొరపాటున ఆ జలము త్రావి, వాని అక్క మరణించెను. రాగవర్ధనుడు కూతురుపై బెంగపడి, మంచమెక్కి ఉన్మత్తుడయ్యెను.

ఇదే అదను అనుకొని, జ్ఞాతి మాధవవర్మ అక్కడకు చేరుకొనెను. తాను చంపుమని ఇచ్చిన శిశువు ఎచ్చటనో గోవర్ధనుడు అను పేర సురక్షితముగా పెరుగుచున్నట్లు తెలిసి, వెదకి చంపుమని ప్రధానికి అతడు ఆజ్ఞ ఇచ్చెను. కాని గోవర్ధనుడు ఆడువేసమున నుండుటచే తప్పించుకొని రాగవర్ధనుని ఉన్మాదపు మాటవిని, తనకు తగిన వైద్యము తెలియుటచే రామపురముచేరి అక్కడ అందఱచే సరస్వతిగా భావింపబడుచుండెను.

సరస్వతి గోవర్ధన నామమున పురుషవేషమున నుండి కాశీపుర ప్రధాని. చిక్కి మాధవవర్మ కడకు రామపురము పంపబడి, తండ్రి వద్దకు చేరుకొనెనుకి

తుదకు మాధవవర్మ పశ్చాత్తప్తుడై, అన్నను క్షమాభిక్ష వేడి, వదినెగారు బ్రదికియే యున్నట్లు తెలిపెను. భూకంపముచే పాతాళ గుహాద్వారము కూలి, బయటపడిన కమల, తన దాసితో వచ్చి సమయమునకు చేరుకొనెను.

## 2. సరస్వతి కథ

సరస్వతి సవతితల్లి బాధలు పడలేక మధురిక అను దాసితో కలిసి మగ వేషమున పారిపోయెను. సముద్రమున ఓడ తుఫానులో చిక్కుటచేత ఆమె దాసి నుండి వేఱై, ఒక నిర్జన ద్వీపముచేరి కళాలలితుడు అను వానిచే రక్షింపబడి జగన్నాథపురము చేరెను. పురుష వేషమున రామపురపు రాజునకు తఱచుగా ఉండు గోవర్ధనుడు అను పేరు పెట్టుకొనినది. కళాలలితుని సవతి చెల్లెలగు కళాలలిత ఆమెను మగవాడు అని ప్రేమించెను. సరస్వతి కళాలలితుని వలచెను.

మగవేషమును విసర్జించి, తన సమస్యలు పరిష్కరించుకొనగోరి ఆమె కాశీపురము చేరుకొనెను. ఆమె సరస్వతిగా బయటపడగానే, జయరామసింగు చేతచిక్కి బంధింపబడెను. చిత్రముగా ఆమె గోవర్ధనునిచే తప్పింపబడి తిరిగి పురుషవేషము తాల్పవలసిన దయ్యెను. ఆ పురుషవేషముననే ఆమె గోవర్ధనుడని మాధవవర్మ ప్రధానిచే బంధింపబడి రామపురము పంపబడెను. అచ్చట మాధవ వర్మ భటులచేత చంపబడనున్న ఆమెను కళాలలితుడు వచ్చి రక్షించెను. ఆ పిదప ఆమె తండ్రిని చేరుకొనెను.

### 3. గోవర్ధనుని కథ

ఇతడు మొదట మాధవవర్మ దాసిచే పెంపబడి, తుదకు చేతులు మారి నంద్యాల పార్వతమ్మ అనునామె వద్ద పెరిగెను. ఆమెయే అతనికి విద్య చెప్పించెను. ఇతడు కాశీపురమున ఉండగా సరస్వతిని పురుష వేషమున వలచిన కళాలలితచే ఆమెగానే భావింపబడి తుదకు ఆమె ప్రేమను అంగీకరించినాడు.

జయరామసింగు చెఱలో ఉన్న సరస్వతిని రక్షించి, తన దుస్తులు ఆమెకు, ఆమె దుస్తులు తనకు మార్చుకొనెను. ఆ ఆడు వేషమున ఉండి జయరాముని శిక్షించి సరస్వతిని గోవర్ధన రూపమున ప్రేమించిన కళాలలితుని కలిసికొనెను. కళాలలితుడు అతనితో గోవర్ధనుని పట్టి చంపుమని కాశీపురమున రాజాజ్ఞ యైనది కనుక మఱల పురుషవేషము తాల్చవలదని కోరెను. అతడు ఆ వేషముననే రామపురము చేరి తుదకు తల్లిదండ్రులను కలిసికొనెను.

### 4. మధురికా భ్రమరకుల కథ

మధురిక సరస్వతి దాసి, భ్రమరకుడు గోవర్ధనుని భటుడు. తుఫాను సమయమున మధురిక భీమపురపు పల్లెవాండ్రచే రక్షింపబడి, భ్రమరకుని కలిసినది. వారు ఇరువురును వివాహమాడుటకు నిశ్చయించుకొనిరి.

వీరు ఇరువురును గోవర్ధనుని, సరస్వతిని ఒక్కమారుగా చూడలేదు. గోవర్ధనుడు కనబడినప్పుడు పురుషవేషమున ఉన్న సరస్వతి అని మధురిక, భ్రమరకుడు కాదనుట; సరస్వతి కనబడగా స్త్రీవేషమున ఉన్న గోవర్ధనుడు అని భ్రమరకుడు, మధురిక కాదనుట; ఇట్లు తుదిదాక జరిగినది.

### 5. కళాలలితా కళాలలితులకథ.

వీరి కథలు సరస్వతీ గోవర్ధనుల కథలలో కలిసిపోయినవి.

కళాలలితా గోవర్ధనులు, సరస్వతీ కళాలలితులు, మధురికా భ్రమరకులు, కురంగి (కళాలలిత దాసి) జయరామసింగుల పెండ్లిండ్లతో నాటకము ముగిసినది.

## షేక్స్పియర్ కామెడీల ప్రభావము

ఈ విచిత్ర కథ మక్కికి మక్కిగా ఎక్కడ నుండియు దింపినది కాకున్నను, షేక్స్పియర్ నాటకములచే అమితముగా ప్రభావితము ఐనది. **Commedy of Errors, Twelfth Night**– ఈ రెండు కథలుకాదు. కథల లోని వైచిత్ర్యము సరస్వతి కథలో ప్రధాన సూత్రము అయినది.

హేతువాద పరీక్షకు ఆగని కథా సన్నివేశముల ఘటన, సుఖాంతత, జీవితమునందలి గాఢేతరమైన (**Take easy**) దృక్పథము అను విషయములందు కూడ షేక్స్పియర్ నాటకముల ప్రభావము ఇందు కానసగును. దీని వివరణ మఱియొకచోట.

## ట్వెల్త్ నైట్

మొదట సరస్వతికి, ట్వెల్త్ నైట్ నాటకమునకు ఇతివృత్త కల్పనమున, సన్నివేశముల కూర్పులో గల ప్రధాన భేద సాదృశ్యములు వివరింపబడును.

1. సరస్వతిలోని కవలలు అన్న, చెల్లెలు.

ట్వెల్తునైటు నాటకములోని కవలలు అగు సెబాస్టియన్, వయొలా కూడ అన్న, చెల్లెలు.

2. సరస్వతిని పురుషవేషమున ఉండగా ఆమెను ప్రేమించినట్టి కళాలలిత తుదకు ఆమె సోదరుని వివాహము ఆడెను.

వయొలా పురుషవేషమున ఉండగా ప్రేమించిన ఒలీవియా చివఱకు ఆమె సోదరుడు అగు సెబాస్టియన్ను వివాహము ఆడెను.

3. గోవర్ధనుడు తన భటుడగు భ్రమరకునకు మాడలసంచి ఇచ్చెను. ఆ సంచిని అతడు పురుషవేషములో ఉన్న సరస్వతికి ఇచ్చి, గోవర్ధనునకు ఇచ్చితి ననుకొనెను. గోవర్ధనుడు వచ్చి అడిగినప్పుడు తెల్లపోయి, అతనిని అనుమానించెను.

ఇది కొంత మార్పుగా ట్వెల్త్‌నైట్‌లో ఉన్నది.

ఏంటోనియో ఒక నావికుడు, సెబాస్టియనుకు స్నేహితుడు. ఇరువురును కలిసి నగరముచేరిరి. ఏంటోనియో అచ్చటి ప్రభువునకు ఒకప్పుడు అనిష్ట కార్యము చేసినందున శిక్షాపాత్రుడై ఉండెను. కావున అతడు సెబాస్టియనుతో కలిసి పట్టణము చూడబోవక తన ధనపుసంచి అతని చేతికి ఇచ్చి తాను బసకు పోయెను. తరువాత అతడు వయొలాను మగరూపునచూచి మిత్రుడు అనుకొని తన ధనము అడిగెను. ఆమె తెల్లబోయి తాను ఎఱుగనని అనగా అది సెబాస్టియనే అనుకొని నిందించెను. ఈ భ్రమ ఎక్కువకాలము సాగకమునుపే కౌంట్ ఆర్సినో, ఒలీవియా, ఏంటోనియో మున్నగు వారిముందు సెబాస్టియన్ వచ్చి చేరుటతో ఈ చమత్కారము ముగిసినది.

4. కాశీపురమున శిక్షార్హుడుగా ఉండినవాడు గోవర్ధనుడు కాని ట్వెల్త్ నైట్‌లో అది ఏంటోనియో.

5. సరస్వతిలో గోవర్ధనునకు, కళాలలితకును చివఱదాక పెండ్లికాలేదు.

కాని ట్వెల్తునైట్‌లో సెబాస్టియన్, ఒలీవియాలకు చతుర్థాంకముననే పెండ్లి జరిగెను.

## కామెడీ ఆఫ్ ఎఱ్ఱర్స్

ఇట్లె దీనికి కామెడీ ఆఫ్ ఎఱ్ఱర్స్‌నకు ఉన్న తుల్యాంశములు ముఖ్యములైనవి యివి.

1. కవలల తల్లిదండ్రులగు కమలా రాగవర్ధనులు సరస్వతిలో ఎడబాటు పొంది యుండిరి. నాటక కథ సుఖాంతము అగుటలో వీరి కలయిక ఒక అంశము.

ఎయిజియన్, ఎమీలియా వీరి ఎడబాటు కామెడీ ఆఫ్ ఎఱ్ఱర్స్‌లో ఉన్నది. వీరి కలయిక చివరి ఘట్టమున జరుగుటతో నాటక సుఖాంతత పరిపూర్ణమైనది.

2. సరస్వతిలో కమల భర్తనేకాక పిల్లలనుకూడ ఎడబాసి యుండెను. అట్లె కామెడీ ఆఫ్ ఎఱ్ఱర్స్‌లో ఎమీలియా పిల్లలను ఎడబాసి యుండెను.

3. సరస్వతికి పురుషవేషమున గోవర్ధనుడు అని పేరు. కవలలో మగవాడు గోవర్ధనుడు. రామపురపు రాజులకు తఱచుగా ఇదే పేరు.

కామెడీ ఆఫ్ ఎఱ్ఱర్స్‌లో కవల సోదరులకు ఇద్దరకును తండ్రి ఏంటి ఫోలస్ అను పేరే ఉంచెను.

కవల బానిసలకు కూడ అందులో ఒక్కటేపేరు - డ్రోమియో అని. పంతులుగారు అట్లె ఈ కవల వివాహము ఆడిన వారికి కళాలలిత, కళాలలితుడు అను పేర్లు పెట్టి ఒకచోట చమత్కారము చేసినారు.

సరస్వతి పురుష వేషమున కళాలలితుని ప్రేమించి "హా! ప్రాణకాంత! కళాలలితా!" అనుకొనగా కళాలలిత దాసియగు కురంగి చాటుగానుండి విని తన యజమానురాలిని ఉద్దేశించినవే ఆ పలుకులని భావించును.

కాంతా కనకములకు సంబంధించిన విషయములలో భ్రమ ప్రమాదముల వలన ఏర్పడు సంచలనమునకు తీవ్రత ఎక్కువ. షేక్‌స్పియర్ ఈ రెండు నాటకములందును ఒకచో అన్న, చెల్లెలు; మఱియొకచో అన్నదమ్ములు అయిన కవల నుంచి, ఒకే రూపమున నున్న వీరి వలన ఈ రెండు విషయముల ఏర్పడిన భ్రమ ప్రమాదములను ఈ నాటకములలో వ్రాసెను. పంతులుగారు కూడ కవలలు, కాంతా కనకములు వీనిని కలిపిరి. షేక్‌స్పియర్ తన కామెడీ లలో తఱచుగా వాడిన అన్యవేషధారణమును ఇందు విరివిగా వాడినారు. ట్వెల్తు నైట్‌లో స్త్రీ పురుష వేషమును మాత్రమే వేయగా, ఇందులో పురుషుల చేత స్త్రీ వేషములు కూడ వేయించినారు.

దీని నంతయు నటుంచి, ఈ నాటకములో ఇంకొక విశేషము ఉన్నది. అది కథాంశములు అన్నింటిని ముందుగనే సూచన చేయక క్రమ క్రమముగా తెలుపుచుండుట.

రాగవర్ధనునకు ఎట్లు కవలు ఉదయించిరనియు, భార్య కమల బ్రతికియే ఉన్నదనియు, తుదిదాక తెలియదో, అట్లె పాఠక సామాజికులకును ఈ విషయము తెలియరాదు. దానివలన ఈ భ్రమ ప్రమాదములు మిగుల ఉత్కంఠ కలిగించును. నాటకములలో ఈ పద్ధతి అపూర్వము. పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయము నందువలె, ఆధునిక నవలలలో కొన్నింటి యందువలె, పంతులుగారు క్రమక్రమముగా ఒక్కొక్క ముడి విప్పుచు, మఱియొక ప్రక్కనుండి వివిధ ఉపకథా సూత్రములను ముడివేయుచు నాటక వస్తూన్మీలనము చేసిరి.

ఈ పద్ధతిచే మిగుల ఆకర్షింపబడిన వడ్డాది సుబ్బారాయ కవిగారు పంతులుగారిని ఎంతయు ప్రశంసించిరి. ఇవి వారి మాటలు.

"ఏను గంటి సరస్వతి ; పానుగంటి
నారసింహ ! తలచుకొంటి సూర సుకవిఁ
దెలుగున మఱెద్ది దానికిఁ గలుగ దుద్ది,
యుద్ది యగునో కళాపూర్ణ సుద్ది యొకటి ? "

—వసురాయ చాటు ప్రబంధము
ప్రశంసా ప్రకరణము—325.

వసురాయుడుగారు దీనితో కళాపూర్ణ సుద్ది యొకటి పోలిక తెచ్చుటకు అందలి మాయరంభ, మాయ నలకూబరుల వృత్తాంతమువలె ఇదియును చిత్ర విచిత్రముగా ఉండుటయే.

## విచిత్ర పాత్ర సృష్టి

ఈ విశేషములు అన్నియును ఎట్లు ఉన్నను ఇందులో కొన్ని విచిత్ర పాత్రలను పంతులుగారు సృష్టించి యున్నారు. కామెడీ నాటకములకు ఇట్టి ప్రత్యేక పాత్రలు శోభ ఇచ్చును. అట్టి పాత్రలలో జయరామ సింగు ఒకడు. నాటక ప్రస్తావనలో కూచివారే మొదట ఈ పాత్రను గూర్చి ప్రత్యేకించి ప్రస్తావించినారు.

నటి : మన "మనము" గారి మదనశాస్త్ర మర్యాదలు, ప్రద్యుమ్న ప్రహారణములు, పదతాడనములు—నాకంతగా నచ్చలేదు బావా!

సూత్రధారుడు : పోనీ, గర్దభ శృంగార మని కవియే పేరు పెట్టినాడు గదా దానికి! సృష్టిలో నట్టి వెఱ్ఱి సౌరబుఱ్ఱ వా రుండగూడదా? అట్టి వారున్నఁ గాని పరమ పురుషుల ప్రతిష్ఠ యెట్లు బయటపడును?

హాస్యరస పోషణమునకై సాహిత్య స్రష్ట కొన్ని ప్రత్యేక సన్నివేశములు కల్పించుకొనుట, కొన్ని విశిష్ట పాత్రలు సృష్టించుచుండుట నూతన విశేషము కాదు. కొన్నియెడల అట్టివి సుసంభవములైనవే అయినచో అవి యథార్థముగా ఉన్నవని భావించి, పలువురు ప్రశంసింతురు. కొన్నికొన్ని అసంభవములుగా తోచునంత విపరీత సంభవము లైనవి. అట్టి వానిని సృజించిన రచయితను సాధారణముగా లోకము—ముఖ్యముగా ఆధునిక లోకము తిరస్కరింపవచ్చును.

కాని యాథార్థ్య నిరూపణము కవి తన రచనలలో చేయవలయు నన్నప్పుడు, అది లోకములో మన కన్నుల యెదుట జరుగుచున్నదే కానక్కఱ లేదు, జరుగుటకు అవకాశము ఉన్నదియైన కావచ్చును—అను అభిప్రాయమును రసజ్ఞులు తిరస్కరింపరు.

పూర్వోక్తమగు పరిస్థితులలో పంతులుగారి లేఖిని నుంచి ఉద్భవించినవాడు జయరాముడు. వీనిని గూర్చి ఒక సమగ్రమయిన నిర్ణయము చేయుట సులభము కాదు. ఈ నాటకములో గోవర్ధనుడు ఒక్కఁడు వీనిని గూర్చి పరిశీలనా పూర్వకమగు అభిప్రాయమును వెలువరించినాడు.

మొదట వీనిని గూర్చి అతడు "మాటలను బట్టి వెఱ్ఱి ముండకొడుకు: చేష్టను బట్టి కిరాతకుడు." అనుకొనెను. తరువాత, "విచిత్రస్వరూపుడు; ఈ మందభాగ్యుని నా కన్నులారఁ జూచితిని గాన సరిపోయినది. కాని యే నాటక కవియైన నట్టి పాత్రను సృష్టించిన యెడలఁ గవికిఁ బ్రకృతి జ్ఞానము లేదని యవిమర్శముగ నాతని నిందించి పాపము కట్టుకొని యుందును గదా! ఆహా!

హద్దులేని సృష్టిలో నెట్టి చిత్ర విచిత్రాతివిచిత్ర మహావిచిత్ర ప్రకృతు లున్నవో!" అని తలచెను. ఆ పిదప "వీఁడు చిన్నతనమునుండియు నెక్కువ గారాబముగాఁ జదువురాని తల్లిదండ్రుల చేతఁ బెంపఁబడి పాడుచేయఁ బడిన వాఁడని తోఁచుచున్నది. వ్యాధి ముదిరి పోయినది." అని ఊహించెను.

**ఊహాతీత వ్యక్తి**

ఈ ఊహలన్నియు వానిలో ఒకవంతు మాత్రమే ప్రదర్శించును. వాడు తెలివితక్కువవాడు కాడు—దుర్మార్గమునకు వెనుకంజ వేయువాడు కాడు—పైగా పిఱికి పంద. మానాభిమానములు లేనివాడు. స్వార్థ పరత్వమునకు సరిహద్దు అయినవాడు. శ్రుత పాండిత్యము అధికముగా కలవాడు. పండితుడనని, సౌందర్య వంతుడనని అధికమగు ఆత్మవిశ్వాసము గలవాడు. అన్నింటికంటెను వస పోసిన వాగుడు పిట్ట. అతి తెలివితేటలు కలవాడు. ఇక్కడికిని వానిని గూర్చి పూర్తిగా చెప్పినట్లు కాలేదు. వీడు మృచ్ఛకటికములోని శకారునివలె ఊహాతీతు డయిన వ్యక్తి.

అలంకార శాస్త్రము, వేదాంత శాస్త్రము మున్నగువానిని కలగాపులగము చేసి వీనివలె మాటలాడువాడు మరియొకడు ఉండక పోవచ్చును. ఒకవేళ మాట లాడినచో వాడు ఉన్మత్తుడై యుండును. వీని ఉన్మాదము కేవలము ఉన్మాదము అనుటకు వీలు లేనిది.

స్త్రీ రూపమున ఉన్న గోవర్ధనుడు సామముగా బుద్ధి చెప్పవలెనని శాంత ముగా "సీతను హరించిన రావణుఁ డేమయ్యెనో యెఱుఁగవా?" అని అడిగిన, "అది మనము కనులారఁ జూచిన యంశము కాకపోవుట చేత యిదమిత్థమని నిశ్చయింపఁజాలము. పోనీ, స్త్రీహరణము చేతనే రావణుఁడు చచ్చినాఁడని మాటవరుసకు నిశ్చయింపుము. వాల్మీకి దేనిని హరించి చచ్చినాడు?" అని ఎదురు ప్రశ్న వేసినవాడు తెలివితక్కువవాడా? నిషేక తల్పము అధిరోహించి, కాయిలా మంచము మీదికి అర్హమైన "శరీరే ఝర్ఝరీ భూతే వ్యాధిగ్రస్తే కళేబరే...." అను శ్లోకము పఠించినవాడు మతి యున్నవాడా?

పైన గోవర్ధనుని చేత అనిపించిన మాటల వలన పంతులుగారు ఈ పాత్రను సమర్థించుకొనినారు గదా! దానిని బట్టి ఎవ్వరో యిట్టి ప్రకృతి కొంత గలవారు పానుగంటివారి దృష్టిలో నున్నారు అన్నంత వఱకు నిజము. వారి దృష్టిలో నుండినవారు వీరే అని చెప్పబడినవారు ఒక రిద్దరు ఉన్నను, ఆ పేర్లు బయట పెట్టుట ఉచితము కాదు. అంతమాత్రమే కాక ఆ ఊహ సరియైన దనుటకు చాలినన్ని నిదర్శనములును లేవు.

## మేక వన్నె పులి

మఱియొక చిత్ర పాత్ర మాధవవర్మ. ఇతడు లౌక్యము తెలిసినవాడు. తన మనస్సులో ఉన్న మాట ఏదో, దానికి విరుద్ధముగా ఆరంభించి, ఎదుటి వారిచేత ఆ మాట అనిపించి, విధి లేక తాను బలాత్కారముగా అందులకు ఒప్పు కొనినట్లు అభినయించగల నిపుణుడు. కాని దానితోపాటు పరమ వంచకుడు, దుర్మార్గుడు, కిరాతకుడు నైన ఈతడన్న ఒక విధమగు జుగుప్స, భయమును అంకురింపక పోపు. ఇతడు మేక వన్నెపులి.

ఈ పాత్ర నిర్వహణమునకు బీజములు బుద్ధబోధసుధ నాటకమున దేవదత్తునిలోనే పడినవి అని చెప్పబడినది. దీని తరువాతి నాటకమగు వీరమతిలో తిరిగి పార్వతి ఇటువంటి జాణ.

ఏమయినను, తుదిక్షణమున ఒక్కసారిగా ఇతని మనస్సు మారిపోయి నది. అన్నను క్షమాపణ వేడి వదినగారు బ్రతికియే యున్నదను సంతోషవార్త తెలిపినాడు. ఇతడు As You Like It లోని Duke Frederick వలె అన్నగారి యెడ ఒక్కసారి గౌరవము చూపువాడైనాడు.

రామపురపు రాజగు రాగవర్ధనుడు, మాధవవర్మ వలె ఈ నాటకమున తుది అంకములలోనే కనిపించును. ఇతడు బుద్ధిసూక్ష్మత కలవాడు, సాత్త్వికుడు, చమత్కారి. పాపము! ఇతడు చేసిన పొరపాటెల్లను రెండవ వివాహము చేసికొనుటయే. దానితో ఇతని జీవితము దుఃఖభాజన మైనది. ఈతని మాటలు కూడ తుదిని నవ్వు పుట్టించినను, ఆ పాత్రపై మిగుల జాలి కలిగించుచున్నవి.

తన కొమార్తెయే అనుకొని. తనకు ఉన్మాద వైద్యము చేసిన స్త్రీ వేష ధారి యగు గోవర్ధమునితో ఇతడు చేసిన ప్రసంగములు అష్టమాంకమున ఉన్నవి. సూత్రధారుడు ప్రస్తావనలో అన్నట్లు ఈ అష్టమాంకము ఎంత కరుణరస భరితమో ! కనులు చెమ్మగిల్లకుండ ఈ భాగమును చదువుట గాని, వినుటగాని కడు గష్టము.

## అమలిన ప్రేమ

సూత్రధారుని ముఖమున కూచివారు కళాలలితా కళాలలితుల అమల ప్రేమమును విశిష్టముగా ప్రశంసించియున్నారు.

"చుంబ నాశ్లేషముల దాటి సుప్రణయము
స్త్రీ పురుష భేద చింతనా తీత మవిష
యకము, స్వార్పణ పూర్వక మదియె రాధ
బాలకృష్ణునిపై నిడ్డ వలపు సుమ్మి."

నిజమునకు వారు ఇరువురును సరస్వతీ గోవర్ధనులను అట్లే ప్రేమించిరి. కళాలలితుడు మఱియును సుకుమార హృదయుడు.

పంతులుగారు పాత్రలచేత సుదీర్ఘ సంభాషణములు చేయింపుచుందురు. ఒక్కొక్కచోట నాటకము మందకొడిగా సాగుట, ప్రదర్శనమున క్లిష్టత ఏర్పడుట దీనికి పర్యవసానమగును. ఈ నాటకమున ఇట్టిది చాల అధిక మైనదని చెప్పవలయును. మన సత్త్వ నిరూపణము చేయుట, విపులమగు లోకానుభవము చాటుట—వీనిలో పడి పానుగంటివారు దీనిలో నాటక సంభాషణ పద్ధతిని కావలె నని విస్మరించినారు.

సంభాషణల దైర్ఘ్యము వారికి స్ఫురణలోనే ఉన్నది. పురుష వేషమున నున్న సరస్వతి కళాలలిత మాటలపై పెద్ద స్వగతములో పడినది. అంతట కళా లలిత యిట్లు పలుకును : "ప్రాణకాంత ! గంట కొక్క మాట నాడుచున్నావు-

నీకు నిద్ర వచ్చుచున్నదేమో యని యనుకొందును." ఈ సమర్థన బాగుగానే ఉన్నది. కాని దోషపరిహారము కాలేదు. నడుమ నడుమ ఇటువంటి వాక్యముల మూలముగా పంతులుగారు తమ లోపమును ఎఱిగియున్నారన్న మాట స్పష్ట మగుచున్నది.

ఈ నాటకమును రంగస్థలముపై ప్రదర్శించుటకు పైన చెప్పిన ఒక్క కష్టమే కాక, భ్రమలు కొలుపు నంతటి ఏకరూపులైన జంటలు కావలసి ఉన్నారు. పైగా నాటకమునందు ముందు భ్రమలు కలిగించి, చివఱకు పరిష్కారము చేయు పద్ధతిని అవలంబించి యున్నందున, అట్టి సదృశరూపుల అవసరము మఱియును ఎక్కువ.

ఏది ఎట్లున్నను నాటక మూల శిల్పము దృష్టిలో, సాహిత్య గౌరవ దృష్టిలో పంతులుగారి ఎన్నిక చేయదగిన నాటకములలో సరస్వతియు నిరభ్యంతరముగా ఒకటి కాగలదు.

# వీరమతి

సరస్వతి నాటకమునకు తరువాత మూడేండ్లకు పైగా గడచిన వెనుక వ్రాసిన నాటకము ఇది. అనగా 1923 లో రచన. మొదటి ముద్రణ మందలి పీఠిక తుదిని 24-12-1923 తేదీ ఉన్నది. సరస్వతి యువరాజావారి జన్మ దినోత్సవమున ప్రదర్శింపబడుటకు వ్రాయగా, వీరమతి మహారాజ దంపతుల ప్రథమ పుత్రిక అగు మంగమాంబా దేవి గారి జన్మదినోత్సవమున ప్రదర్శించు టకుగాను వ్రాసిరి. ఉచితతను పాటించి ఉత్తమ గుణ శీలయు, విద్యావతియును అగు కాంతా రత్నము కథను ఇతివృత్తముగా వారు గ్రహించిరి.

" దీనిలోని కథ భండారు అచ్చమాంబగారి అబలా సచ్చరిత్ర రత్నమాల లోనిది. స్వల్పమైన మార్పులతో నా కథనే నాటక రూపమున వ్రాసితిని." అని పంతులుగారు పీఠికలో పేర్కొనినారు.

అబలా సచ్చరిత్ర రత్నమాలలో వీరమతికథ 62-78 పుటలలో ఉన్నది. భండారు అచ్చమాంబగారు ఈ కథను ఆరంభించుచు ముందు వీరమతినిగూర్చి ఈ వాక్యములు వ్రాసియున్నారు.

" భార్యా భర్తృరూపమయిన రెండు గిల్లలు విద్యాబుద్ధులయందు సమాన ముగ నుండిన పక్షమున సంసార శకటము బహు సులభముగా నడచుననియు, నడుమ నెన్ని సంకటములు వచ్చినను ఆగక చక్రద్వయ సహాయముచే సులభ ముగ గదులుననియు, తుద కానందముగా నీప్సిత స్థలమునకు రథము చేరుననియు జూపుటకు వీరమతి చరిత్ర మత్యంతోపయోగ కరమైనది."

అబలా సచ్చరిత్ర రత్నమాల కథను పంతులుగారు ఎంతవఱకు అనుస రించిరో, ఎట్లు మార్పులు చేసిరో పరిశీలింతము.

" ఉదయాదిత్యుడు సూర్యవంశపురాజు, విక్రమాదిత్యుని వంశములోని 48 వ పురుషుడు. ఈయన మాలవదేశములోని ధారానగరమును తన రాజధానిగా జేసికొని యనేక సామంతులకు జక్రవర్తిగా నుండెను." ఇతనికి ఇద్దరు భార్యలు. " ఈ రాణీల నామములు తెలియక పోయినను, పెద్దభార్య వాఘేలీ వంశములోని దనియును, రెండవభార్య సోళంకి వంశములోని దనియును తెలియుచున్నది. వాఘేలీరాణికి రణధవలుడనియు, సోళంకిరాణికి జగదేవుడనియు బుత్రులు కలిగిరి." పంతులుగారు వాఘేలి రాణికి పార్వతి అనియు, సోళంకి రాణికి భవాని అనియు పేర్లు పెట్టిరి. తమ నాటకమున వాఘేలిరాణి ద్వితీయభార్య యైనట్లు చూపిరి.

" వాఘేలి కుమారు డయిన రణధవళుడు చిన్న తనమునాటినుండియు వెఱ్ఱివానివలె నుండుటచేత వాడెవరికిని బ్రియుడు కాకపోయెను. ఇట్లు తన కుమారునిజూచి యంద ఱసహ్యపడుదురనియు, దన సవతి కుమారుని నందఱు బ్రేమించెదరనియుఁ జూచి యిటులనే కొన్నిరోజులు జరుగనిచ్చిన యెడల జగదేవుడే రాజగుననియు వాఘేలీరాణి తలంచెను." వాఘేలిరాణి సవతిని ఇల్లు వెడల గొట్టించెను. మంత్ర్యాదులు మధ్యస్థులై ఆమెకు, జగదేవునకు రెండు గ్రామములు ఇప్పించి, ఊరివెలుపల ఇల్లుకట్టించి యుంచిరి. ఆమె కుమారునకు చక్కగా విద్యాబుద్ధులు చెప్పించెను. జగదేవుడు కొన్ని దినములలో రణధవలునికంటె అధికశూరుడని కీర్తి సంపాదించి, ప్రజాభిమానము పొందెను.

" రాజుకూడ జగదేవుని శౌర్య సాహసముల విని సంతోషించు చుండెను. కాని వాఘేలి రాణికిఁ గోపము వచ్చునేమోయని రాజు తనకు జగదేవునియందు గల ప్రేమ స్పష్టపఱచుటకు వెఱచుచుండెను."

" గుజరాతు దేశ మందలి చావడా వంశస్థు డగు బిరజుడను రాజా టుకటోడా యను గ్రామమును రాజధానిగా నేర్పఱచుకొని ప్రజాపాలనము చేయు చుండెను. ఇతని తండ్రి బ్రతికియున్నను అత డతివృద్ధు డైనందువలన బిరజుడే ప్రజాపాలనము చేయుచుండెను." వృద్ధరాజు కడగొట్టు కొమార్తె వీరమతి క్షత్ర విద్య నేర్చినది. సౌందర్య గాంభీర్య వినయాదులు గలది. " పుంవత్ప్రగల్భ."

ఈమె జగదేవుని వరించినది. తనకు కోడలురాకుండ జగదేవుని వివాహ మగుటకు వాఘేలిరాణి అంగీకరింపదేమో అని ఉదయాదిత్యుడు భయపడెను గాని, అట్టి ఆటంకము కలుగకయే వివాహము జరిగినది. వివాహ సందర్భమున సోళంకిరాణి, జగదేవుడు కోటలోనికి వచ్చిరి. అప్పుడు జగదేవుడు రాజకార్యములు నిర్వహించుచుండుట మూలమున అతని ప్రశస్తి ఇనుమడించినది.

"జగదేవుడు తన సవతితల్లియగు వాఘేలిరాణిని సదా సంతోషపెట్ట వలయు ననియు, తనపయి నామె పుత్రవాత్సల్యము నుంచవలయు ననియు నెల్లప్పుడు ఆమె యంతఃపురమునకు బోయి యామె కరుణను బడయుటకు ప్రయత్నింపుచుండెను. ఇట్లు తన యంతఃపురమునకు శుద్ధాంతః కరణముతో బలుమారు వచ్చెడి బాలునిపై గొప్ప నెప మొకటి మోపి రాజునకు నమ్మకము పుట్టునట్లుచేసి వాఘేలి యా జగదేవుని రాజ్యము వెడల గొట్టించెను.

అబలా సచ్చరిత్ర రత్నమాల యందలి యీ కథను అనుసరించి, వీరమతి వివాహ మైన వెనుక కొన్నినాళ్లు అత్తింట నుండి, పుట్టింటికి పోయినప్పు డీ విధముగ జరిగెను. జగదేవుడు "పట్టణము" అను సంస్థానమునకు పోయి ఉద్యోగము సంపాదించుకొన గోరెను. దారిలో ఒకమారు టుకటోడా పోయి ప్రాణేశ్వరిని చూడదలచెను.

అతడు టుకటోడా చేరి పురిబయట ఉద్యానవనములో నిదురించుచుండగా వాఘేలి రాణిచే పంపబడిన ఘాతుకులు అతనిని వధించుటకు ఎత్తుకొని పోయిరి. ఆ సమయమునకు వీరమతి, ఆమె చెలికత్తె పురుషవేషముల ఆ ప్రాంతమున నుండి అతనిని రక్షించిరి.

పిదప బిరజుని అనుమతిపై వీరమతిని తీసికొని జగదేవుడు పట్టణము బయలుదేరెను. దారిలో శౌర్యశాలురై వారు ప్రజాపకారము చేయుచుండిన రెండు బెబ్బులులను వధించిరి. వాఘేలిరాణి పంపిన మఱికొందఱు సైనికులు వారిని చుట్టుముట్టి బంధింపనుండగా సోళంకి రాణిచే పంపబడిన ఒక మంత్రి ధీర సింహుడు వారిని కాపాడెను. తాను వాఘేలిరాణి కుతంత్రము లెల్ల బయటపెట్టి నిరూపింతునని ధీరసింహుడు చెప్పినను జగదేవుడు అందులకు అంగీకరింపలేదు.

వీరమతి పుట్టినింట నున్నట్లు పంతులుగారు ఈ నాటకమున గ్రహింపలేదు. ఇరువురును కలిసియే ధారానగరమునుండి బయలుదేరినట్లు, దారిలో ఒక బెబ్బులిని జగదేవుడు సంహరింపగా, ఇంకొకటి వచ్చి వెనుకనుండి మీద పడుచున్నప్పుడు వీరమతి దానిని చంపి భర్తను కాపాడినట్లు వివరించిరి.

వాఘేలి రాణి ప్రోత్సాహముచే ఆమె దాసి మంత్రిని లోబఱచుకొని, జగదేవుని చంపుటకు భటుల రూపమున ఇద్దఱు నరహంతల పంపినట్లును, వారు వీరమతీ జగదేవుల మంచితనమున మనసు మారినవారై అట్టి దుష్కార్యము మానివేసినట్లును నాటక కథ. చెడి మామగారింటికి బోవుటకు జగదేవుడు ఒప్పుకొనలే దనియును ఇందు ఉన్నది. కాగా బిరజుడు బావమఱదిగా కాక, మామగారే అయినట్లు చెప్పిరి. ధీరసింహుని పేరు ప్రస్తావనలు పంతులుగారు తేలేదు.

దంపతులు కొన్నాళ్లు ప్రయాణము చేసి అణహితపురము అను పేరు గలట్టి పట్టణ సంస్థానము చేరిరి. దీనికి అధిపతియగు జయసింగు సిద్ధరాజు. "ఆయన ధర్మాత్ముడనియు, దయాశాలి యనియు ప్రసిద్ధికెక్కెను గాని, తన రాజ్యములోని యధికారుల బరీక్షింపక, వారిపయి నమ్మిక కలిగి ప్రవర్తించుటచే నా పట్టణమునం దనేకాన్యాయములు జరుగుచుండెను. ఆ పట్టణమునకు గొత్వాలు—అనగా దండనాయకుడుగానున్న డుంగరసీ యనువాడు స్వయముగా దొంగలను ప్రోత్సాహపఱచి, వారు తెచ్చిన సొమ్ములో భాగము గొనుచుండెను. వేశ్యాంగ నాసక్తుడయి గ్రామమునం దనేక వేశ్యాంగనలను దెచ్చియుండెను.

వారిలో జామోతీ యను వేశ్య మిక్కిలి చక్కనిదై సంఖ్యలేక ధనమును సంపాదించెను. దానియిల్లు రాజభవనము వలెను, పూదోటలు రాజోద్యానముల వలెను గానుపించును. ఈ వేశ్యాంగనలలోని రాణి తన దేహమును విక్రయించుటయే గాక, పట్టణమునందలి యనేక సాధ్వీమణులను మోసపుచ్చి తన యింటికి రప్పించి బలవంతముగా వారిని కాముకజనుల కర్పించి, వారి పాతివ్రత్యము భంగము సేయుచుండెను. దండ నాయకుని కుమారుడగు లాలదాసు డనువాడు గూడ జారశిరోమణియని పేరుగాంచి ఈ జామోతీ దాసుడయి యొప్పుచుండెను."

ఈ జామోతీ పంతులుగారి నాటకమున జాంబవతి అయినది. వీరమతిని ఊరి వెలుపల సహస్రలింగ తటాకము వద్దనుంచి బస కుదుర్చుటకై జగదేవుడు ఊరిలోనికి పోయెను. ఆ సమయమున జామోతీవద్ద పనిచేయుచున్న ఒకదాసీ వచ్చి కపటమున వీరమతి వృత్తాంతము కనుగొనిపోయి, జామోతీ కెరిగించి పారితోషికము పొందెను. జామోతీ రాజస్త్రీ వేష ధారిణియై పల్లకీలలో వచ్చి ఉదయాదిత్యుడు తన పెదతండ్రి కొడుకని పరిచయము చేసికొని, జగదేవుడు తన భర్తవద్ద నుండినట్లు కల్లలాడి వీరమతిని మోసమున తన వెంబడి తీసికొనిపోయి బంధించెను. లాలదాసునితో చెప్పి, బసకొఅకు తిరుగుచున్న జగదేవుని కారాబద్ధుని చేయించెను.

వీరమతి వృత్తాంతము తెలిసికొని పోయిన దానిపేరు జంబుకి అని పంతులుగారు పెట్టిరి.

వీరమతి తనను బలాత్కరింప వచ్చిన లాలదాసుని హతమొనర్చెను. పుత్రశోకముచే కుములు డుంగరసీ పంపిన భటులు తనను పట్టుకొన రాగా పదునొకండు మందిని వధించెను. అట్టి సమయమున రాజగు జయసింగు వచ్చి సకల వృత్తాంతమును వీరమతివలన తెలిసికొనెను. "రాజు జామోతీని కైదులో వేయించి, దాని యిల్లంతయు జప్తు చేయించెను." డుంగరసీ పలాయితుడు కాగా, రాజు జగదేవుని దండనాథుని చేసెను.

ఈ భాగమునందు పంతులుగారు కొన్ని మార్పులు చేసినారు. జంబుకి డుంగరసీ కోపమునకు వెఅచి, అటునిటు పరుగెత్తుకొని పోవుచు నూతిలో పడి చచ్చెను. జాంబవతిని డుంగరసీ చంపెను. వీరమతీ జగదేవులపై పగదీర్చుకొనవలెనని అతని కున్నది. కాని ఇంతలో రాజు అతనిని బంధించెను.

వీరమతీ జగదేవులకు జగద్ధవలుడు అని కుమారుడు కలిగెను. కొంతకాలమునకు రాజ్యమున మహామారి కాద్యుపద్రవములు కలిగెను. జగదేవుడు దండనాయకు డైనప్పటి నుండియు గిట్టుబాటు లేకుండిన కొందఱు దుష్టులు కాళీ విగ్రహము వెనుక చేరి దేవి మాటలుగా జగదేవుడు బలి కావలెనని కోరిరి.

ఇప్పటి కథ రెండు రకములుగా చెప్పుకొనుచున్నట్లు అచ్చమాంబగారు వ్రాసిరి. జగదేవుడు తన సొత్తు దానముచేసి బలికి సిద్ధముకాగా రాజు వారించెను. జగదేవుని మరణమునకై తహతహలాడుచుండిన దుష్టులు సర్వనాశనము కాగల దని విగ్రహము వెనుకనుండి బెదిరింపగా రాజు అనుమానపడి వెదకి వారిని పట్టుకొని శిక్షించినాడని ఒక కథ. జగదేవుడు సకుటుంబముగా బలి కాగా దుఃఖము పట్టుకొనలేక రాజు తన ప్రాణమును ఇచ్చుటకు సిద్ధపడెనని, అంతట దేవి ప్రత్యక్షమై మృతులను బ్రతికించెనని రెండవకథ.

పంతులుగారు వీనిలో మొదటిదానినే కొంచెము మార్పుతో గ్రహించి యున్నారు. కాని, వీరమతీ జగదేవులు ప్రాణము లిచ్చుట కాగానే తామును బలికావలసినదే అని రాజదంపతులు నిశ్చయించుకున్నట్లు కల్పించిరి. ఇక, చెఱ నుండి డుంగరసీ తప్పించుకొనిపోయి, జగదేవునిపై కుట్ర పన్నినట్లును పంతులు గారు వ్రాసిరి. జగదేవునకు పుత్రుడు కలిగినట్లు ఈ నాటకమున లేదు.

అబలా సచ్చరిత్ర రత్నమాలలో రాజు జగదేవుని గొప్పతనమునకు మెచ్చి తన కొమార్తె ప్రభావతిని ఇచ్చి వివాహము చేసినట్లు ఉన్నను, ఈ అంశము వీరు గ్రహింపలేదు.

దీని తరువాత తండ్రి రాజ్యము అన్యాక్రాంతము అయ్యెనని విని జగదేవుడు జయసింగు సైన్యములతో పోయి శత్రువులను ఓడించి, తండ్రిని మఱల రాజ్యారూఢుని చేసినట్లు ఉన్నది. అప్పుడు ధీరసింహుడు వాఘేలిరాణి దుర్మార్గములు అన్నియు బయటపెట్టినట్లు మూలకథయందున్నది.

నాటకమున జగదేవుడుససైన్యముగా వచ్చుచున్న వార్త విని శత్రువులు పారిపోయిరి. అంతకుముందే రాజ్యమునందలి ముసలి మంత్రి ఒకడు విసము పెట్టి, వాఘేలిని చంపించెనని, రాజునకు మతిలేదని చెప్పి బంధించి, రణధవళుని పేర తానే రాజ్యము చేయుచుండగా, ఆ పరిపాలనకు రోసి శత్రువులను ప్రజలు ప్రతిఘటింపనైన లేదని, ఇప్పుడు జగదేవుడు వచ్చుచున్న వార్త విని వారు సంతోషించిరని పంతులుగారు నాటకమున కల్పించిరి. జగదేవుని పట్టాభిషేకముతో నాటకము ముగిసినది.

ఇక వాఘేలిరాణి జగదేవుని వెడల గొట్టుటకు కల్పించిన నెపమును వీరు విస్తరించిరి. మొదట ఆమె లలిత అను దాసికిని, జగదేవునకును సంబంధమున్నట్లు ప్రవాదము వేయించెను — దానిని నమ్మనేమో అనుకున్న వీరమతి నమ్మక పోయెను.

పిదప రాణి జగదేవునకు విషము పెట్టించెను. దైవ వశమున అది తప్పినది. చివఱకు లలితచేత రణధవళుని మెడప్రక్కన బాకు పెట్టించి, స్త్రీ విషయకమగు వివాదము మనసులో నుంచుకొని జగదేవుడు తన కొడుకును చంపుటకు యత్నించెనని నేరారోపణ చేసినది.

సరస్వతి నాటకములోని రాగవర్ధనునకు ఇందలి ఉదయాదిత్యుడు అన్నయో తమ్ముడో కావలెను. ఆయనకు జగదేవునిపయి ప్రేమ ఉన్నది. అతడు ఋజుమార్గ వర్తనుడు అని తెలియును. తన్ను అసమర్థుని చేసి ద్వితీయ భార్య ఆడించుచున్నది అనియు ఎఱుగును. కాని తన మాట నిలుపుకొనుటకు ధైర్యము లేదు. మూలకథలోని అంశములతోనే పంతులుగారు ఇట్టి వ్యక్తిత్వము స్ఫుటముగా నుండునట్లు ఈ పాత్రను పోషించిరి.

వాఘేలి రాణికి పార్వతి అని పంతులుగారు పెట్టిన పేరు. రణధవళుడు ఎంత వెఱ్ఱియో, ఈమె అంత జాణ. భర్తను గుప్పిట నుంచుకొని ఏమి ఆడినదో ! జగదేవుడు, వీరమతి వెడలి పోవునప్పుడు మీరు వెళ్లవలెను అని మాత్రము అనలేదు. ఇటు సాగదీసి, అటు సాగదీసి ఎదుటి మంచి తనమును ఆధారముగా చేసికొని, ప్రాణములు విసుగునందాక మాటలాడి, తుదకు "నేను, నా కొడుకు పోదుము." అన్నది. "ఏల ? మేమే పోవుదుము." అని జగదేవుని చేత అనిపించినది. సరస్వతి నాటకములోని మాధవవర్మవంటి కార్యసాధకురాలు పార్వతి.

లలిత, కుశల పార్వతి దాసీలు. ఆమె పనుపున జగదేవుని వెడల గొట్టు తంత్రమున పనిచేసిరి. వీరిలో లలిత మొదట రణధవళునకు లోకజ్ఞానము నేర్పుటకై వినియోగింపబడినది. పిదప జగదేవునిపై వలపు ప్రకటించి, తిరస్కరింపబడినది. రణధవళుని మెడపట్టిలో జాగ్రత్తగా ఒక బాకు దూర్చి నేరము

జగదేవునిపై పెట్టినది. తుదకు రాణీగారి ఆదేశముపై మంత్రి సీతారామ సింగునకు ఆ మాటలు, ఈ మాటలు చెప్పి జగదేవుని చంపుటకు అతడే తనంత పూను కొనునట్లు చేసి, రాణీగారి పేరు పైకి రాకుండ ఆమెకు పనిచేసి పెట్టినది.

ఇక వీరమతీ జగదేవుల పాత్రలలో పంతులుగారు ఆదర్శమూర్తులను ప్రతిష్ఠించిరి.

జాంబవతి పాత్ర కేవలము కథాప్రాధాన్యమును బట్టి మాత్రమే కాకుండ దానికి ఒక తీవ్రమగు అభినివేశము ఉన్నట్లు చూపి చిత్రించిరి. సానుల కన్న పతివ్రతలు ఎక్కువ అని తెగ నీలుగు వారిని బట్టి, వారి పాతివ్రత్యము ధ్వంసము చేయవలెనని దాని జీవితాశయము ; ఈ పెంపుదలకు దారితీసిన చిన్న వాక్యము మూలకథలో "పట్టణమునందలి యనేక సాధ్వీమణులను మోసపుచ్చి తన యింటికి రప్పించి బలవంతముగా వారిని కామిజనుల కర్పించి, వారి పాతివ్రత్యము భంగము చేయుచుండెను" అని మాత్రమే.

వీరమతీ చారిత్రము వ్రాయుచు అచ్చమాంబగారు ఎట్టి ప్రాధాన్యము ఈ చరిత్రమునకు ఉన్న దనినారో, దానికొఱకై పానుగంటివారు నవమాంకమున ఆ నగరమందలి బాలికలు వీరమతియొద్ద విద్యాబుద్ధులు గఱచినట్లు వ్రాసిరి.

# చూడామణి

ఇది పంతులుగారి పదునెనిమిదవ నాటకము. ఆరంకముల చరిత్రాత్మక నాటకము. పంతులుగారు దీని రచనా కాలము స్పష్టముగా తెలిపి యుండలేదు. పీఠికకు తేదీ వేసి ఉండక పోవుటయే కాక, ముఖ పత్రముపై ముద్రణకాలము కూడ వేసి లేదు. 1927 డిసెంబరు మాసాంతముదనుక అచ్చు పడిన పుస్తకముల జాబితాలో (ఆంధ్ర గ్రంథసూచి) ఈ పేరు లేదు. కావున ఇది తరువాతనే ముద్రింపబడి యుండవలయును. దీనిని కాకినాడ ముద్రాక్షరశాల యందు ముద్రించిరి.

దీనికి ముందటి నాటకము వీరమతి 1923 లో రచన; దీని తరువాతి నాటకము పద్మిని; ఆ తరువాతిది మాలతీమాల 23-8-1929 కి పూర్వము వ్రాసినది.

చూడామణి నాటక కథను పంతులుగారు "రాజ తరంగిణి" నుండి గ్రహించినట్లు ముఖ పత్రమున, ప్రస్తావనలోను పేర్కొనబడినది.

సూత్ర : పేరికిఁ గల్హణ పండితునిది. యథార్థముగాఁ గవిది.

పారి : అనగా—

సూత్ర : కల్హణ పండిత కృత రాజ తరంగిణిలోని స్వల్ప కథాంశము తీసికొని, దానిని స్వబుద్ధిచే విపులీకరించి, ప్రశస్తమైన నాటకముగఁ జేసినారు.

కల్హణ పండితుని రాజ తరంగిణిని పోలవరము జమీందారులు "సరస్వతీ" పత్రికాధిపతులును అగు కె. ఆర్. కృష్ణారావు బహదూర్, బి. ఎ. గారు తెనుగున వచన కావ్యముగా అనువదించిరి. ఈ అనువాదము రెండు భాగములుగా సరస్వతీ గ్రంథమాల 29, 30 సంఖ్యలు గల పుస్తకములుగా వెలువడినది. ఆ రాజ తరంగిణిలో ఈ నాటక కథా సంబంధిగా ఒక్క

వాక్యము మాత్రమే ఉన్నది. "తరువాత స్త్రీ రాజ్యమును జయించినప్పుడీ రాజేంద్రుడు ఇంద్రియ నిగ్రహణ మాచరించిన విషయము దిగ్విజయ మాచరించిన విషయము కన్న నతి విచిత్రముగా గణింపఁదగి యున్నది."

ఈ నాటక కథ యంతయును దీనిపై పెంపు చేయబడి యున్నది. కాక ఇందలి పాత్రములు, కొన్ని చారిత్రక విశేషములు కూడ రాజ తరంగిణి నుండి గ్రహింప బడినవి.

జయాపీడుడు అను నామాంతరము గల వినయాదిత్యుడు కాశ్మీరమును 31 సంవత్సరములు పాలించెను. ఇతడు విజేతయైన లలితాదిత్యుని మనుమడు. ఇతడు తాతగారివలె దిగ్విజయ మొనర్ప వలెనని బయలు దేరెను. క్రమక్రమముగా ఇతని సైన్యము విదేశముల యందు ఉండలేక మానుకొనెను. ఇట్లు ఉండగా అతని స్యాలకుడు అగు జజ్జుడు సింహాసనము ఆక్రమించుకొనెను. వినయాదిత్యుడు కొన్నాళ్లు అజ్ఞాత వాసము ఒనర్చెను. తరువాత గౌడ దేశాధిపతి తన కొమార్తె యగు కళ్యాణదేవి నిచ్చి పెండ్లి చేసెను. వినయాదిత్యుడు పంచ గౌడ దేశములను జయించి, మామగారికిచ్చి, విశ్వాస పాత్రుడు అగు మంత్రి ఆహ్వానముపై స్వదేశము చేరుకొనెను. యుద్ధములో జజ్జుడు మరణింపగా దేశము ఇతని వశమయ్యెను. తరువాత ఇతడు క్రమముగా దిగ్విజయ యాత్ర సాగించి, నేపాలాది దేశములను గెలిచెను. తుదకు ఇతడు బ్రాహ్మణులను అవమానము చేసి, వారిచేత అభిశప్తుడై హీనముగా మరణించెను.

వినయాదిత్యుని పక్షమున నున్న దామోదరశర్మ, ఉద్భటభట్టు పాత్రలు కూడ రాజ తరంగిణి లోనివే. ఇక స్త్రీ రాజ్యములోని పేర్లు అన్నియును కల్పితములు. షేక్స్పియర్ తన నాటక కథలను కొన్నిటిని, ప్లూటార్క్ వ్రాసిన రోమను వీరుల చరిత్ర నుండి ఎన్నుకొనినట్లు పంతులుగారు ఈ నాటకమునకై కావలసిన కొన్ని చారిత్ర కాంశములను రాజతరంగిణి నుండి గ్రహించి యున్నారు. అననుకూలమైనవి, అనుచితముగా నున్నవి మార్చుట గాని పరిహరించుట గాని చేసినారు. ఈ నాటకము వీర రసప్రధానమై భారతీయ జీవిత, సంస్కృతుల మహోదారతను ప్రకటించ జాలి యున్నది.

వినయాదిత్యుని పాత్ర దీనిలో బాగుగా సంస్కరింప బడి యున్నది. రాజ తరంగిణిని బట్టి ఇతడు ఏకపత్నీ వ్రతుడు కాడు. దుర్గ, కల్యాణదేవి అని ఇతనికి ఇరువురు భార్యలు. వీరి యందు ఇతనికి లలితాపీడుడు, సంగ్రామ పీడుడని ఇరువురు కుమారులు ఉండిరి. తండ్రి తరువాత వీరు క్రమముగా రాజ్యము ఏలిరి. వీరు కాక కమల అను ఒక నర్తకి ఉన్నది. పంతులు గారు ఇతనిని అచంచలుడగు ఏకపత్నీ వ్రతుడుగా రూపొందించి, "ఇంద్రియ నిగ్రహణము" అను అంశమును బలపఱచిరి.

వినయాదిత్యుడు కాని, అతని తాత లలితాదిత్యుడు గాని బౌద్ధమత పోషకులే కాని పంతులు గారు నాటకమునందు అతనిని బౌద్ధునిగా చేసిరి.

స్త్రీ రాజ్యము వారిచే ఇతడు బద్ధుడు కాగా, అతని మంత్రి యగు దామోదర శర్మ వచ్చి, తన అసమాన రాజ భక్తి మూలమున ఆ రాజ్యపు రాణి అగు పద్మావతిని మెప్పించి, రాజును విడిపించు కొనినట్లు పానుగంటి వారు వ్రాసిరి. ఈ అంశము రాజ తరంగిణిలో లేదు. కాని నేపాల దేశపు రాజగు ఆరముడి పై వినయాదిత్యుడు దండెత్తిపోయి, అతి సాహసము వలన బద్ధుడు కాగా అతని మంత్రి యగు దేవశర్మ స్వప్రాణ త్యాగముచేసి రాజును విడిపించి నట్లు ఉన్నది. అది ప్రేరేపకముగా పంతులుగారు ఇట్లు వ్రాసి యుందురు.

పద్మావతీ మహారాజ్ఞి, వినయాదిత్యుడు ఈ నాటకమున ఒకరికొకరు తీసిపోవువారు కారు. వారిని అనుసరించియున్న మందాకినీ దుర్గలు, ఉద్భటభట్ట, దామోదర శర్మలు వారికి తగినవారు కారు. అందఱిలోను పద్మావతీ రాణిని " చూడామణి " గా భావించి పానుగంటివారు నిరూపించి యున్నారు.

వినయాదిత్యుని దండయాత్ర సంగతి వినగానే ఆమె పలికిన పలుకులు ఆమెకు శౌర్యనిధులలో అగ్రాధ్య పదము సంపాదించి పెట్టును. " అవసరమును బట్టి శౌర్యము. అంతకంటె నేమున్నది? మయూర మెంత మృదులమగు పక్షి! అది తప్పించు కొనుట కవకాశము లేనిచోట దానిని సృష్టి కధికారి యైన మనుజుఁ డెదుర్కొననీ—అది యాతని కన్నుల పీకి వేయునో లేదో? అంత

వఱ కెందులకు ? నీ కాలి త్రొక్కును సహింపలేని గండు చీమ నిన్నెదుర్కొని పీకి వేయదా ? దాని శౌర్యము ముందు నీ శౌర్యము హెచ్చని నీవు చెప్పగలవా? శౌర్య ప్రకటనమునఁ బెద్దపులి ఘూంకార మెట్టిదో దోమ హుంకారము గూడ నట్టిదే సుమా !"

గెలిచిన కీర్తి; ఓడినను "వినయాదిత్యుని జయము కంటెఁ బద్మావతి యపజయమే లక్ష గుణములు శ్లాఘ్యమని" నిశ్చయించినది. ఆ విధముగనే అతనికి ప్రతి సందేశము పంపినది. "వీరితోఁ బోరాడుట యెందులకని యతడు మమ్ముపేక్షించు నెడల, నాతఁడెక్కడ నున్నాడో కనుగొని యక్కడకు ససైన్యముగ వచ్చి యాతనితో యుద్ధ మొనర్చి చత్తుము గాని మానఁదలచు కొనలేదు." అని మఱి నాలుగు మాటలు చేర్చినది.

పద్మావతి సేనా నాయిక, మంత్రి అగు దుర్గ, మందాకినులు వంచన చేసి వినయాదిత్యుని బంధించిరి. దామోదర వర్మ రాజును విడిపించు కొనుటకు వచ్చి, ఆ సంగతి నెత్తి ఎత్తి పొడువగా పద్మావతికి బాధ కలిగినది. తనకు కలిగిన మచ్చ పోగొట్టు కొనుటకు "మాకు పదివేల సైన్య మున్నది. మీరు మాపైకి ముప్పదివేలతో వచ్చిన గాని, మీ రాజును విడువను." అని స్పష్టము చేసినది. చిట్ట చివఱకు తులారణములో వినయాదిత్యునకు దెబ్బ తగిలినప్పుడు, అతనికి సర్వోప చారములు చేయించి, మఱి యుద్ధమునకు తలపడినది.

## చక్రవర్తిని మించిన దాసి

పద్మావతి ఎంత గొప్ప రాణి యైనను, ఈ నాటకము శ్రద్ధగా చదివి చూచిన వారికి ఎంత కాలమునకు మఱపురాని పాత్ర చపల. ప్రస్తావనలో చూడామణి పేరు సార్థకము చేయునది ఇందలి ఏ పాత్రము అను ప్రశ్న వచ్చి నప్పుడు తక్కిన పాత్రలతోపాటు చపల పేరును చర్చకు వచ్చినది. కాని సూత్రధారుడు ఆమె "స్వచ్ఛానురాగ వాచాల యయ్యె" అని త్రోసి వేసెను. అయినను, వినయాదిత్యుని వంటి వాడు ఆమెకు చివఱకు ఎంతటి ప్రశంసా పత్రము ఇచ్చెనో పరిశీలింపుడు.

"వసుధ నెందరో ననుబోలు ప్రభులు కలరు,
తన్వి ! నీ వంటి రాజ్ఞీ వతంస మొకతె
యైన నుండగా వచ్చును గాని జగతి
నింత దాసిని మాత్ర మీక్షింపలేదు."

జగతినే కాదు, దాసీ పాత్రలకు ప్రత్యేకత కలిగినట్టి పానుగంటి వారి కావ్య జగతిని గూడ ఇంత దాసి లేదు.

చపల కాంక్షించినది వినయాదిత్యుని ప్రేమను ; అతడు ఏక పత్నీ వ్రత దీక్షాధురంధరుడు అయ్యెను. తాను ఎంత దాసి మాత్రమే అయినను ఏక భర్తృ దీక్ష వహించినది. తన ప్రాణమును ఇచ్చియైనను చెఱలో నుండగా అతని ప్రాణము మీదికి వచ్చినచో రక్షింప శపథము చేసినది. "మీఁదఁ జేవైచుట కైనఁ, గన్ను పూర్తిగ విప్పి చూచుటకైన నొల్లని భర్త ప్రాణములు కాపాడిన యీ దాసి యీ చక్రవర్తికంటె ఘనురాలని లోకముచేఁ గొనియాడఁబడును." అని సూటిగా అతనితోనే అనినది.

కారాగారములో నుండి రాజును విడిపించుటకు కూడ సిద్ధపడినది కాని రాణిగారి పట్ల ద్రోహబుద్ధి లేని భక్తి కలిగినది. భల్ల యుద్ధము ఒనరించుచున్న పద్మావతికి, వినయాదిత్యునికి నడుమ నిలిచి శాంతి సాధించుటలో ఆమె చూపిన సాహసము, ధీరత ఆమెను హీనకుల సంభవగా చెప్ప నీయనివి.

దుర్గ — ఉద్భటభట్టు, మందాకిని — దామోదరుల ప్రేమ కలాపములు మున్నగునవి హాస్యరస పోషకములుగా నున్నను, గ్రంథ మంతయు పూర్తియైన తరువాత నిలుచు అనుభూతి చపల, పద్మావతి, వినయాదిత్యుడు - ఈ పాత్రత్రయ సంభాషణములు, చర్యల మూలమున కలుగు ఉదాత్తతా స్ఫూర్తియే.

ఔజ్జ్వల్య ప్రధానములై చకచక సాగిపోవు సంభాషణములు, అక్షరాక్షరమున ఉబుకు వీరరస వాహిని, ఈ నాటకమునకు ఒక ఉత్తమ స్థానమును కల్పించుచున్నవి.

## వ్యాఖ్యాన సహిత ముద్రణముల ఆవశ్యకము

ఈ నాటకమును సమగ్రముగా అర్థము చేసికొనుటకు రాజతరంగిణిలోని పెక్కు విషయములు తెలిసియుండవలయును. సాధ్యమైనంత వఱకు లక్ష్మీ నరసింహారావుగారు దీనిని స్వయం పోషకముగా ఉండునట్లె వ్రాసినారు.

వినయాదిత్యుడు దిగ్విజయము చేయుచు శ్రీ రాజ్యమునకు వచ్చి యుద్ధ సందేశము పంపినపుడు, మంత్రి మందాకిని సందేశము గొనివచ్చిన ఉద్భటునితో ఇట్లు ఆక్షేపించుచు పలుకును.

" అతని విద్యా పోషణమును గూర్చి కాని, పాండిత్యమును గూర్చి కాని మేము వినలేదు. కాని యత్యసాధారణమైన యాతని దిగ్విజ యోన్మాదమును గూర్చి మాత్రమే మేము వినియున్నాము. తన దేశమును బంధుఁ డాక్రమించు కొని పరిపాలించు చుండఁ దాను పర రాష్ట్ర పరిగ్రహణ ప్రయత్నమున నుండుట యున్మాదము కంటె భిన్నమా ? "

వినయాదిత్యుని విద్యా పోషణము, పాండిత్యమును గూర్చి వచన రాజ తరంగిణిలో 92 వ పుటలో వివరముగా ఉన్నది. అదియును జజ్జుడు అను నతని స్యాలకుడు అతని రాజ్యము ఆక్రమించుకొని యుండుట మొదలగు విశేషములు తెలిసి యుండుట ఆవశ్యకము. ఇంతకును చెప్పవచ్చిన దేమనగా, ఇట్టి విశేష ములతో, ఈ నాటకమును వ్యాఖ్యానించిన ముద్రణములు అవసరము అని, ఆంధ్ర షేక్స్పియర్ అనుటతో తృప్తిపడక, షేక్స్పియర్ నాటకములవలె ఇట్లు వ్యాఖ్యాన సహితముగా పంతులుగారి నాటకములు ముద్రింపించు కొనుట ముఖ్యమని.

మఱియొక్క విశేషముతో ఈ నాటకమును గూర్చి ముగింప వచ్చును. చతుర్థ, షష్ఠాంకములలో పంతులుగారు రెండు విష్కంభములను కూర్చిరి. మొదటి విష్కంభమున శ్రీ రాజ్యపుకోట ముందు కాపు కాయుచున్న ఇద్దఱు భటులు ఉబుసు పోకకు ముచ్చటించు కొనుచుందురు. దీనిలో పెదగా జరిగిన సూచ్య కథా సూచనము ఏమియు లేదు. వినయాదిత్యుని బంధించిరి. యుదము

వచ్చునని వీరు గాలి వార్తలు విన్నారు. బంధితు డెవ్వడో వారికి తెలియదు. వానిని గూర్చి వీరి ఊహాగానములు—చపలకు తగిన మగని తెచ్చిరట. "తగిన అనగానేమో తెలియునా ? చిన్నవాడు, రోగము, రొచ్చు లేనివాఁడు, అట్టె ఆసలేదు—రెండు మూడు లక్షల రాబడి కల రవంత రాజ్యమున్నవాఁడు." ఆ పిల్లవాని తల్లి దండ్రులకు ఈ లోపల తెలిసిన యెడల తీసికొని పోవుదురేమో అని అతనిని దాచిపెట్టిరట.

ఇంతలో దామోదరశర్మ వచ్చెను. బంధితుడు సుఖముగా నున్నాడా అని అడిగెను. వీనిలో ఒకడు "నీ వాతని తండ్రివా ?" అని అడిగెను. అతడు రాజు కోటలో ఉన్నట్లు రూఢి చేసికొని, "మీరొకరు పోయి, కాశ్మీర దేశ మంత్రి వచ్చి నారని రాణిగారితో గాని మంత్రిగారితో గాని చెప్పెదరా ?" అనగా వెంటనే అతడు "మీరు మంత్రులా బాబూ ? దండాలు. కాశ్మీరమనగా రామేశ్వరము దగ్గఱదే గదా బాబూ ! పండుగ వచ్చుచున్నది. క్రొత్తపంచెలఁ గట్టుకొందును." అని మనవిచేయును.

ఎంత చక్కని హాస్యమును వారి అమాయకత్వము నుండి చిందించిరో పంతులు గారు ! మానవ ప్రకృతిని ఎంతగా వారు పరిశీలించినారో అనిపించును. కథకన్నను బింకమైన ఇట్టి సన్నివేశములు కూర్చుటలో చిత్ర విచిత్రమైన పాత్రలు సృష్టి చేసినారు.

అట్లే షష్ఠాంకమున వస పోసిన పిట్ట వలె వాగుచుండెడి ఒక భటుడు "టక్కు టిక్కు" చెప్పుచుండునని, ఎప్పుడు చెప్పినను సూటిగా రెండు ముక్కలలో చెప్పువాడనే గాని సోదె పెట్టు వాడను గానని వానికి దృఢమైన విశ్వాసము.

"మా భటు లందఱు మంచివారే యని రాజుగారన్నారు. మా భటులం దఱు మంచివారని రాణిగారన్నారు. ఆడువాండ్ర చేత మా భటులు చెడిపోయినా రని రాజుగారన్నారు. మగ వాండ్ర ప్రోద్బలముచే మా భటులు చెడిపోయినారని రాణిగా రన్నారు. ఆడువాండ్రు తొందర చేసినంత మాత్రమున నేమి—రవంత

బుద్ధి నిలుపుకొన గూడదా యని రాజుగారు తమ భటులను విసుగుకొన్నారు. మగవాండ్రెంత మీదికి వచ్చిన నేమి కానంత తప్పుకొనలేక పోయినారా యని రాణిగారు తమ భటులను విసుగుకొన్నారు. ఆడువారున్న చోట నింక యుద్ధము చేయగూడదని రాజుగా రన్నారు. మగ పురుగు మీద విల్లెత్త గూడదని రాణిగా రన్నారు. మహా వీరుడైన నా సేనానిని తీసికొని దుర్గమ్మ లేచిపోయినదని రాజుగారు విచారించినారు. దుర్గమ్మ నుద్భట భట్టు ముండకొడుకు లేవదీసికొని పోయి నాడని రాణిగారు విచారించినారు."

ఇక వాని మాటల తీరు ఇట్టి

ఈ నాటకము చదువుచుండగా జైమినీ భారతము నందలి ప్రమీలార్జునీయము కథ జ్ఞప్తికి తగులును. పంతులుగారు 1913 లోనే సాక్షిలో "స్త్రీ స్వాతంత్ర్యము" అను పేర ఇట్టి యొక వృత్తాంతమును వ్రాసి యున్నారు. దానిని కొంత విపులీకరించినను, ఈ నాటకమున తద్గత హాస్యమును క్రమ్మి వేయు ఉదాత్తతను దానికి జోడించి, పంతులు గారు నిశ్చయముగా ఒక గొప్ప నాటకము వ్రాసినారు.

# ప ద్మి ని

ఆఱంకముల ఈ నాటకము పంతులుగారి పందొమ్మిదవయది. 1929 లో కాకినాడ ముద్రాక్షరశాలయందు ఇది తొలుత ముద్రింప బడినది. దీని యందలి కథ కల్పితమైనది.

పద్మిని సుఖాంత నాటకమే. కాని దాదాపుగా చివఱి అంకము వఱకును ఇది సుఖాంతము అగు ననిపింపదు. దీనిని ట్రాజి కామెడీగా పరిగణింప వలయును. ఇందలి నాయికా నామమును, నాటక నామమును ఒక్కటియే. కాని పారిపార్శ్వకుడు చెప్పినట్లు నాయిక పేరు మంచిదే కాని తీరు మంచిది కాదు.

పద్మిని సౌభాగ్యపురపు రాణి. తన తండ్రి గతించిన వెనుక ఆమె పరిపాలనమునకు వచ్చెను. తండ్రి బ్రతికి యుండగా, ఆమెను కళింగ రాజ పుత్రుడగు మురళిమనోహరునకు ఇచ్చుటకు సంకల్పించెను. మనోహరునకు ఈమెపై పట్టరాని అనురాగము. పద్మిని సామంతులలో గోపాలవర్మ ఒకడు. అతని మేనల్లుడు విజయనారాయణ వర్మ. ఈ వర్మపై పద్మినికి భ్రాంతి. విజయ నారాయణ వర్మ మేన మఱదలు రత్నప్రభ. వారు ఇరువురు అన్యోన్యాను రాగము కలవారు. పద్మిని వారిరువురను చీలదీయుటకై యత్నించెను.

అదే సమయమునకు మురళిమనోహరుడు సాధువేషముతో పద్మిని ప్రేమ సంపాదించుటకయి వచ్చెను. పద్మిని ఒక నెపము పన్ని, రత్నప్రభను సాధువు వద్దకు పంపించెను. ఆ వేళకు సరిగా నారాయణవర్మ వారిని చూచునట్లు సంఘటించి, అతని మనస్సులో రత్నప్రభను గూర్చి అనుమానము ఏర్పడునట్లు చేసెను. వర్మ రత్నప్రభను చంపునని, దానితో తనకు ఆటంకము తొలగు ననియు పద్మిని భ్రమపడెను.

కాని నారాయణవర్మ ఆ రాత్రి సాధువును చంపుటకు వచ్చెను. పద్మిని వచ్చి అడ్డు పడునంతలో సాధువునకు స్వల్ప గాయము అయ్యెను. కాని మురళి మనోహరుడు ఆ విషయమును దాచిపెట్టి, తనకు కలిగిన గాయము పెద్దదైనట్లు తనకు ప్రాణము మీదికి వచ్చినట్లు నటించి, మెల్ల మెల్లగా పద్మిని సానుభూతిని సంపాదించు కొనెను.

విజయ 'రాయణవర్మ ఎట్లును తనకు లభించువాడు కాడని నిరాశ చేసికొని, తన దుండగములకు పశ్చాత్తాపము చెందినట్టి పద్మిని మురళి మనోహరుని వివాహము ఆడుటకు అంగీకరించెను.

## కథ-కథా నాయిక

ఈ నాటకమునందు ప్రాధాన్యము కథానాయిక అగు పద్మినికే కాని నామమాత్ర నాయకు డయిన మురళి మనోహరునకు కాదు. సూత్రధారుడు ప్రస్తావనలో చెప్పినట్లు కథానాయిక అగు కొంత పురుషులను మించిన పరుష స్వభావురాలును, కాపటిక శిఖామణియు నైనది.

కథ విషాదాంతము అగుటయో, సుఖాంతము అగుటయో ఆమె చేతిలో ఉన్నదే అనుటలో ఎంత మాత్రమును అతిశయోక్తి లేదు. తన సుఖమును కాంక్షించి తన చిన్ననాటి స్నేహితురాలగు రత్నప్రభకు హాని కలిగించుట కామె వెనుదీయలేదు. గాఢమైన అంతఃకరణము, తీవ్రమైన స్వభావమును కలిగిన పద్మిని తనకు నారాయణవర్మ ఎట్లును దక్కువాడు కాడు అని నిశ్చయించు కొనగానే ఏమి తలచినదో చూడుడు.

"ఎంత బట్టబయలై పాడైపోయినది! ఇప్పుడేమి చేయవలసినది? తెలివి తక్కువయైన యాడు దిప్పు డేడ్చును. నే నట్లు లేడ్వను. కాని నా మాయ రాజ్య మంతయు వ్యాపింపకుండనే చప్పున నెవ్వనినైనఁ బెండ్లి చేసికొందును. నే నీ సారి మగనికొఱకై ప్రయత్నింపను. ప్రప్రథమమున నెవడు నన్ను వరించి యడుగునో మాఱుమాట చెప్పకుండ నాతనిని బెండ్లి చేసికొందును."

ఆమె ఇట్లు అనుకొనుటకు మాత్రమే కాదు— తన మాయ బయల్పడ నున్నది కాన ఎల్లరను చంపించి, తాను చావగల సమర్థురాలు. అందఱి అదృష్టము బాగుండబట్టి ఆమె యిట్టి నిర్ణయము చేసికొనినది. దాని ప్రకారమే ఆచరించి పద్మిని మురళీ మనోహరుని వివాహము ఆడుటకు స్థిరపఱచుకొనెను.

పానుగంటివారి ట్రాజి కామెడీలలో ఇది చక్కని నాటకము. పద్మిని సాధువు వద్దకు భవిష్యత్తును తెలిసికొనుటకు రత్నప్రభను ప్రోత్సాహపఱచి పంపుట; సంజ చీకటిలో వారిరువురను అనుమానాస్పదులను చేసి విజయ నారాయణవర్మకు చూపుట— షేక్స్పియరు నాటకములలో Much Ado About Nothing లో హీరో, క్లాడియసులను డాన్‌జాన్ వేఱు చేయుట గుర్తు చేయును.

ఈ నాటకమును గూర్చి ఇంతకంటెను ప్రత్యేకించి చెప్పుకొన దగిన విశేషములు లేవు.

# మాలతీమాల

ఇది నాలు గంకముల నవ్యనాటిక అని దీని ముఖపత్రమున వేసిరి. పిఠాపుర యువరాజు రాజా గంగాధర రామారావుగారి పరిణయ మహోత్సవమున ప్రదర్శించుటకై ఇది వ్రాయఁబడెను. పరిణయము 23_8_1929 న జరిగినది.

మాలతీమాల పంతులుగారి ఇరువదవ నాటకము. దీనిని వారు గంగాధర రామారావుగారికి అంకితము కూడ చేసిరి. తమ మొదటి రెండు నాటకములను రావు చెల్లయమ్మారావుగారికి అంకితము చేసిన పిదప తిరిగి ఇదియే వారు తమ నాటకమును ఒకరికి అంకితము ఇచ్చుట.

ఈ చిన్న నాటికయందు పాత్రలును తక్కువయే. కథా వైచిత్ర్యమును తక్కువయే. ప్రస్తావనలో తక్కువ పాత్రములతో నాటకము చేసిన నేర్పును కూచివారు ఎంతయు కొనియాడించినారు.

రాము దుర్గపు ఆస్థాన యువరాజు చంద్రశేఖరరావు గుణవతి అను కన్యను ప్రేమించి వివాహము ఆడుట దీనిలోని కథ, దాంపత్య శృంగార ప్రాముఖ్యము, సత్ప్రవర్తన మున్నగు అంశముల గూర్చి బోధలు ఇందులో ఉన్నవి. ఇందలి చతుర్థాంకము అంతయు నూతన వధూవరులకు పెద్దలు చేయు హితోపదేశమే.

మహారాజు వారి వివాహమునకు కోకిల నాటకమును పంతులుగారు వ్రాసిరి. యువరాజుగారి వివాహమునకు ఇప్పుడు ఈ నాటకము. రెండును శృంగార రస ప్రధానములే. అయినను వారి వయస్సులో అప్పటికిని ఇప్పటికిని ఎంత అంతరమో ఉన్నది. వారి దృక్పథములందును భేదము వచ్చినది. ఇది 1929 లో సరస్వతీ విద్యున్ముద్రాక్షర శాలయందు ముద్రితము అయినది.

# గుణవతి

ఇడా పంచమి అను నామాంతరము కల ఈ నాటకము పంతులుగారి నాటక కృతులలో ఇరువది యొకటవదిగా లెక్కింపబడినది. 1930 లో ముద్రణమందు ఉన్నట్లుగా ప్రకటింపబడిన వానిలో ఇది ఒకటి అయినను, ఎందుచేతనో అప్పుడు ఇది అచ్చు కాలేదు. పంతులుగారు కాలము చేసిన తరువాత ఎనిమిదేండ్లకు 1948 లో మఱి కొన్నింటితో పాటు ఇది పిఠాపురము సంస్థానాధిపతులచేత అచ్చు వేయింప బడినది.

పంతులుగారు దీనిని, మణిమాలను లెక్కలో వేసికొని, ఆ తరువాతిది అయిన సరోజినిని ఇరువది మూడవదిగా పేర్కొనియున్నారు. అప్పటిలో దీనికి నాంది ప్రస్తావనలు కూడ వారు వ్రాయించను లేదు — వ్రాసికొనను లేదు. పంతులుగారి పీఠికయు దీనిలో లేదు. రచనకూడ అప్పుడు సంపూర్ణముగ చేసిరో, లేక తరువాత చేసిరో సంశయాస్పదముగ ఉన్నది.

మాలతీమాల, ఆ తరువాత నాటకములలో పంతులుగారి నాటకములందు సృజనాత్మక ప్రతిభ వెనుబాటు పట్టినట్లు తోచును. అందును వారి యనంతరము ముద్రణ పొందిన లఘు నాటక కృతులు మఱియును పేలవముగా ఉన్నవి.

గుణవతి యందలి కథ సాంఘికమైనది. రాజేశ్వరరావు అను నియోగి బ్రాహ్మణ యువకుడు రాధ అను ఒక కన్యను, ఆమె తల్లిని మోసగించి తన గ్రామమునకు తీసికొని పోవును. తనకు నాల్గువందల యెకరముల భూవసతి, మూడు లక్షల రూపాయల నిల్వ ఉన్నట్లు వారిని నమ్మించి, రాధపై తనకు వలపున్నది కావున ఆమెను వివాహము చేసికొందునని చెప్పెను. రాధ శ్రీవైష్ణవ కుటుంబములోనిది. తానును శ్రీవైష్ణవుడే అయినట్లును, తనపేరు కాందూరి లక్ష్మీనారాయణాచార్యులు అనియును కూడ అతడు చెప్పుకొనెను.

రాధ తల్లి అగు సుభద్రతో ఆ గ్రామమునకు వెళ్ళిన వెనుక, తనకు ఉంపుడుగత్తె, తనకంటె వయసులో పెద్దది అయిన నాగమ్మ అను ఒక దాసిని, తన తల్లి అని వారికి పరిచయము చేసెను. వారిని ఒక యింటిలో ఉండ నియమించి, అచ్చట దొంగల భయము ఎక్కువగా ఉండుటచే, వారి నగలు తాను పుచ్చుకొనెను. రాధను వివాహము చేసికొనకుండ చెడగొట్టుటకు ప్రయత్నించి విఫలుడయ్యెను.

ఆ ఊరిలో గణపతి రావు అను మిత్రుని ఇంటికి ఒకనాడు ఇతడు భోజనము చేయబోయి అతని భార్యను చూచి, ఆమెపై భ్రమ పడెను. మోసమున ఆమె పొందు సంపాదింప దలచి, రాధవద్ద తాను తెచ్చిన నగలమూట గణపతి రావునకు దాచనిచ్చి రసీదు పొందెను. గణపతిరావు ఆ నగలను దొడ్డిలో సున్నపుకుండ క్రింద పెట్టెను. భార్యయగు కమల ఒత్తిడిపై నగలమూట మిత్రుడు ఇచ్చుట, దానిని తాను ఫలాని చోటున దాచుట మున్నగు వివరములను అతడు చెప్పుచుండుట రాజేశ్వరరావు దొంగచాటుగ విని, ఆ మూటను సునాయాసముగా అపహరించెను. మఱునాడు మూట పోయినట్లు చూచి కమలయు, గణపతిరావును కలవరపడిరి.

తుదకు కమల తాను రాజేశ్వరరావు వద్దకు పోయి, అతడిచ్చిన నగలు పోయినవి గనుక వాని విలువకు సొమ్ము క్రమముగా ఇచ్చి తీర్చుకొనగలమని తెలిపెను. అతడు కొంతసేపటికి మెత్తపడినట్లు నటించి, కమల గనుక తన కోర్కె తీర్చుటకు అంగీకరించిన, సొమ్ము వదలుకొందునని తన తుచ్ఛ వాంఛ బయటపెట్టెను. ఆమె మఱునాడు కలిసికొని ఏ సంగతియు చెప్పెదనని పోయెను.

కమల వచ్చుటకు కొంచెము పూర్వము దాసి నాగమ్మ తాను చేయుచున్న అన్ని సేవలకును ప్రతిఫలముగా ఒక చిన్న యిల్లు కొనిపెట్టుమని కోరుట, అతడు సమ్మతించక పోవుటచేత దానికి కోపము వచ్చుటయు జరిగినది. దానితో నాగమ్మ కమలను ఇంటికి పోవుచుండగా ప్రక్కకు పిలిచి రాధ, సుభద్ర ఉన్న యింటికి పోయి, వారితో మాట్లాడుమని గుర్తులు చెప్పి పంపెను.

తరువాత దినమున కమల రాధా సుభద్రలను వెంట పెట్టుకొని వచ్చి, వారిని చాటుగా ఉంచి, తాను ఒక్కరిత రాజేశ్వరరావును కలిసికొని అనుకూలముగా ప్రసంగించెను. అతడు తాను చేసిన పథకము తెలిపి, నగలమూట, రసీదు తిరిగి ఇచ్చివేసెను. అంతట కమల రాధను, సుభద్రను ఎదుటికి రప్పించి అతనిని కన్నములో దొంగవలె పట్టుకొనెను. రాజేశ్వరరావు అల్లరినుండి, పోలీసుల బాఱినుండి తప్పించుకొనుటకు, తాను చేసిన పాపములకు పరిహారముగా తన వద్దనున్న ముప్పదివేల రూపాయలలో సగము రాధకు, ఏడువందలు ఇల్లు కొనుటకు నాగమ్మకు, తక్కినది ధర్మ వైద్యశాలకు ఒసగుటకు ఒప్పుకొనవలసివచ్చెను.

ఇంతలో కమల చేసిన ఏర్పాటును అనుసరించి, ఆమె భర్త గణపతి రావు, సోదరుడు శోభనాద్రిరావు అక్కడకు వచ్చిరి. తల ఎత్తుకొనలేని పరిస్థితిలో నుండి రాజేశ్వరరావు వారితో ఇట్లు చెప్పెను.

" మహా సుందరియగు రాధయను కన్యను నేను వివాహమాడ నిశ్చయించుకొని తెచ్చితిని. వీరి కుటుంబము మిక్కిలి సత్సంప్రదాయము గలదని నేను విని యామెను దెచ్చితిని. కాని నాకు మారక దశ సమీపించు చున్నదని యొక జ్యోతిష్కుడు నిన్నను చెప్పగా విని దాని గొంతుక గోయుట ఎందుల కని, వివాహ ప్రయత్నమును మాను కొంటిని. ఇక్కడి కామెను నిష్కారణముగా దెచ్చినందుల కామెకు నా యాస్తిలోఁబదునైదు వేల రూపాయ లిచ్చితిని. ఇది నా బుద్ధిపూర్వకముగ నిచ్చిన యీవి గాని మఱియొకటి కాదు. ఇదికాక ఇచ్చటి ధర్మ వైద్యశాలకు మిగిలిన పదునైదు వేల రూపాయలును దానమొనర్చితిని. ఈ దానములు నే నొకరి ప్రోత్సాహమునగాని, యొకరి బలాత్కారమున గాని యేదైన భయము వలనగాని చేసినవి కావు."

రాధను తన సోదరుడు అగు శోభనాద్రి రావునకు ఇచ్చి అప్పటి కప్పుడే కమల పెండ్లి చేయించెను. ఆ దినము ఆషాఢశుద్ధ పంచమి. దానినే ఇడా పంచమి అనియు అందురు. ఆనాడు పై వ్యవహారము జరుగుటచేత దీనికి పంతులుగారు ఆ రెండవ పేరు పెటిరి.

వ్యాసము

ఈ నాటక కథ పూర్వము పంతులుగారు వ్రాసిన కథాలహరిలో ఉన్న "మోసము" అను కథనుండి పెంచి వ్రాసిరి. పాత్రల నామములు కొన్ని మార్పు పొందినవి.

| కథలో | నాటకమున |
|---|---|
| నాగేశ్వరరావు | రాజేశ్వరరావు |
| శ్యామలాంబ | కమల |
| | సుభద్ర |

రాధ, గణపతిరావుల పేర్లు రెండు స్థలములను ఒకే విధముగా ఉన్నవి.

శోభనాద్రిరావు, నాగమ్మ పాత్రలు నాటక కథలో క్రొత్తగా ప్రవేశ పెట్టబడినవి. కావున ఈ పాత్రములతో సంబంధించి యున్న కథాంశములు కూడ క్రొత్తగా చేర్చబడినవి అని వేఱుగా చెప్పనక్కఱ లేదు గదా! కథలో శ్యామలాంబ మొదటి పర్యాయము నాగేశ్వరరావుతో మాటలాడి ఇంటికి పోవుచు, యాదృచ్ఛికముగా రాధను కలిసికొనెను. నాటకమున నాగమ్మ పాత్రచే ఈ సంఘటనము కలిగింప బడినది.

ఈ నాటకము పంతులుగారి సాంఘిక నాటకములలో విశిష్టమై యున్నది. ఆ విశిష్టత ఎట్టి దనిన, ఇందలి ప్రసంగములు, పాత్ర షంభాషణములు కథా కథన వేగము కలిగి సూటిగా నడచినవి. సాంఘిక వాతావరణమునకు భంగ కరమగు ఎట్టి వృత్తాంతమును లేదు. నాయకుడు దుర్మార్గవర్తనుడు. వానిని కమల అణచుటచే నాటకము సుఖాంత మైనది. స్వగతముల ఆధిక్యము కాని, ఉపన్యాస ధోరణులు కాని యిందు లేవు. అటంకముల ఈ నాటకమున పద్యములు అసలే లేవు.

ఇందలి పాత్రలలో కమల చెప్పుకొన తగినది. ఈ పాత్ర చిత్రణమున మొదట కథ వ్రాయునప్పటికంటె నాటకము వ్రాయునప్పుడు పానుగంటి వారు ఎక్కువ శ్రద్ధ కనబఱచినారు. ఈమె స్థానమున మఱియొక సాధారణ స్త్రీ

ఎవ్వతె యైన నున్నచో కథ దుఃఖాంతము కావలసి వచ్చెడిది. గణపతిరావు నగలు పోయినవని దిగులుపడి కూర్చున్నప్పుడు కమలయే ధైర్యముతో వ్యవహరించి యున్నది. ఈ నగలమూట దాచనిచ్చుటలో ఏదో అంతర్యము ఉన్నదని ఆమె తెలివిగా పసికట్టినది. భర్త అతనిని సరిగా అర్థము చేసికొనజాలక పోయె ననియు ఆమె తెలిసికొని ఇట్లు చెప్పినది.

"నీ కాతఁడు మిత్రుఁ డనియుఁ, గొంత యోగ్యుఁడనియు నీ యభిప్రాయమై యున్నది. నీ వాతని మనస్సును బాగుగా పరీక్షింప లేదని నా యభిప్రాయము. అతఁడు మనకు బహిర్మిత్రుఁడు - నంతర్విరోధి యనియు, నతని నడవడి మంచిది కాదనియు నా సందేహము."

"విటునికిఁ దన యుంపుడు గత్తె లావణ్యములో నెన్ని లోపము లగపడునో, మిత్రుని కవితలో మిత్రున కెన్ని దోషము లగపడునో, మనుష్య ప్రకృతిలో మంచివాని కన్ని లోపము లగపడును. ప్రపంచ పరీక్షకు మంచివాఁ డర్హుఁడు గాఁడు అని అమె పలికినది. అంతటి విజ్ఞానవతి ఆమె.

స్త్రీ పాత్రల బాహుళ్యము వలన కలుగు ఇబ్బంది కాక పోయినచో ఇది ప్రదర్శించుటకు చక్కని నాటకము అనిపించును. 101 పుటలు గల ఈ పుస్తకము నవ్యనాటకములకు త్రోవ చూపించు మంచి రచన. ఇది కాకినాడ ముద్రాక్షరశాలలో ముద్రితమైనది.

# మ మా ల

గుణవతి వలెనే పంతులుగారి యనంతరము 1948 లో పిఠాపుర ప్రభువులచే ముద్రింపబడి ప్రకటింపబడిన మఱియొక నాటకము మణిమాల.

ఇది కల్పితేతి వృత్తము గల ఆఱంకముల నాటకము. దామోదర రాజు పుత్రుడు దయాళుడు. జయసింహ నృపతి కొమార్తె యశోధర. వీరు పరస్పరము ప్రేమించి వివాహము చేసికొనదలచి యుండిరి. ఆ దేశపు చక్రవర్తి తనయుడు, అమిత కాంతాలోలుడు, దుర్మార్గుడు అయిన పార్థసారథి అను వాడు యశోధర గుణరూప లావణ్యాదులు విని మోహితుడై దయాళుని దొంగచాటుగా పట్టి ప్రచ్ఛన్నముగా బంధించును. యశోధర పండితుని వేషమున అతని వంచించి, బంధించి, తన ప్రియుని విడిపించుకొనును. పార్థసారథి తుదకు బుద్ధిమంతుడై యశోధరా దయాళుల వివాహము జరిపించి, మణిమాలను కానుకగా నిచ్చును.

ఈ నాటక కథను తీర్చుటలో పంతులుగారు ముక్కుకు సూటిగా పోయినారు. సంభాషణాత్మకతయే కాని నాటకీయత దీనిలో ఎక్కువగా లేదు. ఒకటి రెండు పాత్రలను పోషించుటలో తమకు సహజమగు చమత్కారము కనబఱచినను, మొత్తము మీద ప్రధాన పాత్రముల తోనే కథను ఈడ్చివేసినారు.

పార్థసారథిని దుర్మార్గుడుగానే మొదట చిత్రించినను, వానిలో తుదిని పరివర్తనము చూపి సానుభూతి పాత్రుని చేసినారు. తాను చక్రవర్తి కొడుకు అగుటచేత విశృంఖల ప్రవర్తనము, సర్వ ధనస్వామిత్వము, సర్వ కాంతా భర్తృత్వము మున్నగునవి తప్పులేదను భావనతో మూర్ఖుడుగా నాటకారంభమున ఇతడు కనుపించును. తండ్రికి విషము పెట్టి చంపి యైనను, సత్వరము ప్రభువు కావలెనని యోజన చేసినాడు. కాని మార్పు వచ్చినప్పుడు హఠాత్తుగా మంచి

వాడైనాడు. అది ఎట్లు సాధ్యమైనది అని దయాళుడు ఆశ్చర్య పడినప్పుడు అందుకు అల్పులగు భటులు, ఆడుది చీవాట్లు పెట్టి, పిదప ఏమి విఱుచుకొని పడునో అని చూచువేళ దయాళుడు వచ్చి మహా శాంతముగ మాటలాడుట చేత ఇట్లు జరిగినది అని అతడు వివరించును.

ఆ సందర్భమున తన తత్త్వమును గూర్చి ఒకటి రెండు విషయములు చక్కగా చెప్పినాడు.

" శుద్ధవాత రోగమున్నదే - అది యెంత భయంకర లక్షణములు గల దైనను రెండు వాతరాక్షసపు మాత్రలతో టక్కున శాంతించును. రవంత శీతము, రవంత పైత్యము కలిగిన జ్వరమున్నదే యది దీనికి బెట్టగ నది వృద్ధి యగుచు దానికిఁ బెట్టగ నిది వృద్ధియగుచుఁ గొన్నినాళ్లు బాధించును. మహోన్మాద మున్నదే—అది వెంటనే తగ్గిపోవును. కాని రవంత తెరపి, రవంత మఱపు గలది మాత్రము చిరకాలము నిల్చును. ఇట్టె యిట్టె యుదయమున సాలగ్రామ ములపైఁ బుష్పము లుంచి యట్టె యట్టె సందె చాటున సానిదాని కొప్పులోఁ బూలుంచు భక్తిరక్తి మధ్యగతుఁడున్నాఁడే - వాని కారోగ మెన్నటికి శాంతిం పదు. నాది సాంకర్యము లేని శుద్ధమదన వికార మహోన్మాద రోగము— కావున వెంటనే శాంతించినది. "

" పందెపు గుఱ్ఱమునకుఁ గళ్లెము బిగబట్టిన కాలఁది రోషము, పరుగు హెచ్చయి పోవును. చూచితివి కాదా ? దాని కాయాస మెప్పుడు వచ్చునో యప్పు డాఁగ వలసినదే. అట్టి తత్త్వమునాది. "

పెద్దగా చెప్పుకొన దగిన వైచిత్రి ఈ నాటకమున లేదు. ఇది పద్యములు లేని వచన నాటకము. పంతులుగారి శేముషీ ప్రతిభలకు ఇది చెప్పుకొన దగిన రచన కానేరదు.

# సరోజిని

ఓలేటి పార్వతీశ కవిగారు తమకు చెప్పిన పురాణస్థమగు ఒక కథను పంతులుగారు ఈ ఎనిమిది అంకముల నాటకముగా మలచినారు. ఇది వారి ఇరువది మూడవ నాటకము-విషాదాంత నాటకములలో రెండవది. 1930లో ఇది శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షర శాలయందు ముద్రించ బడినది.

ప్రస్తావనలో కూచివారు ఈ కథలోని ముఖ్యాంశములను అన్నింటిని చెప్పించి, ఈ నాటకములో మాయా ప్రభావము అధికముగా కన్పడు చున్నదని వివరణము చేయించిరి. దీనిని భయానక రసాత్మకముగా వారు పేర్కొనినారు.

దీనిలోని కథ మూడే ముఖ్య పాత్రలతోడ నడచినది. పద్మనాభశాస్త్రి భార్య సరోజిని. తమకు సంతానము లేనందున మగని మెడలు విఱిచి, ఆమె తనమేన గోడలు పార్వతిని భర్త రెండవ భార్యగా స్వీకరించునట్లు ఒప్పించినది. పద్మనాభ శాస్త్రి దానివలన ఎవ్వరికి సుఖము ఉండదని స్పష్టముగా చెప్పినను సరోజినికి తలకు ఎక్కలేదు. తీర పెండ్లి యైనప్పటి నుండియు, ఆమెకు పార్వతిపై అసూయ పొడమెను. కొన్నినాళ్లకు పార్వతి గర్భవతికాగా, తన్నాశనమునకు మందు పెట్టినది. పసివాడు పుట్టిన వెనుక వానిని చంప వలెనని కూడ యత్నించినది. కానిదైవ వశమున వారికి ఎట్టి ఆపదయు వాటిల్లక సరోజినియే మరణించినది.

ఈ కథ శివపురాణము నందలిది. అందలి సందర్భము కథ తీరు చాల భిన్నముగా నున్నవి. మహారాష్ట్ర దేశమున దేవగిరి యందు సుధర్ముడు అను పేరుగల బ్రాహ్మణుడు ఉండెను. ఆయన మొదటి భార్య సుదేహ. వారికి సంతానము లేకపోయెను. అందుచేత సుదేహ ఒత్తిడి చేసి, తన భర్తకు తన చెల్లెలినే ఘుశ్మ అను దానిని ఇచ్చి వివాహము చేయించెను.

ఘుశ్మ శివభక్తురాలు. దినదినమును నూటయొక్క పార్థివ లింగములను నిర్మించి విధి విధానమున పూజించి, సమీప తటాకమున పడవైచు చుండెను. ఆమెకు పుత్రోదయ మయ్యెను. ఆ కుమారుడు పెరిగి పెద్దవాడై విద్యా బుద్ధులు నేర్చెను. అతనికి వివాహము జరిగి భార్య కాపురమునకు వచ్చెను.

భర్త సుధర్ముడు, చెల్లెలు ఘుశ్మ, కొడుకు, కోడలు తనను ఎంత నెత్తిన బెట్టుకొనిన, సుదేహకు తృప్తి లేకపోయెను. సపత్నీ ద్వేషబుద్ధి గలదియై ఆమె ఒకనాడు రాత్రి కొడుకును కత్తితో పొడిచి చంపెను. శవమును సుదేహ తటాకమున పడవైచెను.

కొడుకు మరణవార్త తెలియునప్పటికి ఘుశ్మ శివపూజ చేయుచుండెను. ఆమె ఎంతమాత్రమును చలించక ఓర్పుతో నిబ్బరముతో యథావిధి పూజ ముగించి పార్థివ లింగములను తటాకమున పడవైచి తిరిగి వచ్చుచుండెను.

అంతట ఆమె కొడుకు శివానుగ్రహమున బ్రతికి వచ్చెను. పరమశివుడు ఆమెకు ప్రత్యక్షమై ఆమె సవతిని తన త్రిశూలముచే ముక్కలు ముక్కలుగా ఖండింతు నని చెప్పగా, ఆమె

కీ డొనరించిన వారికిఁ
గూడఁ బ్రభూ! మేలు సేయగూడున్ గాదే
ఊడదె నీ దరిసెనముఁ
గూడని తలఁపది సుదేహకున్ సుచరిత్రా!

అని చెప్పెను. ఘుశ్మ గొప్ప బుద్ధికి మెచ్చుకొని శివుడు ఆ తటాక ప్రదేశమున ఘుశ్మేశ్వరుడు అను పేర వెలసెను. సుదేహ పశ్చాత్తప్తురాలై పరివర్తనము పొందెను.[1]

1. ఈ కథ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారి శివభక్తి విజయ కథావళి నుండి గ్రహింపబడినది. శాస్త్రిగారు శివపురాణము పద్యకావ్యముగా వ్రాసిరి.

ఈ నాటకమున అత్యంత ప్రాధాన్యము వహించునది సరోజిని. ఆమె మనస్సు క్రమక్రమముగా ఎట్లు దుష్టమై ఆమె ఘాతుక చర్యలకు ఒడిగట్టునట్లు చేసినదో, ఆ పరిణామమును పోషించుటలో పంతులుగారు చూపిన నేర్పు అపారము.

పఠన, పాఠన, శ్రవణములకు ఈ నాటకము ఎంత సొగసుగా నుండునో, అంత రక్తి ప్రదర్శనమున ఉండుటకు అవకాశము నీయని దృశ్యము లిందున్నవి. త్వర త్వరగ ప్రశ్నము సమాధానము సాగిపోవలసిన పార్వతీ పద్మనాభ శాస్త్రిల సంభాషణములపై చాటున ఉన్న సరోజిని వ్యాఖ్యానము చేయు చుండును. ఈ దృశ్యమును రక్తిగా ప్రదర్శించుట ఎట్లు ?

మొత్తము మీద అల్పసంఖ్య గల పాత్రములతో మనస్తత్వ నిరూపణ పద్ధతికి ప్రాధాన్యము ఇచ్చి వ్రాసిన నాటకములలో ఉత్తమమైన వానిలో ఇది ఒక్కటి అని చెప్పవలయును. ఇంతకంటె విశేషముగా ఈ సందర్భమున చెప్పుకొనవలసిన దేమియు లేదు.

# 24

సరోజిని పంతులుగారి ఇరువది మూడవ నాటకము. రాతిస్తంభము (చూపు) ఇరువది యైదవ నాటకము. మధ్య ఇరువది నాల్గవ దేది ?

పంతులుగారి నూతన నాటక రాజములను వ్యాపార ప్రకటనబట్టి కాత్యాయని అను నాటకము ఇరువది నాల్గవది అని ముందు స్థిరపఱుపబడినది. నడుమ సంఖ్యలు గల గుణవతి, మణిమాలలు పంతులుగారు జీవించి యుండగా అచ్చు కాకపోయినను, వానిని ఆ సంఖ్యలతోనే వ్యవహరించి వారు తరువాతి నాటకములకు తరువాతి సంఖ్యలను ఒసగినారు. అట్లే కాత్యాయని అచ్చు కాకపోయినను దానిని 24 వదిగా లెక్కించి రాతిస్తంభమును ఇరువదియైదు అనియున్నారు అని భావింప వలసి యున్నది.

ఈ నాటకమును గూర్చి ఇది కల్పిత కథ అనియు, ఇందు కాత్యాయని ప్రజ్ఞావిశేషము, శత్రు సంహరణ చాకచక్యము, మాయా విశేషము మున్నగు గుణములు వెల్లడి యగును అని వ్యాపార ప్రకటన వలన తెలియ వచ్చినది. ఇది కష్టాంత నాటకము.

పంతులుగారు సంఖ్యలతో పేర్కొనిన వానిలో చివరి నాటకము విచిత్ర వివాహము 26 వది. వారు కాలము చేసిన పిదప వారి కుమారులు అముద్రితము లగు "ఆఱు నాటకములను, రెండు వ్యాసములను" ప్రకటింప వలసినదిగా పిఠాపురపు ప్రభువును అభ్యర్థించిరి. అవి యన్నియు మూడు చిన్న పుస్తకములుగా వెలువరించ బడినవి. వీనిలో కాత్యాయని లేదు.

1948 లో ప్రకటింపబడిన మూడు చిన్న పుస్తకములకు సంబంధించిన వివరములు ఈ క్రింద ఈయ బడినవి.

I గుణవతి

లేక ఇడాపంచమి (21) నాటకము

II 1) మణిమాల (22)

2) సుబ్బరాజు

అను కానుగుచెట్టు

III 1) పరప్రేమ

2) రామరాజు

3) చిన్ననాటకము

4) ప్రేమతత్త్వము ్యాసము

5) అద్వైతము

కావున కాత్యాయని వ్రాసిరో, వ్రాయుటకు తలపెట్టిరో, సగము వ్రాసి విడిచిరో - ఏమియును చెప్పుటకు వీలుకాని స్థితిగా ఉన్నది.

ఏమయినను ఆ సంఖ్యగల నాటకము వెలుగునకు వచ్చినది లేదు.

# రాతిస్తంభము

ఇది పంతులుగారి నాటకములలో ఇరువది యైదవది, కష్టాంతములలో నాల్గవది. 1930 లో పిఠాపురము నందలి శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షర శాలయందు ముద్రింపబడినది.

పంతులుగారి ఇరువది యైదవ నాటకముగా వ్యాపార ప్రకటన బట్టి ఏర్పడుచున్న చూపు అనునది, రాతిస్తంభమును వేర్వేఱు నాటకములు కావనుట నిరూపింప బడగలదని ఇంతకు ముందు చెప్పబడినది.

రాతిస్తంభమున కథానాయకుడు నారాయణరావు త్రాగుబోతు, వేశ్యాలోలుడునై తల్లిని, భార్యను కష్టపెట్టును. తల్లి అంత్య కాలమునకు దగ్గఱనుండక వేశ్య యింటికి పోగా, అతనిని పిలిచి కొని వచ్చుటకు భార్యయగు లక్ష్మి పోవును.

వేశ్య వేళా కోళముగా నోటికి వచ్చినట్లు మాటాడగా, వృథాభిమాన యుతుడై నారాయణరావు వచ్చిన భార్యను కఱ్ఱతో కొట్టెను. తల్లి మరణించినది. భార్యయు ఈ దెబ్బకు మరణించెను. ఈ లోపున ప్రమాదము వలన కుమారుడు మూడేండ్లవాడు కుంపటిలోపడి కాలి పోవును. ఈ సంఘటనలచే గుండె పగిలి నారాయణరావు కూడ తుదకు మరణించెను.

చూపును గూర్చిన వ్యాపార ప్రకటన దీనికి సరిగా సరిపోవుచున్నది.

"ఇదికూడ కష్టాంతము. సాంఘిక నాటకము. ఇందులో గృహాధిపతి దుర్నయము వలన నతని కుటుంబములోని యందఱు నశింతురు. ఇందులోని యుత్తమ నాయిక యైన లక్ష్మి యెట్టి సుగుణవతియో తెలిసికొన దగినది."

దీనిని బట్టి ఈ వ్యాపార ప్రకటన యనంతరమున దీని పేరు మార్చిరని ఊహింపవలసి యున్నది. కాని అచ్చయిన నాటకపు పీఠికలో, ఆ విధముగా మార్చినట్లు పంతులుగారు సూచన చేయలేదు.

వేశ్యా గృహమున భర్త తనసు కొట్టినప్పుడు లక్ష్మి ఆతని నేమియు అనక తిరిగి వెళ్లనప్పుడు అతనికి నమస్కరించుచు ఒక్క "చూపు" చూచినది. దానిని గూర్చి నారాయణరావు ఇట్లు అనుకొనును.

"అట్టి చూపు మాత్రము నే నెక్కడను జూడలేదు. అదియేమో వింతగా నున్నది. ఆ చూపుతో నామనస్సు చేయిపెట్టి కలిపినట్లయినది. ఆ చూపులో దైన్య మున్నది — ధైర్య మున్నది. దయ యున్నది — ఒకింత కాఠిన్య మున్నది. అన్నిటిని మించిన దేదో యలౌకిక తేజమున్నది."

మఱల పంచమాంకమున లక్ష్మితో మాటాడుచు అతడిట్లు చెప్పెను.

"దుర్మార్గుడనై, కిరాతుడనై నిన్ను గఱ్ఱతోఁ బ్రక్కటెముకలలోఁ బొడచి నప్పుడు నీవు నావంకఁ జూచిన చూపున్నదే: అది నా మనస్సులో నేదియో మార్పు గలుగఁ జేసినది మనస్సునకుఁ బుట్టిన వెఱ్ఱి వెఱ్ఱి తలల నఱ్ఱి ఛేదించి నట్లయినది. హృదయములోనున్న మాలిన్యమునకు నిప్పంటించి నట్లయినది. ఎఱ్ఱగఁ గ్రాగిన లోహము మూసలోనున్నప్పుడు కమసాలి గొట్టముతో నూది లోనున్న కశ్మలత్వ మెగురఁ గొట్టి నట్లయినది. నా యనుభవ మనేక విధములుగా నున్నది. ఆ చూపు నా చిత్తమును గట్టిగ నూచి దులిపి నట్లొకప్పు డుండెను. రెండు చేతుల నడుమఁ బెట్టి గట్టిగ నలిపి రసము పిండి నట్లొకప్పు డుండెను. మనస్సులోనుండి యేదో యావలికిఁ గొంత పోయినట్లున్నను మనస్సు నీరసముగా లేక బలముగా నున్నట్లున్నది. ఇదేమో నాకు వింతగా నున్నది."

ఇంత ప్రభావము ఆ చూపునకు ఉండుటచే పంతులుగారు దీనికి మొదట "చూపు" అని నామకరణము చేసిరి. ఇక తుదకు నారాయణరావు మరణించుచు పొరుగింటి నరసయ్యతో తన దుర్మార్గ చరిత్రమును రాతి స్తంభముపై వేయించు మని కోరుటచేత దీనికి రాతి స్తంభము అని పేరు మారినది.

"పశుగుణము వోదు ప్రతి పశు వర్తనమున
నాత్మ తేజంబు చేతనే యణగు గాని"

అనియును,

"చెడుగు పేరొక చెడుగుచే నుడుప నెంతు
పేని యింకొక దుష్కృతిఁ బృథ్విఁ జొన్పు
దందుచే క్షాంతినే యది యడచివైవు"

మనియు నుపదేశించుటకై ఈ రూపకము రచింపబడినది.

రాతిస్తంభము అయిదంకముల నాటకము. కథానాయకుడు నారాయణ రావు దుర్నయపరుడై ఇంటిని నాశనము చేసికొనెను. అతని భార్య ఆతని ప్రవర్తనను తన ప్రాణములు బలిచేసి మార్చగలిగెను. కాని అతని హృదయమున పరివర్తనము ఆరంభమైనప్పటికి భార్యాపుత్రులు మరణించగా అతడు భ్రంశించిపోయెను. తుదకు గుండె పగిలి ఆతడును మరణించెను. ఈ విధముగా పచ్చగా నడువవలసిన ఒక సంసారము, మూడు నిండు జీవితములు వ్యర్థమై విషాద భావమును కలిగించుచున్నవి.

నాయకుడు విషాదాంత నాటకోచితమైన ఔన్నత్యము కలవాడు కాడు. సామాన్యుడు, ఎంతటి వానికి ఎట్టి అధః పతనము అను భావమును అతడు కలిగింప లేడు. పూర్వోక్తౌన్నత్యము కల పాత్ర లక్ష్మి. జీసస్, బుద్ధుడు వారి బోధల నాచరించి చూపు ఉత్తమురాలినిగా కవి ఈ పాత్రను చిత్రించెను. లక్ష్మిలో ఒక లోపమును లక్షింపవచ్చును. ఆమె అత్తగారు అనినట్లు ఆమె మెత్తదనము చేతనే భర్త పాడైనాడు. ఆమె యోగ్యత కాపాడు కొనుటకే ఆమె చూచినది కాని, అతనిని నిరోధించి బాగు చేయవలయునని ఆమె చూడలేదు.

కథాంశములలో నూతనత్వము ఏమియు లేదు. నాటకాంతము ప్రధాన పాత్రల మృతులతో బరువైనది. విషాదాంతతకు దారి తీసిన అంతరంగ సంఘర్షణము దృఢముగా ఎచ్చటను లేదు. కాగా సమాజము నందున్న కొన్ని దురాచారములను గూర్చి బెదరు పెట్టుటకు, నిరసించుటకు వ్రాయబడిన నాటకము అనవచ్చును.

# విచిత్ర వివాహము

శారదా చట్టము త్వరలో రానున్నదని జరిగించిన అతి బాల్య వివాహముల ముచ్చట ఇతివృత్తముగా గల ఈ హాస్య నాటకము పంతులుగారి నాటక కృతులలో ఇరువది ఆఱవది. దీని రచనా కాలము స్పష్టముగా పంతులుగారు ఇచ్చి యుండలేదు.

అయినను, నాటక తృతీయాంకమున పెండ్లి మంత్రములు చెప్పుచు పురోహితుడు చెప్పిన తిథి వారాదులను బట్టి సుమారుగా చెప్పవచ్చును. అక్కడ ఉన్నది— "శుక్లనామ సంవత్సరే, ఫాల్గుణమాసే, శుక్లపక్షే – శుక్రవాసరే." ఇది 1930 మార్చి చివఱభాగము అగును.

ఈ నాటకము మొట్ట మొదటి సారిగా 4-11-1931 న ప్రదర్శింపబడినట్లుగా తెలియుచున్నది.

కూచి నరసింహముగారు దీనికి వ్రాసి యిచ్చిన ప్రస్తావనలో అపహాస్యము చేయు పద్ధతిలో వ్రాసిన ఈ ప్రహసనమును గూర్చి చర్చించిరి. అతి బాల్య వివాహములు చేసిన వారి చిత్తములను ఈ అపహాసాసి గ్రుచ్చుకొని బాధించినను, తుదకు వారిచేత ఇట్టి పనులు మానిపించుటచేత ఇది హింసక మగు కత్తికాదు— శస్త్ర వైద్యునిచేతి శస్త్రము అని తేల్చిరి. అట్లె "చిన్న రోగాణు జీవిని అక్షికిని పెద్దగా జూపు భూత కాచమువలె కవి స్వల్పదోషములను కొండంతచేసి చూపును. ఇందలి అసంభవములని కొందఱు అను కొనుచున్నవి విపరీత సంభవములే గాని యసంభవములు కావు. సాత్మ్యములో సర్వానర్థ కరములగు అతిశయోక్తులు ప్రహసనములకు పంచ ప్రాణములగును." అనియు తమ అభిప్రాయము సూత్రధారుని చేత చెప్పించిరి.

మంగళ్లు, చాకళ్లు, పురోహితులు-వీరి కలవు ; పది లగ్నములలో ఏదియు దాటి పోకుండ డబ్బు చేసికొనవలె నని వీరి కక్కుర్తి, రెండేండ్ల పిల్లలకు, మూడేండ్ల పిల్లలకు వివాహము చేయకున్న ఏమో మునిగిపోవునని ముసలి వారు పడు కంగారు-ఇత్యాదు లన్నియును ఈ ప్రహసనమునకు సంఘటనలు సమకూర్చి పెట్టినవి.

నాలుగేండ్ల పెండ్లికొడుకు గోళీలాటకై దేవురింపగా, వానిని బలవంతముగా పట్టుకొని పెండ్లి చేయుట, రెండేండ్ల పెండ్లికొమార్తె గంపలో కూర్చుండక పోగా, తల్లికూడ గంపలో కూర్చుండ వలసి వచ్చుట, పెండ్లి కొడుకు అల్పాచమానముతో అగ్నులకు గతి తప్పుట ; ఇట్లు ఎన్నో విశేషములతో ఈ ప్రహసనము పంతులుగారు నింపిరి.

పురోహితుని హడావిడిలో మంగళ సూత్రము కట్టింపకుండ పెండ్లియైన దనిపించును. ఇంటికి పోయిన వెనుక రొంటిలో నుండి సూత్రములు రాలగా, ఏమి చేయవలయునో తోచక రాత్రికి రాత్రి పోయి చీకటిలో పిల్ల మేనత్త ఒక వితంతువు ఉండగా ఆమె మెడలో కట్టివచ్చును. మఱునాడు అది దయ్యపు చర్యగా నిరూపించి, ఆమెచే పెండ్లి కూతురు మెడలోనికి మార్పించును. ఇది పతాక సన్నివేశముగా ప్రహసనమును ముగించిరి.

అతి సరళముగా సాగిపోవు సంభాషణములు, సంభాషణలను, సన్నివేశములను ఆశ్రయించి కడుపుబ్బించు హాస్యము ఈ ప్రహసనమునకు వన్నె తెచ్చును.

# సుబ్బరాజు

## అను కానుగ చెట్టు

కానుగ చెట్టు అను పేరుతో పంతులుగారు 1919 లో ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలో ఒక కథ ప్రకటించినారు. సాక్షి సంఘములో చదువుటకై ఎవ్వరో పంపించినట్లు దీనిని మఱల ఆఱవ సంపుటమున ప్రచురించిరి. ఆ కథనే పంతులుగారు ఎనిమిది అంకములలో ముప్పది మూడు పుటలలో నాటకముగా చేసిరి. ఇది పంతులుగారి అనంతరము మణిమాల నాటకముతో కలిపి ఒక సంపుటముగా వెలువరింప బడినది. ఇందు కొన్ని అంకములు రెండు పుటలకు మించిలేవు. మొదట వ్రాసిన కథలో నున్న బిగువు నాటకమున లేదు.

సుబ్బరాజు నిరతాన్న ప్రదాత. భాగవత మహాగ్రంథముపై, పోతన్న గారిపై విశేష గౌరవముగల రామభక్తుడు. ఇతడు కొంత కాలమునకు నిర్ధను డయ్యెను, అటుపిమ్మట భార్యతో, కూతురుతో దేశాంతరము పోయి అక్కడి పరిపాలకుడైన నవాబు గుఱ్ఱపు బండిలో పోవుచుండగ ఆపి తనచే పుణ్య గ్రంథములకు ప్రతులు వ్రాయించి, తగు భృతిని ఏర్పఱపుమని ప్రార్థించెను. నవాబు భటుడు అపహాస్యముగా జందెముపై చేయివేయగా అతనిని గంటముతో కొట్టెను. ఆ దెబ్బకు వాడు చచ్చెను, దానికై అతనికి మరణ శిక్ష విధింప బడెను. సుబ్బరాజు భార్య, కూతురు మహామారిచేత మరణించిరి. సుబ్బరాజును ఎవ్వరును చంపలేక పోయిరి. అతడు తలపైనున్న భాగవత గ్రంథమును క్రిందపెట్టి రామా అని అఱచుచు ప్రాణత్యాగము చేసెను. కష్టకాలమున అతని కుటుంబమునకు కానుగచెట్టు ఆశ్రయమిచ్చినందున ఈ కథకు ఈపేరు వచ్చినది.

# పరప్రేమ

ఇది ఆఱంకముల కల్పిత కథా నాటకము. గోపాలరావు అను ఒక బీదవాడు మాణిక్యము అను భార్యతోను, రామయ్య, లక్ష్మన్న అను పుత్రుల తోను, మంగమ్మ, శివమ్మ అను ఇరువురు పుత్రికలతోను కలిసి సీతారామ పురమున కాపురము చేయుచుండెను. వీరు తిండిలేక బాధపడుచుండెడి వారు. ఇట్లుండగా దైవకృపచేత గోపాలరావునకు లాటరీలో పది లక్షల రూపాయల సొమ్ము వచ్చును. గోపాలరావు మిక్కిలి లోభియై ఒక్క కానుకూడ కొడు కులకు ఈయక వారిని బాధించును. కొడుకులు గోపాలరావును బంధించి పిచ్చివాడు అని గదిలోనికి నెట్టజూతురు. ధనము రాకమునుపు ఒకరీతిగా, వచ్చిన పిదప మఱియొక రీతిగా అసౌఖ్యములు పొందిన ఆ కుటుంబ చరిత్రము ఈ నాటక కథావస్తువు.

దీనిలో సుబ్బారావు అను పేరుగల పుస్తక భాండాగారపు మేనేజరు, జగన్నాథరావు, సోమేశ్వరరావు అను ప్లీడర్లు, కొండలరావు, పాండురంగ విఠల్ అను ఇరువురు వయవంచకులు తక్కిన పురుష పాత్రములు. మాణి క్యము తల్లి సూరమ్మ మఱియొక స్త్రీ పాత్ర.

ధనము వచ్చిన తరువాత దానికొఱకై కుటుంబములో ఏర్పడిన కలతలను గూర్చి చెప్పుచు ప్లీడరు సోమేశ్వరరావు ఇట్లనును.

"చూచితిరా? ధనమనగ నంత యాకర్షకము. చక్కదన మాకర్షకము గాదు. విద్య కాదు—మోక్షలక్ష్మి కాదు. పైస! పైస! దానితోడనే ప్రపంచ మున్నది. పరప్రేమ యున్నది."

ఈ నాటకమునకు ఈ పేరు ఉంచుటకు ఈ భావమే హేతువైనది.

ఈ నాటక కథలో కాని, పాత్ర చిత్రణలో గాని నాటకీయత లేదు, వైచిత్ర్యము లేదు. దీనిని వారు చివటి దినములలో వ్రాసియుండవచ్చును. ఆ దినములలో వారు అనుభవించిన దుర్భర దారిద్ర్యము వారి మనసుపై వేసిన ముద్ర, ధనము వారికి కలిగించిన వెగటుదనము ఈ నాటకమును బట్టి తెలియును.

రసోల్లాస మయములగు చక్కని నాటకములు అంతకు పూర్వము వ్రాసిన వారి లేఖినికి కొంత భావ దారిద్ర్యము వృద్ధాప్యము వలన ఆర్థికాది దుస్థితి వలన కలుగుట ఈ తుది కృతులలో చూడవచ్చును.

ఈ కథ సాక్షి ఆఱవ సంపుటములో "సుఖము—దుఃఖము" అను ఉపన్యాసమున ఇంతకుముందు చెప్పబడినదే. ఆ కథలో తుదకు ఆడు పిల్లలు తక్క అందఱును మరణించినట్లు ఉండగా ఈ నాటకములో అది మార్చి కలహములతో, దెబ్బలతో పంతులుగారు ముగించినారు.

ఈ పరప్రేమ పేరునకు ఆఱంకముల నాటకము అయినను మొత్తము నలుబది ఆఱు పేజీల లఘు కృతి. దీనిని, రామరాజు అను మూడు అంకముల మఱియొక నాటకమును, ఒక ఏకాంకికను, రెండు వ్యాసములను కలిపి ఒక సంపుటముగా చేసిరి. ఈ నాటకమునకు నాందీ ప్రస్తావనలు గాని, పంతులుగారు తామే వ్రాసిన పీఠికగాని లేవు.

# రా మ రా జు

ఇరువది యేడు పుటలలో ఉన్న మూడు అంకముల నాటకము ఇది.

1924 లో మే మాసమున భారతి పత్రికలో పంతులుగారు వ్రాసిన ఇదే పేరుగల కథ ఆధారముగా ఈ నాటకము వ్రాయబడినది.

రామరాజు పశుసేవానురక్తి గలవాడు. భార్య ఒత్తిడిపై భద్రాద్రి యాత్రకు పోవును. అతని భార్య చంద్రమతి సంతానముకొఱకై ఈ యాత్ర చేయును. యాత్ర పిదప రామరాజునకు పుత్రుడు పుట్టెను. అతడు తండ్రికి గండమున పుట్టెను. రామరాజు పాలికాపు తెచ్చిన గడ్డిమోపు దింపుటలో సహాయము చేయుచుండగా అందులోనున్న పాము అతనిని కాటు వేయును. రామరాజు మరణించును.

రామరాజు మరణించునని ఇరువురు ఓఢ్ర జ్యోతిష పండితులు రఘు, బాలంకి మిశ్రపి యనువారు ముందే తెలిసికొని గోడపై వ్రాసి పోవుదురు. అది చూచి ఊరిలోని వారు అగు సుబ్బయ్య, దిబ్బయ్య అనువారు రామరాజునకు తెలుపుదురు. అతడు ఆ వార్త వినియు నిశ్చింతగా నిశ్చలముగా నిబ్బరముగా వ్యవహరించును.

భారతి పత్రికలోని కథ ఉన్నంత రక్తిగా ఈ నాటకము లేదు. కథలో రామరాజు పాత్ర మిక్కిలి మనోహరమై ఉన్నది. నిర్లిప్తుడు, భక్తుడు అగు రామరాజు పాత్ర నాటకములో వారు అంత మనోహరముగా పోషించలేదు.

ఈ నాటకమునకు వారి పీఠిక, నాందీ ప్రస్తావనలే కాక, భరత వాక్యము కూడ లేదు.

# చిన్న నాటకము

ఇది ఏకాంకిక. పంతులుగారు దీనికి ఎట్టి పేరును పెట్టియుండ లేదు. వ్యాసమహర్షి తాను తెలిపిన "బలవా నింద్రియ గ్రామో విద్వాంస మపి కర్షతి" అను శ్లోకార్థము సరి కాదని వాదించిన సుబలుడు అను శిష్యునకు స్త్రీ వ్యామోహము ఎంతటి గాఢమైనదో తెలియజేయుట ఇందలి కథ.

"పండితుని యుపన్యాసము" అను పేరిట సాక్షి మూడవ భాగమున పంతులుగారు చెప్పించిన కథ ఇది.

అచ్చట శిష్యునికి పేరు పెట్టలేదు. దీనిలో సుబలుడని పేరు ఉంచినారు. వ్యాసుడు ఇంద్రియ గ్రామపు బలమును దెలుపుటకై స్త్రీ రూపమున వచ్చినప్పుడు నాటికలో శీలవతి అను పేరు పెట్టియున్నారు.

ఇంద్రియ సంఘాతము యొక్క బలమును తెలిసికొనిన సుబలుడు వ్యాస మహర్షికి సాష్టాంగపడి క్షమాభిక్ష నర్థించినప్పుడు మహర్షిచేత "నేను మంచి వాఁడనా? నేను తప్పు చేయలేదా? మాతండ్రి చేయలేదా? మనము మనుష్యులము. మనుష్యులు జాళ్లవలెఁ గరఁగ కుందురనుట ప్రకృతి జ్ఞానశూన్యత." అనిపించినారు.

దీనికి చివఱ భరత వాక్యము ఉన్నది. అది నాటక పాత్రలచేత చెప్పించినది కాక ఊరక కవి తుదిని వ్రాసినట్లుగా నుండుట విశేషము.

# మనోమహిమము

ఈ రూపకమును గూర్చి ఇక్కడ చెప్పుట విచిత్రముగా నుండును. ఇది మొదట సువర్ణలేఖా పత్రికయందు ప్రకటింప బడినది. తరువాత 1911 లో ఇది పుస్తక రూపమున వచ్చినది. అప్పుడు 500 ప్రతులు మాత్రమే ముద్రించిరి. ఆ తరువాత హాస్యవల్లరిలో చేర్చి దీనిని ప్రకటించిరి. దీని రచనా కాలమును బట్టి ఇది 11, 12 సంఖ్యలు గల వృద్ధ వివాహమునకును కల్యాణ రాఘవమునకు నడిమిది. అయినను పంతులుగారు దీనిని తమ నాటక రచనములలో ఒకటిగా లెక్క వేసికొని చెప్పి యుండలేదు. ఆ కారణముచేత చివర లఘు నాటక కృతులతోపాటు దీనిని ఇక్కడ చెప్పుట జరుగుచున్నది.

హాస్యవల్లరి మొదటి ముద్రణ పీఠికలో దీనినిగూర్చి పానుగంటివారు ఈ వాక్యములను వ్రాసియున్నారు.

" దీనిలో నున్న మనోమహిమము మాత్రము ప్రహసనమని చెప్పుటకు వీలులేదు. అయినను దానిలో వచ్చు సూరయ్య, పేరయ్యల మాటలు, చర్యలు హాస్యాస్పదములై యుండును గావున నదియుగూడ నిందు చేర్పబడెను. "

ఈ చిన్న నాటకమునకు పంతులుగారు నాందీ ప్రస్తావనలు వ్రాయలేదు. ఆంగ్ల రూపక పద్ధతిని సూత్రధారుని ప్రవేశపెట్టి, ప్రొలోగ్, ఎపిలోగ్ వ్రాసిరి. ఈ రెండును పద్యాత్మకములే_ప్రొలోగ్ అని ముందు పేరు పెట్టలేదు కాని, ఎపిలోగ్ అని తుదిని ఆంగ్లములో ముద్రింపించిరి. వానికి సమానార్థకములగు పదములను వాడలేదు.

ప్రొలోగ్‌లో సూత్రధారుడు ఈ రూపకములో ప్రధానముగా నిరూపింప బడిన అంశమును గూర్చి వివరించుచు మనసునకు గల శక్తిని ఇట్లు పొగడెను.

" మనసు చేతనే ఘనులైరి మనుజు లిలను
మనసునకుఁ గలశక్తి యింతనఁగ వశమె?
మనసునందె సమస్తంబు మలగి యుండు
మనసుకంటె విచిత్రంబు మహిని లేదు."

అప్పుడు పంతులు అను గోలకొండ వేపారి ఆయన పురోహితుడగు పేరయ్య, వైద్యుడగు సూరయ్య పన్నిన కుట్రలో పడి, తాను నీరోగి అయ్యును రోగము ప్రవేశించినది అని నమ్మి జంకి ప్రాణములు కోల్పోయెను. ఇది ఇందలి కథ. దీనిని కడు చమత్కారముగా పంతులుగారు ఇందు తీర్చినారు. పై వారు ముగ్గురును కాక అప్పుడు పంతులు భార్య కనకమ్మ మఱియొక పాత్ర.

దీనిని ప్రహసనము అనక పోవుటకు కారణము సులభముగా ఊహింప వచ్చును. సూరయ్య పేరయ్యలు ద్రవ్యార్జనకై ఆశపడి గర్హ్యమగు కుట్ర పన్ని అన్యాయముగా ఒక నిండు ప్రాణమును బలిగొనిరి. అప్పుడు పంతులు పాత్రపై సానుభూతితో ఈ నాటకమును పఠించినచో ఇది ప్రహసనము కానేరదు.

ఎపిలోగ్‌లో సూత్రధారునిచేత విపులమగు ఉపన్యాసము చేయింపుచు, పంతులుగారు తిరిగి మనశ్శక్తిని ప్రస్తుతించిరి. దానిలో ఒక గంతు వేసి, ఈ దృష్టితో వివిధ మతముల ఆశయముల తారతమ్యములనుగూర్చి ఒక సీసములో చర్చించిరి. తుదకు " బ్రహ్మ నేనె యటంచు పరమ దృఢత నమ్మి, యనుష్ఠించు నద్వయుఁడు ఘనుఁడు, ధన్యుఁడు, లోకోపకారి " అని ప్రశంసించిరి.

# హాస్య వల్లరి

ఇది నాటక కృతి అనుటకు వీలు కాదు. పండ్రెండు ప్రహసనములు, మరికొన్ని హాస్య సంభాషణములు చేర్చిన సంపుటి— కావున నాటక సారస్వత సంబంధి అధ్యాయమున చేర్చి పరిశీలింప వలసియున్నది. 1915 లో తణుకు శ్రీ సౌదామినీ ముద్రాక్షరశాలలో దీనిని మొదట ముద్రించిరి. దీనిలో పీఠిక వ్రాయుచు పంతులుగారు ఇట్లు చెప్పిరి.

" శ్రీ సువర్ణలేఖా పత్రికకు నే నప్పుడప్పుడు వ్రాసి పంపిన ప్రహసనములను ఇందు చేర్చితిని. ఈ ప్రహసన సమూహమునకు హాస్య వల్లరి యను పేరు సువర్ణ లేఖాధిపతియే యుంచెను. ఆ పేరికి నేను సమ్మతించితిని. "

దీని అట్టపై మొదటి ముద్రణమందు మొదటి భాగము అని అచ్చువేసిరి. కాని ఇదియే తుది భాగము కూడ అయినందున మలిముద్రణమున ఇది తొలగింపబడినది. దాని బదులు ప్రకటన కర్తలు " చక్కని కథలు " అని చేర్చిరి :

ఇందలి పండ్రెండు ప్రహసనములు ఇవి :

1. పురుష వచన ప్రహసనము.
2. పరీక్షాధికారి.
3. గ్రహ ప్రహసనము.
4. లొల్లా బట్టీయము.
5. విచిత్ర పురాణ పఠన ప్రహసనము.
6. విద్యాభ్యసన పద్ధతి ప్రహసనము.
7. కవితా రసిక ప్రహసనము.

8. బధిరవిధవా ప్రహసనము.
9. అపూర్వ వివాహ ప్రహసనము.
10. విపరీత ద్విజ ప్రహసనము.
11, రైలు ప్రయాణము.
12. గాన రసిక ప్రహసనము.

వీనిలో మొదటిది 1913 మే 20 వ తేది సువర్ణ లేఖలో వచ్చినది. ఈ ప్రహసనములను ఆ పత్రిక హాస్యార్ణవము అను శీర్షిక క్రింద ప్రకటించెడిది.

కందుకూరి వీరేశలింగము గారి ప్రహసనములు అప్పటికి ఉన్న ప్రసిద్ధ ప్రహసన సాహిత్యము. పంతులుగారు ప్రహసనములలో అంతకంటె ఒక క్రొత్తదారి త్రొక్కినారు. వీరేశలింగము గారి ప్రహసనములు అధిక్షేపణ హాస్య ప్రధానములు. పానుగంటి వారి ప్రహసనములలో అధిక్షేపణ హాస్యము ఉన్నను ఇవి వినోదాత్మకములు.

లోకములో సాధారణముగా మన దృష్టికి అందని హాస్యాస్పదాంశము లను ఎన్నుకొని వానిని అతిశయముగా కనబఱచుట వీరి పద్ధతి. కందుకూరివారి ప్రహసనములలో కన్న వీనిలో కథా శరీరము తక్కువ. ఒక్క చిన్న సన్నివేశ మును తీసికొని రమ్యముగా తీర్చుటయే వారు ఎక్కువగా చేసినది.

# నాటక సాహిత్య సమీక్ష

పానుగంటి లక్ష్మీ నరసింహారావు పంతులుగారు వ్రాసిన నాటకములను అన్నింటిని ఒక టొకటిగా పరిచయము చేయుట ఇంత వఱకును జరిగినది. వివరములు ఏమియును తెలియని కాత్యాయనిని, ప్రహసనములను విడిచిపెట్టి, వారు వ్రాసిన చిన్న పెద్ద నాటకముల సంఖ్య ముప్పది అగుచున్నది.

వారు నాటక రచనకు ఆరంభించినది 1900 లో. వారు చివఱకు వ్రాసిన లఘు కృతుల రచనాకాలము స్పష్టముగా తెలియనందున 1939 వఱకు వ్రాయుచునే యుండిరని ఊజ్జాయింపుగా గ్రహింప వచ్చును. ఈ ముప్పది తొమ్మిదేండ్ల నాటక రచనా కాలమును, వెలువడిన నాటకముల గుణ దోష విశేషములను పురస్కరించుకొని గాని అన్య విధముగా గాని కొన్ని దశలుగా విభజించుటకు వీలగునేమో ప్రయత్నము చేసి చూడవలయును.

ఆ పిదప నాటకములు ఇతివృత్తము, రసము, మున్నగు వానిని బట్టి వర్గములుగా చేసి సామూహికముగా పేర్కొనదగిన విశిష్ట లక్షణములను పేర్కొనవలయును. నాటక శిల్పదృష్టితో నాంది ప్రస్తావనలు, సూచ్య కథా సూచనము, అంకముల కూర్పు, పాత్ర పోషణము, పాత్ర సంభాషణములు మొదలగు అనేకాంశములను గూర్చి సూక్ష్మ పరిశీలనము చేయవలసి యుండును. ఈ భాగమున అట్టి సమీక్ష చేయబడును.

పానుగంటి వారికి నాటక రచనపై గల శ్రద్ధా గౌరవములు అపారము. తెలుగు భాషలో పఠన పాఠనములకు అనువైనవి, విద్యా సంస్కార యుక్తుల ఆమోదము పడయునవి, సమకాలీన దుష్టాభిరుచుల ప్రాబల్యమునకు లొంగనివి, చిరకాలము నిలిచి తరతరముల అభిమానమును పడయ జాలినవి అగు నాటకములను వ్రాయవలెనన్న అభిలాషముతో వారు ఆరంభించిరి.

## ప్రారంభ దశ

పానుగంటివారి మొదటి మూడు నాటకములను నాటక కర్తగా వారు కుదుట బడుటకు పునాదులుగా గ్రహించి, అంతవఱకు ప్రారంభ దశగా పరిగణింప వచ్చును.

మొదటి నాటకము వారు వ్రాసిన తరువాత అందలి గుణ దోషములను గూర్చి, భాషా సాహిత్యాంశములను గూర్చి కొందఱు వారిని విమర్శించి నట్లు తెలియును. ఆ విమర్శలు ఎవరు చేసిరో, ఎట్లు చేసిరో మాత్రము తెలియదు. అందు మీదట వారు ఆ నాటకమును పండితుల అభిప్రాయములకై పంపిరి. దీనిని గూర్చి తిరుపతి వేంకట కవులు 23-11-1918 తేదీగల కృష్ణా పత్రికలో ప్రకటించిన లేఖలోని భాగము ఉదాహరించుట తగును.

"మేము వారికి (పానుగంటి వారికి) 19 సంవత్సరముల క్రిందట, ప్రసక్తాను ప్రసక్తముగా వ్రాసిన "ఆంధ్ర కాళిదాస బిరుదము" మఱువలేదు. పంతులవా రపుడు దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రి, తమ్మన శాస్త్రిల వారిచేఁ గాఁబోలును గవితా విషయమున నాక్షేపింపఁబడి సమాధాన సందర్భమునకై మాలో నొకరి పేర వ్రాసిన యుత్తరముపై మే మా యాక్షేపణ సరికాదని వ్రాయుచు నా బిరుదమును హృదయపూర్వకముగా వ్రాసితిమి."

"ఆంధ్ర కవుల యపరాధము" అను పేర రామకృష్ణ కవులు వ్రాసి ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలో ప్రకటించిన ప్రసిద్ధ పద్యములపై చెలరేగిన వాదోప వాదముల సందర్భమున కృష్ణా పత్రికలో 1918 లో ఆగస్టు నుండి, నవంబరు వఱకు అనేక బహిరంగ లేఖలు ప్రచురిత మైనవి. ఇందు పాల్గొనిన వారిలో తిరుపతివేంకట కవులు, శేషాద్రిరమణ కవులు, పానుగంటి వారు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు మున్నగువారు ఉన్నారు.

ఆ చర్చ సందర్భముగా—పిఠాపురాధీశులను ఆంధ్రభోజు లనినారు, ఇక కాళిదాసు అన్నది రామకృష్ణులకో, పంతులుగారికో అన్వయించవలెను గదా ! "రామకృష్ణుల స్థితిని బట్టి దీనిని వహించి సంతసించుట వాంధ్ర యవివేకము

నకు పన్నె పెట్టుటయే యైనను, పంతులవారి యుదారతను బట్టి యేమి, యోగ్యతను బట్టి యేమి, వివేకమును బట్టి యేమి, ఈ భారము వారు వహింప నంగీకరింపరని మేమే కాక లోకు లెవ్వరేని సమ్మతించి తీరవలయును." అని తిరుపతి వేంకటకవులు ఆక్షేపించినారు. దానిపైన పానుగంటివారు ప్రత్యుత్తరము ఇట్లు వ్రాసినారు.

"వివేకమును బట్టి, యుదారతను బట్టి, యోగ్యతను బట్టి యని నా మిత్రులు నా యందలి యనురాగముచే మృదులముగా జెప్పినారు. కాని యశక్తిని బట్టి యని వా రొక్క మాటలోఁ జెప్పవలసి యుండెను. నిశ్చయముగా నే నట్టి భారమును వహింప నంగీకరింపను. కాని నా మిత్రులగు నీ వేంకటశాస్త్రిల వారే నా కాంధ్ర కాళిదాస బిరుదము నిచ్చియున్నారు. వారు మఱచియుందురేమో ! ఇప్పుడు జ్ఞప్తి చేయుచున్నాను. సుమారు పదునేడు సంవత్సరముల క్రింద నేను రచియించిన నర్మదాపురుకుత్సీయమును వారికిఁ బంపగా "నుపమా సందర్భమున నేమి, రసపోషణమున నేమి, మీ రాంధ్ర కాళిదాసులని యెట్టి విద్వాంసుల సభలో నైనను నేను రెండు చేతులెత్తి నిస్సందేహముగాఁ జెప్పఁ గలనని వారు నా కవితకు యోగ్యతా పత్రిక నిచ్చినారు.

కింకవీంద్ర ఘటా పంచానను లిచ్చిన యీ యసాధారణ బిరుదమును నేను వహింప నంగీకరించిన వాఁడనే యైన యెడల నిన్ని సంవత్సరము లా పత్రికను బ్రకటింప కుండ నూరకుండి యుందునా ? తరువాత వ్రాసిన పదుమూడు నాటకములలో దేని యుపోద్ఘాతము నం దైనను నీ సంగతి కాసంత యైనను సూచించితినా ? తప్పనిసరి యగుటచేత గాని యిప్పుడైన, జెప్పి యుందునా ? ఊరకుండ లేక యిప్పుడు చెప్పవలసి వచ్చినందులకు నా మిత్రులు లోకులు గూడ నన్ను క్షమింతురు గాక ! నిశ్చయముగా నే నట్టి భారమును వహింపలేను."

దీనికి సమాధానమే మొట్ట మొదట పేర్కొనిన తిరుపతి వేంకటకవుల లేఖ. ప్రస్తుతాంశము నుండి శాఖాచంక్రమణము చేసి, కొంత దూరము పోవలసి వచ్చినను, పంతులుగారికి సంబంధించిన ఒక ముఖ్యాంశమునకు చెందిన వృత్తాంతము కావున వివరముగా పొందు పఱపవలసి వచ్చినది.

ఈ విధముగా పంతులుగారికి వచ్చిన ప్రశంసలను అటుంచి, వారు ఆత్మ సమర్థనమునకై పండితులకు ప్రతులను పంపి వారి అభిప్రాయములను సేకరించుట నిశ్చయముగా ప్రారంభ దశనే సూచించుచున్నది.

నర్మదా పురుకుత్సీయమున, సారంగధరలోను, ప్రచండ చాణక్య మందును, పంతులుగారి విలక్షణత బీజప్రాయముగా గోచరించుచున్నను, ఎక్కువ భాగము వారు పూర్వ మహాకవుల పథకములపై ఆధారపడి యుండుట చూడవచ్చును.

ఇట్టి గోడ చేర్పునకు ఆవశ్యకము లేకుండ రస పరిప్లావిత మగు ఒక వినూతన సౌందర్య కళా జగమును వారు స్వీయ మహా ప్రతిభా విశేషముతో సృజించినది రాధాకృష్ణ నాటకములో. అది వారి నాటక రచనలో క్రొత్త అధ్యాయ మునకు తొలి మెట్టుగా పరిణ మించినది.

భాషా విషయకముగా కూడ వారికి మొదటి మూడు నాటకము లందు కంటె తరువాత సౌలభ్యము, సారళ్యము హెచ్చినది. రచనా ప్రణాళికలో ఒక సహజ స్ఫూర్తియు ఏర్పడినది. మొదటి దశలో వారి రచన కొంత ప్రయత్న పూర్వ కముగా చేసినట్లు అనిపించు చున్నది.

## మహోజ్జ్వల దశ

రాధాకృష్ణ నుండి పద్మిని వఱకును గల 16 నాటకములు వారి మహోజ్జ్వల దశను ప్రకటించు చున్నది. ఈ పదునాఱు నాటకములలో అప వాదములు లేక పోలేదు బుద్ధ నాటకము, వృద్ధ వివాహము, ముద్రిక అను మూడును ఏవో ప్రత్యేక కారణముల వలన వ్రాయుట జరిగినది. ఈ మూడింటను వారి సంపూర్ణ శక్తి విశేషము ప్రతిబింబించదు. కాని న్యాయమునకు ఒక మాట చెప్పవలెను. ఆ నాటకములు కూడ పంతులుగారు కాబట్టి ఈ కథతో ఈ మాత్రమైన వ్రాసిరి అని మాత్రము అనిపించును.

ఈ నాటకములలో ఆంగ్లభాషా సారస్వత ప్రభావము ఎట్లు ద్యోతకము అగుచున్నదో ఈ వఱకే వివరింప బడినది. కాని వారు అనుకరణము చేయువారు కారు. స్వాతంత్ర్యతా పరిపుష్టమైన వారి మనస్సు ఆంగ్లేయ రూపక శిల్ప ప్రథమ మహాదశను గౌరవించి, ఆంగ్లేయ మహాకవి నిర్దిష్ట పథములను అనుగమించి మాత్ర నిర్మాణమును గావింప గలిగినది.

## మూడవదశ

మాలతీమాల మొదలు కొని తరువాతి నాటకములు విచిత్ర వివాహము వఱకు వ్రాసినవి కొంత చప్పని నాటకములు. వీనిలో హాస్యరస ప్రధాన మయిన విచిత్ర వివాహము తప్ప తక్కినవి రసదృష్టితో, కథా ప్రణాళిక దృష్టితో పరిశీలించిన పూర్వ నాటకములవలె సమగ్ర శోభా సంయుక్తములై కన్పట్టవు. పాత్ర చిత్రణము, సంభాషణముల యందు మాత్రము వారి సిద్ధహస్తత యథా ప్రకారము వీనిలో కూడ ఉండుటచేత అవి ఆ మాత్రమైన రాణించినవి.

ఈ దశయందు వ్రాసిన వానిలో కొంతవఱకు విశిష్టముగా చెప్ప కొనదగినది సరోజిని నాటకము. కాని ఇది ప్రదర్శనకు అననుకూల మైనంత విపుల మనస్తత్త్వ నిరూపణ ప్రాముఖ్యము కలిగి యున్నది అని ఇంతకు పూర్వమే చెప్పబడినది.

## చరమ దశ

పంతులుగారి జీవితమున తుదిదశ మిగుల దుర్భరముగా హృదయ విదారకముగా గడిచినది. ఆ కాలమున వారు వ్రాసిన రూపకములు అన్నియు లఘుకృతులు మాత్రమే. అందు ఎక్కువ భాగము తాము పూర్వము ఏదో ఒక రూపమున చెప్పిన కథలకే నాటకానుసరణములు. వానిని నాటకములుగా తీర్చుటలో కూడ రసవత్తరముగా చేయలేక పోవుట అటుంచి, సరసముగానైన చేయలేక పోయినారు.

ఈ దశలోని నాటకములలో సంభాషణ నిర్వహణమున ఏ కొంచెమో వారి సహజచాతుర్యము మిగిలియున్నను, పాత్ర చిత్రణమున భావ దారిద్ర్యము ఏర్పడ జొచ్చినది. వారి రచనా వ్యాసంగమున క్షీణదశగా దీనిని పరిగణనము చేయవచ్చును.

## వైవిధ్యము

పానుగంటి వారి నాటకములలో వైవిధ్యము ఎక్కువ. రసమును బట్టి చూచినచో భక్తి, శృంగార, వీర, హాస్య, బీభత్స, భయానక రసప్రధాన నాటకములు ; ఇతి వృత్తమును బట్టి చూచినచో పౌరాణిక, చారిత్రక, కాల్పనిక, సాంఘిక నాటకములు ; కథాంతము, కథానిర్వహణ పద్ధతి దృష్టితో సుఖాంత విషాదాంత నాటకములు వారు వ్రాసిరి.

ఇంతేకాక పంతులుగారు ఆంగ్లేయాది పాశ్చాత్యరూపక వాఙ్మయములలో కినవచ్చుచున్న మఱి కొన్ని అంతశ్శాఖలను కూడ తెలుగున సృష్టించిరి. ప్రతీ కారాత్మక విషాదాంతము (Revenge Tragedy) నాగరక విమర్శాత్మక సుఖాంతము(Commedy of Manners) మొదలగు భిన్న శిల్పములను వారు సమాదరించిరి.

అయినను పానుగంటివారి నాటక సాహిత్యమును, ఆ మాటకు వచ్చినచో అసలు తెలుగు నాటక వాఙ్మయమును సవిమర్శముగా సునిశితముగా పరిశీలించుటకు ముందు ఒక మాట జ్ఞప్తియం దుంచుకొన వలెనేమో. తెనుగు నాటకము యొక్క ఆవిర్భావమునకు దేశీయమగు యక్షగానము, అటు సంస్కృత రూపకము, ఇటు పాశ్చాత్య నాటకము ఈ మూడును ప్రేరేపకములు అగుట ; అల్ప కాలముననే కలగా పులగముగా అన్ని ప్రభావములును విశేషముగా ప్రసరించుట ; క్రమ పరిపక్వమునకు తావు లేకుండ అత్యల్ప కాలముననే ఈ సాహిత్యశాఖ ఆవిర్భవించి, విస్తరిల్లి యుండుట—ఈ హేతువులవలన తెలుగు నాటకము ఒక ప్రత్యేకత సంతరించు కొనినది. దీనికి క్రమబద్ధమగు ఒక లక్షణము-ఏర్పఱచుట మిగుల దుర్లభము.

కొన్ని వందల తెలుగు నాటకములలో రంగస్థలముపై ప్రాచుర్యము, విశేష జన సమాదరము పొందిన నాటకములు పరిమిత సంఖ్యాకములు. సాహిత్య గౌరవ దృష్టితో పరిశీలించిన యెడల నిలుచునవి ఇంకను అల్ప సంఖ్యాకములు.

అట్టి సంఖ్యేయములైన వానిలో అధిక నాటకములు వ్రాసిన వారిలో పానుగంటి వారు ఒకరు.

పంతులుగారి నాటకములలో కొంతవఱకు మొత్తము మీద చెప్పుకొను టకు వీలయిన ఒక శిల్ప పద్ధతి ఉన్నది. ప్రాచీనమగు సంస్కృత రూపక లక్షణానుసారముగా ఇతివృత్తము గాని. పంచ సంధులు గాని నిరూపించి, దశ విధరూపకములలో గాని, ఉప రూపకములలో గాని ఈ నాటకములను సర్ది వేయుట సాధ్యము కాదు. అంతేకాక ఆ లక్షణమును మనస్సులో పెట్టుకొని ఈ నాటకములను పరిశీలన చేయుటకు ప్రయత్నించుటయు సరియగు పద్ధతి కాజాలదు.

పంతులుగారి రచనలు రస నిర్వహణ పద్ధతిని, సూచ్య, దృశ్య వస్తు విభజనమున సంస్కృత రూపకములను అనుసరించినను, ఇతివృత్త నిర్మాణమున, పాత్ర చిత్రణమున కథకు ఆద్యంతములను మనసులో పెట్టుకొని వస్తూన్మీలనము చేయుటలోను, పాశ్చాత్య రూపకముల యందలి ఆదర్శములను వారు గైకొనినారు.

పానుగంటి వారి రసపోషణ నైపుణ్యమును గూర్చి ముచ్చటించు సందర్భమున వారి నాటకములలో వివిధ రసప్రధానములైనవానిని గూర్చి చర్చ చేయవచ్చును.

ఇక నాటకేతివృత్తములను బట్టి విభజించి చూచినచో వారు 7 పౌరాణిక నాటకములు, 7 చారిత్రక నాటకములు, 11 కాల్పనిక కథా నాటకములు. 5 సాంఘిక నాటకములు వ్రాసి రనవచ్చును.

## పౌరాణిక నాటకములు

1. నర్మదాపురుకుత్సీయము
2. రాధాకృష్ణ.
3. పాదుకా పట్టాభిషేకము.
4. విజయ రాఘవము.
5. వనవాస రాఘవము.
6. కల్యాణ రాఘవము.
7. చిన్న నాటకము.

## చారిత్రక నాటకములు

1. సారంగధర.
2. ప్రచండ చాణక్యము.
3. విప్రనారాయణ చరిత్రము.
4. బుద్ధ బోధ సుధ.
5. పూర్ణిమ.
6. వీరమతి.
7. చూడామణి.

## కాల్పనిక కథా నాటకములు

1. కోకిల.
2. కంఠాభరణము.
3. ముద్రిక.

సరస్వతి.

5. పద్మిని.
6. మాలతీమాల.
7. గుణవతి.
8. మణిమాల.
9. రామరాజు.
10. సుబ్బరాజు.
11. మనోమహిమము.

## సాంఘిక నాటకములు

1. వృద్ధ వివాహము.
2. సరోజిని.
3. రాతిస్తంభము.
4. విచిత్ర వివాహము.
5. పరప్రేమ.

ఈ విభజనములో కొంత చిక్కు లేకపోలేదు. పంతులుగారి కాల్పనికములలో సాంఘిక వాతావరణము ఉన్నది. ఉదాహరణమునకు కంఠాభరణము ఉన్నది. అది కాల్పనికము, సాంఘికము రెండును అనవచ్చును. అట్లై సరోజిని కథ పురాణమునుండి బీజప్రాయముగా గ్రహించి, సాంఘికముగా చేసిరి. మాలతీమాల నాటక వస్తువు సాంఘికమే అయినను సాంఘిక విమర్శము లేకయున్నది. కావున కాల్పనికములలో చేర్చుట జరిగినది.

సారంగధర నాటకము పూర్తిగా చారిత్రకమని అనుటకు వీలులేదు. ఇది జనశ్రుతిగా వచ్చిన కథ; ఇందు కాల్పనిక లక్షణమే ఎక్కువ. అయినను వేంగి నాటిని ఏలిన రాజ రాజునకు అతుకు పెట్టిరి. రచనాశిల్ప పద్ధతి చారిత్రక రూపక సంబంధి కాదు. బుద్ధనాటకము, విప్రనారాయణ చరిత్రము చారిత్రక మహా పురుషులకు సంబంధించినవే అయినను, వాని రచనా పద్ధతి భిన్నమైనది. ఇట్టి చిక్కులలో ఒక రీతిని పై వర్గీకరణము చేయుట యైనది.

## పౌరాణిక నాటకములు

పానుగంటివారు నాటక రచనమును పౌరాణిక నాటకముతోనే ఆరంభించినారు. మహా ప్రతిభావంతులగు వారు పౌరాణికములగు కథాంశములను ఎన్నుకున్నను, చిత్ర విచిత్ర కల్పనలు జోడించి, రమణీయములగు సన్నివేశములను సృజించి, పాత్ర చిత్రణమున విలక్షణతను ప్రదర్శించి ఆ నాటకములను తీర్చిరి.

నర్మదాపురుకుత్సీయము, రాధాకృష్ణ నాటకములలో వారికి లభించిన మూలవస్తువు అత్యల్పము. ప్రధాన పాత్రములు మాత్రమే వారికి పురాణ కథలలో తారసిల్లినవి. నాటక నిర్మాణమునకు అనువగు సన్నివేశములు, ఆవశ్యకమగు తక్కిన పాత్రములు వారే సృష్టించుకొనినారు.

శ్రీమద్రామాయణ నాటకములలో మాత్రము వారికి రసవంతమగు ఇతివృత్తము, పాత్రలు సిద్ధాన్నముగా దొరికినవి. కాని వానిలో ప్రసిద్ధ పాత్రలను దృశ్య కావ్య పద్ధతిని పునరుజ్జీవింప చేసినారు. అంతకు ముందు లేని స్ఫుట

రేఖలు ఆ యా పాత్ర చిత్రణమున వారు ఎట్లు గీసినారో, ఆ పాత్రలను క్రొత్త వెలుగులో ప్రదర్శించినారో వివరించుట జరిగినది. పౌరాణికమగు పాత్రలతో వారు వ్రాసిన ఏకాంకికయగు "చిన్న నాటకము" ఈ సందర్భమున ప్రత్యేకము చెప్పుకొన వలసినంత ముఖ్యమైనది కాదు.

## చారిత్రక నాటకములు

పంతులుగారి రెండవ నాటకము నామ మాత్రముగా చారిత్రకమే యైనను, అందు చారిత్రక రూపక పద్ధతి గోచరించ దనుకొంటిమి. ఆ లక్షణము ప్రచండ చాణక్యమున ప్రారంభమైనది. షేక్స్పియర్ మహాకవి రచనా పద్ధతిని వారు గ్రహించిరి.

నాటక రచనకు అనుకూలము కాని అంశములను పరిత్యజించి, మార్పులు చేసి బిగువగు సంఘర్షణమును మౌలికముగా ఏర్పఱచి పంతులుగారు ప్రచండ చాణక్యము వ్రాసినారు.

విప్రనారాయణ, బుద్ధ బోధసుధలు చారిత్రక పురుషులకు సంబంధించినవే అయినను వీనికి ఒక ప్రత్యేకత ఉన్నది. విప్రనారాయణ భక్తుని కథ. భక్తి, శాంతము ప్రధానముగా తీర్చుటచే దీనిలో చారిత్రక వాతావరణము కంటె పౌరాణిక పద్ధతి వాతావరణము హెచ్చుగా ఉండును. బుద్ధ నాటకమున వారు ఆ మహా పురుషుని జీవితము కంటె సందేశమునకు ఎక్కువ ప్రాధాన్యము నొసగిరి.

అందుచేత, ప్రచండ చాణక్యము తరువాత చారిత్ర కాంశములపై మనోహరముగా నాటక నిర్మాణము కావించినది వారు పూర్ణిమ, వీరమతి, చూడామణి నాటకములలో. ఆయా నాటకములను గూర్చి పరిచయము చేయునప్పుడు నాటక రచనకు ఇవి అనుకూలించునా అని సామాన్యులు సందేహపడ దగినట్టి స్వల్ప వృత్తాంతమును గ్రహించి రమణీయ నాటకములు ఎట్లు చేసిరో తెలుపబడినది. ఒక కల్పిత కథను నాటకముగా మలుచుకొనుట వేఱు. ఉన్న స్వల్పాంశముల

నుండి చారిత్రక రూపకము వ్రాయుట వేఱు. పంతులుగారు ఈ అంశములను గ్రహించుటలో, సంస్కరించుటలో, నాటకముగా రూపొందించుటలో విశేష నైపుణ్యమును కనబఱచినారు.

## కాల్పనిక కథా నాటకములు

కోకిల నాటకముతో పానుగంటివారు కాల్పనిక నాటకములకు శ్రీకారము చుట్టినారు. తరువాత వారి ప్రతిభా విశేషము కంఠాభరణమున, సరస్వతియందు, పద్మిని యందు పరాకాష్ఠ దశను అందుకొనినది. తక్కిన కాల్పనిక నాటకములు ఇంత మనోజ్ఞమైనవి కావు.

కాల్పనికమునకు సాంఘికమునకు పాటింపబడిన భేదము ఏమనగా, రెండవదానియందు సామాజిక జీవిత చిత్రణము, సమకాలిక వ్యవస్థపై రచయిత అభిప్రాయముల ప్రకటనము ఉండును.

కోకిలాదుల కథను నిర్మించుటలో పంతులుగారు ఆంగ్ల నాటక సారస్వతమునందు ముఖ్యముగా షేక్స్పియర్ మహాకవి వ్రాసిన కామెడీల ప్రభావమునకు లోబడినారు. కథానిర్మాణము, తదనుకూల సుఖాంత నాటకోచిత పాత్ర చిత్రణము ఈ నాటకములలో పంతులుగారు బిగువుగా చేసినారు.

ఈ నాటకములలో సాంఘిక వాతావరణములో జరుగుటకు అశక్యమైన అసంభవ సన్నివేశము లేవియు లేవు. దేవతలు, దయ్యములు - వీని మహిమలు లేవు. కాని ఈ కథా నిర్మాణమున కొట్టవచ్చినట్లు కనుపట్టు ఒక లక్షణము నిశిత హేతువాద పరీక్షకు ఆగని సన్నివేశముల సంయోజనము.

పంతులుగారు విడిగా పద్య కావ్యములు వ్రాయక పోయినను కవితాత్మ కలిగినవారు. ఈ పాత్రలను, వారి చర్యలను ఆధారముగా చేసికొని వారు ఉత్తమ కవిత అనదగిన రీతిలో విపులమగు తమ లోకానుభవమును, భావ సౌందర్యమును కనబఱచుచు సంభాషణములు వ్రాసినారు.

## సాంఘిక నాటకములు

పంతులుగారు సాక్షి వ్యాసములు వ్రాసినారు. తన్మూలమున సమాజము నందలి దుష్టాచారములను, దుష్టాభిరుచులను ఖండించినారు. వ్యంగ్య పూర్వక ముగా అధిక్షేపణ పూర్వకముగా వారు వ్రాసిన ఆ ఉపన్యాసములు మిగుల ఆకర్షకములై ఒప్పినవి. ఇటు నాటక రచన యందు, నాటక శిల్ప పాటవమున వన్నెకెక్కిన పేరు వారిది. ఈ రెండు లక్షణములను సమన్వయ పఱచి చూచినచో వారు గొప్ప సాంఘిక నాటకములను వ్రాయగలిగి యుండవలెను. కాని ఏ కారణముననో వారు అంత మంచి సాంఘిక నాటకములు వ్రాయలేదు.

పిఠాపురాధీశుల కోరిక వెంబడి వృద్ధవివాహము వ్రాయుట జరిగినది. అది ఒక మాదిరి రచన. చిట్టచివఱ అది ప్రచార సాహిత్యమై రెండే పాత్రల మహోపన్యాసములతో ముగిసినది. మనోమహిమమున, సరోజినిలో మనస్తత్వ నిరూపణ పద్ధతికే ప్రాధాన్యము. ఇందున్న సాంఘిక విమర్శ అత్యల్పము.

రాతిస్తంభము మిక్కిలి పేలవముగా నుండుటయేకాక చేతకాని వైద్యుని చేతవలె ప్రధాన పాత్రములన్నియు చకచక మరణించుటతో, విషాదాంత నాటకానురూప గాంభీర్యము లేక పోవుటతో అది చెప్పుకొన దగినంతటిది కాకపోవుచున్నది.

ఎటువచ్చి ఒక్క విచిత్ర వివాహము మాత్రము హాస్యరస ప్రధానము అగుటచే కొంత ఆకర్షింప జాలియున్నది. అదియైనను అతిబాల్య వివాహములపై అధిక్షేపకము అగుటచేత ఏకదేశమైన దృష్టి కలిగి నిలుకడ పొందజాలదు. పరప్రేమ రాతిస్తంభము వలెనె తేలిక రచనము.

సాంఘిక నాటకములు కాలానుసారము చేపట్టిరి కాని, వారికి వానిపై సరియగు లక్ష్యములేదు అనియే మనము అనుకొనవలసిన మాటగా కన్పించు చున్నది. కంఠాభరణము వంటి కాల్పనిక కథా నాటకములలో అంత నిపుణముగా సంఘముపై విసురులు చూపించిన వారు—అతిశయోక్తి రహితమగు సాంఘిక నాటకమును నిర్మించలేక పోయినారు.

## సుఖాంతములు

పాశ్చాత్య నాటక సాహిత్యములలో కామెడీలు, ట్రాజడీలు అని యున్న ప్రక్రియలకు సుఖాంత, కష్టాంత నాటకములని వ్యవహారము ఉన్నది. కాని ఇవి సరియగు పర్యాయ పదములు కాజాలవు. పానుగంటి వారు వ్రాసిన నాటకములలో కొన్ని సుఖాంతములే యైనను, వానిని పఠించునప్పుడు మన మనస్సు పాశ్చాత్య రూపక లక్షణమును గూర్చి ఆలోచింపదు. ఉదాహరణమునకు విప్రనారాయణ చరిత్రము, విజయరాఘవము మున్నగునవి స్థూలముగా సుఖాంతములైనవి కాని పాశ్చాత్య సంప్రదాయానుగుణమగు అర్థమున ఇవి సుఖాంతములు కావు గదా!

కాల్పనిక నాటకములలోని సుఖాంతములను గూర్చియే ఈ సందర్భమున చెప్పుకొన వలసి యున్నది.

కామెడీలను స్థూలముగా అచ్చమగు కామెడీలు (Pure Comedies), ట్రాజి కామెడీలు (Tragi Comedies) అని విభజింప వచ్చును. కోకిల, సరస్వతి, విచిత్ర వివాహము- ఇవి అచ్చముగా కామెడీలు. షేక్స్పియర్ రచించిన Mid-Summer Night's Dream, Comedy of Errors, Twelfth Night మున్నగు కథలలోని చమత్కార హేతువులగు అంశములను గ్రహించి వానిపై పంతులుగారు ఈ కథలను ఊహించి యున్నారు.

షేక్స్పియర్ కామెడీలలో తఱచుగా కాననగు పద్ధతులను ఇట్లు సంగ్రహింప వచ్చును.

1. కథాగతి విషయమై కవికి కొంత స్వాతంత్ర్యమును ఇచ్చి తీర వలయును. కథ, అందలి సంఘటనముల సంభావ్యత నిశిత పరీక్షకు, తర్కమునకు నిలువదు. యావత్కథకును భూమికగా గ్రహించు పరిస్థితులను, పాత్రల స్వభావములను మనము ప్రతి వచనము లేకుండ ఆమోదించిననే గాని వీలుపడదు.

2. కామెడీలలోని పాత్రలు జానపద వాఙ్మయములోని పాత్రలవలె నిరాడంబరముగ, ముక్కునకు సూటిగా పోవునట్టి పంశ్లిష్టేతర స్వభావములు గలిగి యుండును.

3. కథానాయకులు ఉదాత్త ప్రకృతి కలవారే అయ్యును నాటక కథ శుభాంతము అగుటలో వారు ప్రత్యేకము సాధించునది ఏమియు నుండదు. వారికన్న కథానాయికలు చాకచక్యము ఎక్కువగా కలవారై ఉందురు.

4. అన్యవేష ధారణమునకు ప్రాధాన్యము ఎక్కువ. స్త్రీ పురుషులు అన్యోన్య వేషధారణము ఒనర్చి పురుషులుగా, స్త్రీలుగా చెల్లిపోవు చుందురు.

5. ఇందలి పాత్రములు జీవితమును గూర్చి గట్టిగా పట్టించుకొనునట్టి తత్త్వము కలవి కాక ఆడుచు పాడుచు కాలము గడపునవియై యుండును. కాలమే క్రమముగా సర్వమును శుభోదర్కమగునట్లు సంఘటించు చుండును.

ఈ విధముగా షేక్స్పియర్ మహాకవి సృష్టించిన కామెడీలు ఒక ఊహాజగత్తునకు సంబంధించినవిగా నుండి ఉల్లాసమును కలిగించును. ఊహాజగత్తు అనినంత మాత్రమున ఇందు వాస్తవికత ఉండదని అర్థము కాదు. అందలి వాస్తవికత విశిష్టమైనది. మొదట కొన్ని అంశములను, పరిస్థితులను సంభావ్యము లగునా, కాదా, అని తర్కింపకుండ ఆమోదించిన యెడల ఇక తక్కిన దంతయును సంభావ్యమే అగును. పానుగంటి వారి కామెడీలలో ఈ లక్షణములు అన్నియు నున్నవని ఈ వఱకే నిరూపింపబడినది.

పంతులుగారు ఈ కథలలో ఏవో చిన్న చిన్న రాజ్యములు, వాటి నడుమ సముద్రములు, అరణ్యములు సృష్టించి ఒక క్రొత్త ప్రపంచమున జరుగుచున్నట్లు చేసిరి. ఈ వాతావరణము ఈ కథలను ఏ బహుపూర్వకాలమునకో కొని పోవును. కాని అందు చర్చింప బడిన విశేషములు, వారి జీవితానుభవములు, అలవాట్లు పమకాలిక ధనిక ప్రభు కుటుంబముల లోనివి.

ట్రాజి కామెడీగా చెప్పబడినది పద్మిని ఉన్నది. నాటకము విషాదాంతము వలె గంభీరముగా నడచి ఒక్క మలుపుపైన సుఖాంతముగా పర్యవసించుట ఇందలి ప్రత్యేకత. వీరమతి నాటకమున సుఖాంత నాటక వాతావరణము కొంత ఉన్నది. ఇది సుఖాంతము కూడ. దీనిలో ప్రధాన పాత్రలు ఆదర్శ మూర్తులై ఉన్నవి. ఇది దీని విశిష్టత. కంఠాభరణమున సామాజిక జీవితముపై విమర్శ అగ్ర స్థానమును వహించును. ఇందలి రచన వ్యంగ్యవిలసితమై దీనిని కామెడీ ఆఫ్ మేనర్స్ శాఖకు చెందజేయును.

## రెస్టొరేషన్ కామెడీ ప్రభావము

షేక్స్పియర్ మహాకవి వ్రాసిన కామెడీల ప్రభావము కన్నను రెస్టొరేషన్ కామెడీల ప్రభావమ్ము పంతులుగారిపై ఎక్కువగా ఉన్నదని కొందఱు అభిప్రాయ పడుట కలదు.

రెస్టొరేషన్ కామెడీలలో మితిమీరి, అవినీతికి గూడ తావల మగు శృంగారము చోటు చేసికొనినది. పంతులుగారు కూడ శృంగార విషయమున ఔచిత్యమును పాటించలేదు. కొన్నికొన్ని చోట్ల సంస్కృత బుద్ధులకు జుగుప్సావహముగా తోచునట్లు శృంగారమును పోషించిరి. దీనిని గూర్చి వివరముగా పంతులుగారి రసపోషణ సంవిధానమును పరిశీలించునప్పుడు చెప్పబడును— రెస్టొరేషన్ కామెడీ రచయితలలో కొందఱియందు కానవగు గుణదోషములు పంతులుగారి రచనలలో కూడ కనవచ్చును. అంత మాత్రమున పంతులుగారు ఆ ప్రభావమునకు లోనైరి అని సిద్ధాంతీకరించ వలసిన అవసరము ఏమున్నది ?

## విషాదాంతములు

పంతులుగారి నాటక కృతులలో మంగళాంతములు కాని వానికి చివఱ, మామూలుగా తాము వ్రాయుచున్న భరత వాక్యపు పద్యమును వ్రాసి " అను భరత వాక్యమునకు ఇందు అవకాశము లేదు గదా ! " అనిపించుచు వచ్చిరి. ఈ రీతిగా ఉన్న నాటకములు నాలుగు ఉన్నవి.

1. పూర్ణిమ 2. సరోజిని
3. రాతి సంభము 4. పరప్రేమ

వీనిని అన్నిటిని పాశ్చాత్య సంప్రదాయార్థమున విషాదాంతములు అనుటకు అవకాశము చాలదు. ఇవి కష్టాంతములే అయినను, అన్నియు ట్రాజడీలు కావు.

ఈ నాలుగు రూపకములలోను ఉత్తమమైనది పూర్ణిమ. దీనిలో ట్రాజడీలకు ఉచితమైన గాంభీర్య విలసనము, భావ, పాత్ర స్వభావ సంఘర్షణమును ఉన్నవి. ఈ నాటక కథ విషాదాంతము అగుటకు దారితీసిన పరిస్థితులు పరిశీలించినచో షేక్స్పియర్ ట్రాజడీలలో వలె నాయకునిలో గల లోపము కొంత కారణము అనిపించును. అయినను జీవితము నెడ, లోకగతి యెడ భారతీయులకు సహజముగా నుండు తాత్త్విక దృక్పథమును పంతులుగారు విస్మరించలేదు. చంద్రశేఖరస్వామి చేత కర్మవశమున జీవితములు ఒకనిర్దిష్ట మార్గమున ఈడ్వబడుచుండుట, మానవులు ఆ పరిస్థితులకు నిస్సహాయముగా తలను ఒగ్గుచుండుట గూర్చి పానుగంటివారు చెప్పించియే యున్నారు. షేక్స్పియర్ మహా కవియు తన విషాదాంత నాటక పాత్రలచేత దైవిక శక్తుల అప్రతిహత ప్రభావమును గూర్చి ప్రశంసింప జేసియే యున్నాడు గదా!

పూర్ణిమ నాటకములో మనుష్యుల గుణావగుణములతో సంబంధము కంటె ప్రారబ్ధ వశమున ఎక్కువగా విషాదాంతత సంఘటిల్లుచున్నట్లుగా చిత్రించిన పంతులుగారు సరోజిని నాటకములో, రాతిస్తంభములో, పరప్రేమలో ప్రారబ్ధముకన్న మనుజుల శీలస్వభావములు, చర్యలు, మనస్సులు విషాదాంతతకు ప్రత్యక్ష హేతువులు అగుచున్నట్లు నిరూపించిరి.

సరోజిని నాటకమున దుష్ట స్వభావము గలిగిన సరోజిని మరణము చివఱకు సంభవించినను, మంచి పాత్రములకు అపకారము తప్పినది. ఒక దృష్టితో చూచినచో ఇందు విషాదాంతత ఎక్కడిది? అయినను పంతులుగారు దీనిని కష్టాంతముగానే పరిగణించినారు.

నాటకమునకు వారు సరోజిని పేరు ఉంచినారు. సరోజిని మొదట దుర్మార్గురాలు కాదు. అసూయా ద్వేషములు అంకురించి ఆమెను దుష్టమార్గమునకు లాగినవి. సవతిని ప్రేమింప గలనని, తాను ఉత్తమ సంస్కారము కలదానిని అని, లోకుల కంటె భిన్నముగా భర్త సుఖమునకు తాను పరమోదారముగా వ్యవహరించగలనని ఆత్మ విశ్వాసాధిక్యము ఆమెకు ఉన్నది. కాని యిది కాల పరీక్షకు నిలువలేదు. ఇది ఆమె జీవితమునకు విషాదదాయక మగుటయే కాక సంసారమున అశాంతి లేవదీసినది. ఈ విధముగా పంతులుగారు ఊహించి యుండ వచ్చును.

రాతి స్తంభము నాటకము చివర నున్న కష్టానుభవములు యాదృచ్ఛికముగా ఒక్కసారి సంఘటితము లైనవి. వృద్ధురాలు అగు నారాయణరావు తల్లి మరణించుట, నారాయణరావు సమయమునకు సమీపమున నైన ఉండక వేశ్యా గృహమున ఉండుట, అతని దౌర్మార్గ్యమును సూచించుటకు అవసరము. అతడు తన్ను పిలువ వచ్చిన భార్యను కొట్టుట అతని దుష్టత్వమునకు పరాకాష్ఠ. ఆమె ఆ దెబ్బలకు మరణించుట అతనిలో పరివర్తనము తెచ్చుటకు ఆవశ్యకము. ఇక కొడుకు కుంపటిలో పడి కాలిపోవుట, నారాయణరావు గుండె పగిలి మరణించుట అనునవి అపక్వ ఫలములు. నాయకుని యందు అంతరంగ సంఘర్షణము లేకపోవుట చేత, కష్టానుభవములు ఊరక పెంచబడుట చేత నాటకమున విషాదాంత గాంభీర్యము లేక నిర్వేదమయ మగుచున్నది.

పర ప్రేమ మనుష్యుల లుబ్ధత్వమును నిర్దయగా అపహసించు నాటకము. ఇందు ధనము యొక్క ప్రభావముచే అల్పులై పోవు మనుష్యులు పాత్రలు. విషాదాంత నాటకము చాయలకైన రాదగినది ఒక్క పాత్రము లేదు.

ఇక వ్రాసిరో, వ్రాయరో తెలియని కాత్యాయనియును కష్టాంతనాటకము అని వ్యాపార ప్రకటనలో ఉన్నది. అది ఎట్టిదో తెలియదు.

పంతులుగారి నాటక శిల్పమును గూర్చి కొన్ని అంశములుగా విభజించుకొని ఇక్కడ నుండి పరిశీలన చేయవలసి యున్నది. వారి నాటకములు ముఖ్యముగా అందలి సంభాషణల వలన ప్రశస్తములును, ప్రమోదకరములును

అగుచున్నవి అనుట అతిశయోక్తి కాదు. నాటకమున ప్రధానమగు అంగముల యందు సంభాషణము ఒకటి. సన్నివేశ కల్పనము మున్నగు ఇతర అంగముల కంటె దీనికి విస్తృతి హెచ్చు. సన్నివేశ కల్పనము, పాత్ర చిత్రణము, కథాగమనము, వస్తూన్మీలనము ఆదిగా గలుగు అంగములు అన్నింటికిని ఇది ప్రధాన వాహిక కదా!

## పాత్ర సంభాషణములు

పానుగంటి వారి నాటకములలోని పాత్ర సంభాషణములు విశిష్టములుగా తోచుటకు గల ప్రధాన హేతువులు ఇవి:

1. వారి పాత్రలలో మితభాషిత్వము కలవి సకృతుగా నుండును. లభించిన అవకాశము జారిపోవునేమో అన్నట్లు ప్రసంగించునట్టివే సర్వత్ర కనుపట్టును. సాధారణముగా ఇది నాటక రక్తిని భంగించు అంశము కాని విలక్షణములు, విశిష్టములు, సజీవములు అగు వారి పాత్రల మనోధర్మ స్వభావములను కడు శక్తిమంతముగ నిరూపించునవి అగుటచేత ఆ ప్రసంగములు ఎంత మాత్రమును విసుగు కలిగింపక, ఎక్కువ ఆహ్లాద కరములుగా ఉండును.

2. దీర్ఘ ప్రసంగములు, సంభాషణములు నాటక కథాగమన వేగమును అలసము చేయును. కాని పంతులుగారి నాటక రచనా శిల్పము ఎట్టిదనిన, వారు దృశ్య కథను అంకములుగనే కాని పలువురు ఆధునికుల వలె అంకమును మరల రంగములుగా విభజించరు. అందుచేత మొత్తము మీద దృశ్యముల సంఖ్య మిక్కిలి పరిమితము అగుచున్నది. అట్టి యెడ ఈ దృశ్యములలోనే కథాగమనము అంతయును ఇముడదు. కథలోని కొన్ని ముఖ్య దృశ్యములే ఎన్నుకొనబడును. సంస్కృత రూపక కర్తలవలె కథ ఎక్కువగా అర్థోపక్షేపకముల యందే సూచింపుచు రసానుకూలములగు దృశ్యములను మాత్రమే విపులీకరింతురు. ఈ పద్ధతి యొకటి వారి సంభాషణ రీతిని అట్లు నిర్వహించుకొనుటకు ఎడ మిచ్చినది.

3. సంభాషణములు పాత్రలు ఆ యా సన్నివేశముల యందు పొందు భావా వేగమునకు అనుగుణముగా నుండునట్లు హ్రస్వ దీర్ఘములుగా నుండును.

ఉదాహరణమునకు-పూర్ణిమ నాటకమునందు విజయరావు తన కుమారు డగు దేవరాజుతో శీఘ్రముగా పాఱిపోయి ప్రాణ రక్షణము చేసికొనుమని చెప్పును. దేవరాజునకు అది నచ్చదు. అప్పుడు విజయరావు వివేకముతో కూడిన సాహసమును గూర్చి విదర్శన పూర్వకముగ ఉపన్యసించును.

ఇచ్చట పంతులుగారు ఆఱు గీతములు వ్రాసిరి. వాని తుదిని దేవరాజు "తండ్రీ ; మీరు సెలవిచ్చిన యంశము లన్నియు బోధములైనవి." అనును. దానికి విజయరావు సమాధానము. "బోధమైనప్పు డిక మాటలాడక పొమ్ము." ఈ హ్రస్వ సంభాషణముతో సన్నివేశము రక్తి కట్టినది.

ఇంతలో ఒక దీర్ఘ సంభాషణము. మఱల పొడి పొడి ముక్కలు. ఒకసారి గ్రుక్క త్రిప్పుకొనని నీయని దీర్ఘ సమాసములు, అంతలో అలతి అలతి పదములు ఈ రీతి శైలి నాటక కర్త ఆ యా పాత్రలను, సన్నివేశములను మననము చేసికొనుచు వ్రాసె ననిపించును.

పంతులుగారి వాక్య నిర్మాణమును గూర్చి మఱియు ఎక్కువగ వేఱు స్థలమున చెప్పబడును.

4. యతి ప్రాసాను ప్రాసాదులు వాక్యములయందు ఉండుటచే వాక్యములకు ఒక సొగసు ఏర్పడును. ఇంకను ఇరుసిబ్బులలో సమ తూకము పడిన త్రాసు వలె వాక్యము నిలుకడగా హుందాగా నడపుటయు వారికి నల్లేరుపై బండి.

5. పాత్రలకు తగిన రీతిగా సంభాషణ స్థాయి మార్చుటయు పంతులుగారు మనోజ్ఞముగా చేసిరి. ఒక్క వాక్యములో కొట్టవచ్చినట్లు ఆ మాటలు అనిన పాత్ర మన కన్నులముందు నిలుచును. పంతులుగారి నాటకములలో పాత్రోచిత భాష అనినచో అది శబ్దార్థోభయములను అనుసరించి యున్నది. పరిశీలింపుడు.

సెట్టి : ఇదుగో, నీవుకూడ బుక్కా తీసికొనవలదా ? వియ్యపురాలవు నీవే ముఖ్యము. అసలు వస్తువు నీవే కదా ? ఈ పైదంతా వడ్డీ డబ్బులు కాదటే !

—విచిత్ర వివాహము

బంగారమ్మ : ఇదిగో ! ఓ! చేసినదేదో చేసినావు. అంతటితో నూరకుండ రాదా ? ఈ ప్రజ్ఞ లోకమున కంతకుఁ జాటవలయునా యేమి ?

—కంఠాభరణము

పల్లెవాడు : వల బుజాన వేసి ఎన్ని యేండ్లయినదో ! కుంటి బాపనయ్యా అయిదు పదుల మీఁద రెండన్నాడు. కంతి సాతానమ్మ పదైదులు మీద రెండన్నది. ఎవరిమాట నిజమో నాకుఁ దెలియదు. కాని యింత గాలి విసరు మాత్రము తోకబుట్టలో బొమ్మిడాయి బోణీ అయినది మొదలు నే నెఱుఁగను బాబూ ! నెత్తిమీఁద పెంఁడ్రుక లుండునో, యెగురునో యనిపించినది.

—సరిస్వతి

6. పద్యములు, పాటలు—వీని విషయమై పానుగంటివారు చేసికొనిన నియమము విశిష్టమైనది. తెలుగు నాటకములలో ఎటులో సంభాషణము పద్యమయముగా చేయు ఆచారము వచ్చినది. మొదటి రోజులలో తెలుగు దేశము వచన నాటకములనే ఆదరించినది. నాటకములయందు పద్యములు, పాటలు, సంగీతము—వీనికున్న స్థానమును గూర్చిన చర్చలు తక్కువ ఏమియు కాదు.

పంతులుగారికి వీనినిగూర్చి నిశ్చితాభిప్రాయము లున్నవి. టక్కుటిక్కు నడకలేని సీసాది మాత్రాచ్ఛందములను, భక్తి రసమునందు మాత్రము పాటలను వాడ వచ్చునని వారి అభిప్రాయము. సంగీత మూలకమైన ప్రేక్షక జనరక్తి వీరి నాటకములలో లోపించినను, దానికి బదులు వారు వచన సంభాషణలయందు హాస్యాదుల వలని ఆకర్షణ కల్పించి నాటకములకు ప్రదర్శనయందు రక్తి హెచ్చునట్లు వ్రాసియున్నారు.

పంతులుగారు స్త్రీ పాత్రములకు పద్యములను అత్యల్పముగ వాడినారు. పురుష పాత్రల కైనను ప్రధానముగా జీవితము, లోకము—వీని తత్త్వమును ప్రవచించు పట్టుల, అత్యంతోద్వేగముతో కూడిన సందర్భముల నియతముగా ఛందములను వాడిరి.

## నాటక పద్యరచన

నాటకములలో పంతులుగారి పద్యములనుగూర్చి చెప్పుకొనవలసిన అంశములు రెండు మూడు ఉన్నవి.

1. పంతులుగారు కంఠాభరణమున విజయ రాఘవమున వృత్తములు వ్రాసిరి. ఈ రెండు స్థలములందును కవులము అని డాబులు చూపువారిని వెక్కిరించుటకే వ్రాసిరి. నర్మదా పురుకుత్సీయమున మొదటి ముద్రణములో రెండు వృత్తములు ఉన్నట్లును, పునర్విమర్శ చేసిన తరువాత వానిలో ఒకటి తొలగించినట్లును చెప్పుటయైనది. రెండవది కూడ ప్రమాదవశమున గమనింపక విడిచియుందురు.

2. మాత్రాచ్ఛందములందు గాన బీజములను తొలగించి పంతులుగారు ఉపయోగించిరి. ఈ తొలగించుట ఎట్లు జరిగిన దనగా :

i) గురు లఘువులు, యతిప్రాసలు మొదలగు చోట్ల ఛందోభంగము కాకుండ వ్రాయుటచేత మాత్రమే పద్యములైన పద్యములను వ్రాయుట.

ii) వచనము వ్రాసినట్లే యుండు వాక్య నిర్మాణము పద్యరచనయందు కూడ చేయుట.

iii) మనోభావ సూచకములగు ధ్వనులుకూడ పద్యములలో మధ్యన ఇముడ్చుట, ముఖ్యముగా వీనిని పద్ధతులుగా చెప్పవచ్చును. ఈ లక్షణములకు ఉదాహృతులుగా ఈ క్రింది పద్యములను చూడవచ్చును.

పొడిచెదను, గోసెదను, జెరుపుదును, జీరు
దును వెలదిఁ జెప్పునను గొట్టక నను నిటు ద
హింతువా ? రామచంద్రు బాధింతువా ? ము
నీశ్వరులను దిట్టింతువా ? యిదిగో కత్తి.

చండాలుఁడను, మదాంధుఁడ, జడుండఁ గాం
తా జనతాలోలతా యుతుండఁ
బుత్ర ఘాతుకుఁడను, భూభర దేహుఁడ
వధ్యుండనైన నన్ వధము సేయు
నాతఁడేఁడీ ? లక్ష్మణా ! తండ్రి ! నీ కింత
కాలంబునకు దయ గల్గె; నిదె కి
రీటము—లోక సంప్రీతిఁ జేసెడి రాము
తల నుంచు మిదె నాదు తలను వంచి

నాఁడఁ ! గానీ యెటులో చెప్పువాఁడ, విను శి
రంబు గిరగిర దొరలుచు రాము పాద
ములను బడవలె ; తెలిసెనా ? మోడ్పుకేలు
పట్టితిని, ఉఁ ! ఇఁకాగ కట్టా ! యిదేల ?

—పాదుకా పట్టాభిషేకము

3. పంతులుగారి నాటక పద్యములయందు భావ సౌందర్యము ఎక్కువ. వారిని గొప్పకవి అనిపించు పద్యములు ఎన్నో కలవు. పద్యములలో అధిక భాగము అలంకార భూషితములు. కొన్ని చోట్ల వారు పొడవగు పద్య మాలికలను కూడ రచించినారు.

ఇక పాటల విషయము. భక్తిరసమున, కొన్ని యెడల హాస్య స్ఫూర్తికి (కంఠాభరణమున, పూర్ణిమలోను) పాటలు వ్రాసినారు. అచ్చట కూడ భావ ప్రాధాన్యమే ఎక్కువ.

## పాత్ర చిత్రణము

నాటకములలో మనోధర్మ తత్త్వ నిరూపణమునకు, తన్మూలకమగు పాత్ర చిత్రణమునకు అధిక ప్రాధాన్యము ఇచ్చి వ్రాసినవారు పానుగంటివారు. అంతకు పూర్వము అట్టి లక్షణములు గల నాటకములు వ్రేళ్లపైన లెక్కింప దగియుండును.

పంతులుగారు వ్యవహార విదులు ; లోకజ్ఞులు. మనుష్యులను బాగుగా పరిశీలించు ఆసక్తి గలవారు. ఆ కారణముచే పాత్రలలో వైవిధ్యమును తేగలిగినారు. ఎన్నటికిని మరపురాని పాత్రలను సృష్టి చేయగలిగినారు.

నర్మదాపురుకుత్సీయాదులగు తొలి నాటకములందు కన్న తరువాతి నాటకములలో ఊహలకు అందని పలు పోకడలు కల చిత్ర విచిత్ర పాత్రలను వారు సృష్టించి యున్నారు. వారి పాత్రలను అన్నిటిని పరిశీలించినచో, స్థూలముగా అవి రెండు వర్గములుగా కన్పట్టును. ఒక వర్గము శాంత గంభీరోదాత్తమై, సాత్త్వికతా నిబిడమైనది. ఔజ్జ్వల్య ప్రధానమై, పరిహాస ప్రియమై, తర్కనిపుణమై త్రుళ్లిపడునది ఇంకొకటి. ఈ రెండు చిత్ర ప్రకృతులును వారిలో ఏకమై యున్నవి. పంతులుగారి వ్యక్తిత్వమును గూర్చి యోజించునపుడు అదే మొదట చెప్పుకొనవలసిన విశేషము.

శ్రీరామచంద్రుడు, జగద్దేవుడు, మొదలయిన పురుష పాత్రములు, రాధ, వీరమతి, లక్ష్మి (రాతి స్తంభము) మున్నగు స్త్రీ పాత్రములు మొదటి వర్గమునకు చెందినవి. శారదుడు, శ్రీనివాసుడు ఆదిగా గల పురుష పాత్రలు, దేవదేవి, పద్మిని, చపల ఇత్యాదులగు స్త్రీ పాత్రములును రెండవ వర్గమునకు చెందినవి.

ఈ రెండు వర్గములును కాక, మఱి యొక వర్గమును చెప్పవచ్చును. అట్టి వాని సృష్టికి మూలాధారమైన సత్యమును వేఱు సందర్భమున సాక్షి ఆఱవ సంపుటమున వారే యిట్లు చెప్పించినారు.

"స్వభావ సిద్ధముగా నున్న వానినిఁ జూడ మనకు వేడుకగా నుండదు. స్వభావములోనో, స్వరూపములోనో, యెక్కడనో రవంత వ్యత్యాసము, కాసంత తెటుకు నున్నగాని మన కక్కడకు మనసు పోదు. ప్రకృతి గతి భిన్నమైన దేది యైనను సరే మనల నాకర్షింపక తప్పదు."

ఈ రీతి పాత్రములు సృష్టించుటలో పానుగంటి వారు సిద్ధ హస్తులు. కాని వీనిని సరిగా అర్థము చేసికొనుటకు, ఆనందించుటకు అందఱకును కుదరక పోవచ్చును. కొన్ని చోట్ల మఱియు అత్యుక్తులతో ఉన్నట్లు, స్వభావ విరుద్ధముగ ఉన్నట్లు తోచవచ్చును. సరస్వతిలో జయరామసింగు మున్నగు పాత్రలు ఇట్టివే.

వీనిని ప్రత్యేకముగా నాటక కవియు నాందీ ప్రస్తావనలు వ్రాసి యిచ్చిన కూచి నరసింహముగారును కూడ ఎడనెడ సమర్థించుకొని యున్నారు. నాటకములలో మాత్రమేకాక సాక్షి వ్యాసములలో కూడ ఒకటి రెండు చోట్ల పంతులుగారు ఇట్టి వానిని గూర్చి హెచ్చరించి యున్నారు.

గ్రంథ పరిష్కారము అను వ్యాసమునందు సాక్షి-నాల్గవ సంపుటము తుదిని, కవి గ్రంథములలో త్వరపడి శోధించి నిర్ణయింపరాదు అని పంతులు గారు తీవ్రముగా హెచ్చరించినారు. పుట్టుక తోడనే కొన్ని మనస్సులు స్వభావ విరుద్ధముగా ఉండును. అనేక కారణములచేత తరువాత కొన్ని స్వభావ విరుద్ధములు అగును. వీనిలో భేదములు అనేకములుగా ఉన్నవి.

ఈ వర్గీకరణము అటుంచి, పానుగంటి వారి నాటకములలోని పాత్రలను మఱియును అనేక రీతుల వర్గములుగా చేసి పరిశీలింప వచ్చును.

## దాసీ పాత్రములు

పంతులుగారి దాసీ పాత్రములు పరిశీలనార్హములు. వారి నాటకములలో దాసీలకు గల ప్రాధాన్యము అనల్పము. వారికి ఎదురు లేదు; తిరుగు లేదు. తెలివితేటలు ఎట్లున్నను, వారికి గట్టి నోరు మాత్రము పంతులుగారు ప్రసాదించినారు.

దశరథుడు అంతటివాడే

"క్ష్మా వధూ భర్త లఖిలాధికారు లన్న
మాటయే కాని లోలోని పోటు లన్ని
యెవరి కెఱుగంగ వచ్చు? వా రెపుడు
నగరునందుఁ గల దాసులకు దాసు లగుట నిజము."

అనుకొనవలసి వచ్చినదన్న వారి విఖ్యాతికి ఇది చాలదా? దశరథుడు ఈ మాట లోలోన అనుకొనెను. వీరమతిలోని మంత్రి సీతారామసింగు మోమోటమి లేక పైకే ఒప్పుకొనెను. "అమ్మగారి దాసి యైనది మంత్రినిఁ దిట్టకుండిన దెవతె?"

ఈ దాసీ జన ప్రాధాన్యమునకు మొదట దారి ఇచ్చిన వాడు పారిజాతాప హరణ కర్త ముక్కు తిమ్మన్నగారు. వారి శ్రీకృష్ణుడు సత్యభామకు తనపై చాడీలు చెప్పకుండ లంచములిచ్చి నెత్తి కెక్కించుకొనినాడు!

ఈ దాసీ జనములోను ఒకరి వంటి వారు ఇంకొకరు కాదు. వీరమతిలోనే ఉన్న కుశలది ఒక పద్ధతి. రాణిగారి వద్ద విలాసముగ కూరుచుండి సమస్థాయిలో మాటాడుచు మందలించుటకైన వెనుదీయనిది అది. పార్వతి రాణి కుమారునకు రణధవళునకు లోక జ్ఞానము నేర్పుటకు అతని మీదికి తన మేనకోడలిని ఉసి కొలిపి, తన చర్యను సమర్థించుకొనుచు, కలవర పడుచున్న రాణిని "అంతఃపురము కనిపెట్టుకొనిన దాసులము-మా కా మాత్రపు స్వాతంత్ర్య ముండగూడదా?" అని సవాలు చేయగలిగినది. కైకేయి వద్ద మంథర తీసికొనిన చనువు ఇక చెప్పనే రాదుకదా!

పూర్ణిమలో సర్వ మంగళ దాసి పద్మిని ఎప్పటి కెయ్యది ప్రస్తుతము అట్లు మాట్లాడునది. దేవరాజును వివాహమాడక తప్పనట్లున్నదని సర్వ మంగళ అనినప్పుడు "అట్లే కనబడుచున్నది." అనును. కాని అతని వివాహ మాడిన తండ్రికి అవమానము కదా అనగానే "అవునమ్మా! అవశ్యము మానివేయుట మంచిది." అని చెప్పును. ఇట్లు తుదిదాక మాటలాడి, సర్వ

మంగళ విసిగి పోయి "పద్మినీ! నేనే మాట యంటినో, నీవా మాటను జెప్పుచున్నావు." అనగా దానికి పద్మిని ఇచ్చిన సమాధానము "మీ యన్న మింతకాలము నుండి తినుచు వ్యతిరేకపు మాట నెట్లు చెప్పగలను?"

ముద్రిక నాటకమున భర్తను మంచి దారిన పెట్టుకొనుటకు రాణికి దాసీ దాని సహాయము అవసరమైనది. "విశ్వామిత్ర సంతతి ఆప్పటకు" అమావాస్య యనక, పగలనక భార్యలనుజేరి దద్దయ్యలను కనకుండ అవసర నైవేద్యమునకు దాసీలను జేరదీయుట చాల మంచిదని పంతులుగారి పాత్రలు కొన్ని గట్టిగా సిఫారసు కూడ చేసినవి. ప్రచండ చాణక్యమున రాణి సునంద దాసి యగు చతురను ఉంచుకున్న వారిని గూర్చి కుశల ప్రశ్నములు కూడ వేసి సమాదరించినది.

సరస్వతి నాటకములోని రాజు కోటలలో దాసీ జనమును గూర్చి వెలువరించిన అభిప్రాయము గమనింపుడు. "రాజుగారి మాటలను బొంచి వినుటలో నీ దాసి ముండలంత పండితులు లేరు సుమీ. రాణి కొఱుకరాని కొయ్యయైన తరువాత, దాసిది రాజుగారి చెవులు పట్టుకొని జోకాయించుట సిద్ధము........ ఈ దాసులున్నారే — నా సొమ్ము నాకుఁ బెట్టుట కేడ్చుచుందురు సుమా — రాజ్యము వారి దైనట్లు, నేను గతిలేక కోటలో గంజికై చేరినట్లు వారి యూహ."

సరస్వతిలోనే కళాలలిత దాసియైన కురంగి, మాలతీమాలలో గుణవతి దాసియెన కురవక తమ యజమానురాండ్రకు భర్తలు లభించుటకై తీసికొనిన చొఱవ వలన వారి వారి ప్రియులకు చెప్పుదెబ్బలు తప్పినవి కాని చీవాట్లు తప్పినవి కావు. ఈ దాసీ జగతికి చూడామణి వంటిది చూడామణిలోని చపల అని ఈ వఱకే చెప్పబడినది.

## విష్కంభ పాత్రములు

ఈ నాటకములలోని విష్కంభ పాత్రములు కూడ దాసీపాత్రల వలెనే ప్రత్యేకత కలిగినవి. పంతులుగారు తమ నాటకములయందు నలువదికి పైగా విష్కంభములను కూర్చిరి.

ప్రాయికముగా వారి విష్కంభములయందు రెండు పాత్రలు ఉండును. ఏవో ప్రేక్షకులకు చెప్పి పోవలసిన ఆ నాలుగు కథాంశములను చెప్పి పోవుటకు మాత్రమే ఆ పాత్రలు రావు. వ్యక్తిత్వము కలిగియుండి అవి రంగముపైనున్న నాలుగు నిమిషములను సొమ్ము చేసికొని పోవును.

ఈ పాత్రములు ఎక్కువగా సామాజికులను నవ్వించినను, కేవలము నవ్వింప వలె నన్న ఉద్దేశము కల వ్యక్తులు మాత్రమే కావు ఆ పాత్రలు. నాటకములోని ప్రధాన పాత్రవర్గమువలె సుస్పష్టమైన జీవరేఖలు వీనిలో గమనింప వచ్చును. చూడామణి నాటకములోని షష్ఠాంకస్థ విష్కంభములోని రామలక్ష్మణులు ; వనవాస రాఘవములోని చతుర్థాంకస్థ విష్కంభమునందలి అంశుమాలి, శరభులు, పాదుకా పట్టాభిషేకములోని షష్ఠాంకములోని విష్కంభమందు కనుపించు సుచిరుర భ్రమరకులు సజీవ పాత్రలు.

## విదూషక పాత్రములు

విదూషక పాత్రలను సంస్కృత రూపకములలో సంప్రదాయ సిద్ధముగనున్న ఫక్కిగనే పంతులుగారు కొంతవఱకు పోషించిరి. అయినను దానికి మఱికొంత కలిపి అధికమైన ప్రయోజనమును కూడ వారు సాధించినారు. ఈ అంశము రాధాకృష్ణలోని శారద పాత్రము గూర్చి చెప్పునప్పుడు నిరూపించుట జరిగినది.

సంస్కృత రూపకములలో విదూషక పాత్రము హాస్యనిమిత్తమైనది. విదూషకుడు నాటక నాయకునకు శృంగార సహాయుడు. విదూషకుడు ప్రత్యుత్పన్న ప్రతిభుడు, నర్మప్రయోక్త, నర్మగర్భ నిర్భేద్యుడు, విచ్ఛేద విదూషిత వచనుడు అని నాట్య శాస్త్రము.

విదూషకుని శృంగార సహాయము ద్వివిధముగా ఉండును. విదూషక పదము నిర్వచింప బడుచున్న రెండు పద్ధతులను బట్టి ఇది తేటతెల్లము కాగలదు. ఇతడు విగ్రహమును సంధిచే దూషించు వాడు, విప్రలంభమందు వినోదము కలిగించి దానిని మఱపించువాడు.

లక్ష్మీ నరసింహారావు గారి నాటకములలో విదూషక పాత్రము అని నిర్దేశింప బడినది ఒక్కటే. అది వారి తొలినాటకము నర్మదా పురుకుత్సీయము నందలిది. ఈ విదూషకునకు వారు నామకరణము చేయలేదు. ఇతడు భోజన ప్రియుడు. నర్మదా వియోగముచే సంతప్తుడగు రాజును ఊరడించుటలో ఎక్కువ శ్రమపడెను. ఇతడు సంస్కృత విదూషకుల కోవలోని వాడు.

ప్రచండ చాణక్యములోని వసంతకుడు, రాధాకృష్ణలోని శారదుడు విదూషక తుల్యులైన వారే. రాధాకృష్ణలోని శారదుడు కృష్ణుని వేడుక చెలికాడు. ప్రత్యుత్పన్న ప్రతిభుడైన వాడు. చమత్కార సంభాషణ చేయువాడు. ఇతడును నర్మదయందలి విదూషకుడును ఉదాత్త ప్రకృతులు.

ప్రచండ చాణక్యములోని వసంతకుని సంగతి వేఱు. ఇతడు నందునకు వేడుక చెలికాడు. "తెల్లవారు సరికి" తనకు "విస్తరిలోని కే దయినను, సాయంకాల మగుసరికి రాజుగారికిఁ బ్రక్కలోని కేదయినను జూడవలసిన సుఖ వ్యాపారము కల" ఇతడు కేవల విదూషకుడే కాక కొంత వఱకు చేటుడు కూడ. తన దుష్ట ప్రవర్తనచే నందునికి చెఱుపు తెచ్చి, తానును దుర్మరణము పాలైనాడు.

విప్రనారాయణ నాటకములోని శ్రీనివాసుడు కూడ విదూషకప్రాయుడే అనవలయును. ధీరప్రశాంతుడగు ద్విజ నాయకునకు చతుర్విధ విదూషకులలో ఔచిత్యమును అనుసరించి శిష్యుడు విదూషకుడుగా నుండవలెను అన్న ఆలంకారిక నియమమును అనుసరించి ఇతడు సరియగు విదూషకుడు అగుచున్నాడు. కాని నాటకములోని కథానాయక ప్రకృతిని అనుసరించి, ఇతడు శృంగార సహాయుడు కాక భక్తి రసమున సహాయుడైనాడు.

## సంశ్లిష్ట పాత్రములు

పంతులుగారి లోకజ్ఞతను చాటిచెప్పు పాత్రములు, సంశ్లిష్ట స్వభావము కలిగిన పాత్రలు. వానిలో ప్రత్యేకముగా పేర్కొన దగినవి సరస్వతిలోని మాధవ వర్మ, రాగవర్ధనుడు, వీరమతిలోని పార్వతి, ఉదయాదిత్యుడు, మొద లయినవి. వీనిని గూర్చి విపులముగా ఆ యా సందర్భములందు చెప్పబడినది.

ఇవి కాక సారంగధర లోని చంటిక, లవిత్రులు మొదలగు అల్ప ప్రాధాన్యము గల పాత్రలు, పంతులుగారి ఊహ శక్తికి తార్కాణము లయిన విజయరాఘవములోని మహోదరాదులు, వనవాస రాఘవములోని అంశుమాలి, శరభులు, పూర్ణిమలోని కవియైన దొంగ, సరస్వతిలోని జయరామసింగు మున్నగునవి కలవు. పంతులుగారు ఎంత సూక్ష్మ పరిశీలన సమర్థులో వారి నాటక పాత్రములు అన్నియును ప్రకటించుచునే ఉన్నవి.

## ప్రసిద్ధ పాత్రములు

తాము క్రొత్తగా కల్పించిన వానినే కాక పూర్వ సాహిత్యము నుండి తాము గ్రహించిన రామ, కృష్ణ, దశరథ, వసిష్ఠాది పాత్రములలో కూడ వారు క్రొత్తదనమును సంపాదించ గలిగిరి.

రాముడు "అమ్మయెడఁ జూపు నిల్పి మాటాడు చుండ నట్లు మాటాడినను, జూడు మయ్య యిటుల అనుచు" గడ్డము గ్రహియించి అతని మొగము తన ప్రక్కకు త్రిప్పుకొను దశరథుడు; దశరథుడు పురిటి గ్రుడ్డయిన రాముని తనకు చూపగా, కనుల నానంద బాష్పములు తొలుకగా స్వల్ప పూర్వ పరిచయము గల పూర్ణ, విమల, శాంత, గంభీర తేజంబు చూచు వసిష్ఠుడు సామాజికుల స్మృతి పథములను ఎన్నడును వీడవివి.

## స్త్రీ పాత్రములు

పంతులుగారి నాటకములలో పురుష పాత్రల కన్న స్త్రీ పాత్రములు రమ్యతరములు. స్త్రీ పాత్రలకు ఎక్కువ ప్రాధాన్యమును ఇచ్చి వ్రాసిన వారిలో వా రొకరు.

వారు వ్రాసిన నాటకములలో పెక్కు స్త్రీల పేరులు కలిగినవే. ఈ స్త్రీ ప్రాధాన్యము పంతులుగారి చూడామణి నాటకమునందు పరాకాష్ఠ దశను అందుకొనినది.

స్త్రీలను గూర్చి గౌరవముగా, చిత్రముగా చమత్కారముగా వారు ప్రకటింప జేసిన అభిప్రాయములు అనేక సందర్భములలో ఉన్నవి. దానికి అనుగుణముగా వారు స్త్రీ పాత్రలను అనేక రీతులలో తీర్చినారు.

రాధ, వీరమతి, లక్ష్మి వంటి ఉత్తమ కాంతలు, పద్మిని, పార్వతి వంటి కాపటిక శిఖామణులు, పద్మావతీ మహారాజ్ఞి వంటి శౌర్యనిధులు, దేవదేవి వంటి రాజసిక ప్రధాను రాండ్రు, దాసీవర్గము వంటి తామస ప్రకృతులు, గుణవతిలోని కమల వంటి ధీరు రాండ్రు వారి నాటక పాత్రలలో ఎందరో!

పంతులుగారు ఎట్టి పాత్రనైన అవలీలగా సృజించి, పోషింపగలరు. కాని వారి సృష్టిలో తీవ్ర ప్రకృతి గల పాత్రలు ఎక్కువగా రక్తి కట్టును. సుఖ దుఃఖములకు ఊగిపోయి, తెగబడి బయటపడు విద్యు దుద్వేగము గల యట్టివి, సుఖ దుఃఖములచే అనభిభూత మైన స్వభావము కల ఉదాత్త పాత్రలు ఈ రెండును ఒక్కొక్క రకముగా తీవ్ర ప్రకృతులే. దేవదేవి, లక్ష్మణుడు, పద్మిని, పద్మావతి మున్నగు పాత్రలను వారు ఎంత రమణీయముగా పోషించినారో!

సుమారు నాలుగు వందల పాత్రములు వారి నాటక వాఙ్మయమున మున్నవి. ఇవి అన్నియును వైవిధ్యము, వ్యక్తిత్వము గల పాత్రలే. ఎవనికున్న కష్ట సుఖములు వానికి ఉన్నవి. ఆ కష్ట సుఖములను అనుభవించుటలో అందఱికిని ఒక మనస్సే కాదు. వారి వారి అనుభవములను బట్టి వారికి ఎన్నో స్థిరాభిప్రాయములు—వానిని బట్టి ఒక్కొక్కరిది ఒక్కొక్క మార్గము.

ఈ పాత్రలు కేవలము మానవ విగ్రహములు మాత్రమే కావు. నాటక కర్త మానవ కృత్యములను నిర్వర్తించు బొమ్మలను సృష్టించుట కాదు. ఆ కృత్యములను చేయించు మనస్సును, జీవమును కూడ ప్రసాదింప వలసి యున్నది.

అట్టి జీవ ప్రదాన మహాత్కార్యమే పాత్ర సృష్టిని, పాత్ర చిత్రణము కన్న విశిష్టముగా చేయునది.

వాస్తవిక వ్యక్తులకు, నాటక పాత్రములకు మధ్య సన్నని పొర వంటి అంతరమైన లేకుండునట్లు సృష్టించుట గొప్ప కళ. అది పానుగంటి వారికి కరతలామలకము. పాత్ర సృష్టి చేయుటలో వారికి ఒక ఆవేశము ఉన్నట్లుగా తోచును. దాని మూలముగా అతి చైతన్యవంతము లైన పాత్రలు అవతరించినవి.

భయాశ్చర్య కోపతాపాదులను వరుస క్రమములో అభినయించునవి కాక జీవితములో వలెనే సమగ్రమును, అసమగ్రమును అయి వివిధ భావ సంఘర్షణలు కలిగిన మనస్సు గల పాత్రలు—ఏకీభూత సప్త వర్ణమైన సూర్యరశ్మి వలె ప్రకాశమాన మైన స్వభావముగల పాత్రలు అవి.

## సన్నివేశ కల్పనము

సన్నివేశ కల్పనము నాటకకర్త ప్రతిభకు నిదర్శనమైన విషయము. పద్య గద్యమయములగు శ్రవ్య కావ్యములలో కన్న దృశ్య కావ్యముల యందు ఈ విషయమై ఎక్కువ శ్రద్ధ చూపించవలసి యుండును. ఏలన, నాటక కర్తకు రసబంధురమగు కొన్ని సన్నివేశములను మాత్రమే విస్తరించుటకు అవకాశము ఉన్నది. ప్రధాన కథలోని యిట్టి సన్నివేశములను ఎన్నిక చేసికొని, తన పాత్రలను, కథాగమనమును నిపుణముగా, ఆహ్లాద కరముగ నాటక కర్త సామాజికులకు ఎఱుక పఱచ వలయును.

పానుగంటి వారు సన్నివేశ కల్పనమున, సంఘటన నైపుణ్యము నందు కూడ సిద్ధహస్తు లైన వారు.

వారి సిద్ధ హస్తత తొలి నాటకమైన నర్మదాపురుకుత్సీయము నందే స్పష్టమైనది. మొదటి అంకమునందు విశ్వామిత్రుని తపోభూమి ప్రాంతమున ఊర్ధ్వలోకమునుండి చిత్రకేతుని, ఉరగ లోకమునుండి అంశుమంతుని ఏక కాలమున ప్రవేశపెట్టి మూడు లోకములకు ముడివేసి కథా నాయికా నాయకులను సంఘటించిరి. ఇది కథలో శృంగారమునకు తోడుగా ప్రవహించిన అద్భుతమునకు అచ్చుకట్టినట్లై అనంతర కథా సంవిధానమునకు మూలాధారమైనది.

అట్లె రాధాకృష్ణ నాటకమునందు మూడవ అంకమున మధురనుండి శారద, కృష్ణులు బృందావనమునకు వచ్చుసరికి లలితా, మధురా, రాధలచేత నాటకము ఆడించుచుండుట, పైగా తరళా సత్యభామలను కూడ తెచ్చి నిలిపి, పాత్రలను అన్నింటిని తారతమ్య పరీక్షకు నిలిపి, ఆ సన్నివేశము ఆరంభముగా సత్యా మనః పరివర్తనమును చిత్రించుట వారి ప్రతిభకు తార్కాణ మైనట్టి సన్నివేశము.

రామాయణ నాటకములందు కూడ సామాజికుల పర్వేంద్రియములను ఆకట్టుకొను సన్నివేశములను ఎన్నింటినో వారు కల్పించినారు. కల్పిత కథలలో చెప్పనే అక్కఱలేదు. ఇట్లు చెప్పుచు పోయినచో వారి నాటకములలోని అన్ని సన్నివేశములను చెప్పుచుండ వలసినదే. అందుచేత వారి విశిష్టతను చాటు ప్రత్యేక సంఘటనములను గూర్చియే ఇక్కడ చెప్పుకొనవలయును.

అట్టివానిలో పంతులుగారి విష్కంభములు అగ్రగణ్యములు. విష్కంభ ములు సాధారణముగా సూచ్యకథా సూచనకే అయినను వీరి నాటకములలో అవి అంతకంటె అధిక ప్రయోజనకరములు. పూర్వాపర కథాంశములకు సంబంధము కలిపినను, అందులో కొన్ని (నవ్యార్థమున) ఏకాంకికవలె ఉండును.

దశరథుని మృతి, భరతునకు ఆవార్త తెలియకయే వసిష్ఠుని ఆదేశముపై అయోధ్యకు వచ్చుట — ఈ వృత్తాంతమును తెలుపుటకై పంతులుగారు పాదుకా పట్టాభిషేకములో కూర్చిన విష్కంభము ఉన్నది. తైలభాండ నిక్షిప్తమైన దశరథుని మృత కళేబరమును గూర్చి ఆవకాయతో పోల్చి సురుచిరుడు ఆక్షేపించును భ్రమరకుడు వలదని వారించినను వినడు. ఇంతకును కారణము అతడు పొరుగూరి వాడు ; శ్రాద్ధక్రియలు ఆరంభమై దానదక్షిణాదులు దొరకునని ఆశపడి వచ్చి ఎన్ని నాళ్లకును దహన క్రియలు ఆరంభము కాకపోవుటచేత విసిగిపోయినవాడు. అతడు ఏమైన మాట్లాడును. లోకములోనుండు చిత్ర ప్రకృతులను ఇట్లు సంఘటించి వారి వ్యక్తిత్వము నిలుపుచునే సూచ్యకథ వారిచే సూచింపజేసి పంపినారు. ఇట్టివి చూడామణిలో, వనవాస రాఘవములో, కోకిలలో ఇంకను ఉన్నవి.

పంతులుగారు అంకములను రంగములుగ విభజించి వ్రాయలేదు. అయినను ఒక్కొక్క అంకమున మూడు నాలుగు సన్నివేశములను కూర్చి యున్నారు. ఎచ్చటనోకాని, తఱచుగా ఈ సన్నివేశములు ఏకస్థలమున జరిగినవే. కొన్ని సందర్భములలో వీధి, గృహాంతర్భాగము మున్నగు భిన్నస్థలములలో ఒకే అంకములోని సన్నివేశములు జరిగినవి. అట్టి యెడ నడుమ తెరను ఉపకరణముగా నిబంధించినారు.

ప్రాయికముగా అంకాది సన్నివేశములను పానుగంటి వారు ఏదో ఒక చర్చ నడుమ ఆరంభించు చుందురు. కొంతసేపు నడచిన గాని ఆ పాత్రల చర్చ యందు ప్రసక్తమైన అంశము సామాజికులకు అవగతము కాదు.

ఉదాహరణమునకు పాదుకా పట్టాభిషేకమున ప్రథమాంకమున ప్రారంభము.

దశ : మంత్రీ ! తలచుకొనిన పని శీఘ్రముగఁ గాకుండ నిది యెంత యంతరాయము గలిగించినది ?

వసి : మీరు సందేహింప వలదు. అది యావశ్యకమే కాదని నా యభిప్రాయము.

దశ : ఎందు చేతనో యానతిచ్చెదరా ?

వసి : అది యిదివఱకే యాచరించ బడుటచేత—

దశ : భగవానుఁడా ! అది యెటులు ?

వసి :

వంచనెంచి రాజులు తల వంచుకొనిరి;
యెత్తనెంచి యంజలి తల కెత్తుకొనిరి:
అట్టి హరువిల్లు చెఱకును హస్తివలెను
విఱిచె నతఁ డది దిగ్జయ విధము గాదె ?

అఖిల రాజన్య మూర్ధన్య సమాజ సాంద్రమగు తత్సభలో శ్రీరామచంద్రునిచే జరిగింప బడిన యీ మహాకార్యము కంటె దిగ్విజయ మేమున్నది ?

అంక ప్రారంభమున దశరథుడు తనకు ఎదురయిన ఏదో ఒక సమస్య గురునితో, మంత్రితో ఆలోచించుచుండగా నడుమన అంక మారంభమైనది. ఆ సమస్య యెట్టిదో మఱి రెండు మూడు నిముషములు ఆగినగాని తెలియదు.

ఈ పద్ధతిని గూర్చి చెప్పుటకు ముందు పైన ఉదాహరింపబడిన భాగమును మఱల కొంత కొనసాగించి ఒక విశేషమును చెప్పవలసి యున్నది.

దిగ్విజయము ఆవశ్యకము కాదని నిర్ధారణమైన తరువాత—

దశ : అటులైన దాశరథి పట్టాభిషేకము వెంటనే చేయుట కభ్యంతరమేమున్నది ?

వసి : ముహూర్త నిర్ణయము.

దశరథుని మనస్సునకు అనుగుణమగు చక్కని సమాధానము. కాని ఈ నాటకము పట్టభంగ రాఘవము. దశరథుడు తలపెట్టిన పట్టాభిషేకము భగ్నమగుట. దశరథుడు ఏమి చేయుచున్నాడు ? ఆటంకముల గూర్చి, అభ్యంతరము గూర్చి, అవరోధములను గూర్చి చర్చింపుచున్నాడు. ఈ విధముగా నాటకారంభము ! అవరోధము ఏర్పడిన పట్టాభిషేక మహోత్సవపు కథ అవరోధముతోనే మొదలైనది. ఎంతటి ఔచిత్య శోభితమైన ప్రారంభము ? అది పంతులుగారి ప్రజ్ఞావిశేషము.

అంకమునందలి సన్నివేశమును చర్చకు నడుమ ఆరంభించుటలో రెండు ప్రయోజనములు ఉన్నవి. మొదటిది నాటక ప్రదర్శన యందు సామాజికుల ఉత్కంఠ పెరుగుట. రెండవది అంకము మొదట తెర ఎత్తగనే ఉండు కలకల ధ్వని తగ్గునంతలో ప్రధాన విషయము వినబడకుండ పోవు ఇబ్బంది తొలగుట.

పంతులుగారి నాటకములలో సన్నివేశములు ప్రాయికముగా దీర్ఘములు. చిట్టిపొట్టి సన్నివేశముల వలన రసము అవిచ్ఛిన్నముగా ఉండదు. కావున వారు అట్టి వానిని సాధ్యమైనంత వఱకు కూర్పరు. సన్నివేశము దీర్ఘమైనను సంభాషణములు వ్రాయుటలో ఉన్న నైపుణ్యము మూలముగా రక్తి కొఱవడదు.

ఒక్కొక్క సన్నివేశమును తీర్చుటలో వారు ఉన్న అవకాశములు అన్నియును పూర్తిగా వినియోగ పఱచుకొందురు. ఇక ఆ సన్నివేశములో మఱి యొకరు ఒక మాట చేర్చదగినది, మార్చదగినది ఉండదు.

## ప్రాచ్య పాశ్చాత్య లక్షణ సమన్వయము

పానుగంటివారికి నాటకములు వ్రాయుటలో షేక్స్పియర్, కాళిదాస భవభూతులు ఆదర్శము. వారి నాటకముల ప్రాచ్య పాశ్చాత్య నాటక లక్షణములు సమన్వయము పొందినవి.

తెలుగు నాట నాటకము ఇప్పటి స్వరూపమున 1860 లో అవతరించినది. దేశీయ, విదేశీయ సంప్రదాయముల సమ్మేళనములో నాటకములు ఆవిర్భ వించినను తెలుగు రంగస్థల ప్రభావమున వీనికి ఒక ప్రత్యేకత ఏర్పడినది.

సంస్కృత రూపకము నుండి నాందీ ప్రస్తావనలు, భరత వాక్యము తెలుగు నాటకములో ప్రవేశించినవి. తక్కిన లక్షణము ఆదరించిన రచయితలు ఆద రించిరి; లేనివారు లేదు. విష్కంభ ప్రవేశములను కొందఱు కూర్చిరి; కొందఱు విడిచిరి. పంచ సంధులతో కూడిన యితి వృత్తమును కొందఱు సంఘ టించిరి. తక్కినవారు దానిని అంతగా పట్టించుకొనలేదు. ఏకనాయకుడు, ప్రధాన రసము దృష్టిలో ఉంచుకొనిన నాటకములును తక్కువగానే ఉన్నవి. తెలుగు నాటకముల కొక లక్షణమును లక్ష్య సహితముగా నిరూపించుటకు గట్టి ప్రయత్నము జరుగలేదు.

సాహిత్య గౌరవము కలిగిన నాటకముల కంటె ప్రదర్శన లాఘవము కలిగిన నాటకములే ఎక్కువగా వచ్చినవి. వివిధ సామాజికులకు ఎటులో సద్యః ఆనందమును గూర్చుటయే బహు నాటక కర్తలకు ధ్యేయమైనది.

ఇట్లుండగా, ఆంగ్ల నాటక రీతుల ప్రభావము తెలుగు నాటక వాఙ్మయము మీద ప్రసరించినది. దీని వలన విషాదాంతము, సంఘ సంస్కరణాభిలాష ప్రేరితము—ఇట్టివి వచ్చినవి. వానితోపాటు వట్టి కథాకథనము మాత్రమే

కాకుండ నాటకములలో మన సత్త్వ నిరూపణము, భావ సంఘర్షణము, సందే శము మున్నగునవి అవసరము అనిపించినది. అంకమును రంగములుగ విభ జించు కొనుటయును తత్ప్రభావ ఫలితమే. రంగమున అంతకు పూర్వము నిషిద్ధమైన ఉద్వేగాత్మక చర్యలను ఏల నిషేధింప వలె నను మాట వచ్చినది. కొందఱు నాటక కర్తలు ఆంగ్ల నాటకములందు వలె ప్రొలోగ్, ఎపిలోగ్ వ్రాయ నారంభించిరి.

ఇట్టి కాలమునకు చెందిన వారు పానుగంటివారు. కావుననే అనివార్యముగా వారి నాటకములందును తక్కిన అనేకాంశములందు వలె ప్రాచ్య పాశ్చాత్య దృక్పథముల సమన్వయము ఏర్పడినది.

పంతులుగారు తమ నాటకముల యందు ఎచ్చటను అంకములు రంగ ములుగా విభజింపలేదు. హాస్య వల్లరిలో చేర్చిన మనో మహిమములో మాత్రమే ప్రొలోగ్, ఎపిలోగ్ వ్రాసిరి. పంతులుగారి నాటకములలో గాని, ఇతర రచన లందు గాని పాశ్చాత్యుల ప్రభావము పడినచో అది బాహ్యస్వరూపముపైన కన్న ఆంతర తేజముపై నెక్కువ అన్నమాట జ్ఞాపకము ఉంచు కొనవలయును.

పంతులు గారి నాటకములలో పౌరాణిక కథలు; తత్తుల్యములైన కథలు కలవి అయిన నాటకములను చదువునప్పుడు కాని, ప్రదర్శించునప్పుడు కాని మన మనస్సు పాశ్చాత్య లక్షణమును గూర్చి ఆలోచింపదు. చారిత్రక నాటక ములు వ్రాయుటలో పంతులుగారు షేక్స్పియర్ పోకడలు పోయి ఆంధ్ర షేక్స్పియర్ బిరుదమునకు అర్హులైనారని డా. కె. వీరభద్రరావు గారి నిర్ణయము. కామెడీ ట్రాజిడీల సృష్టిలో కూడ వారు షేక్స్పియర్‌ను అనుసరించినట్లు చూచితిమి.

ప్రాచ్య లక్షణములో నాందీ ప్రస్తావన, భరత వాక్యము, విష్కంభము వీనిని పంతులుగారు ఆదరించినారు. అంకములలో రంగ విభజన చేయక పోవుట, నర్మదా రాధాకృష్ణాదులలోని రసపోషణ విధానము, అలంకార బహుళ మైన రచన కావించుట మున్నగు వానిలో పంతులుగారిపై కాళిదాసు, భవభూతి మున్నగువారి ప్రభావము గోచరించును.

పౌరాణిక నాటకములలో సంస్కృత రూపక పథాను సరణము ప్రధాన మైనను ఆంగ్ల సాహిత్య ప్రభావము గౌణమై అట్లే ఆంగ్ల నాటక కర్తల పద్ధతిని వ్రాసిన వానిలో సంస్కృత రూపక పథకము గౌణమై కనుపట్టక మానదు.

## నాంది - ప్రస్తావనలు

ఏ నాటకమైనను తీయగనే నాంది ప్రస్తావనలతో ఆరంభమగుచు సంస్కృత లక్షణాను సరణము గోచరించును.

వారి మొదటి నాటకమునకు ముందు కాకరపర్తి వేంకటరాయుడుగారు నాంది ప్రస్తావనము వ్రాసి యిచ్చినట్లును, తరువాత, మూడవ ముద్రణము నాటికి దాని బదులు, పంతులుగారు తామే వ్రాసికొనిన దానిని చేర్చినట్లును చెప్పబడినది. రెండవ నాటకము అగు సారంగధరకు వారే వ్రాసికొనినారు. ఈ రెండును లఘు ప్రస్తావనలు. ప్రచండ చాణక్యము నుండి విచిత్ర వివాహము వరకు గల నాటకములలో ముద్రిక, పంతులుగారి అనంతరమున ప్రకటింప బడిన గ్రంథములకు తప్ప తక్కిన వానికి అనగా ఇరువది నాటకములకు కూచి నరసింహముగారు నాంది ప్రస్తావనలు వ్రాసి యిచ్చిరి.

ప్రస్తావనయందు తమను గూర్చిన ప్రశంస ఉండును కావున నాటక కర్తలు తామే వ్రాసికొనుట బాగుండదని వారి అభిప్రాయము అయినట్లు తోచును. విద్యార్థి దశలో సుసర్ల అనంతరావు గారి శ్రీరామ జననమునకు పానుగంటి వారు ప్రస్తావన వ్రాసి యిచ్చినారు. కూచి నరసింహము గారి రూపలత, వన వాసి నాటకములకు, రాజా వేంకటాద్రి అప్పారావుగారి గోవర్ధ నోద్ధరణము అను నాటకమునకు కూడ వారు నాంది ప్రస్తావనలు వ్రాసిపెట్టినారు. తమ నాటకములకు ఇంకొకరిచేత వ్రాయించినారు.

కూచి వారు వ్రాసి యిచ్చుట ఆరంభమైన వెనుక, నాంది ప్రస్తావన లేకుండనైన నాటకము వేయించిరి గాని, వారు ఇక ప్రస్తావన తాము వ్రాసికొన లేదు. అందువలననే ముద్రిక, గుణవతి, మణిమాల ఇత్యాదులు నాంది ప్రస్తా వనలు లేకుండ వెలువడ వలసి వచ్చెను.

నాంది ప్రస్తావనలు వ్రాయుటలో కూచి వారును, పానుగంటి వారును అవలంబించిన పద్ధతులు ఒకే విధముగా నున్నవి. కూచి వారి నాంది ప్రస్తావనలలో కానవగు విశేషములను ఇట్లు సంగ్రహింప వచ్చును.

1. నాంది పద్యము నందలి పద సంఖ్య, కావ్యార్థ సూచనలను గూర్చిన లక్షణములు యథావకాశముగ పాటింపబడినవి.

2. ప్రస్తావనలో నాటక కర్త ప్రశంస, పాత్ర ప్రవేశ సూచన విధిగా నున్నవి.

3. వీరికి పంతులుగారిపై గల గౌరవానురాగములు వీనిలో స్పష్టముగా కనబడును.

4. పంతులుగారి ఆ యా నాటకములలో ప్రసక్తము లయిన ప్రధానాంశములను గూర్చిన చర్చ జరిపి, నాటకమును అర్థము చేసికొనుటకు తగిన దృక్పథమును వారు సామాజికులలో కలిగింతురు. (ఉదా. రాధాకృష్ణ, బుద్ధబోధ సుధ.)

5. పానుగంటి వారు తమ నాటకములలో పాత్రలలో గాని, సన్నివేశములలో గాని చేసిన విచిత్ర సృష్టి ఏదయిన ఉన్నచో, దానిని విపులీకరించి సమర్థించుటకు ప్రస్తావనలో నరసింహము గారు కృషి చేసిరి. (ఉదా. సరస్వతి, విచిత్ర వివాహము.)

6. పాత్ర ప్రవేశ సూచనలు చేయుటలో వీరు రకరకముల విన్నాణములు చూపిరి. రాధాకృష్ణ యందు సూత్రధారుడు "రాధాకాంత భక్తి వంటి భక్తితో మన మీ నాటకము ప్రదర్శింప వలయును." అనగా నటి దానికి ఇట్లు చేర్చును. "దానితో గూడ సలలితోత్తమ శ్రద్ధా వివేకములు జత సేయవలెను." తరువాత రాధయు, లలితయు ప్రవేశించి, శ్రద్ధా వివేకములకు గల సంబంధమును జర్చింపుచు సంభాషణము ఆరంభింతురు.

7. పరిపాటి యగు కథోద్ఘాతమును, ప్రయోగాతిశయమును గూడ వీరు వాడినారు.

పానుగంటి వారు కూడ వారికి వ్రాసి యిచ్చిన ప్రస్తావనలలో నాంది పద్యము లందలి పద సంఖ్యా నియమమును పాటించినారు. పాత్ర ప్రవేశ సూచనలో చమత్కారములు చూపిరి.

వన వాసిలో సూత్రధారుని చేత తన్నాటక ప్రాశస్త్యము చెప్పించుచు, "ఈ నాటకము బాలురకే కాదు, విద్యా భ్యాస యోగ్యమైన బాల్యము మొదలు విపినావస్థ...." అనిపించినారు. అర్థోక్తిలో దానిని పావకుడు అను పాత్ర దిద్దు చున్నట్లు "విద్యాభ్యాస యోగ్యమైన బాల్యము తరువాత విపినావస్థ." అనుచు ప్రవేశించును.

## విష్కంభములు

నాటకములలో విష్కంభములను ఉపయోగించు పద్ధతి వరకు సంస్కృత రూపక లక్షణాను సరణమే యైనను, పానుగంటి వారి విష్కంభములు అంత కన్న భిన్న లక్షణము కూడ గలిగి యున్నవి.

మధ్యమ పాత్రములు ఉన్నవానినే కాక నీచ పాత్రలు ఉన్న వానిని కూడ పంతులు గారు విష్కంభములు అనియే అన్నారు. ప్రవేశక విష్కంభముల భేదము వారు ఎచ్చటను లక్షించలేదు. విష్కంభములు శుద్ధములో, మిశ్రములో కూడ వారు ఎచ్చటను పేర్కొనలేదు.

విష్కంభములు వ్రాసి నిర్వహించుటలో వీరికి ఒక ప్రత్యేకమైన నేర్పు ఉన్నది. సన్నివేశ సంఘటన చమత్కృతికి, హాస్యరస పోషణ సంవిధాన కౌశలమునకు వానిని తార్కాణములు చేసినారు. ప్రాయికముగా వారి విష్కంభములు హాస్య రసమయములే.

విష్కంభముల దైర్ఘ్యము విషయమై వారు ఎన్నియో ప్రయోగములు చేసినారు. అర పేజి మొదలుకొని ఇరువది ఆఱు పేజీల వఱకు ఇవి విస్తరించి యున్నవి. విష్కంభములలో ప్రవేశించు పాత్రల సంఖ్య తఱచుగా రెండే.

రాధాకృష్ణలో విష్కంభము అని అనక పోయినను, తత్తుల్యమైన రచన ద్వితీయాంకము మొదట ఉన్నది. ఇది ఒక్కటే వాడు ఏక పాత్రతో నిర్వహించిన అర్థోపక్షేపకము. చూడామణి నాటకములో నాల్గవ అంకము మొదట విష్కంభములో మూడు పాత్రలు కలవు. అట్లు చేయుటయు ఆ ఒక్క యెడనే.

పంతులుగారి విష్కంభములు దాదాపుగా వానికి అవి ఏకాంకికలు.అది ఒక ప్రపంచము. చిత్ర విచిత్రములైన తత్త్వములు, కొన వెఱ్ఱులు గల వ్యక్తులు దానిలో తిరుగాడుదురు. "రాముడు ఎంత మంచివాడో, దశరథుడు అంత దుర్మార్గుడు; రామ పట్టాభిషేకమునకు వ్యవధి ఉన్నచో ధన వ్యయము అగునని తలచు లోభి." అని బాహ్యతాదిహితముగా నదురు బెదురు లేకుండ చెప్పగలిగిన వారు, టక్కు టిక్కున చెప్పుచుంటి నన్న భ్రమలో సోది పెట్టువారు, తమకు అనుకూలముగా ప్రపంచమున సంఘటనములు జరుగక పోవుటచేత అక్కసుపడి దుర్వ్యాఖ్యానములు చేయువారు, పట్టి చమత్కారమునకై ఇంతను అంత చేసి పెంచి తోచిన రీతిగా మాట్లాడువారు—ఇట్టి అల్పవు మనుష్యులు, వారి వారి కష్ట సుఖములతో, వారి వారి అనుభవ సిద్ధాంతములతో, వారి వారి గర్వాహంకార ములతో ఈ విష్కంభములలో ప్రత్యక్ష మగుదురు. పంతులుగారి సూక్ష్మ బుద్ధికి, సునిశిత దృష్టికి, విపులానుభవమునకు, విశిష్ట ప్రతిభకు ఇవి తార్కాణములు.

**భావ విరతి**

పాదుకా పట్టాభిషేకమున పంచమాంకము నందు రాముడు స్వజనమును వీడి అరణ్యములకు పోవుట కూర్చ బడినది. ఇది కరుణ రసభరితము. మరల షష్ఠాంకమున భరతుడు జరిగిన వృత్తాంతమును తెలిసికొని వగచుట. ఇదియు కరుణ రసాస్పదమే. ఈ నడుమ విష్కంభము ఒక్కసారి మనస్సులను తేలిక పఱచునది. ఇట్లు వీరి నాటకములలో విష్కంభములు కేవలము సూచ్యార్థ సూచనకు మాత్రమే కాక కొంత భావ విరతి కలిగించుటకు తోడ్పడు చున్నవి.

విష్కంభములను కొన్ని చోట్ల పానుగంటివారు ప్రయత్న పూర్వకముగా పెంచినట్లు గమనింప వచ్చును. అట్టి స్థలముల యందు కొంత అసహజత్వము చోటు చేసికొనినట్లు తరువాత తోచినను, చదువు నప్పుడు, చూచునప్పుడు

ఆ క్షణమునకు అది బాగుగా ఉండును. ఒక్క మాటలో చెప్పవలెనన్న ఆ సందర్భములో ఆ పాత్ర ప్రవర్తన అసహజముగా ఉండవచ్చును కాని, ఆ ప్రవర్తనకు మూలబీజమగు చిత్తవృత్తిని మాత్రము అసహజము, అసంభవము అనలేము. ప్రచండ చాణక్యములో ఇందుశర్మ ఏడుపుతో ఆరంభమైన విష్కంభము, మూడవ అంకము నందలిది అటువంటిదే.

చెప్పవలసిన విషయమునకు ఏమియు సంబంధము లేకుండ మఱి యేదో విషయము ఆరంభించి, మాటపై మాట పెంచి క్రమముగా తుదకు ప్రసక్త విషయమును తెచ్చుట వీరి విష్కంభములలో తఱచు కనబడును. కోకిల తృతీయాంకము నందలి విష్కంభము గాని, వనవాస రాఘవములోని ఇరువది ఆఱు పేజీల విష్కంభము గాని ఇందులకు ఉదాహరణముగా గ్రహింప వచ్చును.

వీరి నాటకములలోని విష్కంభముల గూర్చి చెప్పవలసిన మఱి యొక అంశము వీనిలో సూచింపవలసిన కథ అప్పుడప్పుడు అతి దీర్ఘముగా ఉండును. వనవాస రాఘవములోని పైన పేర్కొనబడిన దానినే చూచిన కబంధవధ మొదలుకొని దాదాపుగా సీతాన్వేష ణారంభము వఱకు గల కథ అంతయు దీనిలో చెప్పబడినది. ఇదే విధముగా కోకిల తృతీయాంక మందలి దానిలోను విస్తృత కథ సూచింప బడినది. అన్ని విపుల కథాంశములను చెప్పవలసి వచ్చినను, చమత్కారముగ, విశదముగ, విసుపు కలిగించకుండ చెప్పించు నేర్పు లక్ష్మీ నరసింహారావుగారికి ఉన్నది.

## ప్రదర్శన యోగ్యత

వీరి నాటకములు పఠన పాఠన వ్యవహారమునకే గాని ప్రదర్శనార్థము అంతగా బాగుండవు అని ఒక వాదము ఉన్నది. ఇది పూర్తిగా యథార్థము కాదు; పూర్తిగా కొట్టి వేయదగినది కాదు.

వీరి నాటకములు ప్రదర్శనమునకు అంతగా అనుకూలింపనివి అనుకొనుటకు ప్రబలముగా చూపబడుచున్న కారణములు ఇవి :

1. పంతులుగారి నాటకములు పట్టి గద్య నాటకములు. సంగీతమునకు అవకాశము లేదు - ఉన్న పద్యములు కూడ నీరసములుగా ఉండును.

2. వీరి రచనలో సభ్యత విషయమై జుగుప్సావహములగు విషయములు ఉండును.

3. ఛాందస ధోరణిని ప్రసంగములు చేయించుచుండుటచే ప్రదర్శనము రక్తి కట్టక విసుగుగా ఉండును.

ఈ హేతువులు వారివారి మనస్తత్వములను అనుసరించి భిన్న భిన్నముగా ఉండు అభిప్రాయములపై ఆధారపడినవి.

గద్య నాటకములు అనునది ఒక ఆక్షేపణమే కాదు. ఆంధ్ర నాటక వాఙ్మయమున తొలి దశలో వెలువడినవి వచన నాటకములే ఎక్కువ. ప్రదర్శనములందు కూడ వచన నాటకములు ఎక్కువగనే ప్రాముఖ్యము వహించినవి. పద్యములకు, పాటలకు, సంగీతమునకు నాటక రంగము క్రమక్రమముగా లోబడి పోయినది. ఆ కారణము చేత ముచ్చటైన మూడు వందల పద్యములు లేనిది నాటకము కాదు అన్నంత భ్రాంతి పొడమినది. అట్లు లేకపోవుట నాటకముల, నాటక కర్తల లోపము కాదు. నాటకీయమగు విశిష్టత, ఉదాత్తత కేవలము గద్య, పద్యముల ఎన్నికను బట్టి ఏర్పడదు.

పానుగంటి వారికి నాటకీయ పద్య రచన గూర్చి నిష్కర్షయగు అభిప్రాయము ఉన్నది. ప్రజాభిరుచి మున్నగు విషయములకు అధిక ప్రాధాన్యమును ఇచ్చి తమకు పద్ధతి యని తోచిన దానిని మార్చుకొనుటకు వారు అంగీకరింపలేదు. అది నిజముగా సంతోషించదగు విషయము.

సభ్యత మాట వచ్చినప్పుడు పంతులుగారు కొన్ని చోట్ల ఆ విషయమై సరియగు శ్రద్ధ చూపలేదని అంగీకరింపక తప్పదు. ఆ లోపము వారి ఏ నాటకములలో ఉన్నదో అవి మూడో నాలుగో వారి ఉత్తమ రచనలు కావు. అవి రంగస్థలముపై జనరంజకములుగా పరిగణింపబడి ప్రదర్శింపబడినవి కావు. అన్ని నాటకములను కలిపి ఒకే త్రోవుడు మాట అనుట పాడి కాదు.

అయినను సభ్యత అనునది నిలుకడ గల అర్థము ఉన్న మాట కాదు. అది దేశకాల మాన పరిస్థితులపై ఆధారపడినది. కవి ప్రతిభావంతుడై విలక్షణ సృష్టి చేసినప్పుడు దానిని అర్థము చేసికొనుటలో కొన్ని తికమకలు తప్పవు. పంతులుగారు వ్రాసిన దానిని ఆద్యంతము సమర్థించుట లేదు కాని అసభ్యముగా నున్నదని కొందఱు చెప్పెడిదానిలో అధిక భాగము ఆ కాలమునకు అసభ్యము కాకపోవచ్చును. ఇక్కడ అనేకుల నాటకములలో అసభ్యములు లేకపోలేదు. అయినను అవి రంగస్థలమున ప్రజాదరణమునకు వెలి కాలేదు.

ఛాందస ధోరణిని ప్రసంగములు పెంచినారు పానుగంటివారు అనుట కును సమాధానము ఇట్టిదే. అదియు జిహ్వా కొక రుచి అన్నట్లు సమాధానము చెప్పుకొన వలసిన మాటయే.

నిజమునకు పంతులుగారి నాటకములయందు ప్రదర్శనమునకు ఇబ్బంది కలిగించు అంశములు ఉన్నవి. అవి ప్రదర్శనమునకు సంబంధించినవి మాత్రమే. వానిని ఇట్లు పేర్కొనవచ్చును.

1. అంకమునందలి సంభాషణను బట్టి ఆ యా సన్నివేశములు జరుగు చున్న స్థలము కొన్నిచోట్ల సాధారణ రంగస్థల పరిమితులలో ఇమడదు.

ఉదాహరణమునకు పద్మిని నాటకమున చతుర్థాంకమున పద్మిని రత్న ప్రభపై నారాయణవర్మకు అనుమానము కలిగింప యత్నించు చున్నది. రత్నప్రభ మనస్సు అన్యాక్రాంతమైనదని ఆమె నారాయణ వర్మకు ఇటు చెప్పు చుండుట, అదే సమయమునకు రత్నప్రభ సాధువేషములో నున్న మురళీ మనోహరునకు తన చేయి చూపించుకొను చుండుట ప్రదర్శింప వలెను. వీరి మాటలు వారికి, వారి మాటలు వీరికి వినబడక పోవుట మాత్రమే కాక, మురళీ మనోహరుడు ఆమె చేతులు కన్నులకు అద్దుకొనుట వర్మకు ముద్దిడు కొను చున్నట్లు కనపడును. ఇట్టి దృశ్యమునకు విస్తృత రంగస్థలము కావలయును.

అట్లే చూడామణిలో కోట బురుజులపై మందాకిని మొదలగువా రుండగా క్రింద కొందఱు భటులు కోటద్వారము త్రవ్వుచుండు దృశ్యమును.

2. ఏక కాలమున రంగస్థలముపై నున్న పాత్రలను కొన్ని వర్గము లుగా చేసి, ఒక వర్గము వారి మాటలు, చర్యలపై వేరొక వర్గము చేత గుప్త వ్యాఖ్య చేయించుచుండుట వారికి పరిపాటి. ప్రదర్శన సమయమున నటుల ప్రాణములు తోడునది ఇది.

సరోజిని నాటకమున ద్వితీయాంకము దీనికి ఉదాహరణము. పద్మ నాభ శాస్త్రి రెండవ భార్యయగు పార్వతిని "ఏదీ ! ఈ చంద్రహారము మీ మేనత్తదే కదా?" అని ప్రశ్నింపగా, ఆమె "మా మేనత్త నాకు వలదనుచుండగా వైచినది." అని బదులు చెప్పును. ఈ రెండింటికి నడుమ చాటున ఉన్న సరోజినికి ఏడు పంక్తుల స్వగతము ఉన్నది. సరోజిని పాత్రమును అర్థము చేసికొనుటకు, క్రమక్రమముగా ఆమె మనస్సులో కలిగిన పరిణామమును గ్రహించుటకు ఈ స్వగతము ఎంత ఆవశ్యకమో అయి యున్నది. కాని రంగ స్థలమున వీనికి సమన్వయము ఎట్లు ?

3. పంతులుగారు సూక్ష్మ బుద్ధి కలవారు. ఎంతటి చిన్న విషయము నైనను పరిశీలించి, ఒక విస్తృత భావ ప్రపంచనము చేయగల వారు. వారు సృష్టించిన పాత్రలకు ఆ శక్తి వారసత్వముగ సంక్రమించినది. అందుచే తాత్త్విక చింతనము సేయుచు పాత్రలు బహు స్థలముల యందు స్వగతములలో మునిగి పోవును. ఇదియును ప్రదర్శనమున క్లిష్టత కలిగించు అంశమే.

4. కథలో క్రొత్త సన్ని వేశమునుగాని, క్రొత్త పాత్రను గాని ప్రవేశ పెట్టకుండ రెండు పాత్రలతో నలువది పుటల అంకమును నడపుట పంతులు గారికి మిక్కిలి సులువైన పని. ఇట్టి పట్టులందు సామాజికులు అక్షరాక్షరము గ్రహించిననే కాని ప్రదర్శన మందు రసాస్వాదనము చేయ జాలరు. తక్కిన నాటక కర్తలు పద్యములు, పాటలు, సంగీతముతో అతికిన రక్తిని, పానుగంటి వారు తమ సంభాషణ రచనా కౌశలము, హాస్య రసోద్దీపన శక్తితో సాధించిరి. నానా విధ ప్రేక్షక సమ్మేళన మున్నప్పుడు ఈ పద్ధతి రుచింపక పోవచ్చును. ప్రధానముగా ఈ కారణముల చేత పంతులు గారి నాటకములు సాధారణముగ రక్తి కట్టించుట కష్టమని చెప్పవచ్చును.

అట్లనే అన్ని నాటకములును అంతే కాదు. కంఠాభరణము, రాధాకృష్ణ, పాదుకా పట్టాభిషేకము, విప్రనారాయణ — ఈ నాటకములు వివిధ నట సమాజములచే పెక్కు పర్యాయములు ప్రదర్శింప బడినవి. ఇవి బాగుగా రక్తి కట్టినవి అని అప్పుడు ఆడిన వారు,చూచిన వారు చెప్పు చున్నారు. పై నాటకములు మాత్రమే కాక సరస్వతి, కోకిల కూడ నట సమాజములచే ప్రదర్శింప బడినవి. పంతులు గారి అన్ని నాటకములును పిఠాపురము పాలెస్ థియేటరులో మొదట ఆడబడినవే.

నట సమాజముల వారు అందఱును పై నాటకములు ఆడినప్పుడు వారు వ్రాసినవి వ్రాసినట్లు ఆడలేదు. కొంత తగ్గించియు, అచ్చటచ్చట పద్యములు, పాటలు క్రొత్తగా వ్రాయించుకొని, చేర్చియు ఆడిరి. కవి వ్రాసినది వ్రాసినట్లు నటసమాజము వారు ఆడుట తెలుగు దేశములోనే కడు అబ్బురమైన విషయము.

రాధాకృష్ణ నాటకమును మైలవరము బాల భారత సమాజము వారు ఆడినప్పుడు వారు చేర్చుకొనిన పాటలు ఒక పుస్తకముగానే వచ్చినవి. కీర్తనలు "జగ్గయ్య పేట వాస్తవ్యులును, గాన విద్యా విశారదులును నగు బ్రహ్మశ్రీ పాపట్ల లక్ష్మీ కాంతయ్య గారి ప్రియ శిష్యుడగు చందాల కేశవదాసుగారిచే రచియింప బడి, భావయుక్తముగా మైల వరం కంపెనీ హార్మోనిస్టు గారైన అలుగుల పాటి రామానుజులు గారిచే స్వరములు కూర్చబడి" 1929 లో సరస్వతీ బుక్ డిపో వారిచే ప్రకటింప బడినవి. కోకిల నాటకమున చేర్చిన పద్యములు, పాటలు గ్రంథపు ప్రతియందే తరువాతి కూర్పులలో అనుబంధముగా ముద్రించినట్లు చెప్పబడినది గదా !

పాటలు, నృత్తములు, నాటకములందు ఉండరాదు అని గర్హించిన పంతులుగారి నాటకములకే అవి చేరుట ఎంత చిత్రము !

విప్ర నారాయణ నాటకమును ప్రదర్శించుటలో "ప్రయోగ సాఫల్యమునకై" పద్మశ్రీ స్థానం నరసింహారావు గారు కొన్ని మార్పులు చేసిరి. దీనిలో వైజయంతీ విలాస ప్రబంధము నుండి వారు కొన్ని పద్యములను ఎన్నుకొనిరి.

కీర్తనలు స్వయముగా వ్రాసికొనిరి. ఇంతకన్న విశేషము ఏమనగా, నాటకములో పంతులు గారు వ్రాసిన కొన్ని భాగములను గ్రహించి, వానికి నడుమ నడుమ స్వయముగా వ్రాసిన కొన్ని సన్నివేశములను, సంభాషణములను చేర్చిరి. ఈ విధముగా పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారు వ్రాసిన విప్రనారాయణ నాటకము ఆధారముగా చేసికొని, వారు వ్రాసి కొనిన మఱియొక నాటకమును ఆ నట సమాజము వారు ప్రదర్శించిరి ! ఇది ఆ నాటి నాటక రంగస్థల స్థితిగతులను నిరూపించునే కాని, పంతులుగారి నాటక రచన యందలి లోపములను కాదు.

రంగ స్థలమును గూర్చి మఱి యొక్క మాట చెప్పుకొనిన చాలును. నాటక ప్రదర్శనమున మన వారు చేసిన అవకతవకలు ఇన్ని అన్ని కాదు. నలుబది యేండ్ల కైకేయి, ఇరువది యేండ్ల కౌసల్య మనకు రంగ స్థలమున క్రొత్త కాదు. చొక్కాలు తొడిగి కొనిన నారద, వసిష్ఠులు మన రంగ స్థలమున శోభించినారు. ప్రక్క పాత్రములను గూర్చి మనకు ఎన్నడును ఖాతరు లేదు. కైకేయి ప్రధాన పాత్ర కావున సొమ్ములు దిగవైచి, మూసివాయినప్పు ముత్తైదువ వలె కౌసల్యను ప్రదర్శించ గలము భావ యుక్తముగా నటించుటచేత గాక ఆఱున్నర శ్రుతిలో పద్యములను పాటలను పైత్యపురోగి వమనము చేసి కొను చున్నంత ఆర్భాటముగా గిరికీలు త్రిప్పి ఆ రాగమునే మఱల మఱల క్రొత్త దనము లేకుండ, చెవులు చిల్లులు పడునట్లు పాడి క్రమ్ముకొను చున్నాము. ఇట్టి రంగస్థలము నాటక ప్రతులలో తమకు ఆవశ్యకములగు మార్పులు చేసికొనినది. అది నాటక కర్త లోపము నవరించుటగా భావించెడు వారున్న వారి కొక నమస్కారము.

పంతులు గారి నాటకములలో మొదటి ఏడెనిమిదియును ముద్రణమునకు పూర్వమే, విరివిగా ప్రదర్శింప బడినవి. ప్రచండ చాణక్యము మొదటి ముద్రణ ప్రతిలో, తరువాత మఱికొన్ని నాటకములలో ప్రకటింపబడుచు వచ్చిన అప్పటి బరహంపూర్ డిస్ట్రిక్ట్ మునిసిఫ్ వి. రంగారావుగారి 29-3-1907 వ తేదీ లేఖ వలన ఈ విషయము తెలియు చున్నది.

ఇది అంతేయును అటుంచి, పంతులుగారికి ప్రదర్శనము మాట నాటక రచన చేయునప్పుడు సర్వదా మనసులో ఉండెనని విశదము చేయు ఘట్టములు వారి నాటకములలో అనేకము లున్నవి. నాటకములలో పాత్రల సంఖ్య విషయమున వారు ఎన్నో ప్రయోగములు చేసిరి. అయిదాఱు పాత్రముల మొదలు ఇరువదియైదు పాత్రముల వఱకు నాటకములలో ఉంచిరి. నేపథ్య భాషణము, చూళిక మున్నగు వానిని ఉచితముగా వాడుట మూలమున కొన్ని పాత్రల ఆవశ్యకము వారు తగ్గించిరి.

విజయ రాఘవమున, చూడామణి నాటకమున యుద్ధ రంగములను చూప వలసిన యెడల వారు ఆదరించిన పద్ధతి ప్రదర్శన సౌలభ్యమును. రక్తిని హెచ్చించును. పూర్వ నాటకములలో వలె ఖేచరులనో, భూచరులనో, ఇతర ప్రేక్షకులనో పెట్టి వారిచే యుద్ధ వర్ణన చేయింప కుండ యుద్ధము చేయుచున్న వారినే ఒకరి వెంట ఒకరినో, ఒక రిరువురనో ఒక చోట చేర్చి చక చక యుద్ధము నడిపింప జేసినారు. బుద్ధ బోధ సుధలో బుద్ధుని ప్రధానాను చరులను రంగస్థలముపై నుంచి, తక్కిన వారిని నేపథ్యమున ఉన్నట్లు కల్పించి, రంగ స్థలము జన సంకీర్ణము కాకుండ చేసి యున్నారు.

స్వగతములను, దీర్ఘ ప్రసంగములను కూడ అట్లే సమర్థించు కొనిరి అని నాము గదా ! మఱి వారు తెలిసియు ఇట్టివి ఏల చేసిరను ప్రశ్నము ఉదయింపక మానదు. నాటకములు ఇట్లు వ్రాయుటలో వారి దృష్టి యందు ఇంకొక పరమార్థము ఉన్నది. విపుల లోకానుభవ ప్రకటనము, దేశకాల బద్ధమగు మనుష్య మనస్తత్త్వమును వ్యాకరించి, వ్యాఖ్యానించుట ముఖ్యముగా వారు ఎంచిరి. ఒదిగినంత వఱకు అది నాటక శిల్పమున ఒదిగినది - లేని యెడ దానిని త్రోసి రాజని స్వతంత్రించి నిలిచినది.

వారి నాటకములు తొలి దశలో మూడు గంటల కాలమునకు మించి ప్రదర్శన పట్టకుండునట్లే వ్రాసిరి. కాని నడుమ కొన్ని నాటకముల దైర్ఘ్యము పెరిగినది. క్రమముగా చివఱ దశలో వారు మఱల రెండు మూడు గంటలలో ప్రదర్శనము ముగియునట్లే వ్రాసిరి.

రంగస్థల పరికరములు కూడ బహుశః వీరి నాటకములలో ఎక్కువ అవసరము ఉండవు. పట్టి తెరలతో ఆడుటయే చాలును. సామాజికుల దృష్టి సాధారణముగా రంగస్థలిపైని సజీవ పాత్రములను విడచి నిర్జీవ రంగ పరికరముల దాక పోవుట కలుగదు. తెరలు కూడ ముందు లేక నడుమ తెర ఉన్న సన్నివేశము వెంట సన్ని వేశమును వేగముగా ప్రదర్శింప వచ్చును.

"ప్రత్యేక శిక్షణము ఉండిన సమర్థులగు నటులకు పానుగంటి వారి నాటకములు పెన్నిధి వంటివి. వారి పాత్ర సంభాషణములు రసానుకూలమైనవి అగుటచే నటులకు ఉత్సాహము కలిగించును. సుదీర్ఘ స్వగతములు కొంచెము తగ్గించి, పద్యములు చేర్చి, ప్రదర్శించినచో, ఎట్టివారైనను నాటకము రక్తి కట్టింప గలుగుదురు." అని స్థానము నరసింహారావు గారితో చర్చించినప్పుడు వారు ఒసగిన అభిప్రాయము.

ఈ నాటకముల ప్రదర్శన విషయక యోగ్యతా యోగ్యతలు ఎట్లున్నను, తెలుగు దేశమున ఇప్పుడు పెద్ద నాటకములు ప్రదర్శించుటయే తగ్గిపోవుచున్నది. ఏమైనను ప్రత్యేక శిక్షణ పొందిన నటులు, ఎటువంటి నాటకమైనను సరే చూచి సంతృప్తి చెందు అల్ప సంతోషులు కాని సామాజికులు, ఉండినచో పంతులుగారి నాటకములు ఎక్కువ మార్పులు లేకుండ రక్తి కట్టింప వచ్చును.

## నాటక కర్తగా

ఇంతవఱకును యథా శక్తిగా పానుగంటివారి నాటకములలోని బహు అంశములను వ్యాకరించి చూపుటయైనది. నాటక కర్తగా పానుగంటి వారు ఏమి చేసిరి అను సూటి ప్రశ్నకు ఇందు సమాధానము ఇచ్చుటకు ప్రయత్నము జరుగును. దీనికి సమాధానము చెప్పుట సులభము కాదు.

" ఘన మహాకావ్య పోషణమునఁ గవి పడు
కష మితరుఁ డెఱుంగునే కవియె గాక ! "

అని పంతులుగారి సూక్తి. కవికృతులను, అలని కష్టఫలమును పరిశీలించి అభిప్రాయమును ఒసగుటలో గల బాధ్యత తక్కువది కాదు.

పానుగంటి వారు నాటకములను గాని, ఇతర రచనలను గాని చేయునప్పుడు తమ బాధ్యత ఎట్టిదో స్మరించు కొనుచు వ్రాసినారు. తమ కార్యరంగమైన కళపై వారికి ఆరాధన బుద్ధి యున్నది. ఇది కూడ వారి రచనల స్థాయిని, వారి కృషిని సమీక్షించునప్పుడు విమర్శకుడు మఱచి పోరాని విషయము.

ఒక కవికి ఒసగ దగిన స్థానము నిర్ణయించునపుడు సమకాలీన సాహిత్య స్థాయిని పరిశీలించి, సమకాలికులు అయిన ఇతర కవుల కృషితో పోల్చి చూచి, నిర్ణయము చేయుట అవసరము. శాస్త్రము యొక్క ఆదేశము సర్వత్ర ఒక్కటే అయినను, అభ్యాసము, వ్యుత్పన్నత, ప్రతిభ మున్నగు వానిని బట్టి అభినయవిదులు ఎట్లు ఒకరి కంటె నొకరు ఉత్కృష్టి సాధింప గల్గుదురో, అట్లే ఒక్కరకమైన ఆదేశములకు లోబడి కూడ రచయితలు భిన్న భిన్నముగా విన్యసింపగలరు. అట్టి యెడ ఉత్కృష్టతకు రచయిత ఆత్మీయత హేతు వగును. ఇందువలననే తులనాత్మక పరిశీలన ముఖ్యము అగుచున్నది.

ఇది యిట్లుండగా ప్రసిద్ధులగు తక్కిన నాటక కర్తల కృషి సమగ్రముగా తెలుగులో ఈ వఱకు పరిశీలింపబడి, వివరింపబడి యుండలేదు. ఈ కారణము చేత తులనాత్మక పరీక్షకు ఇప్పుడు అవకాశము తక్కువ యున్నది.

నాటక కర్తకు శ్రవ్య కావ్య కర్త కన్న అర్హతలు ఎక్కువగా అవసరముండును. నాటక రచనలో కవి పాత్రలతో తాదాత్మ్యము పొందవలెను. కాని తన ఆత్మీయత ప్రకాశింప నీయరాదు. స్వీయ వ్యక్తిత్వ ప్రభావము ప్రస్ఫుటీకరింపుచునే, సంయమనముతో శాసించు కొనగలిగి యుండవలయును. లోకజ్ఞత, చిత్ర వచన రచనా నైపుణి, ఆవేశము, ఔచితీ పరిజ్ఞానము, భిన్నత్వ సమన్వయము మొదలైనవి కలిగియుండ వలయును.

ఈ గుణము లన్నియు పానుగంటి లక్ష్మీనరసింహారావు గారిలో ఉన్నవి. కావుననే వారి నాటకములందు సమగ్ర సౌందర్య మేర్పడినది.

నాటకములు వ్రాయుటలో తెలుగులో ప్రధానములైన రెండు పద్ధతులు ఉన్నవి. కేవలం కథానుసరణముగా హృదయ గమ్యముగా వ్రాయు పద్ధతి. అంతరంగపు శ్రద్ధగా తాత్త్విక చింతనముతో, బహుముఖ విషయ విశ్లీకరణమును అరికి బుద్ధి గమ్యముగా వ్రాయు పద్ధతి. ఇది మరింత క్లిష్టమైనది. పానుగంటి వారికి రెండవ పద్ధతి ప్రియతరము. ఈ పద్ధతిలో విభిన్న దృక్పథములపై సమభావము, సమన్వయ కౌశలము కావలెను. పక్షపాత బుద్ధి కూడదు. ఒకే వ్యక్తి ఇరు పక్షముల పెత్తులు వేయుచు చతురంగము ఆడుట వంటిది ఇది.

పంతులుగారి నాటకములలో విరుద్ధ లక్షణములకు సమన్వయము కానవచ్చును. తైక్ష్ణ్యము ఔజ్జ్వల్యముతో పాటు మార్దవము, మాధుర్యము; చిత్త విస్తృతితో పాటు హృదయ వికాసము కూడ వీరిలో కలుగును.

ఆంధ్ర నాటక వాఙ్మయమున వారి నాటకములకు గల ప్రత్యేకత ఎట్టిదో స్థూలముగా పరిశీలింతము. పానుగంటివారు బహు నాటక నిర్మాతలు. వారి రచనలలో రస, కథా సంవిధానాదులను బట్టి వైవిధ్యము వెలయుచుండును. కాని వారు నాటక రచనకు ఉపక్రమించు నాటికే నాటక వాఙ్మయమున చైతన్యము కలిగినది. 20 వ శతాబ్దము మొదటి భాగమును నాటక యుగము అనవచ్చును.

1900 కు పూర్వము, అనగా పానుగంటివారి తొలి నాటకము వెలువడుటకు పూర్వము ముద్రితములై వెలువడిన నాటకముల సంఖ్య అష్టోత్తర శతము వరకు ఉన్నది.

| | | | | |
|---|---|---|---|---|
| 1870 | — | 1875 | లో | 10 |
| 1876 | — | 1880 | లో | 8 |
| 1881 | — | 1885 | లో | 12 |
| 1886 | — | 1890 | లో | 23 |
| 1891 | — | 1895 | లో | 25 |
| 1896 | — | 1899 | లో | 29 |
| | | | | 107 |

ఈ నాటకముల పేర్లను బట్టి చూచిననచో ఏడెనిమిది భారతమునకు సంబంధించినవిగా, పదివఱకు రామాయణ సంబంధులుగా కన్పట్టును. పూర్వ కావ్యము లందలి కథలకు సంబంధించినవి పదునైదు వఱకు ఉన్నవి. సంస్కృత, ఆంగ్ల నాటకములకు అనువాదములుగనో, ఛాయానుకృతులుగనో, లేక అందలి యితివృత్తమును స్వీకరించినవో పదుమూడు, పదునాలుగు వఱకు ఉన్నట్లు తోచును. పౌరాణిక గాథలు ఆధారముగా వ్రాసినవి ఇరువది యైదునకు తక్కువ ఉండవు.

నాటక రచనా విధానము మాట అటుంచి, ప్రధానముగా వీనియందు కనుపట్టు విశేషము ఇతివృత్త వైవిధ్యము. మర్చెంట్ ఆఫ్ వెనీస్ (1880) వెనీసు వర్తకుని చరిత్ర (1880), షేక్స్పియర్ మాక్‌బెత్ (1895) వంటి ఆంగ్ల నాటకముల అను వాదములు, లేక అనుకరణములో, అభిజ్ఞాన శాకుంతలము (1894), ప్రబోధ చంద్రోదయ నాటకము (1893) వంటి సంస్కృత రూపకానువాదములు, వసుగిరికా పరిణయము (1876) ప్రవరాఖ్య నాటకము (1898) సారంగధర నాటకము (1886) వంటి కావ్య ప్రబంధ కథానుసార కృతులు, ప్రహ్లాద (1882, 1883) మార్కండేయ నాటకము (1898) మున్నగు పురాణస్థ కథానాటకములు, వేమన (1874), శివాజీ చరిత్రము (1897) మొదలగు చారిత్రక పురుషుల జీవితములపై కూర్చినవి అప్పటికే వెలువడి యుండుట గమనార్హము.

అట్టి నాటక యుగమున పానుగంటివారు కవిగా అవతరించుట జరిగినది. నాటకములు అనేకములు వచ్చినను అప్పటికి రచనా శిల్పము క్రమ పాకమున పడలేదని చెప్పవలయును. 1909 లో ముద్రింపబడిన తమ "చిత్రాభ్యుదయము" అను నాటకము నందు అవతారిక వ్రాయుచు కాళ్లకూరి నారాయణరావుగారు అప్పటి నాటకముల దుస్థితిని గూర్చి తెలిపియున్నారు. ఇదివఱకే ఒక పర్యాయము ఉదాహరింపబడిన వేటూరి ప్రభాకర శాస్త్రిగారి మాటలు (1930 లో వ్రాసినవి) అప్పటికిని పరిస్థితులు పెద్దగా మారలేదని స్పష్టము చేయుచున్నవి. అట్టిది, పంతులుగారు సమకాలిక స్థాయిని విశేషముగా అధిగమించి పోయి నాటకములు వ్రాసిరి.

నాటక కర్తగా పానుగంటివారు ఆంధ్ర సాహిత్యమునకు చేసిన సేవ అపారమైనది. అయినను ఆ విధముగా వారికి రాదగినంత కీర్తి రాలేదనుట సత్య దూరము కాదు. నాటక కర్తగా రాదగినంత పేరు రాలేదేమో అనునప్పుడు వారి ప్రతిభ ఎన్నడును గుర్తింప బడలేదని అర్థము కానే కాదు. సమకాలికులలో వారి కళానైపుణ్యము గుర్తించిన వారు అనేకులు ఉన్నారు. ముఖ్యముగా ఆంగ్ల విద్యావాసనలు సోకినవారి కెల్లను పంతులుగారి నాటక రచనలో మహోదయ రేఖలు గోచరించినవి. వారిలో కొందరి వాక్యములు ఇట ఉదాహరింప బడును.

ఆంధ్ర సాహిత్య పరిషత్తు ద్వితీయ వార్షిక సమావేశము 1912 లో రాజమండ్రిలో జరిగినప్పుడు " ఆంధ్ర నాటకములు " అను ఉపన్యాసము చేయుచు తల్లా ప్రగడ సూర్యనారాయణరావుగారు చెప్పిన మాటలు :

" ఇప్పుడు మన నాటక వాఙ్మయములో పాత్రౌచిత్య మెఱింగి వ్రాయ బడిన స్వతంత్ర నాటకములు స్వల్పముగ నున్నవని చెప్పియుంటిని. అందగ్ర గణ్యములుగ నెన్నదగినవి పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతుల వారి విప్రనారాయణ, రాధాకృష్ణ, నర్మదాపురుకుత్సీయము అను నాటకములు....

నరసింహారావు పంతుల వారి కథా కల్పన ప్రకృతి సిద్ధమైనది యనియును, ఆయన ఛలోక్తులును, నర్మగర్భ వాక్యములును మఱియొకరి కడ లేవని చెప్పినను అది సాహసము కాదని నా అభిప్రాయము........

ఈయన గ్రంథములను సవిమర్శ దృష్టితో బరికించి చూచిన ప్రపంచాను భవము, ప్రకృతి పరీక్ష, యుచితజ్ఞత యీయన కెంత చక్కగ నలవడినదియును తేట పడకపోదు. ఉపమ లీయన సొమ్ము. చమత్కృతులకు, ఛలోక్తులకు బెట్టినది పేరు. "

" నవ్యాంధ్ర సాహిత్య వీధులు " వ్రాసిన కురుగంటి వారు సంఖ్యేయము లైన ఉత్తమ నాటకములను పేర్కొనుచు రాధాకృష్ణను మిక్కిలి ప్రశంసించి యున్నారు.

పంతులుగారికి బరంపురము నుండి అప్పుడు అచ్చట డిస్ట్రిక్టు మునిసిఫ్‌గా ఉండిన వి. రంగారావు పంతులుగారు వ్రాసిన 29-3-1907 తేదీనాటి లేఖలోని భాగములు :

'I do not really believe that there can be any two opinions on the one point of literary elegance. I have often felt and openly said also, that for the first time in my life I had come across a true Telugu poet, who standing firm to high Hindu ideals, has yet been able to wed them to up-to-date western ideas of the highest order in a manner to make both ideas to coalesce together without any feeling induced of any foreign matter put up for the first time. The lucidity and the elegance of the language and the refinement of thought alike conduce to lift up the listner almost to a state of extatic happiness...........

(Vizia Raghavam) is really one of the grandest products of art for recent times for rising India. Would to heaven that others walked in your foot steps with atleast a portion ever so small of your success and I shall have no doubt of the regeneration of our unfortunate country condemned unknowingly by others for want of originality, purity of thought, conception and ideal.'

ఆధునికులలో కూడ పంతులుగారి రచనలను ప్రశంసించు చున్న వారు అనేకులు ఉన్నారు.వారిలో ఖండవల్లి లక్ష్మీరంజనము గారి అభిప్రాయము ఇది :

"పాత్ర నిర్మాణము, మనస్తత్త్వోన్మీలనము మొట్టమొదటి సారిగా తెలుగున ప్రయత్నించి పాటించిన వారు పానుగంటి వారు. భక్తి మధురములైన నాటకము లందును వీరు సిద్ధహస్తులే. రాధాకృష్ణ, పాదుకా పట్టాభిషేకము, విప్రనారాయణ వీరి ప్రశస్త రచనలు. నాటకమునకు ఉక్తి ప్రత్యుక్తి మూలకమైన సంభాషణమే జీవము అనియు, సంగీత మూలకమైన పద్య రచనము అనావశ్యక మనియు వీరు గట్టిగా వాదించి ఆచరించిరి. నాటకమునందు హాస్య ప్రయోజనమును పానుగంటి వారు చక్కగా గుర్తించిరి."

విజ్ఞాన సర్వస్వము_తెలుగు సంస్కృతి.

తమ నాటకములను గూర్చి పంతులుగారికిని ఒక దృష్టి యున్నది. వారి సప్తతి పూర్త్యుత్సవములలో కొందరు సాక్షి రచయితగా మాత్రమే వారికి శాశ్వతఖ్యాతి కలిగినది అనగా వారు ఆ మాట సహింప లేక పోయిరి. నాడు తమ నాటకములను గూర్చి హృద్యముగా ఉపన్యసించిన నండూరు బంగారయ్య గారిని అభినందించి వారు, "ఏ నాటికైనను తమ కీర్తి దశదిశల వ్యాపింప జేయుటకు శాంతి నొసగుటకు దమ నాటకములే ప్రథమములనియు ఎడమ చేతితో వ్రాయబడిన సాక్షి సంపుటములు కావనియు సెల విచ్చిరి."

—ఆంధ్రపత్రిక—3.5.1935

ఆనందవాచక పుస్తకములలో బాలుర కొఱకు పానుగంటివారును కూచి వారును గలిసి చిన్న చిన్న నాటకములను వ్రాసిరి. విద్యార్థులకు వ్రాయుచున్న పుస్తకమందు కూడ వారు నాటకములు ఎట్లు ఉండవలెనో ఒక పాఠము వ్రాయుచు ఎట్లు వ్రాసిరో చూడుడు.

"మంచి నాటకములోఁ గథా కల్పన చక్కఁగా నుండవలెను. పాత్రల పరస్పర సంభాషణము స్వాభావికముగా, సరసముగా నుండవలయును. అనఁగా వేసిన ప్రశ్న కుచితమైన యుత్తరము రావలెను. ఆ యుత్తరము ముందు ప్రశ్నమును స్ఫురింపఁ జేయుచుండ వలెను. అట్లుండియు, నవి కథా ప్రవాహ మునకుఁ గడు దూరముగా నుండి యప్రస్తుత ప్రలాప మనిపించు కొనఁగూడదు. సంభాషణము స్త్రీ పురుషుల యవస్థల కర్హముగా నుండ వలెను. ఏ పాత్రము నోటను దగిన కారణము లేకుండ భిన్న స్వభావమును వెలువఱుచు మాటలు రాఁగూడదు. కేవలము పామరజన రంజకము లగు మోటు పరిహాసములు గాక, చిత్తోల్లాసకరములగు నర్మోక్తులు మితముగా నచ్చటచ్చట నుపయోగింపఁ బడవలెను, భావముల మనోహరముగా వ్యక్తీకరించుట కుపయోగించు నుపమాదులు సహజముగా సరళముగా నుండవలెను గాని, బలవంతముగా లాగి తీసికొని వచ్చిన ట్లుండఁ గూడదు. ఇట్టి సల్లక్షణములు గలిగియుండి, నాటకము ప్రధానముగా నేవో కొన్ని సద్ధర్మములను ద్రష్టలకుఁ గఱపి, వారి పురోభి వృద్ధికిఁ దోడ్పడ వలెను....

....కవులు నాటకములను కడు జాగరూకతతో రచింపరేని, దేశానర్థకారులగుదురు. భగవద్భక్తి, దేశభక్తి, శాంతి, దాంతి, స్వార్థత్యాగము, పరోపకారబుద్ధి, దయా సత్యశౌచములు, ధైర్య స్థైర్యములు ఇట్టివి తమ కవితా నైపుణితోఁ గఱుపుచుఁ గవులు నాటకములు వ్రాయుట మంచిది. ఆ ధర్మముల కాటపట్టులైన పూర్వకాలపు పురుషులను బొలఁతులనుగాని, యట్టి కల్పిత స్త్రీ పురుషులఁ గాని, వారు తమ నాటములను నాయికా నాయకులుగాఁ జేయుచుండ వలెను....

....కవితా ప్రవీణులైన మహనీయులు కాలమును గనిపెట్టి, ప్రబలుచున్న యధర్మముల నణఁగ ద్రొక్కుటకును, క్రుంగి పోవుచున్న ధర్మముల లేవనెత్తుటకును, దమ యావచ్ఛక్తియు నుపయోగించి నాటక రాజములు వ్రాసి, దేశోద్ధారకులై లోకారాధ్యులగుదురు. పామర జన రంజనమే పరమార్థముగాఁ జూచుకొని వారి యభిరుచుల ననుసరించి క్షుద్ర నాటకము లెన్నడును వ్రాయరు. ”

పంతులుగారికి, కూచివారికి నాటక రచనలపై గల గౌరవమును, శ్రద్ధాసక్తులను ఈ భాగము తెలియ జేయుచున్నది గదా !

తెలుగు నాట సమృద్ధిగా వెలసిన రంగస్థల నాటకములలో వలె కేవల ప్రదర్శన సౌలభ్యము, బహు సంఖ్యాక సామాజిక సంతర్పణము మాత్రమే ధ్రువ తారగా పెట్టుకొని వారు నాటకమునకు గల సాహిత్య గౌరవమును బలిపెట్ట లేదు. నాటక రచన పరమార్థముగ, సాహిత్యమునకు పుష్టిని, తమకు తుష్టిని లక్షించి వారు నాటక నిర్మాణము చేసిరి.

# వచన కృతులు

పానుగంటి వారికి గద్యముపై మక్కువ ఎక్కువ అనియే చెప్ప వలయును. తెలుగు సాహిత్యమునందు గద్య కావ్యములు అధికముగా నిర్మింప బడక పోవుటకు వారు ఎంతయు వగచిరి.

"వచనమును వ్రాయు వానిని డీసిప్రేత సరకుగాఁ గుక్క మూతి పిందెగఁ దృణీకరింప న్యాయమా ? పద్యమునఁ గవిత్వ ముండి వచనమున లేకుండునా ? ఎచ్చట రస ముండునో, యచ్చటనే కవిత్వ మున్నది. కవిత్వము గుణములో నున్నదా ? అభిప్రాయ ప్రకటనమే రావలసినది. అన్ని నాగరక దేశములందు గూడ వచన ప్రబంధములు లక్షోప లక్షలుగా వృద్ధి పొందు చున్నప్పుడు మన దేశ మం దట్లు జరుగక పోవుట కడు శోచనీయము కాదా? వచన గ్రంథ రచనా బాహుళ్యమునఁ గాని భాష యభివృద్ధి పొంద నేరదు."

పిఠాపురమున 1922 లో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి ఏకాదశ వార్షికోత్సవ సభలకు అధ్యక్షత వహించుచు లక్ష్మీనరసింహారావు గారు చేసిన ఉపన్యాసములోని పై మాటలు చూచినచో గద్య వాఙ్మయ నిర్మాణము నెడ వారికి గల ఆసక్తి బోధపడును. ఆ ఉపన్యాసముననే వారు మందలింపుగా పలికిన ఈ వాక్యములను గూడ చూడుడు.

"వచన ప్రబంధములు మనలో మొదటి నుండియు దక్కువగనే యున్నవి. వాని యందు మన వారి కాదరము తక్కువ.... వ్రాయ వలసిన వారికే వాని యందు వైరాగ్య బుద్ధి. వచనము వ్రాయు వాఁడు పట్టి తెలివి తక్కువ వాఁడని జనాభిప్రాయమై యున్నది. కవితామణి కోటీరమును ధరించుట కర్హుఁడు గాని వాఁడే యీ కష్టైల మోపు మోయఁదగిన వాఁడని జనుల నమ్మకము."

వచన రచన అను పేరుతో ఒక వ్యాసమును వ్రాయుచు "ప్రకీర్ణోప న్యాసముల"లో వారు ఎంత గట్టిగా వాదించిరో పరిశీలింప నగును.

"మనుజు డగు వాడు తన యభిప్రాయములను గర్త కర్మ క్రియలు గల సందర్భములగు, సహేతుకములగు వాక్యములలో వెల్లడించుట యుచితము. అది యత్యావశ్యకము గూడను. అందుచేత వచన రచన యెక్కువ యుపయోగ కారి కాదా ?

వచన రచన వలననే గాని భాష యభివృద్ధి పొందదు. దేశ మున్నత దశకు రాదు. మనుజులు జ్ఞాన యుక్తులు గారు. శాస్త్రములు వ్యాపింపవు. సత్యము ప్రబలదు."

వివిధ సందర్భములలో వచనము యొక్క ఆవశ్యకమును గూర్చి వారు చెప్పిన అభిప్రాయములను ఇట్లు క్రోడీకరింప వచ్చును.

1. పద్యము కన్న గద్యము తక్కువది అని నీరసముగా చూచుట తగదు.

2. వచన గ్రంథ రచనా బాహుళ్యము చేతగాని భాష అభివృద్ధి పొంద నేరదు.

3. చరిత్ర, ఆర్థిక శాస్త్రము, శారీర శాస్త్రము, ఫొటోగ్రఫీ, ఎవల్యూషన్ మొదలగు క్రొత్త క్రొత్త గ్రంథములు వెలువడ వలయును. లేనిచో భాష పరిపుష్టి పొందజాలదు.

4. మన భాషలో చిత్ర చిత్రములైన శైలీ భేదములు అరుదుగా ఉన్నవి. వానిని మనము సృష్టించుకొన వలసి యున్నది.

ఇట్టి యభిప్రాయములతో, అభినివేశముతో వారు వచన వాఙ్మయ సృష్టికి కడగినారు. వారు వచన రచనకు దొరకొనినది 1913 ప్రారంభముననే అయినను, మఱియొక విధమున చూచినచో పద్యమునకు, సంగీతమునకు

ప్రాధాన్యము తగ్గించి ప్రధానముగా వారు వచన నాటకములనే వ్రాసి యుండుట చేత, 1900 లో నర్మదా పురుకుత్సీయమును వ్రాసినప్పుడే వారు వచన రచన ఆరంభించినారు అనినను అనజెల్లును.

1911 కు కొంచెము పూర్వము వారు సువర్ణ లేఖా పత్రికతో పొత్తు కలిపి యుందురు. జగద్విఖ్యాతములగు వారి సాక్షి వ్యాసములను, వచన ప్రహసనములను, చిన్న కథలను హాస్య సంభాషణములను, ఎడనెడ పత్రికా వ్యాసములను సువర్ణ లేఖా పత్రిక 1911–14 ప్రచురించినది.

పైన పేర్కొనబడిన రచనలు ఇంచు మించుగా అన్నియును గ్రంథ రూపమును దాల్చినవి. ఆ గ్రంథములు ఇవి :

1. సాక్షి. (మొదటి సంపుటము)

2. కథాలహరి.

3. ప్రకీర్ణోప న్యాసములు.

4. హాస్య వల్లరి.

సాక్షి వ్యాసములలో మొదటి ముప్పది యొక్కటి అప్పుడు సువర్ణ రేఖలో పడినవి. ఆ మొత్తము మొదటి సంపుటములో చేర్చబడి యున్నవి. తరువాత సాక్షి వ్యాసములు ఆంధ్ర పత్రికా సారస్వతాను బంధమున ప్రకటింప బడినవి. అవి తక్కిన అయిదు సంపుటములుగా వచ్చినవి.

పంతులుగారి పేరిట మఱికొన్ని పుస్తకములు లభ్యము లగును. కథా వల్లరి, విమర్శాదర్శ విమర్శాదర్శము మొదలగునవి అట్టివి. కాని యివి అన్నియును పైన చెప్పబడిన కథాలహరి మొదలయిన సంపుటములలో చేరి పోయినవి.

వీనిలో చేరని వ్యాసములును కథలును మఱికొన్ని ఉన్నవి. సందర్భాను సారముగా ఈ అధ్యాయమున వాని వివరములు తెలుప బడును.

పంతులుగారు రెండు నవలలు వ్రాసినట్లు ఆంధ్ర వాఙ్మయ సూచి పేర్కొనినది. అవి—1. దుష్టప్రధానుడు 2. దుర్గయాధికారి. ఇవి నవలలు కావు; చిన్నకథలు. పంతులుగారు నవలలు వ్రాయలేదు.

పంతులుగారి శత జయంత్యుత్సవ గౌరవార్థము ప్రకటించిన ఆంధ్ర సాహిత్య పరిష త్పత్త్రిక సంచిక (సంపుటి 53: సంచిక 4—6.)లో సంపాదకీయమున ఆంధ్ర వాఙ్మయ సూచికలో ఉపగబడిన పదునాల్గు వచన గ్రంథముల నామములను పేర్కొని ఆంధ్ర సారస్వత పరిశోధకులు ఈ గ్రంథములను సేకరించవలసి యున్నదని వ్రాసినారు. ఆ పదునాల్గు వచన కథలను కథాలహరిలో చేరి యున్నవే!

పంతులు గారి వచన కృతులలో అత్యంత ప్రాధాన్యము గల సాక్షిని గూర్చి ముందు పరిశీలించి, ఆ వెనుక తక్కిన వానిని గూర్చి చెప్పుకొనవచ్చును.

# సాక్షి వ్యాసములు

సాక్షి వ్యాసములు తెలుగు భాషాయోషకు వినూతన మగు ఆభరణ సంచయము. పంతులు గారి రచనలలో వీనికి వచ్చినంత పేరు ప్రతిష్ఠలు మరి దేనికిని రాలేదు.

"సంఘ దురాచార నిర్మూలన కరంబులును, పండిత పామర జనరంజకంబులును, సరస హాస్యాద్భుత రసమయంబులును, గంగా ఝరీ ప్రతీకాశ ధాటీ విరాజితంబులును, అమృత మాధురీ ధురీణంబులును, అపూర్వ భావ భాసురంబులును, జ్ఞాన దాయకంబులును. హర్ష దాయకంబులును" అగు సాక్షి పుస్తక రాజములను గూర్చి నిజమునకు ఆంధ్ర పాఠక లోకమునకు పరిచయము చేయ వలసిన ఆవశ్యకమే లేదు. నవ్య సాహిత్యమునందు ఒక విశిష్ట స్థానమును ఆక్రమించి, ఇవి అందరిని అలరించినవి.

కొందరు కొందరి యభిప్రాయములను బట్టి పంతులు గారి రచనల యందు ఇవియే అత్యుత్తమమైనవి. కాని పంతులు గారు తాము మాత్రము ఈ అభిప్రాయమును ఆమోదించి యుండ లేదని తెలుప బడినది కదా !!

సవిమర్శమగు విపుల పరిశీలనము చేయకుండగనే, సాక్షి వ్యాసములలోని అందము చప్పున తెలియునది. నాటకములలోని గొప్పతనము నిశితముగా తరచి చూచి తెలిసికొన వలసినది. సాక్షి వ్యాసములలో ప్రకృతి పరిశీలనము, నిరూపణమునకు వాచ్యమగు పద్ధతి అనుసరింపబడినది. నాటకములలో అది కొంత వ్యంగ్య పద్ధతిలో చేయబడినది. అందుచేత వారి సాక్షి వ్యాసములు బహుజనాదరము పొందినంత సులభముగా నాటకములు పొందవు. పై విధమున వెలువరియ బడిన యభిప్రాయమునకు వెనుక నున్న సత్యము ఇది.

## వ్యాసముల చరిత్ర

సాక్షి వ్యాసములు మొట్టమొదట 1913 లో సువర్ణ లేఖలో అవతరించినవి. వీనికి ఆంగ్ల భాష యందలి Spectator మూలమని చెప్పుట సామాన్య మయిన విషయము. స్పెక్టేటర్ వ్యాసముల నుండియే సాక్షి వ్యాసములు అను ఊహ పంతులు గారు చేసిరి అని చెప్పుటకు ఆలోచింప వలసిన పనియే లేదు.

పంతులు గారు ఆంగ్ల సారస్వతమును బాగుగా చదివిన వారు. ఈ ఊహ వారికే తోచి యుండ వచ్చును, వారి అల్లుడు, సువర్ణ లేఖాధిపతియును అయిన ద్రోణంరాజు వెంకట రమణారావు గారికే ఈ ఆలోచన వచ్చినదని, వారి ప్రేరేపణపై స్పెక్టేటర్ వ్యాసముల వంటివి తెలుగున వ్రాయుటకు పంతులు గారు పూనుకొని నారని కొందఱు చెప్పుదురు.

సువర్ణ లేఖలో వచ్చిన వ్యాసములను మొదటి సంపుటముగా ప్రకటించుచు పీఠికలో పానుగంటి వారు ఇట్లు వ్రాసినారు.

"సాక్షి యను పేరిటి కొన్ని వ్యాసములు నేను 1913 వ సంవత్సరమునఁ గొన్ని మాసములు సువర్ణ లేఖా పత్రికలోన వ్రాసితిని. ఆ పత్రికాధిపతి నన్నత్యంతము ప్రోత్సాహ పఱచి వ్రాయించుటచే వ్రాసితిని."

సాక్షి సంఘము పరీధావి సంవత్సర మాఖ బహుళ చతుర్దశీ శివరాత్రి గురువారమునాడు లింగోద్భవ కాలమున పుట్టినది. ఇది తేదీల లెక్కన 6–3–1913 అగుచున్నది. దీని యందలి అయిదుగురు సభ్యులను పరిచయము చేయుచు పంతులుగారు మొట్ట మొదటి వ్యాసమును వ్రాసిరి. ఇది మార్చి 11 వ తేదీ పత్రికలో వచ్చి యుండును.

సువర్ణలేఖ పత్రికా సంచికలు లభ్యము కానందున ఏ సంచికయందు ఏ వ్యాసము పడినదో తెలియదు. వ్యాసములను పరిశీలించి చూచిన, ఇరువది రెండవది అగు "సభా స్వకీయ వ్యాపారము" తరువాత ఇవి సక్రమముగా

ప్రతి వారము రాలేదు అని తోచును. ఇరువది రెండు, ఇరువది యేడు వ్యాసముల నడుమ సుమారు అయిదు మాసముల కాలము గడచియుండును. ఆ నడుమ వ్యాసములలోని ఈ భాగములను చూడుడు.

సత్యము—23

"నాయనలారా: నాకుఁ దల నొప్పుచున్నది. క్రిందటిసారి మా యుపన్యాస మేమియు జరుగలేదని సిద్ధపడితిని."

రంజాన్ పండుగ—వినాయక చతుర్థి—24

"ఈ నడుమఁ గార్యాంతరమున సాక్షియు నేనును హైదరాబాదునకు వెళ్ళవలసి వచ్చెను. అందుచే మా సభా వ్యాపారము వర్షాకాలపుఁ జదువువలె వెనుకఁ బట్టినది."

పార్థసారథి స్వామి—25

"బొజ్జయ్య సెట్టి కీ నడుమఁ బ్రాణము మీదికి వచ్చినది. అందుచేత సభాకార్యములు మనకు సరిగా జరుగుచుండుట లేదు."

కాలాచార్యుని వివాహ ప్రయత్నము—27

"దాదాపుగా నయిదు మాసములనుండి మా సత్యపుర సంఘ వ్యాపారములు చల్లబడినవి."

ఇరువది యెనిమిదవ వ్యాసమగు "దాక్షిణాత్యోపన్యాసము" 1914 వ సంవత్సరము ఏప్రిల్ 14 న వచ్చినట్లు ప్రకీర్ణోపన్యాసములలోని ఒక ప్రస్తావన వలన తెలియుచున్నది. దీనినిబట్టి కడపటి వ్యాసము ఆ సంవత్సరము ఏప్రిల్ మాసాంతమున అయియుండ వచ్చును.

పునరారంభము

అంతటితో ఆగిపోయిన సాక్షి వ్యాసముల గూర్చి మరల 1920వ సంవత్సరము సెప్టెంబరు 4 వరకు వినబడలేదు. ఆ తేదీగల ఆంధ్రపత్రిక సార

స్వతాను బంధమున ఈ క్రింది విజ్ఞప్తితో గూడ "సాక్షి సంఘ పునః సంస్థాపనము" అని సంఘమును గూర్చి వార్త ప్రకటింప బడినది.

"ఇప్పుడు సారస్వతాను బంధమునకు క్రమముగా వ్యాసావళి వ్రాయుట కంగీకరించిన విద్యాధికులు కొంద రేర్పడి యున్నారు. ఇంతటి నుండి శ్రీ పీఠాపురము రాజావారి ఆస్థాన కవులును, పెక్కు నాటకములు జనరంజకముగా వ్రాసిన వారును, ఆంధ్ర కాళిదాసను ప్రసిద్ధి నొందిన వారును అగు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహా రావు పంతులుగారు సాక్షి వ్యాసములు ప్రతి వారమును వ్రాయుచుందురు. ఇందు పెక్కు విషయములు నిరంకుశముగా విమర్శన మొందు నను విషయము వారు ప్రకటించిన సాక్షియను గ్రంథము[1] వలన ఆంధ్రులు ఎఱుగుదురు. సాక్షి రెండవ భాగ ముపన్యాసము లిక ప్రారంభమగును. సాక్షి సమయోచిత సత్య నిర్ధారణములను ఆంధ్రలోకము మరల వినగలదు."

ఆంధ్ర పత్రిక సారస్వతాను బంధములతో దాదాపుగా వారమున కొకటి చొప్పున రెండు సంవత్సరముల కాలములో మొత్తము 82 వ్యాసములు వెలువడెను. ఇవి సాక్షి 2, 3, 4 సంపుటములుగా తరువాత అచ్చు వేయింపబడెను. వీనిలో మొదటిది 4–9–1920 నాటి పత్రికలోను, చివరిది 2–9–1922 నాటి పత్రికలోను వచ్చినవి.

రెండవ సంపుటములోని ఇరువది తొమ్మిదవ వ్యాసము "దేశభక్తి–స్వార్థ పరిత్యాగము" (30–4–1921) తరువాత ముప్పదియవ వ్యాసము "స్వీయ చరిత్రావశ్యకత" (7–5–1921) వ్రాయుటకు నడుమ ఒకసారి అయిదు వారములును, మఱల మూడవ సంపుటములోని ఇరువదవ వ్యాసము "సాక్షిలేఖ"కు (28–10–1921) ఇరువది యొకటవది "సాక్షి దేహారోగ్యమున"కు (12–1–1922) నడుమ పది వారములు వ్యాసములు ఆగి పోయినవి. తక్కిన యెడల ఎప్పుడైన ఒక వారము లేకపోవుటయే కాని, ఇంత వ్యవధానము లేర్పడలేదు.

---

1. సాక్షి మొదటి సంపుటము 1916 తో వెలువడినట్లు ఆంధ్ర వాఙ్మయ సూచిక.

తరువాత 1927 వ సంవత్సరములో సెప్టెంబరు 12 న జంఘాల శాస్త్రి సంఘ కార్య కలాపములను తిరిగి ప్రారంభించుచున్నట్లు సూచించుచు వ్రాసిన లేఖ ఆంధ్ర పత్రికయందు వచ్చినది. సంఘ పునరుద్ధరణము అను పేరున ఉన్న తరువాతి వ్యాసముతో ఇవి సెప్టెంబరు 23 న ప్రారంభమైనవి.

ఈ పర్యాయము వ్యాసములు తిన్నగా వారము, వారమును వెలువడలేదు. పది వ్యాసములు వెలువడుటకు ఇరువది యారు వారములు పట్టినది. చివరి వ్యాసమగు "ఆయుర్వేద వైద్యుని యుపన్యాసము" 24–3–1928 నాటి పత్రికలో వచ్చినది.

మరల ఇంకొకసారి సాక్షి సంఘ పునరుద్ధరణము 25–3–1933 న జరిగినది. ఈ సారియును వ్యాసములు సక్రమముగా రాలేదు. ఆ సంవత్సరాంతము లోపున మొత్తము ఇరువది వ్యాసములు మాత్రమే వచ్చినవి.

ఈ విధముగా మొత్తము సాక్షి సంఘ సంబంధులుగా పంతులుగారు వ్రాసిరి. (సాక్షి ఆరవ సంపుటములో చివరనున్న కొన్ని సాక్షి సంబంధులు కావు.) ఈ చివరి ముప్పది వ్యాసములును సాక్షి 5, 6 సంపుటములలో చేరినవి.

## సంఘ చరిత్రము

సాక్షి సంఘము పరీధావి సంవత్సర మాఘ మాసమునందు బహుళ చతుర్దశీ గురువారము శివరాత్రియందు లింగోద్భవ కాలమున పుట్టినది. దీనిలో అయిదుగురు సభ్యులు.

మొదటి వ్యాసములో ఈ సంఘము ఏల స్థాపింపబడినదో చెప్పి, పిదప పంతులుగారు సభ్యుల పరిచయము వ్రాసిరి. ఈ వ్యాసము ఉత్తమ పురుషలో "సాక్షి" అను నతడు చెప్పుచున్నట్లు ఉన్నది. పంతులుగారు తమ కర్తృత్వము చాలకాలము గుప్తముగా ఉంచినట్లు అగపడును.

"సుదర్శనీ" పత్రికలో పడిన "సువర్ణ లేఖా పత్రికా ప్రశంస" అను దాని గూర్చి ప్రస్తావించుచు ఇరువదవ వ్యాసమందు జంఘాల శాస్త్రి ఇట్లు చెప్పును.

"మాలోని సాక్షి పానుగంటి లక్ష్మీనరసింహా రాయనింగారని నిశ్చయించినట్లు వారు వ్రాసినారు. ఆ రాయనింగా రెవ్వరో మే మెఱుగము. మాలో.... వెలమ వారెవ్వరు లేరు."

సంఘావతరణము

ప్రాపంచిక చర్యలు చిత్రవిచిత్రములుగా నున్నవి. మనుష్యుని ప్రకృతి అవాస్తవికముగా మార్పునొందినది. "సత్యానుభవాచ్ఛాదనము, మిథ్యానుభవ సంధానము, స్వప్రకృతి సంఛాదనము, పరప్రకృతి స్వీకారము" యుగధర్మమైనది. నేరముల సంఖ్య అధికమైనది. ప్రత్యేక రాజకీయ దండనము ఒక్కటే నేరములను అడగద్రొక్క జాలదు. పైగా రాజకీయ దండనము లేని నేరములు అనేకములు. ఇట్టి స్థితిలో నేరములను అడగించుటకు సంఘశిక్ష అవసరమని సాక్షి భావించెను. నేరముల స్వభావములు విశదపఱచి, వానివలన సంఘమునకు గల్గు హానిని స్పష్టపఱచి, వానియందు జనులకు అసహ్యము కల్గునట్లు చేయుటకై ఈ సంఘము ఆవిర్భవించెను.

దీనిలోని సభ్యులు ఐదుగురును సాక్షి, జంఘాల శాస్త్రి. కాలాచార్యులు, వాణీదాసుడు, బొర్రయ్యసెట్టి అనువారు. సాక్షి తక్కిన నలుగురను పరిచయము చేసిన వెనుక సంగ్రహముగా తననుగూర్చి చెప్పుకొనెను.

జంఘాలశాస్త్రి వాచాలుడు, లోకానుభవము విరివిగా కలవాడు. అన్ని అంశములు ఇంతయో అంతయో తెలిసినవాడు. కాలాచార్యుడు శ్రీవైష్ణవుడు, ధారాళమయిన అంతఃకరణము కలవాడు, వేదవేదాంగ భాష్యములను చదివిన వాడు. వికారరూపమువలన బ్రహ్మచారిగా ఉండిపోయినవాడు. ఇక వాణీదాసుడు కవి, సోమరి, అసూయాపరుడు, శ్లేష కవిత్వముపై అదరము కలవాడు, శూద్రుడు, ఆధునిక కవిత్వము చెప్పుటకు ప్రయత్నించు చున్నవాడు. నాల్గవ

వాడు బొజ్జయ్యసెట్టి కోమటి, వానికి పరిహాస్యము ఎఱిగిన వాడు, కొంత కాలము వెనుక విశేష ధనము ఆర్జించినను చితికిపోయిన వాడు, తామర వ్యాధి గలవాడు. (ఇతడు సభాభవనపు గుమ్మమున పట్టకుండుటచే ఎన్నడును రాడు.)

వీరిని పరిహాస పూర్వకముగా పరిచయము చేసిన తరువాత, సాక్షి తననుగూర్చి ఇట్లు చెప్పుకొనెను.

“నే నెవడనో నాకుఁ గొంత తెలియును గాని నేనెవడనో మీకు స్పష్టీకరించుటకుఁ దగిన యాత్మజ్ఞానము కలవాడను గాను. నా సంగతి మీరు ముందు నా వ్రాతను బట్టియే కనిపెట్టగలరు. నే నారామ ద్రావిడుడను. నాపేరు సాక్షి. మేము ప్రచురించు పత్రికకు నా పేరే యుంచితిని.”

సాక్షి సంఘము “సత్యప్రియముసల పాలా కచేరీ కెదురుగ” నున్న అద్దె భవనములో ప్రతిరాత్రియు సమావేశము కావలయునని ఏర్పాటు చేసికొనిరి. సభ చేరగానే చక్రవర్తిగారికి వారి కుటుంబమునకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యములను ఇమ్మని దైవప్రార్థన చేయవలయునని, సభలో రాజకీయ విషయములను గూర్చి ఎన్నడును ముచ్చటించరాదని, తప్పులనే గాని అట్టి తప్పులకు లోనైన మనుష్యులను నిందింపరాదని, వాదములు ముదిరి కలహములు గానీయరాదని నిబంధనలు ఏర్పఱచుకొనిరి. వారము, వారము ఈ సభా వ్యాపారములను గూర్చి ఒకటి రెండు దళములు సువర్ణ లేఖాపత్రికకు పంపుటకు నిశ్చయమైనది.

ఈ విధముగా సంఘము కొన్ని మాసములు పనిచేసి ఆగిపోయెను. బొజ్జయ్య సెట్టి మరణించుటతో, తక్కిన సభ్యులు కూడ తలకొక దారి చీలి పోవుటతో సమావేశములు వెనుకబట్టి క్రమముగా సంఘము పని మానివేసెను.

ఈ సంఘము మరల మిగిలిన నలుగురు సభ్యులతో 1920 వ సంవత్సరము ఆగస్టు మాసాంతమున పని ఆరంభించి ఉపన్యాస దీక్ష వహించెను. ఈసారి యుపన్యాసములు ఆంధ్ర పత్రికా సారస్వతానుబంధములో ప్రకటింపబడెను.

డబ్బులేని సెట్టి

మరణించిన బొజ్జయ్య సెట్టి స్థానము నింపుటకై దరఖాస్తులు కోరబడినవి. " డబ్బులేని సెట్టి " అను పేర ఒక దరఖాస్తు వచ్చినది కాని ఆ కాగితము కన బడక పోవుటచే మఱల ప్రకటన జరిగినది. అబ్రాహ్మణుడు కావలయునని ప్రత్యేకము నిబంధన చేయబడెను : ఈ ప్రకటనకు సమాధానముగా వచ్చిన మూడు లేఖలు 8_10_1920 పత్రికయందు (సాక్షి 2_6) ప్రచురింప బడినవి. కాని వీరి దరఖాస్తులు నిరాకరింప బడినవి.

వసంతుని దరఖాస్తు

ఈ డబ్బులేని సెట్టిని గూర్చిన ప్రస్తావన "వసంత లేఖల" లో ఎనిమిదవ దానిలో ఉన్నది. వసంతునకు ఒక లేఖ వచ్చినది. "అయ్యా ! మీరు సాక్షి సంఘములో "డబ్బు లేని శెట్టి"గా చేరి యుండిరట - నిజమేనా ? మీ వ్యాసములు నుపన్యాసము లందే వ్రాయ రేమి ?" అని. దీనికి వసంతుని సమాధానము.

" కడుపు కక్కుర్తిచే విదియైన వ్రాయుట గాని సాక్షి సాహచర్యము కలిగిన పిమ్మట నా బోంట్లేమి మొగము పెట్టుకొని కావ్య రచన మొనర్ప వలెను ? కలమునకు సన్యాస మిచ్చిన కడుపుబ్బునని, పనిలేని మంగలి వలె నీ పను లొనర్చు చుంటిని. డబ్బులేని శెట్టి సాక్షి సంఘ సభ్యుడుగా నుండ వీలులేదు. ఏమనగా సాక్షి కిప్పుడు డబ్బు గల శెట్టి దరఖాస్తు వచ్చినందున కాలమును బట్టి, దైవగతిని బట్టి డబ్బు లేని శెట్టిని నామ మాత్రమైన సత్యపురము నుండి తరిమి వేసినారు. కావున నా దరఖాస్తు మంజూరు కాలేదు. ఆ దరఖాస్తు పార వేసినారు. "

సాక్షి సంఘ చరిత్రము నందు ఈ రెండేండ్లును మంచి దశకలిగిన కాలము. ఇంత దీర్ఘకాలము ఈ సంఘము వరుసగా పనిచేయుట ఈ పర్యాయమే జరిగినది. సంఘమునకు విశేష ఖ్యాతి, విస్తృత ప్రచారము ఆంధ్ర పత్రిక వలన కలిగినట్లే, ఆంధ్ర పత్రికకును సాక్ష్యుపన్యాసముల వలన పేరు లభించినది.

సాక్షి ఆరోగ్యము క్షీణించి, సాక్షి సంఘమును కొనసాగించు అభిప్రాయము లేనివాడగుటచేత రెండేండ్లకు 1922 సెప్టెంబరు మాసారంభమున సంఘము రద్దు చేయబడెను.[1]

తరువాత అయిదేండ్లకు 1927 సెప్టెంబరు 12 న జంఘాల శాస్త్రి ఈ సంఘమును మరల పునరుద్ధరించెను. సత్యపురములోనే, అదే కార్యాలయమున, మిగిలిన ఆ నలుగురు సభ్యులతోనే సంఘము కార్యక్రమము ఆరంభించెను. తరువాత కొన్ని నెలలకు 1928 లో బళ్లారి జిల్లా, కమలాపురము పోస్టు, ఆనెగొందికి చెందిన సి. బాలనాగమ్మ యను నామె సభ్యురాలుగా గైకొనబడినది (సాక్షి, 5—7). ఈ పేరు మరల ఎచ్చటను వినరాలేదు.

24.3.1928 తో మరల సాక్షి సంఘ కార్యక్రమములు నిలిచిపోయినవి. ఆంధ్ర పత్రికలో సారస్వతానుబంధము ప్రకటించుట పత్రికాధిపతులు మాని వేసిరి. తిరుగ సారస్వతానుబంధములు ఆరంభమగుట, సాక్షి సంఘము పునఃసంస్థాపనము అందుట 1933 మార్చి 25 న ఐదేండ్ల పిదప. ఈ పర్యాయము సాక్షి సభలు మదరాసులో జరుపబడినవి. చివర రెండు సారులును సాక్షి

1. సాక్షి సంఘమును పునరుద్ధరించి, సారస్వతానుబంధమున వ్యాసములు వ్రాసినందులకు ఆంధ్ర పత్రికాధిపతులగు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ధారాళముగా ముట్టజెప్పెడువారు. చివర చివరలో పానుగంటివారు తగు శ్రద్ధ తీసికొని వ్రాయుట లేదని నాగేశ్వర రావుగారు అనుకొనుట, ఆ విషయము పానుగంటి వారికి తెలియుట జరిగెనట. ముందుగా నిర్ణయించుకొనిన కాలము ముగియగనే పానుగంటివారు సాక్షి సంఘమును ఉపసంహరించిరి. ఉపసంహారములో వారు "వృద్ధుడైన సాక్షి శేషించిన కొలది కాలమును యథాపూర్వముగా సూర్యోపాసన చేసికొనుచు భగవంతుని యాజ్ఞకై యెదురు చూచుచుండును." అని జంఘాలునిచే అనిపించిరి. దీనిలో సూర్యోపాసన అనుటలో పీఠికా పురాధీశ్వరులు శ్రీ సూర్యారావు గారని ధ్వని వచ్చుటవలన నాగేశ్వర రావుగారు అందలి వ్యంగ్యమునకు నొచ్చుకొనిరని వినికిడి.

సంఘము నిలువబెట్ట బడినను సమావేశములు క్రమముగా జరుగలేదు. తుదకు ఎట్టి ఉప సంహార వాక్యములును లేకుండ, ఎట్టి వీడ్కోలును లేకుండ సాక్షి సంఘము కనుమరుగై పోయినది.

మొదటి సారిగా ఈ సంఘము ప్రతిరాత్రియు సమావేశ మైనది. అయినను వారమునకు ఒకటి రెండు దళములు సువర్ణ లేఖకు పంపుట జరిగినది.

రెండవ పర్యాయము వారమునకు ఒకసారి "సాక్షి" ఉపన్యాసము ఏర్పాటు చేయబడినది. ఇది ఆంధ్ర పత్రికలో ప్రతి శనివారమును ప్రకటింప బడెడిది.

మూడవసారి కూడ వెనుకటి రెండు పర్యాయముల వలెనే సాక్షి సంఘము సత్యపురముననే పని చేసినది. ఈసారి ఆంధ్ర పత్రిక శుక్రవార పత్రికల కొఱకు నిరీక్షింప వలసినదిగా జంఘాల శాస్త్రి హెచ్చరించెను.

నాల్గవసారి సాక్ష్యుపన్యాసములు మదరాసులో సముద్ర తీరమున ఈయ బడెను. శుక్రవారము సాయంకాలమున ఈయబడు ఉపన్యాసము మఱునాడే ప్రచురణార్థమై ఆంధ్ర పత్రికకు పంపబడెను.

## సంఘ సభ్యుల చరిత్ర

సాక్షి వ్యాసములందు విషయ వైవిధ్యము మెండుగా ఉన్నది. అనేకాంశములపై ఉపన్యాసాదులను దేనికది విడిగా కూర్చుటగా కాక పానుగంటి వారు ఇందు సభ్యుల జీవిత సంఘటనములను గూడ చేర్చి ఒక కథా సూత్రము కల్పించిరి. ఈ కథా సూత్రము మొదటి సంపుటమున ప్రస్ఫుటముగా ఉన్నది. తరువాత భాగము లందు క్రమముగా దీనిపట్ల పంతులు గారు ఉదాసీనత చూపినారు.

సాక్షి సంఘమునకు సాక్షి పెద్ద దిక్కు. అతని పెద్దఱికము అనేక సందర్భముల స్పష్టముగా కానవచ్చును. జంఘాల శాస్త్రిని పరిచయము చేయుచు సాక్షి తొలుత చెప్పిన విశేషములు గాక చెప్పుకొన వలసినది ఏమనగా-

జంఘాల శాస్త్రి వాచాలుడే కాదు; ఉద్వేగి. ఏ అంశమును గూర్చియైనను పట్టుగా ఆలోచించి, వాస్తవమగు ఆవేశముతో ప్రసంగించును. సాక్షి సంఘ సంస్థాపనము నాటికి ఇతడు పట్టి ముడిసరుకు. సాక్షి చేతి క్రింద మెదిగి సుశిక్షితుడు అయ్యెను.

సంఘ సమావేశములలో మొదటి దానిలో గ్రామ్య భాషా గ్రంథ పఠనమును గూర్చి చర్చ జరినది. దీనిలో శాస్త్రి ఎట్టి ఆవేశ పూరిత స్వభావము కలవాడో, ఎంతటి హృదయ మార్దవము కలవాడో తెలియును. మరునాడు సాక్షి సభా భవనమునకు పోవుసరికి వాణీదాసుడును, జంఘాల శాస్త్రి ఘర్షణ పడుచుండిరి. వారు పరస్పరమును ఔచిత్యము విస్మరించి దూషించుకొనుచు తుదకు కలియ బడిరి. దీనిలో సాక్షి జోక్యము కలిగించుకొని ఇరువురను మందలించెను. అతడెంత శాంతముగ, నిగ్రహముతో ప్రసంగించినట్లు కనబడినను, వారి యసహ్య ప్రవర్తనను ఏవగించుకొనుట, ఆ ఏవగింపు ఆవరానిదై మాటలలో తీక్ష్ణత దొరలుచుండుట చూడ వచ్చును.

"నీవు కవివి కావు; అతడు విమర్శకుడు కాడు. కవితా విమర్శక శాస్త్ర విమర్శ వాదములలో మీరేడు తరముల వఱకుఁ బైకి పంపిన శాపబాణముల ఘాతములు దగిలి "యిట్టి తుచ్ఛులు, ఇట్టి వంశ నాశకులు మన కులమున నేల దాపరించిరో?" యని మీ పితామహ ప్రపితా మహాదులు విగత జీవు లెట్టు లేడ్వదగునో యట్టు లేడ్చు చుందురు...."

విమర్శక స్వభావము. 1-3

తరువాత 'గ్రహచక్ర జ్యోతిషము' (1-5) అను వ్యాసములో గూడ సాక్షి దూరదృష్టి, వంయమన బుద్ధి మఱియొంత తూరి విశదమైనవి. ఇక కొన్ని సంవత్సరములకు ఎన్నడో తోకచుక్క ఉద్భవించుట, సూర్యగ్రహము వేడిమిని కోల్పోవుట జరుగనున్నదని ఒక శాస్త్రజ్ఞుని వ్యాసమును చదివి తన్మూలమున అనర్థములు గలుగుటను ఊహించి, జంఘాలశాస్త్రి నిరుత్సాహుడై సభాసదులను అదలగొట్టగా సాక్షి అందుకొని చిన్న ప్రసంగము చేసెను. శాస్త్రి మౌఢ్యమును గర్హించి, "ప్రాణి సహజమగు నిత్యశోకము చాలదా? దానికి నవనవ కల్పనా

కలాప నూతన రోదన కాండ పారాయణము కూడ కావలయునా ?" అని మందలించెను. మన దృష్టిని తుచ్ఛ బాహ్య వస్తువులందు కాక మనలోనున్న శాశ్వత పదార్థమునందు ఉంచి తచ్చింతాలోలత నుండవలెనని హెచ్చరించి ఆధ్యాత్మిక దృష్టిని ప్రకటించెను.

సాక్షి సంఘము 1920లో మరల ఆరంభింపబడి నప్పుడు సాక్షి వయో వృద్ధుడు అయ్యెను. వయస్సుతో వచ్చిన గాంభీర్యము, సౌమ్యము సాక్షియందు గోచరించును. క్రమముగా తాను తటస్థుడై సాక్షి జంఘాల శాస్త్రిని ప్రధాన నిర్వాహకుడుగా చేయునట్లు కన్పడును.

సభావ్యాపారముల చర్చింపుచుండి, జంఘాలశాస్త్రి "M. S. S (Member of Sakshi Sangham) అని బిరుదము రీతిగా పేరు చివర తగిలిచ్చిన తప్పేమి ?" యని ప్రశ్నించెను. సాక్షి MSS అనగా Manuscripts అని తప్పుటర్థము వచ్చునేమో అని పల్కెను. సాక్షికి గల అయిష్టమును గురుతింప నేరక శాస్త్రి బిరుద ధారణ వ్యామోహమున M. S. S. S. (Member of Satyapura Sakshi Sangham) అని మార్పు చేసెను. అంతట సాక్షి "మీకే బిరుదమైన పొసగియుండును గాని నాకే బిరుదము పొసగియుండును ? నాయనలారా ! బిరుదములు వలదు, బహుమతులు వలదు. మన మే పనిని చేయుటకు బూనుకొని యుంటిమో దానిని నిశ్చల దీక్షతో జేయుదము. దైవమును నమ్మి ప్రవర్తింతము" అని ఉద్బోధించి,[1] తన పరిణత బుద్ధి కనబఱచెను.

1. సాక్షి 2_6 పుట 46. ఛార్లెస్ డికెన్స్ సృష్టించిన పిక్విక్ క్లబ్ సభ్యుల కిట్లు చివర చేర్చుకొనుట యున్నది. జోసెఫ్ స్మిగ్గర్స్ ఎస్క్వైర్, P. V. P. M. P. C. అనగా Perpetual Vice President–Member of Pickwic Club. అట్లే శామ్యూల్ పిక్విక్, G. C. M. P. C.–General Chairman–Member of Pickwic Club. వైస్ ప్రెసిడెంట్, జనరల్ ఛెయిర్మన్ అని చెప్పి, మరల మెంబర్ అనుట. పిక్విక్ కూడ పిక్విక్ క్లబ్ మెంబరని తగిలించుకొనుట చిత్రములుగా నున్నవి.

సాక్షికి ఆడంబరము నచ్చదు. సాక్షి సంఘ ప్రథమ వార్షికోత్సవము జరుపుటకు కూడ అతడు వ్యతిరేకించెను. వార్షికోత్సవము చేయవలదని చెప్పి ఆతడు గ్రామాంతరమునకు పోగా శాస్త్రి మున్నగువారు వార్షికోత్సవము ఎట్లో జరిపించిరి. (3—13)

సాక్షి శిక్షణమునకు జంఘాల శాస్త్రి మొదట ఆహ్లాదము పొందలేదు. విమర్శక స్వభావమును గూర్చి వివరించిన రాత్రి ఘర్షణ పడినందులకు గాను వాణీదాసునితో గలిపి తనను గూడ మందలించి నందులకు అతడు మనసులో సాక్షి పై కోపము ఉంచుకొని, అదను చూచుకొని పై మాట సాగ దీసెను; "స్త్రీ స్వాతంత్ర్యము" ను గూర్చి ఉపన్యసించుచు (1-4) ప్లక్ష ద్వీపమున జరిగిన వృత్తాంతమును చెప్పునెడ ఆతడు ఇట్లు అనెను.

"నేను గాలి కొలది దిరిగిన వాడ నగుటచే విదేశ వార్తలను గూర్చి యసత్య కథలు చెప్పుదునని నా మిత్రుడు సాక్షి యభిప్రాయము. ఒకటి లేనిదే రెండు కల్పించు వాడను గాను. అట్టి కవితాశక్తి లేనివాడను నేను విమర్శకుడను గూడ గానని యీ నడుమ సాక్షి న న్నధిక్షేపణ మొనర్చినాడు. ఆ సంగతి లోక మెఱుంగును లెండు. విచారింప దగదు."

## సాక్షి విశ్వరూపము

ఇట్టి జంఘాల శాస్త్రి క్రమముగా సాక్షి గొప్ప తనమును గుర్తించెను. అతనికి భక్తుడై పోయెను.

"మా కధికారి యగు సాక్షి యొక్క తత్త్వమును నేను గొంత యెఱిగిన వాడను గావున నిట్టిమాట లనుచున్నాను. నేను గేవలము శక్తి హీనుడను. సాక్షి నాయందలి యనురాగము చేత సూచించు సూచనలను బట్టి యాకాశమంత నోటితో నే నుపన్యసింతును." అని సాక్షిపై తనకు గల గౌరవమును తుదకు వెల్లడించెను. (5-11). సాక్షి విశ్వ రూపమును గూడ జంఘాల శాస్త్రి ఎన్నడో గురుతించెను.

"సాక్షి స్వరూపము నే నిది వఱకును బాగుగా నెఱుగను. అతని కొక్క స్వరూప మున్నట్లు కూడఁ జెప్పజాలను. నవనాగరకతా సంపన్నుల కాతడు కత్తిరింపుతలతో, నోటి సిగరెట్టుతోఁ గాన బడును. సంఘ సంస్కర్తల కతడు సన్యస్త యజ్ఞ సూత్రుడై కనబడును. సన్యాసులకు దండ కమండలు సహితుడై యగపడును. ఛాందసులకు వైదికవిష్ఠాపరుడైయున్నట్లు కానబడును. విష్ణుభక్తులకు శంఖ చక్ర చిహ్నాంత భుజుడై తులసీ మాలా వక్షస్కుడై కానబడును. మహమ్మదీయులకు బోడితలతో పొడుగు గడ్డముతో గనబడును. అతని యే స్వరూపము జిత్రింప వలయునో యెవ్వరి కెఱుక ? అతని యీ స్వరూపములోనే యింత వైవిధ్య మున్నది. అంతర స్వరూపము మాట చెప్పనే యక్కఱ లేదు. ఇంతకు నాతని బాహ్య పటము మనకేల ? అతడు మన మనస్సులలో నున్నాడు. ఇంక ముందుండును. అటనికి గోనె గుడ్డ కూరుపు గాని, గోడ చేరుపు గాని, యావశ్యకము కాదు." (3-13)

సాక్షి సంఘ ప్రథమ వార్షికోత్సవము సందర్భమున సాక్షి ప్రతిమను చిత్రింప జేసి భవనమున ఉంచవలెనను వాణీ దాసుని ప్రతి పాదనమును వ్యతిరేకించుచు జంఘాలుడు చెప్పిన మాట లివి.

వాణీదాసుడు, కాలాచార్యుడును ఆది నుండియు సాక్షి యందు భక్తి గౌరవములు కలవారు. వీరిలో వాణీదాసు "ఆపాద శిరఃపర్యంత మసూయ గలవాడై" నను అది సంఘ సభ్యులలో జంఘాల శాస్త్రి పైననే ఉన్నది. అతనికి జంఘాల శాస్త్రికి సరిపడదు.

సి. బాలనాగమ్మ అను నామెను దరఖాస్తుపై సభ్యురాలినిగా చేర్చుకొనుటయా, చేర్చు కొనక పోవుటయా యను ప్రశ్నము వచ్చినది (5-7). జంఘాలశాస్త్రి ఆమెను చేర్చుకొన వలయు ననెను. వాణీదాసుడు వల దనెను. దానిపై వాదము జరిగెను. "నా యభిప్రాయ మేదో చెప్పితిని. మార్చుకొన వలసిన కారణము నా కగపడ లేద"ని వాణీదాసుడు గట్టిగా చెప్పెను. కాలాచార్యుడు అటునిటు కాకుండ ఎట్లయినను సరియే అనెను. అప్పుడు జంఘాల శాస్త్రి సాక్షి అభిప్రాయము బయట పెట్టెను. సాక్షి చేర్చుకొన వచ్చునని

అభిప్రాయ పడుటచే హెచ్చు సంఖ్యకల సభ్యుల అభిప్రాయము ప్రకారము ఆమెకు సభ్యత్వము ఒసంగ బడెను. అప్పుడు వాణీదాసుడు అన్న మాటలు చూడుడు : "సాక్షి యభిప్రాయ మట్లున్నదని మొదటనే ఏల చెప్పలేదు? "

వాణీదాసుడును జంఘాల శాస్త్రియు మొదట ఘర్షణ పడి సాక్షి చేత మందలించబడిన వెనుక ఎన్నడును మఱల కలియబడ లేదు కాని వారి నడుమ కలహములు మాత్రము రాక పోలేదు. జంఘాల శాస్త్రి ఉపన్యాసము విని శ్రోతలలో కొందఱు చేసిన వ్యాఖ్యానములు "Nonsense ; So and So ; Mere blindness" ఇట్టి మాటలు వాణీదాసునకే వినబడినవి. (1-8)

"దయ్యములు లేవు: భూతములు లేవు" అని శాస్త్రి సిద్ధాంతము చేసిన వెనుక బండారుపురము నుండి నాగేశ్వర శర్మ అను నతడు భూతావిష్టుడు అనుకొనుచున్న ఒకని చర్యలను వివరించుచు లేఖ వ్రాసి నప్పుడు, నందు దొరికినది గదా అని వాణీదాసుడు జంఘాల శాస్త్రిని ఆక్షేపించుచు ఉపన్యసించెను. (1-14). సాక్షి సంఘమును తిరుగ స్థాపించిన తొలి సమావేశములోనే వాణీదాస కవి స్వీయ చరిత్ర పఠన సందర్భమున ఇరువురు పరస్పరా క్షేపణములకు తలపడిరి (2-2).

కాలాచార్యుడును సాక్షిపై అపరిమిత గౌరవాను రాగములు కలవాడు. భక్తి ప్రపత్తులు కలవాడు. సత్యపురము నందలి ఒక కన్యా వితంతువు కాలాచార్యుని పరిణయము ఆడుటకు రాయబారము అంపగా "సాక్షి యధీనుడనై యుండుటచే నేమియు స్వతంత్రించి చెప్పజాలను." అని బదులు చెప్పినాడు. ఆమె సాక్షికి ఉత్తరము వ్రాసినప్పుడు కూడ సమాధానముగా "వితంతువును జేసికొనినందు వలన నాకీ సభలో సభ్యత్వము పోవునా? పోవు నెడల( జేసికొన నొల్లను. నాకు సాక్షి కంటె సతి యెక్కువది కాదు." అని పలికెను (1-22).

బొజ్జయ్య సెట్టి నామ మాత్రపు సభ్యుడే అయినాడు కాని అంత కంటె అతడు ఎక్కువ చేసిన దేమియు లేదన వలెను. అతనికి సాక్షిపై అభిమానము, అనురాగము ఉన్నవి.

పత్రి రఘునాథాచార్యులు అను మాధ్వుడు సభ్యత్వము అపేక్షించి దరఖాస్తు పెట్టినప్పుడు దానిపై సెట్టి వ్రాసి పంపిన అభిప్రాయము (1-21) చూచిన సాక్షిని గూర్చి అతని కున్న ఎఱుక తేట తెల్లమగును :

" ....ఆర్గురున్నందు వలన నొక్క యీతి బాధ కూడ నున్నది. ముగ్గు రొక్క యభిప్రాయమును మిగులు ముగ్గురొక్క యభిప్రాయమును పడిన యెడలఁ దీర్పున కవకాశ ముండదు. అప్పుడు ' సాక్షి ' కి నిద్దఱు సభ్యుల యధికార మీయవలసి యుండును. అట్లు తీసికొనుటకు సాక్షి యంగీకరింపదు. "

బొజ్జయ్య సెట్టి తన అభిప్రాయము ఇచ్చినది ఈ ఒక్క సందర్భము నందే. ఇతడు విశేషమగు లోకానుభవము, దూర దృష్టి కలవాడుగా ఇచ్చటి అభిప్రాయము నిరూపించును. "సభలో సభ్యులు లొంగు బాటుగ నుండ వలయును గాని విరివిగఁ జేతికందని వారుగ నుండరాదు.... ఆలోచించి మాటలాడు నయిదుగురిలోఁ దేలని యంశ మైదువందలసభ్యులలోనైనఁ దేలునని యనుకొనుట వెఱ్ఱి.... మనము పై సభ్యుల నిరాకరించుటకుఁ గారణము మనలో నుండిన ట్లితరులకుఁ గనఁబఱచ వలయును గాని వారిలో నున్నట్లు కనఁబడిన యెడలఁ బ్రజల యిష్టమునకు దూర మగుదుము. " ఇవి అతని వ్రాతలోని కొన్ని చక్కని మాటలు.

## నామ మాత్ర సభ్యురాలు

పి. బాలనాగమ్మ చిరునామా తక్క ఆమె స్వరూప స్వభావములు మున్నగు ఏ ఇతరాంశములను పంతులుగారు ఇచ్చి యుండలేదు. అకస్మాత్తుగా ఈ పాత్ర ఏల ప్రవేశ పెట్టిరో, వారు క్రొత్త పథకముతో ఏమి చేయదలచిరో తెలియదు కాని సాక్షి వ్యాసములు క్రమముగా రాకపోవుట, తరువాత మూడు నాలుగు వ్యాసములు వచ్చి పిదప సారస్వతానుబంధ ప్రచురణమును ఆంధ్ర పత్రికాధిపతులు విలిపి వేయుట జరిగినది. చివఱి పర్యాయము సాక్షి సంఘము పునఃసంస్థాపించ బడినప్పుడు కూడ పంతులుగారు ఈ పాత్రను వెలికి తేలేదు.

## కథా సూత్రము

పరీధావి సంవత్సరమున శివరాత్రి దినమున సాక్షి సంఘము స్థాపింప బడెను. కార్య కలాపములు ఇంకను ఆరంభము కాలేదు. కవి, కాలాచార్యులు, సాక్షి ఈ ముప్పురును సభా భవనమున చేరి సన్నిహిత ఋతువును గూర్చియు, సాపాటును గూర్చియు ప్రసంగించు కొనుచు కూర్చుండగా జంఘాలశాస్త్రి కాగితముల బొత్తి చేత బుచ్చుకొని వగర్చుచు వచ్చి తలకు తగిలిన దెబ్బ లక్ష్యపెట్టక దేశ భాషా పఠనమును కళాశాలలలో అనివార్య పఠనీయములుగా చేయలేదని వార్తా పత్రికలలో పడిన వార్తను గూర్చి చర్చ ఆరంభించెను (1-2). తరువాతి సమావేశమునాటి రాత్రి సాక్షి భవనమునకు వెళ్లు సరికే వాణీదాసునకు, జంఘాల శాస్త్రికి అభిప్రాయ భేదములు పొడమి, ముదిరి చేయిచేయి కలుపుకొనుటకు సిద్ధపడుచుండిరి. సాక్షి వారికి సర్ది చెప్పుచుండగనే ఎక్కడనో కొంప లంటు కొనుట తటస్థించుటచే అందఱును పరుగెత్తుకొని పోయిరి. ఈ కలవరములో వాణీదాసుడు శాస్త్రిని "ఏది ! మగవాడవైన యెడల నొక్క మత్తేభమును జెప్పుము. ఒక్క చచ్చు తేటగీతి చెప్పుము. అంత వఱకెందులకు ? మూడు ముక్కలు గద్యము చెప్పుము. ముచ్చెమటలు పట్టి చావునకు సిద్ధమయ్యేదవో లేదో!" అని సవాలు చేసెను (1-3).

ఆ సవాలునకు బదులు చెప్పెనా అన్నట్లు జంఘాలశాస్త్రి మరుసటి సమావేశము నుండి ఉపన్యాసములు ఆరంభించెను. తొలి ఉపన్యాసములో ఉత్సుకత కలిగించు అంశము— స్త్రీ స్వాతంత్ర్యము— దానిలో కథ— అందులో హాస్యము— తీసికొని శాస్త్రి విజృంభించెను (1-4). విమర్శక స్వభావమును గూర్చి చెప్ప వలెనని పోయిన సాక్షికి లోన అడుగు బెట్టుటకు వీలు లేనట్లు జనము కిటకిట లాడుచుండెను. ఇక్కడనుండి శ్రోతలు సంఘ భవనమునకు వచ్చుట ఆరంభ మైనది.

ఈ ఉపన్యాసమైన మఱునాడు కూడ జంఘాలశాస్త్రి ఉపన్యాసము వినుటకై జనులు మూగిరి. కాని జంఘాలశాస్త్రి తాను అనుదినమును ఉపన్యాసములు ఈయ వలసి యుండునని ఊహించి ఉండలేదేమో ! సాక్షి "ఎండలప్పుడే మిగుల,

దీర్ఘముగ నున్నవి. వైశాఖ మాసమున నెల్లుండునో ! " అనినగాని అతడు ఉపన్యాస వేదిక ఎక్కలేదు. వేదిక నెక్కి అతడు గ్రహచక్రము భావి గతుల గూర్చి ప్రసంగించెను (1-5).

జంఘాలశాస్త్రిది వ్యతిరేకత కలిగిన కొలదిని పడను, కలుకునెక్కు తత్త్వము. ఒకనాడు అతడు ప్రసంగించుటకు వేదికనెక్కి " ఈ దినమున " అని ఆరంభించెను. సభలోనుండి " ఈ దినముకాదు. ఈ రాత్రి యనుము." అని మాటలు, చప్పటలు వచ్చినవి. దానితో అతడు విరచుకొని పడి వారిని అక్షేపించుచు, పాశ్చాత్య నాగరకతా మహత్వమును దులిపి విడిచెను (1—7.) తరువాత జంఘాల శాస్త్రి భూత వైద్యముగూర్చి, దివ్య యోగములనుగూర్చి, నాటక ప్రదర్శనములనుగూర్చి తన అనుభవములను వివరించెను.

## ఆచార్యుని పెండ్లి - సెట్టి చావు

మలిల తుదలో సాక్షి, జంఘాల శాస్త్రి హైదరాబాదు ప్రయాణము (1-24) బొజ్జయ్యసెట్టి అనారోగ్యము (1-25,26) మున్నగు వృత్తాంతములు వచ్చినవి. సెట్టిని తామర వైద్యమునకై మదరాసు తీసికొని పోయిరి. అక్కడను ఆరోగ్యము కలుగక పోవుటచే తిరుగ ఇంటికి తీసికొని వచ్చిరి (1-27.) ఇంతలో కాలాచార్యునకు " పెండ్లి తహద్దీ "ఎక్కువ అగుటచేత శాస్త్రి అతనిని వెంట బెట్టుకొని ద్రవిడ దేశము పోవుట, అక్కడ చిక్కులు కలుగుట తటస్థించెను (1-27,28.)

కాలాచార్యుడు వివాహ ప్రయత్నములలో వ్యయమై పోయిన డబ్బు తిరుగ సంపాదింప నెంచి శాస్త్రి తోడ్పాటుతో మద్రాసులో హోటలు పెట్టెను (1-31.) ఎట్లో దానిలో నూటయిరువది రూపాయలు మిగిల్చి తెచ్చివారు ఆ ద్రవ్యమును సంఘమునకు మూలధనముగా ఇచ్చిరి. వాణీ దాసుడు గ్రామ్య గ్రాంధిక వాదములలో పడి పోయెను. సెట్టి పరిమపదించెను (1-31.) అతని స్థానమున సభ్యులుగా చేరదలచిన వారిని దరఖాస్తు లంపుకొనుమని కోరుచు సాక్షి సంఘమును పునరుద్ధరించు తల పున్నట్లు వ్రాసి ముగించెను.

ఈ విధముగా ఒక వ్యాసమునకు మఱియొక వ్యాసమునకు సంబంధము నిలుపుట, సభ్యుల వ్యక్తిగత జీవితాంశములను, ఉపన్యాసాదికమును పసిగు పేకలుగా అల్లుట-వీనితో సాక్షి మొదటి సంపుట మొక నవలవలె ఐనది. తరు వాతి సంపుటములలో గూడ ఇట్టి విశేషములు ఉన్నను మొత్తముమీద పంతులు గారు కథా సూత్రమును అంత విపరీముగా, విస్ఫుటముగా కొనసాగించుటపై ఆసక్తి చూపలేదు.

సాక్షి సంఘము 1920లో మొదటి పర్యాయము పునః సంస్థాపనము చేసినప్పుడు మృతి నొందిన బొజ్జయ్య సెట్టి దీనికి ప్రాణము పోయుటకు కారకు డైనాడు. సెట్టి కాలాచార్యునకు కలలో కన్పించి "కాలాచారీ! సాక్షి సంఘము దిరుగ స్థాపించుట నా యభిమతము. స్థాపించి శక్తివంచన లేకుండ మీరు భాషా సేవ చేయుచుండవలయును. సత్యము వర్ధిల్లుననియు నసత్యము నశించుననియు సదాచారములు విజృంభింప వలెననియు, దురాచారములు క్షీణింపవలయుననియు దైవధ్యాన మొనర్చి యుపన్యాస దీక్ష నారంభింప వలయును." అని హెచ్చ రించెను (2-1.)

జంఘాల శాస్త్రియు ఆ నడుమ కాలమున బియ్యపు గంట్రోలు నందు కొంత ధనము సంపాదించి సత్యపురము చేరెను. వాణీదాసుడు ఏదో గ్రామమున ముద్రాక్షర శాలలో అక్షర సంధానము చేయుచుండెను. ఆతడు సత్యపురము చేరుకొనవలసి యుండెను (2-1.)

సాక్షి సంఘ ప్రథమ సమావేశమున వాణీదాసుడు స్వీయచరిత్ర పఠనము ఆరంభించెను (2-2.) ద్వితీయ సమావేశమునుండి జంఘాలశాస్త్రి ఉపన్యాస దీక్ష ఆరంభించెను. ఆరు, ఏడు ఉపన్యాసముల అనంతరము శాస్త్రి సొంత పని మీదను మదరాసు పోయెను. అటనుండి దక్షిణ దేశము కొంత పర్యటించెను.

ఈ పర్యటన సమయమున అతడు విడువకుండ సాక్షికి లేఖలు వ్రాయగా వానిని సాక్షి సభలో చదువు చుండెడివాడు (2-11నుండి 23 నడుమ) శాస్త్రికి మదరాసులో జ్వరము వచ్చినది. తరువాత ఆతడు సత్యపురము తిరిగి వచ్చెను.

ఇట్లు పరిశీలించిన కనబడు అనేక సూక్ష్మాంశములు కాక సాక్షి దేహారోగ్యము, సాక్షి సంఘ ప్రథమ వార్షికోత్సవము, వాణీదాసుని కారాగార శిక్ష వృత్తాంతము వీనితో అప్పుడప్పుడ కథా శరీరము నిలుపుట జరిగినది. రెండేండ్ల పిదప సాక్షి సంఘమును ఉపసంహరింపుచు, సాక్షి వయోవృద్ధుడై, దుర్బలుడై ఉన్నట్లు, కాలాచార్యుడు సర్వవరము ఆలయములో పాచకోద్యోగిగా పోనున్నట్లు, వాణీదాసుడు కాకినాడలో ఆంధ్రోపాధ్యాయుడుగా పోవ నభిలషించు చున్నట్లు, తాను బదరీనారాయణము పోదలచు కొన్నట్లు జంఘాలశాస్త్రి చెప్పెను.

1927 లో సాక్షి సంఘము రెండవసారి పునరుద్ధరింప బడినప్పుడు వెనుకటి సాక్షి సంఘ సభ్యులే ఇప్పటి సభ్యులు అని జంఘాలశాస్త్రి చెప్పెను. సంఘములో సి. బాలనాగమ్మకు సభ్యత్వమిచ్చుట జరిగిననాటి సభా వ్యాపారములలో కాలాచార్యుడు, వాణీదాసుడు పాల్గొనిరి. సాక్షి అభిప్రాయము వ్రాసి పంపెను గాని రాలేదు.

1933 లో చివరిసారి పునరుద్ధరింప బడినప్పుడు ఈ మాత్రము కథా శరీరము కూడ లేదు. తొలి ఉపన్యాసమున మాత్రము (25_3_1933) శాస్త్రి సాక్షి వృద్ధుడయ్యును దేశాటన మొనర్చుచున్నా డనియు, పాశ్చాత్య దేశములను గూడ ఆ నడుమనే చూచినాడనియు, తన అనుభవములను వివరించుచు అతడు ఉపన్యాసము లిచ్చుననియు చెప్పెను. సభా వ్యాపారములు చూచుకొనుచున్నప్పుడు కూడ కవి, కాలాచార్యుడు జంఘాలశాస్త్రి ఉండిరిగాని సాక్షి లేడు. సాక్షి ఎట్టి ఉపన్యాసములను ఈయలేదు.

సాక్షి సంఘము స్థాపింపబడిన క్రొత్తలలో సాక్షి ప్రధాన వ్యక్తిగా ఉండెను. క్రమముగా జంఘాలశాస్త్రి పైకి వచ్చెను. సాక్షి ఆదర్శములను గ్రహించి, అతని ఉద్యమము సఫలము చేయుటకు శాస్త్రి నడుము కట్టెను. సాక్షియును శాస్త్రి శక్తిని గుర్తించి తాను మెల్లన నేపథ్యమునకు పోయెను. ఈ "సాక్షి" నాటకమునకు సాక్షి సూత్రధారుడై ప్రధానపాత్రమగు జంఘాల శాస్త్రిని లోకమునకు ఇచ్చిపోయెను. తుదకు సాక్షి సంఘమనగా జంఘాల శాస్త్రియే స్మృతి పథమున నిలుచును.

తక్కిన సభ్యులలో బొజ్జయ్యసెట్టి కొద్ది కాలముననే గతించెను. కాలాచార్యుడు, వాణీదాసుడు సంఖ్యా బలమునకు నిలిచినవారే కాని సాక్షి మహోన్నతాదర్శములను తెలిసికొని ప్రచారము చేయు శక్తియుక్తులు కాని, నేర్పు కాని వారికి లేదు.

సాక్షి సంఘ సభ్యులను గూర్చి కూచి నరసింహముగారు 'వీరమతి' నాటక ప్రస్తావనలో ప్రస్తావించినారు.

" ఆత్మ యంతరంగ చతుష్టయమును బనులు
సలుప బురికొల్పి తా దటస్థతను దాల్చు
నట్లు స్వాంతరంగ చతుష్టయమును బనిచి
సాక్షియై కవి తన పని జరుపుకొనియె. "

సాక్షి సంఘ సభ్యుల పాత్ర చిత్రణము పంతులుగారు మనోజ్ఞముగా చేసినారు. బహు నాటకముల హృదయంగమముగా వ్రాసి పాత్ర పోషణము చేసినవారికి ఇది ఒక్క లెక్కలోనిది కాదుగదా!

జంఘాలశాస్త్రి నోటివెంట వచ్చిన అభిప్రాయము లన్నియు పంతులుగారి అభిప్రాయములని పెక్కండ్ర అభిప్రాయము. కాని జంఘాలశాస్త్రి పాత్రను సృష్టించుటలో పంతులుగారు కొంత కల్పనాచాతురి చూపినారు. జంఘాలశాస్త్రి వెలిబుచ్చిన అభిప్రాయములు కొన్నియెడల ఆ యా సన్నివేశముల దేశకాల పరిస్థితుల కొదిగియుండును. వాని నన్నిటిని సరిగా వివేచించుకొని సారాంశములు చూచినచో అవి పంతులుగారి అభిప్రాయములు అనుటలో సందేహము లేదు.

పానుగంటి వారి స్వభావము కడు చిత్రమైనది ఎంత ఆక్షేపణ శీలియో ఆయన అంత సౌకుమార్య రాశి. ఎంత పరిహాస ప్రియుడో అంత గంభీర మూర్తి, ఎంత ఉద్వేగ శాలియో అంత నిగ్రహ చిత్తుడు. పొందిక కంచని ఈ భిన్న తత్త్వములను కొంత వఱకు వారు విడదీసి సాక్షిని, జంఘాల శాస్త్రిని సృష్టించి యుందురు. రెండు పాత్రలను సునిశితముగా చూచిన వారికి ఈ సత్యము విశదము కాక పోదు.

## ప్రక్రియ

సాక్షి భాష, భావము, ప్రక్రియ—ఈ మూడంశముల యందును విశిష్టమైనది. నవల, నాటకము, కథ, వ్యాసము—ఈ సాహిత్య ప్రక్రియలు ప్రాచుర్యము నందియున్న కాలములో పంతులుగారు క్రొత్త యూహచేసి, కొంగ్రొత్త ప్రక్రియను ఒకదానిని తెలుగులో ప్రవేశపెట్టిరి.

సాక్షి సంపుటములను ఆంధ్ర వాఙ్మయ సూచికలో గద్య ప్రహసనములను వర్గము క్రిందికి చేర్చిరి. కాని ప్రహసన మన్నమాటకు రూఢియందున్న అర్థము ఇచ్చట పొసగదు. వీనిలోనున్న వచనఖండికలను పానుగంటివారు 'వ్యాసములు' అని పేర్కొనియున్నారు. "సాక్షియను పేరిట కొన్ని వ్యాసములను నేను 1913 వ సంవత్సరమునఁ గొన్ని మాసములు సువర్ణ లేఖా పత్రికలోన వ్రాసితిని." అని వారు మొదటి సంపుటము పీఠికలో వ్రాసిరి. కాని రెండవ సంపుటము పీఠికలో "ఆ 1920 సంవత్సరము సెప్టెంబరు 1వ తేదీని సాక్ష్యుపన్యాసములను దిరుగ నారంభించితిని." అని ఉపన్యాసములను పదమును వారు వాడిరి.

నేడు మనము "వ్యాసము" అని పేర్కొనుచున్న దానికి తొలి నాళలో "ప్రమేయము" అని, తరువాత "ఉపన్యాసము" అని వాడుక యున్నట్లు గమనింప వచ్చును.[1] పానుగంటి వారును తాము వివిధ సందర్భములలో వ్రాసిన వ్యాసములను సంపుటీకరించుచు "ప్రకీర్ణోపన్యాసములు" అనియే పేరు పెట్టిరి.

---

1. డా. వీరభద్ర రావుగారి పరిశోధన వ్యాసము—"తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము"—వ్యాసరచన వ్యాప్తికి వచ్చిన తొలి నాళ్లలో వ్యాసమునకు ప్రమేయము (శ్రీ స్వామినీన ముద్దు నరసింహ నాయనిగారు) సంగ్రహము (శ్రీమాన్ పరవస్తు వేంకట రంగాచార్యులవారు) ఉపన్యాసము (కందుకూరి వీరేశ లింగముగారు) అను నామములు వాడుకలో నుండెను. పుట 363.

" వ్యాసము " అనగా నేమి అను ప్రశ్నకు సంతృప్తికరమైన సమాధానము లేదు. వక్తవ్యమగు ఒక అంశమును గూర్చి విపులీకరించి వ్రాసిన యెడల అది వ్యాస మగును. ఈ విపులీకరించుట ఎన్ని పద్ధతులుగానైన చేయవచ్చును. కాని నిపుణుడగు వ్యాసకర్త చేతిలో వ్యాసము ఎన్ని పోకడలనైనను ఇమిడించు కొన వచ్చును. ఇది వ్యాక్రియా ప్రధానము కావచ్చును. విపులీకరణ ప్రధానమును కావచ్చును. ఒక దృశ్యమును చూడగా, ఒక మాట వినగా మనసులో పొడమిన భావ ప్రపంచమును అంతటిని గుదిగ్రుచ్చ వచ్చును. ఉపక్రమోపసంహార ములలో నేర్పు చూపినచో ఎట్టి భావవ్యాప్తినైనను శరీరముగా గూర్చి వ్యాసము వ్రాయవచ్చును. వ్యాసమునకు అనువైన, అనువుగాని అంశములు అనుచు లేవు. దేనినిగూర్చి వ్రాసినను, కావలసినదెల్ల రచయిత తన భావ పథముల వెంబడి తర్కరథమున సుఖముగా పాఠకులను ఆసీనుల చేసికొని పోవుటయే.

## ప్రసంగపు వ్యాసము

సాక్షిలోని ఖండికలన్నియు వర్గీకరించి చూచినచో ఇందు కథ లున్నవి. ఉపన్యాసము లున్నవి, వ్యాసము లున్నవి. ఉన్న వ్యాసములందు అధిక భాగము ఉపన్యాస (Lecture) రూపమున ఉన్నవి. తక్కినవి లేఖల రూపమున ఉన్నవి. ఈ వ్యాసములను "ప్రసంగపు వ్యాసములు" అని పేర్కొనుట యుక్తముగా నుండును.[1]

వ్యాసమునకు చెప్పిన లక్షణములు అన్నియు ప్రసంగపు వ్యాసమునకును ఆవశ్యకములై ఉండును. ఇంకను అధికముగా వీనికి మఱియొక లక్షణము కూడ కావలసి యున్నది. ప్రసంగములో ఉపన్యాసకుడు ఎట్లు సామాజిక శ్రోతలతో ముఖాముఖి సూటిగా వ్యవహరింప దగియుండునో (direct contact) పసంగపు వ్యాసములలో రచయిత అట్లు సూటిగా వ్యవహరింప వలసి

1. ప్రసంగపు వ్యాసములన్న పేరు " రేడియో "లో నొక యుద్దిష్టార్థమున నేడు వాడుచున్నారు—Spoken word-script. వీనికిని సాక్ష్యుపన్యాస ములకును, పోలికలు ఉన్నవి.

యుండును. ఎట్టి క్లిష్ట విషయమునైనను అరటి పండొలిచి చేతిలో బెట్టినట్లు వివరింప వలయును. తాను చెప్పుచున్న విషయము తా నెట్టి చిత్త వృత్తియందుండి చెప్పుచున్నాడో, అట్టి తుల్య చిత్తవృత్తి పాఠకులకు కవి ముఖ్యముగా కలిగింప వలసి యుండును. అందుచే ఒక విషయమును మఱల మఱల భంగ్యంతరముగా చెప్పుట ప్రసంగపు వ్యాసములందు దోష మనుకొననే రాదు. ప్రాయికముగా పునరుక్తి చేయుట గుణమే అగును.

వ్యాసములలో ఒక్కొక్క దానికిని ఏదో ఒక ఉపోద్ఘాతము ఉండును. వక్త సంఘ సభ్యేతరుడు అగునపుడు అతనిని గూర్చిన పరిచయము; జంఘాలశాస్త్రి కాని మఱియొక సభ్యుడు గాని అయిన చోటులగూడ కొన్ని సన్నివేశములు, నడుమ నడుమ శ్రోతల వ్యాఖ్యానములు ఒకే వ్యాసమున అనేకుల ఉపన్యాసములు — వీనివలన ఈ ప్రసంగపు వ్యాసములకు కూడ వినూతనత అబ్బినది.

ఉపన్యాసము వాచకాభినయ ప్రధానమగు రూపకము అని చెప్పుట అతిశయోక్తి కాదు. చతుర్విధాభినయములలో ఆంగిక, సాత్త్విక, వాచికాభినయములను ఉపన్యాసమునందు సమాహారము చేయుటవలన ఉపన్యాసము రక్తి కట్టును. అందువలన ఉపన్యాస సాహిత్యమును రూపకవాఙ్మయ నిర్మాణశిల్పముతో కూర్చుట యుక్తము. దీనిని **Dramatization** అని చెప్పవచ్చును.

పానుగంటి లక్ష్మీనరసింహ రావుగారు ఈ రహస్యములను ఎఱిగినవారు అనుటకు "సాక్షి" వ్యాసములు నిదర్శనము. సాక్షిలో వారు ఆదరించిన శైలి ప్రసంగపు వ్యాసములకు అత్యుత్తమము అగు శైలి. దానికి మఱి యొకరు మెఱుగు పెట్టలేరు.

జంఘాల శాస్త్రియను ఈ రహస్యములు ఎఱిగిన ప్రౌఢగా అవతరించెను. అతడు చతుర వక్తయై, ప్రజలను వశీకరించుకొనెను. చిన్న చిన్న వాక్యములు, పొడి ముక్కలు—అంతలో పెళపెళ లాడుచు ఒక పెద్ద వాక్యము—ఒక సన్నివేశ వర్ణనము—ఇట్లు చిత్రచిత్రములుగా ఉపన్యాస రంగమున విజృంభణము చేసెను.

సాక్షి ఆతడు తొలి ఉపన్యాసము ఇచ్చుచుండగా ఇట్లు వర్ణించెను (1—4).

" జంఘాలశాస్త్రి బల్లపై నిలుచుండి బ్రహ్మాకాయమువలె వటవట వడకు చున్నాడు. నేత్రహస్త పాదాభినయము లపరిలగ చేయుచున్నాడు. గిఱ్ఱున తిరుగుచున్నాడు. "

ఆంగికాభినయము మాత్రమే కాదు శాస్త్రి యుపన్యాసములలో సాత్త్వికాభినయము గూడ నున్నది. అభినయమను మాటకు ఈ సందర్భమున పరిమితార్థము చెప్పుట అవసరము. రూపక ప్రదర్శనమున నటుడు ప్రదర్శించు సాత్త్వికాది భావములు నటుడు అనుభవింపకయే అభ్యాస వశమున చూపవచ్చును. ఇచట జంఘాలశాస్త్రి విషయమున తదనుభూతి అతనికి కలదు. తాండవ కృష్ణుడు—తాండవ శంకరుడు (సాక్షి 4—2) మున్నగు ఉపన్యాసముల ఈ సాత్త్వికత ద్యోతక మగును.

హఠాదారంభము చేసి, వక్త ప్రసక్త విషయము క్రమముగా చెప్పుట, " ఓ !, సెబాస్ ! " ఇట్టి భావాతిశయ వ్యక్తీకరణ శబ్దములచే వక్త తదనుభూతిని ప్రదర్శించుట, మున్నగు పద్ధతులు సాక్ష్యుపన్యాసములకు నాటకీయత కలిగించి, రూపక సాహిత్యమున కనుబంధముగా జేసినవి. ఉదాహరణమునకు :

" ఓ ! పూచిన తంగేడు వనము ! పండిన దోసతోట ! బంగారు తునకల గని ! సెబాస్ ! చూచి తీరవలయును ; చూచి యానందించి తీరవలయును. ఏమి సంస్థానము ! ఎంత సంస్థానము ! తుడుము మొదలుకొని దేవతార్చన వఱ కందఱు స్త్రీలు....?

" నేనెఱుగుదును. నాకు స్వానుభవమున్నది. నేనా విద్యలో గృషి చేసిన వాడను. మీ కందఱకు దయ్యములఁగూర్చి సందేహ జ్ఞానము గాని నాకు నిశ్చయ జ్ఞానము. "

ప్రధానముగా సాక్షిలోని రచనయందు అధికభాగము వినూతన శైలి యందున్న ఉపరూపక సాహిత్యము అనదగును.

పంతులుగారు ఒక యంశమును చెప్పుటకు ముందు పాఠకుల ఉత్కంఠను పెంచుటకు వారిని ప్రస్తుతాంశము నందు ఆసక్తులనుగా చేయుటకు కొన్ని సన్నివేశములు కల్పించిరి. కుంభకర్ణుడు (సాక్షి 3-14) వ్యాసమున రామాయణమునందలి కుంభకర్ణ పాత్ర సృష్టిని సమర్థించుటకై కఠిణముగారింట, పురాణ పఠనము, దానికి హేతువైన వ్యాఖ్యము మచ్చట, పురాణము పఠించు పండ శాస్త్రి కథ జంఘాల శాస్త్రిచే ఇన్ని చెప్పించిరి. ఒక్కొక్క విషయము చెప్పుటకై అనేక విచిత్ర పద్ధతులు అవలంబించిరి. ఈ వాతావరణ కల్పనమున, సామ్యమును నిరూపించు సంఘటనలు ఏరుకొనుటయందు పంతులు గారు సాక్షి వ్యాసములలో చక్కని కథానికా శిల్పమును మేళవించిరి. అట్లే విషయ విపులీకరణమున వారు వ్యాసరచనా శిల్పము కనబఱచిరి. ఈ విధముగా పానుగంటి వారు ఉప న్యాస రూపక ఉపరూపక సాహిత్యమున కథానికా, వ్యాసరచనా శిల్పములు అంగములుగా చేసికొనిరి.

మఱల ఏనిని అన్నిటిని పంతులు గారు ప్రాథమికముగా నవల (Crude Novel) అను పరిధిలో ఇమిడ్చినారు.

"సాక్షి" లో ఉన్నవి దేనికి అదిగా నున్న భాగములు కావు. వానిలో క్రమమైన కథా సంబంధ మున్నది—భంగ్యంతరముగా చెప్పినచో అన్నింటికిని పూసలయందు దారమువలె దోచు ఏకత ఉన్నది. ఆ దృష్టితో సాక్షి రచన స్థూలముగ, ప్రాథమికముగ ఒక నవల అనుటకు వెనుకాడవలసిన పనిలేదు.

మఱియొక ముఖ్య విషయము ఏమనగా వ్యాసములు ఆత్మాశ్రయ సాహిత్య విభాగమునకు చెందునవి. నవల, నాటకములలో గూడ కవి ఆత్మ భావములను వెల్లడించుటకు అవకాశము ఉన్నను, అవి పాత్రల నోటివెంట వచ్చుటచే కవికి, పాఠకులకు నడుమ పాత్రలు ఉపస్థితములై ఉండును. సాక్షియందు నిర్ధరింపబడిన భావములు పంతులుగారివే యైనను అవి పాత్రల ముఖమున వెల్లడి చేయబడినవి. పాత్రల స్వభావోన్మీలనము, కథా వస్తువు, ఇవి నవలలోని లక్షణములు. అవియున్న "సాక్షి" ని నవలగా గుర్తింపవచ్చును. కాని పంతులు గారు దీనిని నవలగా మాత్రమే చేయలేదు.

మఱి కొంత దూరము సుశితముగా ఆలోచించినచో, సాక్ష్యుపన్యాసములలో కొన్ని చోట్ల నేటి ఏక పాత్రాత్మకమైన శ్రవ్య నాటికా లక్షణములు కూడ బీజ రూపమున తోచక మానవు. ఉదాహరణమునకు :

" ఇదిగో ! మాటాడరేమి ? ఏ మాలోచించినారు ? నేటికి బదునైదు దినముల నుండి మఱి మఱి యదేపనిగాఁ జెప్పు చున్నాను. బెల్లము కొట్టిన రాయివలె నిశ్శబ్దముగ నున్నారేమి ? అయ్యో ! ఆలాగున నవ్వెద రెందులకు ? ఇది వఱకు సంపాదించినది చాలదా ? ఎవరు దినను ? అదిగాక యెల్ల కాలమును సంపాదనయే యగు నెడల నేలాగు ? పుణ్యము పురుషార్థము నక్కఱ లేదా ? ' మన యింట నే పది మంది బ్రాహ్మణులు భోజన మొనర్చెదరు ? ' అని యను చున్నారా ? "

సాక్షి 3-1. అంతః పురోపన్యాసము.

అవతలి పాత్ర నవ్వెన సూచన, చివఱ ఆకాశ భాషితము. ఇవి ఏక పాత్రాత్మక నాటిక లక్షణములే గదా !

ఇట్లు సాక్షి రచనతో పానుగంటి వారు నూతన ప్రకియను ఒక దానిని తెలుగు సాహిత్యమున సృష్టించి ఘన విజయమును సాధించిరి.

## సాంఘిక ప్రతి బింబము

### సంఘ సంస్కారణము

ప్రక్రియ యందే కాక, భాష, భావము లందు కూడ సాక్షి నినూతన మైనది. ' సాక్షి ' వ్యాసములు వెలువడిన దినములు భారత దేశ చరిత్ర యందే ప్రాముఖ్యము వహించునట్టివి. ఆసేతు హిమాచలము దేశమున సాంఘికాది రంగముల యందు చైతన్య వంతములగు మార్పులు పొడ సూపు చుండినవి. ఆ కాలమున ప్రధానముగా గమనింప దగిన ఉద్యమములు రెండు—

i) పాశ్చాత్య విద్యాభ్యాసము చేత ప్రభావితమైన మనస్సుతో సంఘ సంస్కరణములు అభిలషించు వారి ఉద్యమము.

ii) దానిని ప్రతిఘటించుచు, ప్రాచీన భారతీయతను పునరుద్ధరించ వలయు నను వారి ఉద్యమము.

సంఘ సంస్కరణము విషయమున చెప్పుకొనదగు కృషి చేసి బ్రహ్మ సమాజము ప్రముఖ పాత్ర వహించినది. ఆంధ్ర దేశమున కందుకూరి వీరేశలింగము గారు సంఘ సంస్కరణోద్యమ యోధులు. తమ జీవితమును వారు సంఘ సంస్కరణమునకు అంకితము చేసిరి. సాహిత్య సృష్టి చేయగల ప్రతిభ ఆ యోధుని చేత బ్రహ్మాస్త్ర మైనది. ప్రబోధాత్మకముగా, వ్యంగ్య విలసితముగా, విశదీకరణ పూర్వకముగా సంఘ సంస్కరణాశయ సిద్ధికై వారు ఎన్ని రచనలు చేసిరో, ఎట్టి రచనలు చేసిరో తెలుగు వారు ఎల్లరు ఎరుగుదురు.

ఏదేని ఒక విషయమును గూర్చి అభినివేశముతో పని చేయు వానికి, అందలి లోపములు తెలియుట కష్టము. జ్వర తీవ్రత తగ్గించుటకై ఘాటైన మందు వాడక తప్పదు. వాడినప్పుడు అది జ్వరము తగ్గించినను, మఱియొక అవాంఛనీయమైన పరిణామము కలిగింప వచ్చును. సంఘ సంస్కరణమే కావచ్చును, రాజకీయ విప్లవమే కావచ్చును. వీనిలో గూడ ఇట్టి ప్రమాదమే ఉన్నది.

ముఖ్యముగా చిరకాలము నుండి కుదురుకొని యున్న ఒక వ్యవస్థను నిర్మూలించి, క్రొత్త వ్యవస్థ సృష్టించుట అన్నప్పుడు పునర్నిర్మాణము చెందిన వ్యవస్థను గట్టిపఱచుట కష్ట సాధ్యము. నిర్మూలన సమయమున దారి యొసగిన స్వేచ్ఛా ప్రవృత్తులను మఱల నిగ్రహించుట సులభము కాదు గదా !

కందుకూరి వీరేశలింగము గారు ఆరభించిన సంఘ సంస్కరణోద్య మమునకు కలిగిన అతి వ్యాప్తిని అరికట్టుట అవసరముగా పానుగంటి వారికి తోచి యుండ వచ్చును. వారు అతివ్యాప్తి వలన కలిగిన అవాంఛనీయ పరిణామములకు ఎదురు తిరిగిరే గాని, సంఘ సంస్కర ణోద్యమమునకు కాదు.

పానుగంటి వారు కూడ సంఘ సంస్కారప్రియులే. కాని వీరేశలింగము గారి ఉద్యమమునకు, వీరి ఉద్యమమునకు కొంత భేదమున్నది. హైందవ సంప్రదాయములను మూలోచ్ఛేదనము చేయుట వీరికి నచ్చలేదు. మార్పు రావలయునన్న మాట నిజమే కాని ఆ మార్పు తెచ్చిపెట్టుకొనినది కాక ఇచటి జీవితము, సంప్రదాయములు — వీనిలో నుండియే సహజముగా మొలిచికొని రావలయును అన్నట్టి ఊహ పానుగంటి వారిది. లక్ష్మీ నరసింహారావు గారు బహు దేవతారాధనాడంబరమును అధిక్షేపించిరి కాని విగ్రహారాధన నిరసనమును ఆమోదింప లేదు. వారి పద్ధతి ఇట్లుండును.

వ్యక్తి-సమాజము

ఈ ఇరువురి సంఘ సంస్కారోద్యమములను పోల్చి చూచినప్పుడు కన్పట్టు మఱియొక ప్రధాన భేద మిది : పానుగంటి వారి సంఘ సంస్కారమునకు కేంద్ర లక్ష్యము వ్యక్తి, వీరేశలింగము గారి లక్ష్యము సమాజము. మారిపోవుచున్న కాలమాన పరిస్థితులలో క్షీణించి పోవుచున్న వ్యక్తిగత నైతిక స్థాయి (Individual Moral Integrety) నరసింహరావు గారి దృష్టిని ఆకర్షించినది. కందుకూరి వారు ధ్వజ మెత్తినది ముఖ్యముగా సంఘములో ప్రబలియున్న దురాచారములపైన. సంఘ మనగా వ్యక్తుల సమూహమే యైనను, వీరేశలింగము గారి సంఘ సంస్కరణ కృషి సమాజ హృదయమున తాకగా వీరు ఆ కృషిని తీవ్రతరము చేసి వ్యక్తి హృదయమును తాకునట్లు విస్తరించిరి.

పంతులుగారు సాక్షి రచన కావించినది వీరేశలింగము గారి సంస్కరణోద్యమ దుష్ఫలములను తొలగించుటకు మాత్రమే కాదు. 'సంఘ దూషణము' చేత మనుజులు తెలిసి, తెలియక చేయు నేరములను అడగించుటకు: చరిత్రాద్యంశములను గూర్చి, అభిరుచి ప్రధానములైన సాహిత్యాదుల గూర్చి చక్కని అభిరుచి నెలకొల్పుటకు ; విజ్ఞాన వినోదములు కలిగించుటకు — వారు సాక్షి వ్యాసములు వ్రాసిరి. ఇక ముందు వారి వ్యాసములను పరీక్షించినపుడు ఆ విషయము గమనింపవచ్చును. ఇచట పంతులు గారి సంఘ సంస్కరణ కృషి స్వరూప, తీవ్రతలు (Intensity) పరిశీలింప బడును.

సాక్షి వ్యాసములు శ్రద్ధగా చదివినచో, పంతులు గారు సమాజములో ఏ యే వర్గములను ఎదుర్కొనిరో బోధపడును. సంఘములో రాజకీయ దండమున ఉన్న నేరములు, లేని నేరములు గూడ బహుళముగా జరుగుచుండెను. ప్రజలు నిత్య జీవితమున "సత్యానుభవా చ్ఛాదనము, మిథ్యానుభవ సంధానము స్వప్రకృతి సంఛాదనము, పరప్రకృతి స్వీకారములను" చేయుచుండిరి. మాన, న్యాయ, ధన ప్రాణాది విషయములగు వ్యాపారములలో గూడ ఇట్టి మహేంద్రజాల విద్యయే!

పరప్రభుత్వ పాలనము వలన భావ స్వాతంత్ర్యము పోయినది. దేశీయ భాషా, విజ్ఞాన, సంస్కృతుల పట్ల ఆదరము తగ్గినది. విదేశీయ వాసనలు హెచ్చినవి. వేష, భాషా, విశ్వాసములలో అనుకరణమే గాని ఆత్మశోధన లేదు. సామాన్య జీవితము యాంత్రికమై పోవుటచే అపరిమిత వేగము సర్వ మానవ చర్యలను ఆవరించినది. శాంతము, ఆలోచన, స్థిరత తప్పిపోయినవి.

సాహిత్యాది రంగములందు గూడ అభిరుచులు మారిపోసాగినవి. దేశమున రసానుభవ పటిమయు తగ్గినది. ఆడంబరము అధికమైనది. ఆధ్యాత్మిక దృష్టి బొత్తుగా సన్నగిల్లినది. నాగరకతతో పాటు కృత్రిమత్వము బహుళముగ వ్యాపించినది.

సమాజము సంస్కరణకు అర్హమై యుండినది. కాని విచిత్రమేమనగా, అట్టి సంస్కరణములు చేయుటకై ఆరంభమైన కృషి కూడ సంస్కరణార్హమై ఉండెను. ఉన్నది చెడినది; క్రొత్తది రాలేదు. దానికై జరుగు ప్రయత్నము సక్రమముగ లేనందున సత్పరిణామముల కంటె దుష్ఫలితములు, దుష్పరిణామములును కలుగుచుండినవి.

పంతులు గారు ఈ వాస్తవికతను, దీనిలోనున్న సూక్ష్మాంశములతో గూడ చక్కగా గుర్తించిరి. అపహాస్యము చేయవలసిన దానిని అపహసించుచు, దూషింపవలసిన దానిని దూషించుచు, వారి పరిస్థితులను ఎదుర్కొనిరి. సామాన్య జీవితమున మనకు అలవాటయి పోవుటచేత విశేషములుగా కన్పట్ల

నివి—హాస్యాస్పదములైనవి అనేకము ఉన్నవి. ఈ వైషమ్యములను (Little ironies of life) రోగాణు జీవులను పెద్దవి చేసి చూపు కాచదర్పణ యంత్రము వలె వారి రచన పాఠకులకు స్పష్టముగా ప్రదర్శించినది.

"మనుజుడు తన కీయబడిన యొక్కటైన ప్రకృతిని, మాఱుగూడని యొక్కటైన ప్రకృతిని — సమయాను గుణముగ, సందర్భాను సారముగ, సన్నిహిత వ్యాపార సముచితముగ - స్వప్రయోజన ప్రదమగునట్లుగ, బదునాలుగు ప్రకృతుల క్రింద మార్చి, లేక మారునట్లితరుల కగపఱచి, తన్ను సృజించుట యందు భగవంతుడు వెల్లడి చేసిన నైపుణ్యమును — దన్ను దన్నుగాని వానిగా నితరులకుఁ గనఁబఱచుట యందు వెల్లడి సేయుచున్న తన మాయా సృష్టి నైపుణ్యము నెదుట సిగ్గు పడుచున్నట్లు, వెలవెలఁ బోవునట్లు, తల వంచుకొను నట్లు మొగము మార్చు కొనునట్లు సేయుచున్నాఁడు." ఇట్లు చేయుటలో గల అవక తవకలే వారి సాక్షి రచనావస్తువు.

"మన సంఘమును, మన జాతిని, మన వాఙ్మయమును, మన దురాచార ములను మెత్త మెత్తగా నెత్తి పొడుచుచు సంస్కరింప జూచిన మహాగ్రంథము సాక్షి. లక్ష్మీనరసింహారావు పంతులుగారు స్త్రీలు — మతము - నాగరికత - వేదాంతము - విద్యావిధానము — రాజకీయములు - మున్నగు విషయములను గూర్చి యెక్కువ చర్చింతురు." సాక్షిలో నిజమునకు చర్చింప బడని అంశము లేదనుట అతిశయోక్తి కాదు. లోకజ్ఞులైన వారు బర్తు కంట్రోలు నుండి బ్రహ్మ పదార్థము వఱకు, అణువునుండి విశ్వాంతరాళము వఱకు సమస్తమును చర్చించిరి.

సంఘము – స్త్రీ సంఘము

స్త్రీలను గూర్చి, సంఘమున వారి స్థానమును గూర్చి, వారి హక్కులను గూర్చి పంతులు గారికి దృఢమైన యభిప్రాయము లున్నవి. స్త్రీలకు వారెంతయో గౌరవ మొసగిరి. విద్యా సాంస్కృతిక రంగములందు వారి అభివృద్ధిని పంతులుగారు కోరిరి. కాని వారు పాశ్చాత్య నాగరకతా వ్యామోహమునకు ఏ లేశము కూడ గురి కారాదని పానుగంటి వారి తీవ్ర కాంక్ష.

సమాజములో స్త్రీలకు జరుగు అన్యాయములు, కలుగు నష్టముల పట్ల పంతులుగారికి సానుభూతి ఉన్నట్లే కన్పడును. కాని ఎక్కువగా వీనిని గూర్చి పంతులుగారు స్త్రీల సభలలో స్త్రీల చేతనే ప్రసంగింప జేసిరి. సాక్షి వ్యాసముల లోని ఈ రచన హాస్య ప్రధానముగా ఉండుటచేత నియత దృక్పథమునందలి గాఢత మరుగై పోవుట జరుగును. ఉదాహరణమునకు "మండల మానినీ జనమణీ మహాసభ" (1.3) చూడవచ్చును.

జంఘాల శాస్త్రికి ఒక కల వచ్చెను. దానిలో ఒక స్త్రీల సభలో ఒకఆమె సంతాన బాహుళ్యము వలన కలుగు బాధలు వివరించును. పంతులు గారు ఆమె ఉపన్యాసమును ఆవేశముతో చెప్పుచున్నట్లే కూర్చిరి. కాని అందలి ధోరణి నోరు మాటాడుచుండ నొసలు వెక్కిరించె నన్నట్లు ఉన్నది. దీని వలన ఉద్దిష్ట ప్రయోజనమునకు భంగ మగుచున్నది.

వాగ్ధోరణికి కాని, ప్రజాహిత కార్యములకు గాని, పరిపాలనమునకు గాని స్త్రీలు సమర్థత కలిగి యున్నారు. పురుషులు వారి యెడ సరియైన గౌరవము చూపుట లేదు అన్న భావము స్ఫురించునట్లు సాక్షిలో, నాటకములలో గూడ పెక్కుచోట్ల వ్రాసినారు. కాని వ్యక్తి స్వాతంత్ర్య విషయమున వేష ధారణాది కమున వారు హద్దులు మీరి పోవుటను పంతులుగారు కటువుగనే ఆక్షేపించిరి.

## సంప్రదాయ విజ్ఞానము

మత విజ్ఞాన సంప్రదాయములను గూర్చియు పంతులు గారు ఎక్కువగనే వ్రాసియున్నారు. వివిధ మతముల ఆశయము విరాట్స్వ రూపుడైన భగవంతుని తెలిసి కొనుటే. కాని క్రమముగ ఆ యా మతాను యాయులు అందఱును, ఆ సార్వకాలిక సత్యములను, పారమార్థిక తత్త్వ ప్రవచనములను విస్మరించి, బాహ్య చిహ్నముల యెడ, మూఢాచారముల యెడ మాత్రమే శ్రద్ధ వహింప సాగిరి. అంతటితో ఆగక సిగ్గుమాలి, నా మతమెక్కువ, నీ మతము తక్కువ; నీ దేవుడు తక్కువ, నా దేవు డెక్కువ అని కాట్లాడుకొనుటకు సిద్ధపడిరి. దీనిని పానుగంటి వారు తీవ్రముగ గర్హించి, అధిక్షేపించిరి.

మత ప్రవర్తలు తొలుదొల్త మానవ సంఘాభ్యుదయమును, ఆధ్యాత్మికోన్నతిని, లక్షించియే ఉండిరి. కాని తదనుయాయులు అందఱు వాని పరమార్థమును ఎఱుగ జాలకపోయిరి. వారి మూలమున మతమునకు, తత్ప్రవర్తకును అగౌరవము కలుగ జొచ్చినది.

ఈ విషయములను సుస్పష్టముగా నిరూపించుటకే పానుగంటి వారు "కాలస్వరూపుడు" (సాక్షి 3_8) అను వ్యాసమును వ్రాసిరి. నిరుపయోగకరములగు నియమములను పాటించుటలో గల దీక్ష, నైతిక స్థాయిని కాపాడుకొనుటలో చూపనందులకు వారు నొచ్చుకొనిరి. "గదిలో ముండను విడువలేక, గయలో బెండను వదిలితిమి." అని సంతసించువారిని "నడిబజారున" పెట్టిరి. (2_8) నస్యము కొనుటకై వచ్చిన వైష్ణవ బ్రాహ్మణునకు, అమ్ముచుండిన వెలనాటి వైదికునకు నడుమ మైల, మడి పట్టింపును గూర్చి వచ్చిన తగాదాయు (సాక్షి 1_17) ఇట్టిదే.

పంతులుగారు ద్వైతమతస్థులయ్యు రచనలలో వారు అద్వైత మతమును ఆదరించిరి. మతమేదియైనను, నిష్కల్మష జీవితమును నిరాడంబరముగ నడుపుకొనుచు, భగవద్భక్తి కలిగి యుండుట మేలని వారి విశ్వాసము. సంశయ వాద ధూమములు అడగిన గాని, నిజమైన వెలుగు కన్పడదు. మానవుడు అహంకారముతో ప్రవర్తించుట యవివేకము. ప్రకృతిశక్తులముందు మానవుని శక్తి అత్యల్పము. ఆ విషయమును గుర్తించినచో మానవునకు మానవునకు నడుమ గల అంతరములు, అల్ప భేదములు నశించును_అని పంతులుగారు చాటిరి.

సమకాలీన నాగరకత

'నాగరకత'ను గూర్చి పంతులుగారు సాక్షిలో పెక్కు వ్యాసములు వ్రాసిరి. ఆధునికకాలపు నాగరకతకు మారుపేరు విదేశీయ వేషభాషా వ్యామోహము. ఇదియును పానుగంటి వారి తీవ్ర నిరసనకు లోనైనది. "దేశీయతలో బుట్టి, దేశీయతలో బెరిగి, దేశీయతలో మృతినొందుడు." ఇది వారి యుపదేశము.

" అన్నియు నుండియు నేమియు లేని క్లేడ్పు దేశము ప్రపంచమునం దిది యొకటియే. శ్రుతు లున్నవి; స్మృతు లున్నవి; శాస్త్రము లున్నవి; పురాణము లున్నవి; సమస్తకళ లున్నవి; కాని మనది యను నభిమానము మాత్ర మింత వఱకు బూర్తిగ కలుగలేదు." (5_11) అని వారు విచారించిరి.

పైన పేర్కొన్నట్లు దేశీయాభిమానము లేక పోవుటచే విదేశీయ వ్యామోహము ఎక్కువయైనది. ఈ వ్యామోహము ఎన్నివిధములో! వేషము మారినది_ జీవితవ్యయము పెరిగినది_ఆడంబరము హెచ్చినది_కృత్రిమత్వము అధికమైనది. దీనిని గమనించిన పానుగంటి వారు ఎంత తీవ్రముగా దీనిని ఎమలొన్కిసి నారనిన క్రాంపింగులు పెంచినవారిని, సూట్లు బూట్లు వేసిన వారిని, బ్రష్షులతో పండ్లు తోమినవారిని_ఆక్షేపించిరి; అవహేళనము చేసిరి.

వారి అలవాట్లను గర్హించి రన్నచో_వాని వెనుక నున్న మనస్సును, భావదాస్యమును గర్హించి రన్నమాట.

పంతులుగారు ఇట్లు అని యున్నారు. "ఇవి యన్నియు నుపరివేషములు. దొరలవలె నుండుట కుచితత లేక తెచ్చుకొనిన యెరువు సంబరములు. ఎట్టి వైనను బాహ్యస్వరూపములు. ఇవి కూడ నే నంతగా గణింపను. ప్రధానమగునది మనస్సు. అది సత్యసంయుక్తమై, నిశ్చయతా సమన్వితమై, స్వదేశీయ గ్రంథజ్ఞాన తేజశ్శోభాయ మానమై, స్వదేశార్హతమాదార్శ్యావలంబన పటిష్ఠమై, స్వదేశీయ సర్వవృత్తి జాల సంవర్ధన సంపూర్ణ వాంఛా సమంజసమై_స్వదేశ భాషాభి మాన మాననీయమై, పరమేశ్వర పాదారవింద భక్తి ప్రపూర్ణమై యుండిన యెడల బాహ్యావేషము లెట్లుండినవైన నంత గణింప నక్కరలేదు."

తన భాషను, తన సంస్కృతిని, తన సంప్రదాయములను గౌరవించ లేక పైపెచ్చు అజ్ఞానపు కూతలతో నిరసించినవా రన్న ఇక పంతులుగారికి చెప్పరాని ఒడలు మంట. స్వభాష (సాక్షి 3_6) కుంభకర్ణుడు (సాక్షి 3_14). జెంటిలు మాన్ (4_8) మున్నగు వ్యాసములు పరిశీలించినచో పై విషయము స్పష్టపడును.

ఆర్ష వేదాంత సారము

పంతులుగారికి ఆర్ష వేదాంతసారము హృద్గతమైనది. సాక్షివ్యాసములలో పెక్కుచోట్ల వారు పరమేశ్వరుని విశ్వరూపమును కొనియాడి సర్వ భూత సమహితత్వమును గూర్చి ఉద్బోధించి యున్నారు. "ప్రబల ప్రభా భాస మానుడగు భానుడు సమస్త నక్షత్ర మండలముతో, చంద్ర మండలముతో మనకు గనబడని యింకి ననేక సహస్ర భాను మండలములతో గూడ నవాఙ్మానస గోచరమగు పరమాత్ముని తేజోలేశలేశము ముందు మసిబొగ్గు కంటె నధమాధముడు. ఇక ప్రపంచమున తేజశ్శాలి యెవ్వడు? తేజశ్శూన్యు డెవ్వడు?" అని వారి ప్రశ్న.

"అట్లే, గులకఱాయి తక్కువ లేదు, కొండ యెక్కువ లేదు. చవుటి గుంట తక్కువ లేదు, సముద్ర మెక్కువ లేదు. మసిబొగ్గు కంటె మాణిక్యము హెచ్చు కాదు. సృష్టిలోని యన్ని వస్తువు లొక్కటే. పైకి నొక్కటే-పరమార్థ మున నొక్కటే. వస్తు తత్త్వమున నొక్కటే-శక్తియుక్తి నొక్కటే." అని వారి నిర్ణయము (2-3).

ఈ పరమాత్ముడు జ్ఞానగమ్యుడే కాదు భక్తి గమ్యుడును. ఈ భక్తికి విగ్రహారాధనము ఆవశ్యకమే అగును అని పానుగంటివారి అభిప్రాయము. పంతులుగారు రాధాకృష్ణలో కృష్ణునిచే ఇట్లు చెప్పించియే యున్నారు.

"వర్ణతతి జూచి వ్రాసియు, బలికి మఱి గు
ణించినను గాని పాండిత్య మెటుల రాదొ,
మొదట నట్టులు విగ్రహ పూజ లేక
ముక్తి సాధన మగు భక్తి పుట్ట దెపుడు."

సాకారుడైన పర మేశ్వరుని ఉపాసించుటలో వారు శివకేశవ భేదముచూపి యుండలేదు. జ్ఞాన, భక్తి, కర్మయోగములను అన్నింటిని ప్రశంసించిరి. తదను యాయుల ఆడంబరము, కృత్రిమత మాత్రమే వారు గర్హించిరి.

రాజకీయ పరిస్థితులు

రాజకీయములను గూర్చి పలుకరాదను సాక్షి సంఘ నియమమును పాటింపుచునే, పరోక్షముగ నాటి రాజకీయ పరిస్థితులను కూడ వారు వ్యాఖ్యానించిరి. చివర చివరలో గాంధీమహాత్ముని గూర్చి వారు సభక్తికముగా వ్రాసిరి. సబర్మతీ తపస్వి ఆధ్యాత్మిక చింతనతో రాజకీయ తంత్రములు నడిపినందులకు, దేశీయతా ప్రచారకులు అయినందులకు కాబోలు వారు ముగ్ధులైరి. గాంధీ మహాత్ముని స్వదేశీ ఉద్యమము పంతులుగారిని ఆకర్షించినది. మీదు మిక్కిలి పాశ్చాత్య విద్య నేర్చి, పాశ్చాత్య నాగరకతా వ్యామోహము నుండి బయటపడి దానిని పారద్రోలుటకై చేసిన మహాత్ముని కృషి లక్ష్మీనరసింహారావు గారికి నచ్చినది. "మహాత్ముని తపః పరిసమాప్తి" (౯—౯) అను వ్యాసమునందు వారు మహాత్ముని ఇట్లు ప్రస్తుతించిరి.

"అన్ని కాలములందు నన్ని దేశములందు దేవభక్తు లెందఱో యుండిరి. వారిలో ననేకులు సంసారముల రోసి, నివాసముల ద్యజించి యేగిరి. ఏ గహ్వరములందో, యే చెట్టునీడనో తపస్సు చేసికొని తాము తరించిన వారే గాని యితరుల దరింప జేసిన వారు కాదు. అట్టివా రెంత యుత్కృష్ట జీవులయ్యును వారు కూడ నొక విధముగ స్వార్థపరులే గాని కేవల స్వార్థరహితులు గారు. "శ్లో. యస్మిన్ జీవతి జీవంతి బహువ స్సతు జీవతి." అని కవిగాన మొనర్చినాడు.

కాని దానికి మఱి కొంత చేర్పవలసి యున్నది. ఎవడు తరించుట వలన ననేకులు తరింతురో వాడే తరించినవాడు కాడా! అందుచే మహాత్ముడు దేశ భక్తుడే గాక, దేవ భక్తుడు. ప్రజాభక్తుడు. ప్రపంచ భక్తుడు........

మనుజుడై పుట్టి స్వయంకృషిచే, స్వప్రయోజకతచే సాధన క్రమముచే నెంత వాడగుటకు సృష్టితత్త్వ మంగీకరించునో యంతవాడైనాడు. అతడు మొదట నాంగ్లేయ భాషా పండితుఁడే, ఆంగ్లేయ వేషధారియే. తరువాత స్వదేశీయ వస్త్రధారి యైనాడు. పిదప స్వదేశ స్వాతంత్ర్య రక్షకు డైనాడు. పిమ్మట నింద్రియ నిగ్రహుఁ డైనాడు. దానిపై శమదమాది సంపన్నుఁ డైనాఁడు. అందు మీద లోకాద్భుత చరితుఁడైనాఁడు. దానిపై లోక పవిత్రుఁడైనాఁడు."

పంతులు గారు ఏ ఆశయమును హర్షించిరో, ఎట్టి ప్రవర్తనను ప్రోత్స హించిరో, దానికి లక్ష్యభూతుడుగా ఉన్నవాడు గాంధీమహాత్ముడు అని చెప్పుటకే ఇంత విపులముగా ఇట ఉదాహరించుట యైనది. గాంధీజీ అనుయాయులమని చెప్పుకొను వారు బహు సంఖ్యాకులు ఆ గౌరవమునకు తగిన వారు కారు. వారి ప్రవర్తన హాస్యాస్పద మైనది. వివిధ మత ప్రవర్తకుల కృషి అనుయాయుల బాహుళ్యముచే ఎట్లు కృత్రిమమును, అజ్ఞాన పూరితమును ఐనదో మహాత్ముని ఈ మతమునకును అట్టి గతియే పట్టినది. దీనిని పానుగంటి వారు అప్పుడే కనిపెట్టిరి. పిచ్చివాని ఉపన్యాసములలో ఈ అంశమును వారు విమర్శింప జేసిరి. సాక్షి 5-4 లో పంతులు గారు ఈ అసందర్భములకు ఎంత తీవ్ర ప్రజ్వలనము పొందిరో తెలియును.

"ఎనిమిది వర్షముల లోపల నీ భారత వర్షమున బయలుదేరిన దేశ భక్తుల సంఖ్య మిగిలిన సర్వ ప్రపంచమందు నెనిమిది వేల సంవత్సరముల కాలములో గలిగిన దేశ భక్తుల సంఖ్యకంటె నెన్ని మడుగులో హెచ్చని భావింప వలసి నట్లున్నది. అసాధారణమైన, యాశ్చర్యకరమైన, యద్వితీయ మైన యీ యభివృద్ధి యారోగ్య లక్షణమా ? ఆమయ లక్షణమా ? కండల పెటపెటయా, క్రొవ్వు తవతవయా ? నరముల సౌరా ? నంజునీరా ? ఏమి యుపన్యాసముల ఝూంకారములు ? ........

ఆ హా హా ! బుద్ధదేవు డాడదగిన మాటలే ! రామానుజు డాడదగిన మాటలే ! దేశోద్ధరణమును సంకల్పించు కొనిన మీరు వట్టి మాటలతో గృతార్థులు గా గలరా ? మాటల కనుగుణమైన తత్త్వము మీలో నున్నదో లేదో పరిశీలించు కొంటిరా ?

పూర్వ మొనర్చిన జాతి ద్రోహములు, దేశ ద్రోహములు, మత ద్రోహములు, దైవ ద్రోహములు ఖద్దరు టోపీతో సమూలముగ నెగిరి పోయినవా ? ఖద్దరు నీ యొడలి మీదనా యుండ వలసినది ? నీ మనస్సులో నుండవలయును. నీ మనశ్శాటిలోని పడుగు పేక స్వదేశీయ భావ తంతువులతో నెప్పుడు చేయబడినదో యప్పుడు నీవు దేశ భక్తుడ వగుదువు."

జాతీయ వాదులలోని జాతీయ భావ రాహిత్యము, స్వార్థ త్యాగవాదుల స్వార్థ పరత్వము, ఐక్యతావాదులలోని అనేకత వీనిని అన్నింటిని అతి సుని శితముగ పానుగంటి వారు విమర్శించిరి. ఒక్క మాటలో, సంఘములోని ప్రతి మానవ హృదయాంతరములలోని సత్యేతర, శివేతర, సుందరేత రాంశములను పంతులు గారు వెలికి తెచ్చి, చూపి, గర్హించిరి.

## వ్యాసములు - వర్గీకరణము

ఇంతవఱకు సాక్షిలో ప్రతిబింబించు నాటి సంఘ జీవితము, సంస్కరణ కృషియు వివరించుట యైనది. ఇచట మఱి కొన్ని విశేషములు పరిశీలింప బడును.

సాక్షిలో మొత్తము నూట నలుబది వ్యాసము లున్నవి. వీనిలో కొన్ని జంఘాల శాస్త్రి ఉపన్యాసములు. మఱికొన్ని ఆ సంఘ వేదిక నుండి ఇతరులు ఇచ్చిన ఉపన్యాసములు—ఇంకను కొన్ని అన్యస్థలముల యందు జరిగిన వృత్తాంత ములు, ఉపన్యాసములు శాస్త్రిగాని, సంఘాభిమానులు గాని వ్రాసి పంపినవి. కొన్ని సాక్షిలో ప్రచురించుటకై వచ్చిన లేఖలు, రచనలు, కొన్ని సంఘ సభ్యులకు సంబంధించిన వృత్తాంతములు. మఱికొన్ని సభా వ్యాపారమునకు సంబంధించినవి.

వీనిలో అత్యధిక భాగము పంతులు గారు ఉపజ్ఞచే వ్రాసినవే యైనను సాక్షి పాఠకులు అప్పుడప్పుడు వారికి నిజముగా వ్రాసిన లేఖలు ఏ కొన్నియో ఉండక పోవు. భాషలో భావ ప్రకటన పద్ధతిలో వలసిన మార్పులు చేసి వానిని పంతులుగారు ప్రకటించియు ఉండ వచ్చును. ఈ నిజమైన లేఖలను వేఱు పరచుటకు తగిన ఆధారములు లేవు.[1]

---

1. స్పెక్టేటరునకు వచ్చిన నిజమైన లేఖలు ప్రత్యేక మొక పుస్తకముగా ప్రకటింప బడినవి.

"Original and Genuine Letters sent to the Tatler and Spectator" Two Volumes, Published in 1725, by Lillie, the perfumer with Steele's name on the title page.

సాక్షి వ్యాసములలో ప్రాసంగికముగా వచ్చిన సంఘటనల వివరణములు అనేకములు ఉన్నవి. ఇవి సాక్షి వ్యాసములకు కొంత కథా కథన వైఖరి కల్పించినవి. అవిగాక ఒక్కొక్కసారి దాదాపుగా ఆ వ్యాసమంతయు ఒక్క కథయే అయిన స్థలములును ఉన్నవి. వానిలో కొన్ని—"లక్ష్మీ కటాక్షము" (సాక్షి 3-17), "పండితుని యుపన్యాసము" (3-24), "ధనుర్దాసుని స్వార్థ పరి త్యాగము" (4-11), సుఖ ప్రారబ్ధము" (6-1), "ఒక కథ" (9—14).[1]

సంగీత, సాహిత్యములు మున్నగు అభిరుచి ప్రధానములగు కళలకు సంబంధించిన వ్యాసములు వీనిలో అనేకములు ఉన్నవి. దేశములో కాలమాన పరిస్థితులను బట్టి ఔచిత్య రహితముగ ఏర్పడిన అభిరుచులను నిరసించి, సరి దిద్దుటకై పంతులుగారు వీనిని వ్రాసిరి. "విమర్శక స్వభావము," (1-3), "సారంగధర నాటక ప్రదర్శనము." (1—12), "నాటక ప్రదర్శనము" (1-13; 18), "నాటకీయ పద్యరచన." (1-19), "తోలు బొమ్మలు" (1-21), "కష్టాంత నాటకములు" (2—13), "చిత్రలేఖనము." (5-2); "భవభూతి" (6—3) "ఉత్తర రామ చరితము" (6—4), "గాన కళ" (6—7) మున్నగునవి ఇట్టివి.

సాక్షి వ్యాసములలో మఱికొన్ని జరిగిన సంఘటనములను దృష్టిలో ఉంచుకొని పానుగంటివారు వ్రాసిరి. అట్టి వానిలో "మహారాజ బిరుదము" (4-14) ఒకటి. పిఠాపురము ప్రభువగు శ్రీ రావు సూర్యారావు గారికి బ్రిటిష్ ప్రభుత్వము వారు మహారాజ బిరుదమును ఒసగిరి. ఈ బిరుద ప్రదానము జార్జి చక్రవర్తి జన్మదినోత్సవ సందర్భమున 1922 లో చేయబడెను. ఆ సందర్భమున 10-6-1922 వ తేదీ సాక్షిలో పంతులుగారు ఈ వ్యాసము వ్రాసిరి. అట్లే "మహాత్ముని తపః పరిసమాప్తి" 22-7-1933 వ తేదీ ఆంధ్ర పత్రికలో వచ్చినది. మహాత్ముడు ఆరంభించిన ఉపవాస దీక్ష ముగించిన సందర్భమున

1. ఇది ఆంధ్ర పత్రిక 1919 సం. దుర్మతి సంవత్సరపు ఉగాది సంచికలో 185-189 పుటలలో ఉన్నది. సాక్షి సంఘములో చదువుటకై దీనిని ఎవరో పంపించినట్లుగా మఱల ప్రచురించినారు.

పిఠాపురములో సభ జరిగెను. ఆ సభలో ఒక క్రైస్తవ మతాధికారి గాంధీజీని క్రీస్తును పోల్చి సందర్భోచిత వివేక శూన్యముగ ప్రసంగించి, క్రీస్తు గొప్ప తనమును నిరూపించు ప్రయత్నమును చేసెను. అది దృష్టిలో ఉంచుకొని పంతులుగారు క్రీస్తుకన్న మహాత్ముడు గొప్పవాడు అని నిరూపించుచు ఈ వ్యాసము వ్రాసిరట.

"ది. 2-1-1933 వ తేదీని పిఠాపురపు హైస్కూలు నందు అస్పృశ్యతను గూర్చి శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారి యాజమాన్యమున గొప్ప సభ కావింపబడెను." ఈ సభలో దాసరి లక్ష్మణకవి గారు కొన్ని పద్యములను వ్రాసి చదివిరి. 1933 వ సంవత్సరమున సాక్షి సంఘము పునరుద్ధరించగానే పంతులు గారు "అస్పృశ్యత" అని (5-12) వ్యాసము వ్రాసిరి. దీనిలో లక్ష్మణ కవిగారి పద్యములలోని భావములు సైతము చేర్చ బడినవి.

పీఠికాపుర మహారాణి 12-2-1933 న నిర్యాణము చెందిరి. ఆమె స్వభావాదికము ప్రౌఢముగా సూచించుచు పంతులు గారు "మహా పతివ్రత" (6-12) అను వ్యాసము వ్రాసిరి.

### ఉన్మత్తుని యుపన్యాసములు

పంతులు గారి సాక్షి వ్యాసములలో ప్రత్యేకత గడించు కొనినవి ఉన్మత్తుని యుపన్యాసములు. ఇవి మొత్తము ఏడు కలవు. (4-10,17; 5-4,9,13; 6-6,11.) స్త్రీ పురుష సౌందర్యమును గూర్చి, దశావతారములను గూర్చి, రాజకీయోపన్యాసాదికమును గూర్చి చిత్ర చిత్రములగు ఊహలు వీనిలో పంతులుగారు చక్కగా వివరించిరి. వినోదాత్మకముగ, ఏకత అవసరము లేకుండ, పెక్కు భావములను చెప్పించుటకు ఇది ఒక మార్గము.

ఇది యిట్లుండగా దీనిలో మఱియొక విశేషము ఉన్నది. పంతులు గారికి చివఱి దినములలో మతి భ్రమణము కలిగినది. ఇందులకు కారణములు వారి ఆర్థిక పరిస్థితులు తారు మారగుట, నమ్మినవారు నమ్మరాని వారగుట, తమకు రాదగిన గుర్తింపు రాలేదనుట — ఇవి అన్నియును. వారి సాక్షి వ్యాసములు

ఆమూలాగ్రముగా చదివినచో, వారి మనస్సు ఎంత తీవ్రముగా పనిచేసినదో గమ నింప వచ్చును. చివఱ చివఱకు వారు ప్రపంచముపై కొంత ఏవగింపు కూడ పెంచుకొనిరి. తాత్కాలికముగా కలిగిన రోత ఏ కొంతయో ద్వేషముగా మారి నను, వారు నిగ్రహించుకొన గలిగిరి. ఉన్మత్తుని ఉపన్యాసములలో అయిదవ సంపుటిలోని నాల్గవది ఈ ఘర్షణను వ్యక్తము చేయును.

దీనిలో పిచ్చివాడు కాని పిచ్చివాడు ఈ సృష్టినంత నాశన మొనర్చుటయే మంచిది అని మనుష్య జాతిపై అసహ్యముతో వాదించును. తొమ్మిదవ వ్యాస ములో ఈతని వాదము మఱికొంత ఉన్నది. జంఘాల శాస్త్రి ఈతని ఉపన్యాస ములను వినిపించి తుదకు ఇట్లనును :

" ఈ మాటలు మీకెట్లున్నవో గాని నాకు సమంజసముగా గనబడుట లేదు. ఈ యుపన్యాసమును గఠినముగ విమర్శింప వలసి యున్నది. "

కాని జంఘాలశాస్త్రి చేత ఇంత ప్రధానమైన విమర్శనమును పంతులు గారు చేయించనే లేదు ! ఇది ఉద్దేశ పూర్వకమైన చర్య అనియే అనిపించును.

## నాటకములతో సంబంధము

సాక్షి వ్యాసములలో అనేకాంశములపై పంతులుగారికి గల అభిప్రాయ ములు స్పష్టీకరింప బడినవి. ప్రతిభావంతుడైన రచయిత వ్యక్తిత్వము ఆతని సర్వ రచనల యందును ద్యోతకమగు చుండుటలో ఆశ్చర్యము లేదుగదా !

పంతులుగారు పెక్కు నాటకములు వ్రాసిరి. బహు సంఖ్యాకములగు పాత్రలను సృజించిరి. నాటక రచనమున కొంగ్రొత్త శిల్పమును ప్రవేశ పెట్టిరి. వీనిని గూర్చి నాలుగు మాటలు వారు తాముగా చెప్ప వలెనని అనుకొనవచ్చును. శ్రద్ధాళువులై ఈ నాటకముల ప్రదర్శనములను తిలకించిన వారు, పఠించిన వారును కొన్ని సందేహములు వెలువరించి యుండవచ్చును. ప్రశ్నలు వేసియుండ వచ్చును. ఇట్టి వానికి సమాధానములు ఇచ్చుటకు గాని, తమ పద్ధతులను తామై వివరించుటకు గాని సాక్షి వ్యాసములు వారికి అవకాశము ఇచ్చినవి.

సాక్షి మొదటి సంపుటములోని వ్యాసములు 1913, 14 సంవత్సరములలో వారు వ్రాసినవి. అంతకు ముందు పానుగంటి వారు పదునొకండు నాటకములు వ్రాసిరి. మొదటి సంపుటములో నున్న వ్యాసములలో ఈ నాటకములకు సంబంధించిన ప్రస్తావన ఏమున్నదో ముందు పరిశీలింప వగును.

"సారంగధర నాటక ప్రదర్శనము"న జంఘాలశాస్త్రి తాను చూచిన నాటక ప్రదర్శనము వలన కలిగిన తన అనుభూతిని వివరించెను. శాస్త్రి ఇచ్చట ఎక్కువ అధిక్షేపించినది ప్రదర్శకుల అసమర్థతను గాదు. నాటక కర్త అజ్ఞానమును అనుట స్పష్టము గదా! ప్రకృతి జ్ఞానము లేక లోకానుభవ విరుద్ధముగా, దేశ కాల పాత్ర విచక్షణ శూన్యముగా నాటక కర్త కథోన్మీలనము చేయుటచే జంఘాల శాస్త్రికి నాటకముపై అసహ్య భావము కలిగినది.

అంతకు ముందు వారు "సారంగధర" నాటకమును వ్రాసిరి. తాము చూచిన మఱికొన్ని సారంగధర నాటకములు ఇంపుగా లేవనియే వారు దీనిని వ్రాసి యుండవచ్చును. దానితోపాటు రూపకములందు సంగీత ప్రాధాన్యము హెచ్చుగా ఉండుటచే గలుగు అనర్థములను గూడ జంఘాలశాస్త్రి వివరించెను.

పానుగంటి వారు నాటకములలో మాత్రాచ్ఛందములు గాని వాడ రాదను నియమమును పాటించి నాటకములు వ్రాసినారు. తమ ఈ నిర్ణయము తాము ఏల చేసికొనిరో వివరించుటకు గూడ ఈ వ్యాసము ఉపోద్ఘాత ప్రాయమైనది.

తరువాత పదునెనిమిదవ వ్యాసము "నాటక ప్రదర్శనము"లో పాటల నాటకముల అప్రాశస్త్యము మఱింత గట్టిగా నిరూపింప బడినది. "అవి కేవల మసందర్భతా దుర్భరములు, అనౌచితీ భూయిష్ఠములు, అప్రాజ్ఞతాకరములు, అస్వభావ సిద్ధములు." అని నిరసించుటతో ఆగక జంఘాలశాస్త్రి వానిని వ్రాసినవారికి నాటకములలో పాట లుండవలయు ననియే నమ్మకము; "అట్లుండుటయే యౌచిత్యమని వారి యభిప్రాయము; అట్లు లేకపోవుటయే నింద్యమని, యసందర్భమని, యస్వభావమని వారి నిశ్చితము; అట్లు వ్రాయువాడు కవి కాడనియే వారి నమ్మకము" అని ఆవేశముతో పలికెను.

పాటలు నాటకములలో బొత్తుగ నుండరాదని పానుగంటి వారి అభిప్రాయము కాదు. "సంగీత మొక్క రసమున దప్ప రూపకమున మరెక్కడ నుపయోగింపదగదు. ఆ రసము భక్తి." అని వారు జంఘాలశాస్త్రిచే చెప్పించిరి. పంతులుగారు తాము వ్రాసిన "రాధాకృష్ణ," "విప్రనారాయణ" లలో పాట లుంచిరి. తరువాత నాటకములలో "ముద్రిక, పీఠమతి" మున్నగు వానిలో గూడ పాటలున్నవి.

వింత వృత్తములు గాని, సామాన్య వృత్తములు గాని, నియతమగు నడక గలవి అగుటచే పాటలకు వలె కొంత తాళపు సంకెల తప్పనివి. కావున నాటకములలో వీనిని గూడ వాడరాదని పానుగంటి వారి నిశ్చితాభిప్రాయము. ఆద్యంతమును వచనమును బోలియున్న పద్యము కావలయును అన్నప్పుడు గ్రీకు దేశీయుల అయాంబిక్సు వలె, ఇంగ్లాండు దేశీయుల బ్లాంక్ వెర్సు వలె, సంస్కృత భాషలోని ఆర్యావృత్తము, అనుష్టుప్పు వృత్తమువలె తెలుగున తేట గీతము ఇందులకు అనుకూలమైన దని పంతులు గారు "నాటకీయ పద్య రచన" లో నిరూపించిరి. తాము గీత పద్యములు (మాత్రాచ్ఛందములు) మాత్రమే వాడుటలోని ఆంతర్యము ఇట్లు వారు విశదీకరించిరి.

సాక్షి మూడవ సంపుటములో "కుంభకర్ణుడు" అను ఒక వ్యాస మున్నది. వాల్మీకి విరచిత శ్రీమద్రామాయణమున కుంభకర్ణుని నిద్రోద్బోధన ఘట్టము పౌరాణికుడు చదువుచుండగా వినిన ఒక నవనాగరక సంపన్నుడు, ఆంగ్లేయ విద్యాపరిచితి గలవాడు వాల్మీకి ప్రకృతి జ్ఞానము లేని వాడని, కుంభ కర్ణునివంటి వాడు ఈ సృష్టిలో ఉండడని వాదించును. దానికి జంఘాలశాస్త్రి ఉచితరీతిని ప్రత్యుత్తరము ఇచ్చును. కుంభకర్ణుని పాత్ర సృష్టిని సమర్థించు అవసరము పానుగంటి వారికి ఏల కలిగెనన్న దానికి సమాధానము ఒక విధ ముగ ఊహింపవచ్చును. పంతులుగారు తమ "విజయ రాఘవము" అను నాటకమున కుంభకర్ణుని వర్ణనము చేసియున్నారు. దానిలో వారు రణరంగమున కుంభకర్ణుడు కపులను, భల్లుకేశ్వరులను కొండముచ్చు గమిని కలుక్కున కొఱుకుకొని తినగా పండ్లసందున కొన్ని కోతులు చిక్కుకొన్నట్లు, మహో దరుని గదతో అతడు పండ్లు కుట్టుకొన్నట్లు వర్ణించిరి. (పంచమాంకము)

దీనిపై ఎవ్వరో అవకతవకగా మాటాడిన హేతువుచే వారు "సాక్షి"లో పై వ్యాసము వ్రాసియుందురు. విపరీత గాఢ నిద్రకు చరిత్రలో మొదట ఉదాహరణములు చూపి, పిదప వారు మిల్టన్ సృష్టించిన సైతాను పాత్రమునకు కుంభకర్ణుని పాత్రమునకు పోలిక తెచ్చిరి. సైతానుని మహాధిక కాయ దైర్ఘ్యమును వర్ణించుటలో కవి ఒక చమత్కారమును చేసెను. మూడు కొయ్యల గొప్ప సముద్రపుటోడల నడిమి తెరచాప కొయ్య ఆ సైతానుని చేతిలో విలాసార్థముగ వహించిన చిన్న బెత్తమై యుండునని మిల్టన్ కవి వర్ణించెను. కుంభకర్ణుడు సైతాను చేతిలో బెత్తమైయున్న తెరచాప కొయ్యను మైత్రీ భావమున గ్రహించి పల్లు కుట్టుకొనుచున్నట్లుగా జంఘాలశాస్త్రికి కల వచ్చెను. పంతులుగారు ఈ వ్యాసాంతమున ఇట్లు కల్పన చేయుట నిశ్చయముగా పై ఊహను బలపఱచుచున్నది.

"సాక్షి" నాల్గవ సంపుటములోని ఇరువది మూడవ వ్యాసము "గ్రంథ పరిష్కారము" పంతులుగారు సాభిప్రాయముగ వ్రాసినట్లు కన్పట్టును. దాని తరువాతిది "ఉప సంహారము." సాక్షి సంఘమును దానితో వారు ఉపసంహరించిరి. "గ్రంథ పరిష్కారము" అను వ్యాసమున అట్లు ముగించుచున్నట్లు సూచన చేయకున్నను పంతులుగారు ఉపసంహార వాక్యమునకు ముందు ప్రకటించుచున్న ఆ వారపు "సాక్షి" లో తాము ముఖ్యముగ చెప్పదలచుకొన్న, హెచ్చరింప దలచుకొన్న విశేషములను చెప్పజూతురు గదా !

"గ్రంథ పరిష్కారము" లో విమర్శకులు కవి శ్రమమును సరిగ తెలిసికొనకుండుటను వారు గర్హించిరి. "ఒక కవి గ్రంథము వ్రాయుటకెంతయో శ్రమమొంది యుండును. ఎంత బుద్ధియో యందున వినియోగ పఱచి యుండును. ఎన్నిసారులో దానిని గ్రిందనుండి మీదికి మీదినుండి క్రిందికి బరిశీలించి యుండును. తనశక్తి యంతయు దానిపై ధారవోసి యుండును.... కవి తన గ్రంథరచనయందు బడిన కష్టములలో సహస్రాంశమైన నీవు పడకుండనే గ్రంథములో దప్పులున్నవని పలుకుటకు నీవెవడవు ?...." ఇత్యాదిగా వారు వ్రాసిరి. "కవి గ్రంథమును విమర్శించుటకు గాల మున్నది. దానికి విడిచి పెట్టుము" అని వారు హెచ్చరించిరి.

ఒక కవి యొద్దకు మఱియొక కవి మనుమడు వచ్చి కీర్తిశేషులైన తన తాతగారి గ్రంథములందలి తప్పులు పరిష్కరించి పెట్టుమని కోరెను. దానిపై ఈ కవి ఇట్టి ఉపదేశము చేసెను. పరిశీలనగా చూచినచో ఆ వ్యక్తి చేసిన విజ్ఞాపనములో దోషము లేదు. ఉపదేశము చేసిన కవి అనవసరముగా ఉద్విగ్నుడైనట్లు తోచును. పంతులుగారు ఇట్లు వ్రాయుటకు దారితీసిన చిన్ని సంఘటనములు ఏమున్నవో వివరముగా తెలియరాదు.

పంతులుగారు శిల్పదృష్టితో కొన్ని చిత్ర విచిత్ర పాత్రములను సృష్టించిరి. వీనినిగూర్చి నాటకములకు సంబంధించిన అధ్యాయములో కొంతవఱకు వివరించుట యైనది. వానిపై జరిగిన వాదోప వాదములు పంతులుగారిని బహుశః ఈ హెచ్చరిక చేయ ప్రేరేపించి యుండును. "సాక్షి" ఆఱవసంపుటములో "గానకళ" అను వ్యాసమున పంతులుగారు ఇట్లు జంఘాలశాస్త్రిచే చెప్పించిరి. "స్వభావ సిద్ధముగ నున్నవానిని జూడ మనకు వేడుకగా నుండదు. స్వభావములోనో, స్వరూపములోనో యెక్కడనో రవంత వ్యత్యాసము, కాసంత తెటుకు నున్న గాని మన కక్కడకు మనస్సు పోదు." పంతులు గారి బహుసంఖ్యాక పాత్రల సృష్టిలో వైచిత్ర్యమునకు ఈ యభిప్రాయమే బీజము.

"సాక్షి" ఆఱవ సంపుటములోనే "ఉత్తర రామచరితము—పటము" అను వ్యాస మున్నది. దీనిలో భవభూతి ఉత్తర రామచరితములో మొదటి యంకమున, పటముల మూలమున పూర్వకథను స్మరింప జేయుచో కొన్ని లోపములు చేసెనని "ఒక పండితుడు" ఉపన్యసించి, తుదకు ఇట్లు చెప్పును.

"అవి అసహజములని యాత డెరుగడా యని మనము కఠినముగ మనల ప్రశ్నించు కొందము. ఎరుగడని యెట్లు స్పష్టముగ జెప్పగలము? ఎరిగి యుండియు నేల యట్లు వ్రాసినాడు?

నాటకమునకు భావి కథా సూచనము మహా భూషణము. ఈ కవికి భావికథా సూచనయం దున్న వాంఛ యింతయంత కాదు. ప్రతి స్వల్ప విషయమందులకే యుపయోగించునట్లు ప్రయత్నించును. ఈ కవికి రసపుష్టి కలుగ

జేయుటయం దభిమాన మసాధారణము. ఈ కవి యావేశ పూరితమైన హృదయము గలవా డనుట స్పష్టము. అట్టి యావేశ సందర్భములందు ప్రకృతి సూత్రములను గొంత యలక్ష్యము చేసినను జేయగల నిరంకుశుడు."

కొంతవఱకు ఈ మాటలు పానుగంటి వారికిని అన్వయించును. ఆవేశ పూరితమైన రచన, రసపుష్టి కలిగించుటయందు అభిమానము, భావికథా సూచన యందున్న వాంఛ, అందులకై అట నట లోపములను సరకు చేయక పోవుట అనునవి పానుగంటివారి నాటకములందు కనబడు లక్షణములే. భవభూతి రచనను సమర్థించుటలోనే ఇటు పంతులుగారు తమ పద్ధతిని సమర్థించుకొనిరి.

ఇట్లు పంతులుగారి నాటకములకు సాక్షి వ్యాసములకు ఒక నిగూఢమైన అన్యోన్యతా సంబంధము ఉన్నట్లు గమనింప వచ్చును.

## సాక్షి - స్పెక్టేటర్

సాక్షి ఆంధ్ర భాషా సాహిత్యమునకు ఒక వినూత్నా భరణము. ఇట్టి రచనము అపూర్వము. సాక్షి శిల్ప పద్ధతి ఆంగ్లేయ సాహిత్య ప్రభావముచే తెలుగున కలిగినది.

ఆంగ్లభాషా సంస్కారణమున భారతీయ జీవితమున క్రొత్త వికాసము ఏర్పడినది. ఈ వికాసము పలు రంగముల కుసుమించినది. తెలుగు సాహిత్య రంగమున గూడ ఈ ప్రభావము అనల్పమైనది. దీనివలన మన భాషకు జరిగిన ఉపకారములలో సాక్షి వ్యాసములు వెలువడుట ఒకటి.

ఆంగ్ల సాహిత్యమునందు ఎడిసన్ (1672–1719), రిచర్డ్ స్టీల్ (1672–1729) అనువారు రూపొందించిన స్పెక్టేటర్ వ్యాసావళి సుప్రసిద్ధమైనది. పానుగంటివారి సాక్షి సృష్టికి ఈ స్పెక్టేటర్ మూలబీజము.

"స్పెక్టేటర్" అను పదమునకు "సాక్షి" అనువాదమైనను, సాక్షి స్పెక్టేటరునకు అనువాదమును కాదు, అనుకృతియును కాదు. ఈ "స్పెక్టేటర్" ఒక స్వతంత్రమగు దినపత్రికగా వెలువడినది. ఇది వృత్తాంత పత్రిక కాదు.

స్పెక్టేటర్ అను ఒక కల్పిత వ్యక్తి మానవ చర్యలను పరిశీలించి, వానిపై తనకు తోచిన వ్యాఖ్యానము చేయుచు, సమాజమునందలి గుణదోషములను వ్యంగ్యముతో చిత్రించి సంస్కరించుటకు దీని మూలమున కృషి చేయును. ఈ కృషియందు అతనికి మఱి కొందఱు సహాయము చేయుదురు.

స్థూలముగ సాక్షి వ్యాసములు ఆవిర్భవించినదియును ఇట్టి కృషి నిమిత్తమే. అచ్చట స్పెక్టేటర్ ఉత్తమ పురుషలో వివరించినట్లు ఇచట సాక్షియు వివరించు చుండును. సాక్షి కూడ కల్పిత వ్యక్తి. ఇతనికిని మఱికొందఱు సహాయులు ఉన్నారు. సాక్షి ప్రత్యేకము ఒక పత్రికను నడిపి యుండలేదు. తాను వెల్లడింప దలచుకొనిన విషయములను మొదట సువర్ణ లేఖా పత్రికకును, పిదప ఆంధ్ర పత్రిక సారస్వతాను బంధమునకును పంపి ప్రచురింప జేసినాడు.

స్పెక్టేటర్ క్లబ్బునకు ప్రధాన వ్యక్తి స్పెక్టేటర్; సాక్షి సంఘమునకు సాక్షి; వీరిరువురకును సామ్య మున్నది. ఈ ఇరువురును ఉదాత్తాశయములతో సంఘ సంస్థాపనము చేసి, కృషి కావించిన వారే. ఇరువురును గంభీరమైన అంతరంగము కలవారు; హాస్యప్రియులు; హితముగ, మితముగ మాటలాడు స్వభావము కలవారు.

సంఘ స్థాపనము నందలి తన ఆశయములను 12_3_1711 వ తేదీగల పదవ సంచికలో స్పెక్టేటర్ ఇట్లు వివరించెను.

"I shall endeavour to enliven Morality with Wit, and to temper Wit with Morality...And to the End that their Virtue and Descretion may not be short transient intermittent Starts of thought, I have resolved to refresh their memories from Day to Day, till I have recovered them out of that desperate State of Vice and folly into which the Age is fallen...It was said of Socrates, that he brought Philosophy down from Heaven, to inhabit among Men; and I shall be ambitious to have it said of me, that I have brought Philosophy out of Closets and Libraries, Schools and Colleges, to dwell in Clubs and Assemblies, at Tea-Tables and in Coffee-Houses."

తన రచనల విశిష్టతను స్పెక్టేటర్ దానిలో పాఠకులకు తేటతెల్లముచేయుచు పోలెండులో, మస్కోవీలో ఏమి జరుగుచున్నదో తెలిసికొనుటకంటె (ఈ పత్రిక మూలమున ఆత్మజ్ఞానము (Knowledge one's self) పొందుట ఉత్తమము కాదా అని, ద్వేషము, పగ పెంచు వానికన్న అజ్ఞానమును, రాగ ద్వేషములను దూరము చేయు రచనలు చదువుట మేలు కాదా యనియు ప్రశ్నించెను. ప్రపంచమును ఒక నాటకశాలగా పరిగణించి, తాము ప్రేక్షకులవలె తటస్థముగా ఉండు వారికి, తన ప్రతిక ఎక్కువ వినియోగపడునని అతడు తెలిపెను అందరికంటె స్త్రీలకు తన పత్రిక మిక్కిలి ఉపయోగించునని స్పెక్టేటరు అభిప్రాయము. పనిపాటులు లేక అలంక్రియాడంబరమున కాలము వెళ్లబుచ్చు స్త్రీల సంఖ్య తగ్గి, మగవారి మన్నన గౌరవము పొందు విజ్ఞాన వతుల సంఖ్య హెచ్చునట్లు చేయుటకు పత్రిక కృషిచేయుననియు స్పెక్టేటర్ ప్రకటించెను. "గ్రేట్ బ్రిటను పొలిమేరల నుండి, దురాచారమును, అజ్ఞానమును తరిమి వేయుటయే ఈ రచనల ఏకైక చరమ లక్ష్యము." అని స్పెక్టేటర్ స్పష్టీకరించెను.

నైతిక ప్రవర్తన, మంచి, మర్యాదలు, కళలు, సాహిత్యము మున్నగు అన్ని రంగములందును సరియగు ప్రమాణములను సాధించుటకై స్పెక్టేటర్ కృషి చేసెను.

స్త్రీల నడవడికను గూర్చి స్పెక్టేటర్ ఎక్కువగా వ్రాసెను. సంఘములలో వారికున్న ప్రాధాన్యమును ఎడిసన్ చక్కగా గుర్తించెను. అలంకరణమున స్త్రీలు చూపు ఆడంబరము, మగవారితో పోటీ పడుటలో వారిలో కొందరు చూపుచున్న అహ మహమిక, ఇట్టి వానిని గూర్చి వ్రాయునప్పు డెల్ల ఎడిసన్ ఎక్కువగా అధిక్షేపణ పూర్వక హాస్యమును పోషించెను.

"The toilet is their great scene of business and the right adjustment of their hair, the principle employment of their lives. The sorting of a suit of ribands is reckoned a very good morning's Work; and if they make an excursion to a mercer's or a toy shop, so great a fatigue makes them unfit for anything else all the day after.

పనికి మాలిన స్వల్ప విషయములకై పట్టింపు చూపుట, ( Light fantastical disposition) కృత్రిమత డాబు దర్పములు (Showy and superficial ) మున్నగు స్త్రీల యందలి అవగుణములను, స్పెక్టేటర్ వీలయి నప్పుడెల్ల ఆక్షేపించినాడు. (స్పెక్టేటర్ నం. 15, 33, 64, 98, 102, మున్నగు నవి చూడవచ్చును.)

"There is not so variable a thing in Nature as a Lady's Head-dress. Within my own memory, I have known it rise and fall above thirty degrees."

స్పెక్టేటర్ వ్యాసములలో విషయ వైవిధ్యము మెండుగా ఉన్నది. వానిలో ప్రధానములని చెప్పుకొన దగిన కొన్ని అంశములను ఇట్లు వర్గీకరింప వచ్చును.

1. ఫ్యాషన్లు.
2. మూఢనమ్మకములు.
3. ఈర్ష్యా, స్నేహాది ప్రాథమిక భావములు.
4. స్త్రీలోకము.
5. ఆమోద యోగ్యములు కాని అలవాట్లు - ఈలవేయుట, స్త్రీలను తేరిపారి జూచుట మున్నగునవి.
6. సాహిత్యాద్యభిరుచి ప్రధాన విషయములు.
7. పఠ్యుల వ్యక్తిగత జీవితాంశములు.

స్పెక్టేటర్ వ్యాసావళిని గూర్చి దిఙ్మాత్రముగ ఇట్లు తెలిసికొనిన పిదప సాక్షికి స్పెక్టేటర్‌నకు గల భేద సాదృశ్యములను గుర్తించుట సులభము కాగలదు.

1. స్పెక్టేటర్ వలెనే సాక్షియు ఒక కల్పిత వ్యక్తి. స్పెక్టేటర్, సాక్షి ఇరువురును సంఘ సంస్కారణము నిమిత్తమై కృషి చేయుటకై చిన్న చిన్న సంఘములను స్థాపించిరి.

2. సాక్షి వ్యాసములందును, స్పెక్టేటర్ వ్యాసావళియందును గల విషయ వైవిధ్యము దాదాపుగా ఒక రీతిదే. ప్రజలకు సత్ప్రవర్తన కలుగుటకు, సద సద్వివేకము కలిగించుటకు తద్రచయితలు ఇరువురును హాస్య ధోరణినే అవలంబించిరి.

3. తత్వ జ్ఞానమును గూర్చి (Philosophy) లోకములోనున్న అపోహలను తొలగించి, సంస్కృతి, సభ్యతల విశిష్ట సారాంశమే వేదాంత జ్ఞానము అను సూక్ష్మ సత్యమును పానుగంటి వారు, ఎడిసన్ నిరూపించిరి.

4. పానుగంటి వారి సాక్షి రచనకు ఎడిసన్ రచన ప్రేరక మైనది అనుటలో సందియములేదు. కాని కాలక్రమమును అనుసరించి పానుగంటి వారు తరువాతివారు అగుటచే ఎడిసన్ రచనా శిల్పమునకు, ప్రణాళికకు మెరుగులు దిద్దుకొనుటకు అవకాశము కలిగినది.

5. ఆశయములు ఇరువురకును ఒక్కటే యైనను, దేశకాల పరిస్థితులు భిన్నము లగుట చేత ఇరువురి కృషి పద్ధతుల యందును భేదము ఉండక తప్పదు.

స్పెక్టేటర్ ప్రణాళిక, శిల్పపద్ధతి, కృషి వీనికంటె పంతులుగారి 'సాక్షి' యందలి తదంశము లెట్లు భిన్నము లైనవో ఇప్పుడు పరిశీలింప బడును. స్పెక్టేటర్ లోకానుభవమును గడించినవాడు. లోకుల చర్యలను పరిశీలించిన వాడు.

తొలి వ్యాసమున అతడు ఇట్లు చెప్పుకొనెను :

"Thus I live in the world, rather as a Spectator of Mankind, than as one of the Species, by which means I have made my-self a Speculative Statesman, Soldier, Merchant and Artizan without ever medling with any Practical Part in life...In Short, I have acted in all the parts of my life as a Looker-on, which is the character I intend to Preserve in this Paper."

ఇట్టి తన విజ్ఞానము, తన పద్ధతి యగు మూకీభావము చేత వెలికి వచ్చు అవకాశము లేకపోవుటచే, యోజించి దినదినమును పత్రికగా ప్రకటించుట బాగుండునని స్పెక్టేటర్ నిశ్చయించుకొనెను. ఇతనికి సహాయకులుగా ఉన్న వారు—సర్ రోజర్ డి కవర్లీ, సర్ ఆండ్రూ ఫ్రీపోర్ట్, కెప్టెన్ సెంట్రీ, విల్ హనీ కూంబ్, ఒక 'ఇన్నర్ టెంపుల్' సభ్యుడు, అప్పుడప్పుడు వచ్చిపోయెడు మతాధికారి ఒకడు.

వీ రందఱును సమాజములో ప్రధానములగు అనేక వృత్తి వ్యాపారములు ఉన్నవారు అగుటచే స్పెక్టేటర్ తనకు అనేక విశేషములు కరతలామలక మైన వని 34 వ వ్యాసమున చెప్పెను. ఈ వ్యాసమున సభా వృత్తాంతము మాత్రమే ఉన్నది.

దీనిలో సభ్యులు అందఱును కలిసి చర్చించి, స్పెక్టేటర్ తన పత్రికలో దేనిని గూర్చి ఎట్లు వ్రాయవలెనో నిర్ణయించిరి అని చెప్పుచు దానిపై స్పెక్టేటర్ ఈ క్రింది వాక్యములతో ఈ వ్యాసము ముగించెను.

"Having thus taken my Resolutions to march on boldly in the Cause of Virtue and good Sense, and to annoy their Adversaries in whatever Degree or Rank of men they may be found, I shall be deaf for the future to all Remonstrances that shall be made to me on this Account. If Punch grows extravagant I shall reprimand him very freely; If the Stage becomes a Nursery of Folly and Impertinence, I shall not be afraid to animadvert upon it. In short, If I meet with anything in City Court, or Country, that shocks Modesty or good Manners I shall use my utmost Endeavours to make an Example of it I must however intreat every particular Person, who does me the Honour to be a Reader of this Paper never to think himself or any one of his Friends or Enemies aimed at in what is said : For I promise him, never to draw a faulty Character, which does not fit at-least a Thousand People, or to publish a single Paper, that is not written in the Spirit of Benevolence and with a love to Mankind."

సాక్షి వ్యాసములను పరిశీలనగా చదివినవారు పానుగంటి వారు ఎడిసన్ వ్రాసిన ఈ పలుకులను ఎట్లు ఒరవడిగా గ్రహించిరో గుర్తింప గలుగుదురు.

మతాధికారి పై సభలో స్పెక్టేటర్‌ను ప్రోత్సహింపుచు చెప్పినను మఱి యొక అంశమును గూడ సాక్షిలో పంతులు గారు గ్రహించిరి.
"He (clergyman) afterwards proceeded to take Notice of the great Use this Paper might be of to the Publick, by *reprehending those Vices which are too trivial for the Chastisement of the Law,* and too fantastical for the Cognizance of the Pulpit."

పంతులు గారు సాక్షి మొదటి వ్యాసములో " రాజకీయ దండనము లేని నేరములను " గూర్చి ప్రస్తావించి " ఇట్టి నేరముల గూర్చియే మే మిక వ్రాయుదుము. నేరముల వెల్లడింతుము. వాని స్వభావముల విశద పరతుము. వానివలన సంఘమునకు గల్గు హానిని స్పష్టపరతుము. వానియందు జనుల కసహ్యము గల్గునట్లు సేయుటకై ప్రయత్నింతుము. నేరములనే మేము నిందింతుము కాని ఇట్టి నేరములకు లోనయిన వారిని నిందింపము. వారిని దలపెట్టనైన దలపెట్టము. మాకు వారితో లేశమైన పనిలేదు. " అని సాక్షిచే విస్పష్టముగా చెప్పించిరి.

స్పెక్టేటర్‌ను కూడ ఇట్లు చేయవలయు ననియే తక్కిన సభ్యులు ఆదేశించినట్లు 34 వ వ్యాసమున ఉన్నది. (to combat with Criminals in a Body and to assault the Vice without hurting the Person )

స్పెక్టేటర్ వ్రాయసగాడే గాని ఉపన్యాసకుడు కాడు. అందు వలన స్పెక్టేటర్ వ్యాసములలో ఎక్కువ భాగము పత్రికా సంపాదకుని వ్యాసములు, తక్కినవి పాఠకుల లేఖలు. సాక్షి సంఘమునకు ఇంతకంటె విస్తృతమగు రంగము ఏర్పడినది. సంఘపు ప్రధాన వ్యక్తియగు సాక్షి స్పెక్టేటర్ వలెనే మితభాషి యైనను, వావదూకతా వైభవము గల జంఘాలశాస్త్రి సభ్యుడై ఉండుటచే ఉపన్యాస పరంపర కురిపించెను. ఆ వేదికపై ఇతరుల ఉపన్యాసములు, లేఖలు, వానిలో అన్యసభా వృత్తాంతములు, వానిలో మఱల వక్తృత్వ విలాసములు ఇట్లు సాక్షి వ్యాసములలో క్రొత్త క్రొత్త పద్ధతులలో చెప్పదగిన అంశములను

చెప్పుటకు అవకాశము వచ్చినది. ఒకయిరి ఒక అంశములను, అభిప్రాయములను పట్టి పట్టి చెప్పి సక్కగా లేకుండ చాల ప్రాసంగికముగా వివరింప గలిగెను.

స్పెక్టేటర్‌లో కన్న సాక్షిలో సన్నివేశములకు కల ప్రాధాన్యము హెచ్చు. దీని వలన కథానికా శిల్పము ఎక్కువ ప్రాముఖ్యము వహించినది. ఎడిసన్ కూడ కొన్ని సన్నివేశములు కల్పింపక పోలేదు. కాని వానిని అతడు నాటకీయముగ చిత్రించి ఆకర్షకముగా వ్రాయలేదు.

సాక్షి తొలి వ్యాసమున తన సంఘపు ఆశయములను గూర్చి, సంఘ స్థాపనము గూర్చి, సభ్యుల గూర్చి వ్రాసెను. స్పెక్టేటర్ వలె తనను గూర్చి తాను ముందు వ్రాసికొనక సభ్యుల నందఱను పరిచయము చేసిన వెనుక "నే నయిదవ వాఁడను. నే నెవఁడనో నాకుఁ గొంత తెలియును గాని నే నెవఁడనో మీకు స్పష్టీకరించుటకుఁ దగిన యాత్మజ్ఞానము కలవాఁడను గాను. నా సంగతి మీరు ముందు నా వ్రాతలఁ బట్టియే కనిపెట్టఁ గలరు. నే నారామ ద్రావిడుఁడను. నా పేరు సాక్షి." అని మాత్రమే చెప్పెను.

తన జీవిత సంగ్రహమును తెలిపి, "I have given the Reader just so mu h of my History and Character, as to let him see I am not altogether unqualified for the Business I have undertaken. As for the other Particulars in my Life and Adventures. I shall insert them in the following Papers, as I shall see occassion." అన్న స్పెక్టేటర్ వినమ్రతకు భిన్నముగా సాక్షి మాటలు గడుసుగా ఉన్నవి.

సాక్షి వ్యాసములకు స్పెక్టేటర్ వ్యాసావళికి భేద సాదృశ్యములను గూర్చి చర్చించునపుడు, నిశితముగా పరిశీలింపగా తోచు మఱియొక ముఖ్యమైన అంశమును గూర్చి చెప్పవలయును. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు సాక్షి వ్యాసములు వ్రాయుటకు ఆరంభించి, మొదటిపర్యాయము వ్రాసిన వ్యాసములలో స్పెక్టేటర్ ప్రభావము ఎక్కువగా తోచును కాని తరువాత వారు 1922 లో సంఘమును తిరుగ స్థాపించినపుడు పూర్వము ఏర్పడిన పద్ధతిలో అది సాగి పోయినది. తొలి వ్యాసములలో స్పెక్టేటర్ ప్రభావము ఎట్లు కన్పడునో పరిశీలింపుడు.

సాక్షి మొదటి సంపుటము మొదటి వ్యాసములో పంతులుగారు సంఘ సంస్థాపనము గూర్చి వ్రాసిన పద్ధతి అంతయు స్పెక్టేటర్‌ను అనుసరించినదే. స్పెక్టేటర్‌లో వలెనే సాక్షి ఉత్తమ పురుషలో కథనము ఆరంభించెను. సంఘ నిర్మాణము నందలి ఆశయములు, విధానములు స్పెక్టేటర్ క్లబ్ ఆశయములను విధానములను పోలి యుండుట నిరూపింప బడినది.

స్పెక్టేటర్ ఓపెరాలు మున్నగు నాటక ప్రదర్శనము లందలి దుష్టాభిరుచులను అవహేళన చేసినట్లే పంతులుగారును నాటక ప్రదర్శనములను గూర్చి వ్రాసిరి. అంత మాత్రమే కాక సాక్షి కష్టాంత నాటకముల ఆవశ్యకమును గూర్చి, నాటకీయ పద్య రచనమును గూర్చి వ్రాయునప్పుడు సాక్షి మొదటి భాగములో 13 వ వ్యాసమున, అరిస్టాటిల్, సెనెకాల మాటలు ఉదాహరించుచు " అరిస్టాటిల్ అను నాత డిట్లు తలచెనని ఎడిసన్ వ్రాయుచున్నాడు. " అనియు "సెనెకయను నాత డిట్లు చెప్పెనని ఎడిసన్ చెప్పుచున్నాడు." అనియు స్పెక్టేటర్ నుండియే పంతులుగారు ఉదాహరించిరి 19 వ వ్యాసములో కూడ స్పెక్టేటర్‌లో నుండియే అరిస్టాటిల్ అభిప్రాయమును ఉదాహరించిరి. భూత వైద్యము, మున్నగు వానిని పంతులుగారు అపహసించిరి. " స్పెక్టేటర్ " లో ఎడిసన్ కూడ ఇట్టి నమ్మకములను ఖండించెను. ఈ విధముగా పానుగంటి వారు సాక్షి మొదటి భాగములో " స్పెక్టేటర్ " తో తమ కున్న పరిచయము వెల్లడి అగునట్లు వ్రాసిరి. కాని తరువాతి భాగము వ్యాసముల యందు తమ ప్రణాళికాను సారము సాగిపోయిరి.

సాక్షి వ్యాసములలోను, స్పెక్టేటర్ వ్యాసములలోను తుల్యములగు భావములను వెదకి తీయుట, వానిని బట్టి పంతులు గారి సాక్షికి స్పెక్టేటర్‌నకు గల సంబంధమును నిరూపించుట అను ప్రయత్నము అనావశ్యకము. ప్రపంచములో ఎచ్చటనైనను మనుష్య స్వభావము స్థూలముగ ఒక్కటే. వేషభాషలు మారవచ్చును గాని మనుష్య జీవితమునకు ప్రాథమికములైన భావములు ఒక్కటే. వీనిలో ఆమోద యోగ్యములైన వానిని వర్ధిల్లునట్లు చేసి, గర్హనీయములైన వానిని అపహసించుటయే సాక్షి, స్పెక్టేటర్ గ్రంథ రచయితల లక్ష్యము. అందువలన పానుగంటి వారును, ఎడిసన్ మున్నగు వారును కొన్ని సమానాంశములపై

ఏకాభిప్రాయము చూపినప్పుడు పానుగంటి వారు ఎడిసన్ మున్నగు వారిని అనుకరించినట్లు కాదు. పంతులు గారు చేసినది ఒక్కటి — అది ఎడిసన్ మున్నగు వారు చూపిన త్రోవను అనుసరించుట.

శిల్ప విషయకముగా ఎడిసన్, స్టీల్ మున్నగువారి పద్ధతులను కొన్నింటిని పంతులుగారు గ్రహించిరి అని చెప్పుట యైనది. ఆ పద్ధతులు ఇవి.

1. ఎడిసన్, స్పెక్టేటర్ క్లబ్‌ను సృజించెను. దీనిలోనివి అన్నియు విలక్షణ (Singular) పాత్రములు. వీనిని హాస్య పూర్వకముగా, స్పెక్టేటర్ పరిచయము చేసెను. పంతులుగారు సాక్షిలో అట్లే చేసిరి.

2. "స్పెక్టేటర్"లో పాఠకులనుండి వచ్చినట్లు లేఖలు ప్రకటింపబడినవి. ఈ లేఖలు కొన్ని స్పెక్టేటర్ అభిప్రాయములను ఆమోదించునవి, కొన్ని భిన్న దృక్పథముతో అతడు చెప్పిన విషయములను పరాసము చేయునవి, కొన్ని నూత్న విషయములను, వృత్తాంతములను వివరించునవి. ఎడిసన్ మున్నగువారు తాము వ్యాసములు వ్రాసిన పిదప మరల వానిని గూర్చి వచ్చిన ఆలోచనములను పాఠకులకు తెలుపుటకై ఇట్టి సులభ మార్గము అవలంబించి యుండవచ్చును. "సాక్షి" లో గూడ ఇట్టి లేఖలు అనేకములు ఉన్నవి.

3. "స్పెక్టేటర్" క్లబ్బులో ప్రధానవ్యక్తి అగు స్పెక్టేటర్ తనకు వచ్చిన స్వప్న ప్రకారములను అచ్చటచ్చట వివరించెను (నెం. 3, 83.) ఇవి Methodical Dreams అని పేర్కొనబడినవి. సాక్షిలో జంఘాల శాస్త్రికి, సాక్షికి వచ్చిన కలలు అనేకము లున్నవి. వీనిలో కూడ కొంత Method ఉన్నట్లున్నను, స్పెక్టేటర్ కలలవలె భావనా ప్రధానమైన Allegories గా ఉండవు.

4. "స్పెక్టేటర్" పెక్కు సందర్భములలో చిన్నచిన్న కథలు ఇమిడ్చియున్నాడు. సాక్షిలో గూడ కథలు ఎట్లు ప్రాధాన్యము వహించినవో ఈ వరకే చెప్పబడినది.

5. స్పెక్టేటర్‌లోని హాస్యము చాల లలితమైనది. ఆ వ్యాసములను చదువునప్పుడు మందహాసము మించి కలుగదు. సాక్షి పద్ధతి అట్టిది కాదు. సాక్షి హాస్యములో లాలిత్యము ఉన్నను, అంతకన్నను పకపక నవ్వించు లక్షణ మెక్కువ.

వ్యంగ్య రచన పద్ధతిలో కూడ పానుగంటి వారు ఎడిసన్ కన్న స్విఫ్టనకు దగ్గరివారు. హాస్య సృష్టిలో ఛార్లెస్ డికెన్స్‌నకు దగ్గరివారు. ఈ విశేషములు తరువాతి అధ్యాయములలో విపులీకరింప బడును.

స్పెక్టేటర్ వ్యాసములు ఇంగ్లాండు దేశపు సమాజమును ఉద్దేశించి వ్రాయబడినవి. ఆ స్వతంత్ర దేశమునందు అక్షరాస్యులు, భాషా సాహిత్య ప్రవేశ పాండిత్యములు కలవారును ఎక్కువ. సాక్షి వ్యాసములన్ననో పరతంత్ర భారత దేశములో ఇటు నిరక్షరాస్యులు, అటు స్వదేశ, భాషా వేషాభిమాన రహితులు ఎక్కువగా గల సమాజమును ఉద్దేశించి వ్రాయబడినవి. ఈ కారణము చేత పానుగంటి వారు తమ అభిప్రాయములను సూచించి వదలుట కాక తెగవేసి చెప్పవలసిన అవసరము ఉండినది. దాని కొఱకుగా వారికి ఎడిసన్ మార్గము కన్న స్విఫ్ట్ మార్గము అనుసరణీయ మైనది.

# ప్రకీర్ణోపన్యాసములు

ఈ సంపుటమున పంతులుగారు వ్రాసిన "గ్రామ్యవాద ఖండనోపన్యాసములు మొదలగు వివిధోపన్యాసములు" ఉన్నవి.

ఈ ఉపన్యాసములలో కొన్ని సువర్ణ లేఖా పత్రికలోను, మఱికొన్ని ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలోను మొదట ప్రకటితము లైనవి. వచనరచన, విమర్శ గ్రంథముల ఆవశ్యకత, మత విషయక విద్యాభ్యాసము మున్నగు అనేకాంశములపై పంతులుగారు తమ యభిప్రాయములను వీనిలో వెల్లడించిరి.

ఈ వ్యాసములలో పంతులుగారి వచనశైలి ఒక పద్ధతిలో ఉన్నది. ఎక్కువగా పంతులుగారు ఇందు చిన్న చిన్న వాక్యములే వ్రాసిరి. భావ ప్రకటనమున వారికి సహజమగు గడుసుదనము, గట్టినోరు, హాస్య ప్రియత్వము ఈ వ్యాసములలో గూడ కన్పట్టును. ఇంటర్మీడియేటు, బియ్యే పరీక్షలలో దేశభాషలు అవశ్య పఠనార్హములుగ నిర్ణయింప బడుటకై ఆందోళనము జరుపుచున్న దినములలో "దేశభాష" అను వ్యాసమును వారు వ్రాసిరి. దానిలో వారు దేశీయులకు ఎట్లు హెచ్చరిక చేసినారో గమనింపుడు:

"ఇపుడు విద్యాభ్యాస మొనర్చుచున్న బాలుర తండ్రులు, సంరక్షకులు మొదలగువారును 'ముందుఁ కఁ బిల్లలఁ గనదలచిన వారును' గలిసి దాక్షిణాత్యులొనర్చునట్టే సభలఁజేసి వారి ప్రార్థనలను గవర్నమెంటు వారికిఁ బంపుకొనవలయును."

"కవులకొక విన్నపము" అని వారు వ్రాసిన దానిలో కవులు అన్యోన్య వైరములను మాని క్షీరోదక న్యాయమున మెలగవలెనని కోరిరి. కవులలోనున్న కొన్ని దురాచారములను వారు నిశితముగ ఖండించి, తుదకు ఇట్లు విన్నపము

చేసిరి. " మా ప్రార్థనము గట్టినోటితో యున్నదని మీ రాగ్రహింపక మా యంతః కరణ పారిశుద్ధ్యమును గమనించి మమ్ము క్షమింప గోరెదము. " ఈ వాక్యార్థము పంతులుగారి సంస్కరణ కృషి నర్థము చేసికొనుటకు మిగుల అవసరము.

" విమర్శాదర్శ విమర్శాదర్శము "అను మూడు చిన్న పుస్తకములను గూడ[1] పంతులుగారు ఈ పుస్తకములో చేర్చి ముద్రింపించిరి. ఈ భాగము రెండువందల డెబ్బదియేడు పుటలున్నది. ఇది బుఱ్ఱా శేషగిరి రావుగారి " విమర్శాదర్శ " అను ముప్పది ఎనిమిది పుటల గ్రంథముపై[2] విమర్శము ;

పంతులుగారు ఇందు కనబఱచిన విమర్శన పద్ధతి అపూర్వమును, విశిష్టమును అయినది. అయిదుగురు చేరి శేషగిరి రావుగారి గ్రంథమును గూర్చి చర్చ ఆరంభింతురు. ఆ చర్చ విమర్శాదర్శ విమర్శాదర్శ మైనది. విమర్శా

---

1. ఇవి కాకినాడ యందలి ఆంధ్రభాషా సంరక్షక సమాజము వారిచే నెం. 8, 9, 10 కరపత్రములుగా ప్రకటింప బడినవి.

నెం. 8. కరపత్రము— ప్రథమభాగము, పుటలు 120, కాకినాడ సుజన రంజనీ ముద్రాక్షర శాలయందు వోతాప్రగడ బ్రహ్మానంద రావుచే ముద్రితము, 1915.

నెం. 9. కరపత్రము—ద్వితీయ భాగము, పుటలు 66. 12 పుటల అనుబంధము అధికము.

నెం. 10. కరపత్రము—తృతీయ భాగము, పుటలు 115. ఈ రెండును 1915 లో పిఠాపురము శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షర శాల యందు ముద్రింప బడినవి.

2. ఇది 38 పుటల పుస్తకము. విజయ నగరమునందలి తెలుగు లిటరరీ అసోసియేషన్ వారి ప్రచురణలలో మూడవది. శేషగిరి రావుగారు ఆ సంఘమునకు కార్యదర్శిగా ఉండి ప్రకటించిన ఈ పుస్తకము 1914 లో విశాఖపట్టణమందలి యస్. యస్. యమ్. ప్రెస్‌లో ముద్రింప బడెను.

దర్శ వ్యావహారిక భాషయందున్నది. పంతులుగారు గ్రాంథిక భాష సమర్థించెడు వారు. ఆ పుస్తకము నఖశిఖ పర్యంతమును " అల్లరి చేసిపెట్టిరి. " పంతులుగారు హేళన చేయుటలో అందె వేసిన చేయి. దీనిలో శేషగిరి రావుగారిపై ఎట్లు విరుచుకొని పడిరో ;

పానుగంటివారు ఈ విమర్శ నడుమ కథలు చెప్పిరి. చిత్రచిత్రములైన సంఘటనములు కల్పించిరి. ఒక్కమాటలో వారి తర్క నైపుణికి ఇది నిదర్శనము.

మొదట గ్రంథనామమే " పంచాయితీ " సభ్యులకు వివాద హేతువైనది. " ఆదర్శ " శబ్దమును గూర్చి చర్చ జరిపి " విమర్శాదర్శ " అనుట తప్పని అంత ఒకరు దీనిని మఱియొక రీతిగా సమరించిరి.

" విమర్శ శబ్దము దీర్ఘాంతమని గ్రంథకర్తగారు భ్రమపడినట్లు తోచుచున్నది. కావున విమర్శా + దర్శ కలిపి " విమర్శాదర్శ " అను రూపము సిద్ధింపఁ జేసినవి. విమర్శాదర్శ యనగ విమర్శమున కమావాస్యయని యర్థము. ఒక మానముచే నమావాస్య మాసాంత తిథి యగుటచేత నమావాస్యకు లక్షిత లక్షణచేత నవధి యని యర్థము చెప్పవచ్చును. కావున విమర్శాన పద్ధతి పరిపూర్ణతకు హద్దని స్పష్టమైన యర్థము. "

తక్కినవారు చేసిన ఖండనముకన్న ఈతని సమర్థనమే హెచ్చు హేళనాత్మకమై యున్నది కదా ! " విమర్శాదర్శ " ను అడ్డము పెట్టుకొని పంతులుగారు ఈ భాగమున వ్యావహారి కాంధ్ర భాషావాదులను, వాదములను తీవ్రముగ ఎదుర్కొనిరి. ఈ సందర్భమున పంతులుగారు వెలువరించిన అభిప్రాయముల సారాంశమును పరిశీలించు అవకాశము ముందు వచ్చును.

" ప్రకీర్ణోపన్యాసముల " లో ఏకాశ్యాసమున ఉన్న " స్వప్నకావ్యము " అను వచన కావ్యము ఒకటి ఉన్నది. పంతులుగారి ప్రత్యేకమైన ఉపోద్ఘాతముతో ఇది ఉన్నది. " నిత్యమందాగ్ని బాధాసమాలబ్ధ నిఖిల స్వప్న పరిపాటీ విచిత్రుండగు " ఒక్క మిత్రునకు వచ్చిన స్వప్న ప్రకారము ఇందు వివరింప బడినది.

దీనిలో భారత కవులగు నన్నయ, తిక్కనలు పాత్రములుగా వత్తురు. స్వప్న సంపాదకుడు కలలో వారిని చూచెను. వారితో ఆధునిక సాహిత్యమును గూర్చి చర్చ కలిగెను. దీనిలో ఆధునిక సాహిత్యపు ధోరణులు కొంత హేళనకు గురియైనవి.

ఈ లఘు కృతికి దీనిలో ప్రత్యేకము ఒక పీఠిక ఉన్నది. దాని చివఱ పంతులుగారు చేవ్రాలు చేసిన తేదీ 20–3–1918.

ప్రకీర్ణోపన్యాసములను 1918 లో డి. వి. రమణారావుగారు రాజమహేంద్రవరము శ్రీ విద్యా నిలయ ముద్రాక్షర శాలయందు ముద్రింపించి, ప్రకటించిరి.

# ఉపన్యాసములు

పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు ఉపన్యాసములు ఇచ్చుచుండగా వినిన వారు అనేకులు ఇప్పుడు ఉన్నారు. "పంతులుగారు మిక్కిలి ఆవేశముతో ప్రసంగించెడు వారు. మెడలో ఉన్న జరీయంచు ఉత్తరీయపు ఇరుకొనలు చేతులతో పట్టుకొని వారు సభలో ప్రసంగించు చున్నప్పుడు సభ్యులందఱకు ఎవరికి వారికి తమతోనే వారు మాటాడుచున్నారు అనిపించెడిది." అని విన్నవారు జ్ఞాపకము చేసికొని చెప్పుదురు.

సాక్షిలో జంఘాల శాస్త్రి ఉపన్యాస ధోరణి ఎట్లు ఉండునో, వారి ఉపన్యాసము అచ్చముగా అట్లే ఉండెడిదట!

పంతులు గారు ఇచ్చిన ఉపన్యాసములలో పూర్తి ప్రసంగపు పాఠములు రెండు మాత్రమే లభించు చున్నవి. 1922 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో 22 వ తేదీన పిఠాపురము మహారాజ భవనమున జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషదేకాదశ వార్షికోత్సవమునకు పానుగంటి వారు అధ్యక్షత వహించిరి. ఈ అధ్యక్షోపన్యాసము సాక్షి ఆఱవ సంపుటములో 109-143 పుటలలో ఉన్నది.

మఱియొకటి తృతీయ గోదావరీ మండలాంధ్ర గ్రంథాలయ మహాసభకు అధ్యక్షత వహించి ఇచ్చిన ఉపన్యాసము. ఈ సభ చిత్రాడలో జరిగినది. ఈ ఉపన్యాసము చిన్న కరపత్రముగా ప్రకటింప బడినది.

సాహిత్య పరిషదేకాదశ వార్షికోత్సవమునకు అధ్యక్షత వహించి వారు ఇచ్చిన ఉపన్యాసము ఒక బంగారు తునక. పంతులు గారు ఈ ఉపన్యాసమును తమను గూర్చి చెప్పుకొనుటతో ఆరంభించిరి.

" నేను పండితుడను గానని యీ యూరి వారెరుగుదురు. పై గ్రామముల వారెరుగుదురు. నన్నెరిగినంతవర కాంధ్ర దేశమంతయు నెరుగును. సాహిత్య హీనతలో జగమెరిగిన వాడను గాని సాధారణుడను గాను. ఇట్టి నన్ను బరిషత్తు వారేల యెన్నుకొనవలయునో నాకు దెలియదు...."

తిరిగి తుదిని పండితులకు పరిషత్తు బిరుదములు ఇచ్చుట ఆవశ్యకము అని చెప్పుచు వారు ఇట్లనిరి.

"....బిరుదములను గూర్చి యే పండితుడు గూడ నిది వరకు ముచ్చటించి యుండలేదు. ఎందుకో మీ రెరుగరా ? ఏ పండితుడైన ముచ్చటించిన యెడల దనకు బిరుద మిమ్మని యడుగు చున్నాడని పై వారనుకొని పోవుదు రను భయముచేఁ గిక్కురు మనకుండ నున్నారు. నే నా పాండిత్య బాధ లేనివాఁడను గావున నిర్భయముగా బలికితిని. అపండితుని సభాధ్యక్షునిగా నెన్నుకొనుట వలన గలిగిన లాభ మిది...."

ఇట్లు ఆద్యంతములకు ఏక సూత్రత కలిగించుట ఈ ఉపన్యాసమున వారు చేసిన ఒక విశేషము. ఈ ఉపన్యాసమున ఉక్తి వైచిత్ర్యముతో పంతులు గారు ఎన్నియో చమత్కారములు చేయుచు, అనేక విషయములను చుట్ట బెట్టిరి. ఎందరో కవుల, సాహిత్య పోషకుల వృత్తాంతములను వారు ప్రౌఢముగ సూచించిరి. సరస్వతీ దేవ్యారాధనము చేసిన, చేయుచుండిన కవులను అందఱను ఇమిడ్చి ఒక కొల్వు కూటమును ప్రదర్శించిరి. వ్యక్తుల రేఖా చిత్రములను శబ్ద సహాయమున గీచి చూపించిరి. ఈ ఉపన్యాసము వ్యాఖ్యాన సహితముగ ముద్రించి యుంచు కొనదగినది.

ఈ క్రింద ఉదాహృతము లైన భాగములను పరిశీలించిన యెడల ఆ ఆవశ్యకము ఎట్టిదో బోధ పడును.

" ఆస్థాన వైణికాగ్ర గణ్య వీణారవామృతా స్వాదనావశము లైన చిలుకలు గూడ స్తంభోపరి విటంకముల నుండి, సహజ వైఖరిని " రామా " యనబోయి సంగీత వైఖరిని " రీమా " యని యనుచున్నదీ సభయం దే. "

ఇది పీఠికాపుర మహారాజ సభా ప్రశంస, ఆస్థాన వైణికులు తుమురాడ సంగమేశ్వర శాస్త్రి గారు జగ మెఱిగిన విద్వాంసులు.

"నవీన గౌతములు, నర్వాచీన పాణినులు, నూతన బాదరాయణులు విజయదశమినాడు మా మహారాజేంద్రునిపై, వారి పుత్ర పుత్రికా సంతతిపై నాశీః ప్రసవవృష్టి గురియించుచున్న దీ సభయందే."

నవీన గౌతములు శ్రీపాదలక్ష్మీ నరసింహశాస్త్రి గారు, అర్వాచీన పాణినులు వేదుల సూర్యనారాయణశాస్త్రి గారు, నూతన బాదరాయణులు దెందుకూరి నరసింహశాస్త్రి గారు.

ఇట్లే శారద కొలువు కూటము సందర్భమున గూడ ఎందరినో రమ్యముగ చిత్రించి యున్నారు. మృచ్ఛకటికా పరివర్తనమును, జూలి యస్ సీజరు పరివర్తనమును జేత బట్టుకొని నిలువబడిన స్థవిష్ఠుని, వావిలాల వాసుదేవ శాస్త్రి గారిని, "బిల్వేశ్వరీయ శంకరవిజయ ధ్వ జాది గ్రంథములను జేత బుచ్చుకొని "పలుకు దయ్యమా! ఇది పాయసమమ్మా! బమ్మ దయ్యపు టిల్లాలా! ఇది పానకమమ్మా! త్రాగుమమ్మా!" యని తల కంపింప స్పష్టముగ సంబోధించుచున్న హ్రస్వరూపుని కొక్కొండ వేంకటరత్న శర్మగారిని మున్నగువారిని చక్కగా చూపిరి. ఈ ఉపన్యాసమునకు అలరి, వడ్డాది సుబ్బరాయ కవిగారు పంతులు గారికి ఈ క్రింది పద్యము[1] పారితోషికముగా నిచ్చిరి.

"పదముల వింత వన్నెల భవన్నవ శిల్ప మెసంగ సాహితీ
సదనున వ్రాసినట్టి మన శారద చిత్రపటంబు విభ్రమా
స్పదము, ముదావహంబు, వహవా! బళి! దానికి బారితోషికం
బిదె కొను, పానుగంటి సుకవీ; నరసింహ! వసూక్త పద్యమున్."

ఈ ఉపన్యాసమును గూర్చి ఆంధ్ర పత్రిక స్వకీయ విలేఖరి 6-9-1922 తేదీ దిన పత్రికలో ఇట్లు వ్రాసెను.

1. వసు రాయచాటు ప్రబంధము — ప్రశంసా ప్రకరణము. 326 వ పద్యము. పుట 85.

"అధ్యక్షోపన్యాసము ఒక క్రొత్త విధముగ, సంప్రదాయ విరుద్ధముగ రచియింప బడినట్లు భావింప బడుచున్నది. ఇది మొదటినుండి చిట్టచివర వరకు హాస్య రూపకముగ నొప్పుచుండెను. అన్యాప దేశపూరితమై, భావగర్భితమై, సామాన్య ఉపమానములచే నలంకృతమై నవ్వు పుట్టించు శైలి కల్గినదై సభ్యుల నాకర్షించు చుండెను."

సభకు వచ్చిన పానుగల్లు రాజావారు దీనిని గూర్చి ఇట్లన్నారు. "అధ్యక్షుని యుపన్యాసము కేవలము హాస్యరసముగా నున్నను గంభీరమైన యర్థము లేక పోలేదు. అందు సూచింప బడినట్లు పరిషత్కార్యము పరిష్కరింపబడుట నా కెంతయు సంతోషము."

గ్రంథాలయ సభాధ్యక్షులుగా పంతులు గారు ఇచ్చిన ఉపన్యాసములో గ్రంథాలయములు, గ్రంథ రచనము, శాస్త్రములు, కళలు మున్నగు అనేకాంశములు ప్రస్తావింప బడినవి. "రవీంద్రుని వంటి కవీంద్రు డాంధ్రమున వెలయుగాక" అను ఆకాంక్షను వారు ఇందు ప్రకటించిరి. "శబ్ద నిగూఢ మాధురీ విలసితము లగు కావ్యజాలములు" టెన్నిసన్, స్విన్‌బర్ను మున్నగు కవీశ్వరుల కవన చాతురులు ఆంధ్రమున వెలయ వలయు నని వారు హెచ్చరించిరి. ఉత్తమ విమర్శ గ్రంథములు, భాషా చరిత్రము, వాఙ్మయ చరిత్రము మున్నగునవి వెలువడ వలెనని వారు ప్రబోధించిరి. గ్రంథాల యోద్యమము ఆంధ్ర జాతీయ తత్త్వ విస్ఫురణమునకు మూలాధార రూపమని పంతులు గారు ప్రశంసించిరి.

పూర్వోక్తములగు పంతులు గారి ఉపన్యాసములను రెండింటిని చూచినచో కలుగు అభిప్రాయ మిది. ఈ ఉపన్యాసములు వారి విషయ విపులీకరణ సామర్థ్యమును, ఉక్తి వైచిత్ర్యమును, బహుముఖ పాండిత్యమును మాత్రమే కాక వారి హృద్గత వాస్తవికాను భూత్యుద్వేగమును చాటును.

# క థ లు

కథానికా రచయితగా పానుగంటి వారి కృషిని సమీక్షించుటకు, వారి కథలను మూడు వర్గములుగా చేసి చూడ వలసి యుండును.

i) వారి కథాలహరిలో సంపుటీకరించ బడినవి.

ii) భారతి, ఆంధ్ర పత్రికల యందలి ఇతర కథలు.

iii) సాక్షి వ్యాసముల యందలి కథలు.

పంతులు గారు సువర్ణలేఖ పత్రికలో వరుసనే కథలు వ్రాసిరి. అట్లు ప్రచురణమైన కథ వెంటనే ఒక్కొక్కటి ఒక్కొక్క చిన్న పుస్తకముగా ముద్రింప బడెను. సువర్ణలేఖా వార పత్రికా కథామంజరి అను శీర్షికలో వచ్చిన ఈ కథలలో కొన్నింటి పరిచయము ఇదివఱకే చేయ బడినది గదా!

ఈ కథలలోనే పదునాల్గు వఱకు ఆంధ్ర వాఙ్మయ సూచికలో పేర్కొన బడి యున్నవి. వానిలో రెండింటిని ఆ గ్రంథము నవలలుగా ప్రమాదమున పేర్కొనుటయు జరిగినదని, పంతులు గారు నవలలు వ్రాయలేదు అనియు ముందు చెప్పబడి యున్నది.

అట్లు చిన్న పుస్తకములుగా మొట్టమొదట వెలువరించిన కథలం దెక్కువ భాగము 1913 లోనే వచ్చినట్లున్నవి. నాలుగైదు మాత్రము 1915 లో వచ్చినవి.

### కథావల్లరి

1917 వ సంవత్సరము మొదట ఆ కథలలో ఈ క్రింది ఆఱును ఒక సంపుటముగా ప్రకటించినారు.

1. దొంగ టెలిగ్రాము.
2. బుడబుడక్కల వాడు.
3. పతకము.
4. తంతివార్త.
5. విచిత్ర సమావేశము.
6. మోసము.

ఈ సంపుటమునకు కథావల్లరి అను పేరుంచి, తెలికిచెర్ల వెంకట సుబ్బారావు గారు వెలువరించిరి.

## కథాలహరి

ఆ సంవత్సరాంతమునకు పైన పేర్కొనిన కథలకు మఱి పదునాలు చేర్చి కథాలహరి అను పేరుతో డి. వి. రమణరావు గారు ప్రకటించినారు. తక్కిన కథల పేర్లు ఇవి.

7. విచిత్ర మరణము.
8. వింత దొంగలు.
9. కోకిల.
10. జలజ.
11. తురా పాలెము.
12. క్రొత్త రాణి.
13. దుష్ట ప్రధానుడు.
14. ఆనంద సాధు.
15. దుర్గయాధికారి.
16. మోసమునకు మోసము.
17. సౌఖ్యకర సమావేశము.

18. జగన్నాథమూర్తి.
19. పశ్చాత్తాపము.
20. చోర మహాజనుడు.
21. శ్యామలాంబ.
22. శంకరయ్యరు.

ఆంధ్ర వాఙ్మయ సూచికలో వీనిలో లేని మంజువాణి అను కథ 1915లో ముద్రింప బడినట్లు పేర్కొనబడి యున్నది.

కథాలహరిలోని కథలు కథానికా రచయితగా పానుగంటి వారికి కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెట్టు నట్టివి కావు. వారి కథానిక రచనలో ఇవి తొలిదశను సూచించును. 1920 లో సాక్షి వ్యాసములను పునః ప్రారంభించిన తరువాత వ్రాసిన కథలను గాని, 1924 లో భారతిలో ప్రకటించిన కథలను గాని చదివినచో, ఆ కథలు ఇవి ఒక్కరే వ్రాసినారని అనిపించనంత భేదము ఉన్నది.

కథాలహరి చదివినప్పుడు, పంతులుగారు కథానికా రచనపై తగు లక్ష్యము ఉంచలేదనియు, సువర్ణలేఖ పత్రికలో ఏదో వ్రాసి ప్రకటింప వలెను కావున వ్రాసినారేమో అనియు తోచును. ఏలన, ఇందలి పెక్కు కథలను వారు 1913-15 నడుమ వ్రాసి యున్నారు. ఈ సమయముననే వారి సాక్షి మొదటి సంపుటము నందలి వ్యాసములును వెలువడుచుండెను.

సాక్షి యందలి వచనములో ఉన్న ధారాళతగాని, సూటి దనముగాని, సౌష్ఠవముగాని, కథాలహరిలోని వచనమునందు కానరాదు. ఈ వాక్యముల నిర్మాణమును పరిశీలింపుడు.

" అందుచే నిన్న నన్ను గూర్చి మీ కేమియు టెలిగ్రాము పంప బడలేదు."

"ఆమెను మాత్రము చూచి యిట్టి సురూపవతి యట్టి మరణమును బొందుట తగదని తోచి___"

" అప్పుడు వేదాంతి బలి నీయబడు బోవు కాంతను గూర్చి యిట్లనెను."

ఈ పుస్తకము నందలి కథలు మిగుల సంశ్లిష్టమగు వృత్తముపై నిర్మింపబడినవి. ఈ హేతువుచేత కథ మొదటి పర్యాయము చదివినప్పుడు తిన్నగా అర్థము కాక బోవుటలో ఆశ్చర్యము కూడలేదు. కాని ఒకసారి చదివి, స్థూలముగా కథయందలి పూర్వాపర సంఘటనములను అర్థము చేసికొన్న వెనుక, మఱల చదివినచో వారు ఏ వాక్యము ఎట్లు ఎందులకు వ్రాసినారో తెలియును.

ఉదాహరణమునకు దొంగ టెలిగ్రాము అను కథ ఉన్నది. సోమశర్మ అను అతనికి ఒక టెలిగ్రాము వచ్చెను. అతని సోదరునకు అవసానదశ ప్రాప్తమయ్యేనని దానిలోని వార్త. సోమశర్మ అన్నను చూచుటకు ప్రయాణమై వెడలిపోయెను. అతడు వెళ్లిన వెంటనే అతని భార్య సుందరిని దొంగలు అపహరించి ఒక సన్యాసి కడకు కొనిపోయిరి. సోమశర్మకు వచ్చిన వార్త సరికాదని తెలిసికొని, అతడు తిరిగి వచ్చుచుండగా, దారిలో రైలు ప్రమాదము సంభవించినది. శర్మకు దెబ్బలు తగుల లేదు. తప్పించుకొని అతడు సమీపమున ఆశ్రయమునకై తిరుగుచు చిత్రముగా చివఱి క్షణమున భార్యను కాపాడుకొన గలిగెను.

ఈ కథ సోమశర్మ దొంగ టెలిగ్రాము చూచుకొని ప్రయాణము ఆగుటతో ఆరంభము అగును. అచ్చటి వాక్యములు ఇవి.

" అతడు పోదలచిన గ్రామ మచటికి నాల్గు వందల మైళ్ళ దూరముననున్నది. ఆనాడు బుధవారపు రాత్రి. గురువారము మధ్యాహ్నమున కచటకు జేరెను. ఆ సాయంకాలమందే తిరుగు బండిలో బయలుదేరి తన భార్యను గలసికొన బోవుచుండగ నొక యరణ్య సమీపమున బట్టాలనుండి రయిలుబండి జారిపోయెను."

" ఆ సాయంకాల మందే తిరుగు బండిలో బయలుదేరి " అన్న మాటల వద్ద కథకుడు ఏ విషయమునో బలత్కారముగా దాచి యుంచినట్లు లేదా? అదే విధముగా పాఠకులకు ఉత్కంఠ పెంచవలెనని కథకుడు పొందిన ఉత్కంఠ కొన్నిచోట్ల కనబడుచున్నది. సుందరిని బలి యిచ్చుటకై కనకమ్మ అను స్త్రీ గుడికి తీసికొని పోవుచున్నది.

" తెల తెల వారుచుండగాఁ బక్షులు ధ్వను లారంభింపగ నిద్దఱు కాంతలు నొక ముసలి యాతడు నా దుర్గ దేవాలయము లోనికి వచ్చిరి. వారిలో నొక కాంత కనకమ్మ. రెండవ కాంత యెవ్వతెయో మన మెఱుగము."

కథలో సుందరి పాత్ర ఈ వఱకే ప్రవేశించినది. భర్తకు టెలిగ్రాము వచ్చి నప్పుడు సుందరి భర్తతో మాటాడు చుండుట మొదటి సంఘటన. ఇప్పుడు కథకుడు మఱి " ఆమె నెరుగము " అని చెప్పుట ఎంత విచిత్రమైన విషయము !

చిన్న కథలు గాని, నవలలు గాని అల్లుట ప్రాథమిక దశలో ఉన్న ఆ రోజులలోని పరిస్థితుల ప్రాబల్యమే కాకున్నచో పంతులుగారి వంటి మేధావి, శిల్పి, కూలంకషమగు విమర్శ నాత్మక శక్తి కలవారు ఇట్టి రచనలు చేయుట ఏమి?

కథాలహరి లోని కథలు అనేకము సంస్థానోద్యోగులు, రాజులు—ఇట్టి పాత్రములతో కూడి యున్నవి. పంతులుగారి కామెడీలలో కూడ ఇట్టి వాతావరణ మునకు చెందిన కథలే ఉన్నవి. ఇవి అపరాధ పరిశోధనము, రహస్య భేదన ములకు సంబంధించిన కథలు కూడ అయి యున్నవి. చిరకాలము క్రిందట ఎన్నడో భార్యా భర్తలు, పిల్లలు తల్లిదండ్రులు విడిపోవుట, తుదకు కలిసికొనుట ఈ కథలలో ఒక ప్రధానమైన అంశము. ఇట్టి కథలలో స్త్రీ పురుషులు అన్య వేషధారులై యుండుటయు పరి పాటిగా ఉండు విశేషము.

కథలందు కొన్ని కుంభవృష్టి కురియు నన్నట్లు మేఘములు క్రమ్మి, పొడి జల్లులతో తేలిపోయి నట్లు ఉండును. సంఘటనలు కృత్రిమముగా, బల వంతముగా కూర్పు చేసినట్లు ఉండును. సన్నివేశములకు, సన్నివేశములకు నడుమ తగినంత వివరణము లేక పోవుటచే కథా కథన పద్ధతియు సొగసుగా లేదు. ఎవరో తరుముకొని వచ్చు చున్నట్లు కథ సాగి పోవుచుండును. ఈ వేగము కథనములోనిదే కాని, కథలోనిది కాదు. ఒక్క మాటలో చెప్పినచో ఒక పెద్ద నాటకపు కథయో, నవల కథయో వ్రాయుట చేతనైన వాడే విసిగికొనుచు పది ముక్కలలో వ్రాసినట్లు ఉండును.

కథలలో పంతులుగారు సంభాషణముల పద్ధతి ప్రవేశ పెట్టిరి.

రాణి : ( గద్గద స్వరముతో కన్నీరు పెట్టుకొని ) దొంగా ! నీవు గోవర్ధను నెచ్చట నుండి హరించితివి ? ఆత డెవరు ?

ఇట్టి పట్టుల పాత్ర చిత్త వృత్తిని కథకుడు వ్యాఖ్యానము చేయుచు వ్రాసి నప్పటి రక్తి నాటకము నందు వలె బ్రాకెట్లలో సూచనలుగా వ్రాసిన ఎట్లు వచ్చును? కొన్ని స్థలములందు దీని వలన కథ కుంటి నడకలు కూడ నడిచినది.

కథ అంతయు భూతకాలిక క్రియలలో చెప్పుచున్నప్పుడు, నడుమ ఒకటి రెండు సంభాషణములను వ్రాసి బ్రాకెట్లలో పోవును, వచ్చును అని తద్ధర్మ క్రియలు వాడినచో వచనశైలి సౌష్ఠవము ఎట్లు ఉండును ?

ముసుముందు నాటకముగా వ్రాసికొన వచ్చును లెమ్మని కథ జ్ఞాపకము ఉంచుకొను నిమిత్తము వ్రాసికొనిన నోట్స్ వలె కొన్నిచోట్ల ఈ కథ లున్నవి. ఈ కారణముచేత పాత్ర పోషణము కూడ నిండుగా లేదు.

ఈ కథలు అన్నింటిలోను కొంచెము చెప్పుకొన దగినది " మోసమునకు మోసము " అనునది.

గోవిందరావు అను వడ్డీ వ్యాపారి మాలతి అను వేశ్యను చంపెను. ఆ వేశ్య చెల్లెలిని ఒక న్యాయవాది ఉంచుకొనెను. గోవిందరావు ఆమె తనపై కేసు తేవచ్చును అని భయపడుచుండెను.

ఇది ఇట్లుండగా, కొత్రావులపల్లి కామేశ్వరరావు అను నతడు గ్రామమున చోరభయము విస్తారముగా ఉన్నందున, తన భార్య నగలపెట్టెను గోవిందరావు వద్ద దాచుకొనెను. అతడు ఆ పెట్టెను హరించి తాను ఏమియు ఎరుగ ననుటకు సిద్ధము అయ్యెను. అట్టి స్థితిలో కామేశ్వరరావు భార్య అతని వద్దకు పోయెను.

గోవిందరావు ఆమెను చూచి, మాలతి చెల్లెలే అని భయాందోళనలు పొందెను. ఆమెయు అతడు ఏదో తప్పు చేసినట్లు, దానికై తనమీద చర్య వచ్చునని భయపడుచున్నట్లు పసికట్టి, తత్కాలోచితమైన మాటలతో దానిని

వృద్ధి పొందించెను. అతడు తనపై హత్యానేరము మోపకుండుటకు ఆమెకు తన వద్దనున్న తన ఆభరణములనే ఇచ్చెను. ఆ పిదప ఆమె భర్తతో తిరిగివచ్చి వాస్తవమును తెలిపి పోయెను.

అన్నింటిలోను ఈ కథయే సహజముగా ఉండి, పాత్ర పోషణము, క్రమోన్మీలనము కలిగి ఆహ్లాదకరముగా ఉన్నది.

నాటకములను గూర్చిన అధ్యాయములో కథాలహరిలోని కథలు ఎట్లు నాటకములుగా తరువాత రూపొందినవో చెప్పబడినది.

## భారతిలోని కథలు

1924 వ సంవత్సరమున మూడు, 1927 లో ఒక్కటి పంతులుగారి కథలు భారతిలో ప్రకటింప బడినవి. ఆ కథలు ఇవి.

| | | |
|---|---|---|
| 1924 | ఏప్రిల్ | జయసీతారామ్ |
| | మే | రామరాజు |
| | జూన్ | రామ రామ |
| 1927 | సెప్టెంబరు | శివరామ |

ఈ కథలలో పంతులుగారి కథాకథన నైపుణ్యము కనవచ్చును. కథానికలలో విపులమగు కథ రక్తి కట్టదుగదా ! ఒక సన్నివేశమును గాని, పాత్రను గాని, అనుభూతిని గాని ప్రధానముగా తీర్చిన కథానిక ఆహ్లాద దాయకము కాగలదు. పంతులుగారు పై నాలుగు కథలలోను, సాక్షి వ్యాసము లందలి కథలలోను ఈ లక్షణమును అనుసరించి యున్నారు.

భారతిలోని కథ లన్నిటిలోను "రామరాజు" మేటికథ. వారి కథలలో దీనికి సాటి వచ్చునది "కానుగు చెట్టు" అను కథయే. తుది రోజులలో పంతులు గారు రామరాజు కథను నాటకీకరించినారు.

రామరాజు నిర్లిప్తుడు. మహాయోగి అనవలెను. అతని భార్య పార్వతమ్మ. వారు పాతికేండ్లు కాపురము చేసిరి. సంతానము లేక పోవుటచే పార్వతమ్మ తిరునాళ్లకు భద్రాద్రికి వచ్చి రాముని దర్శింతునని మ్రొక్కుకొనెను.

రామరాజు దానికి వ్యతిరేకి. "ఏమి చేయవలయునో, ఏ మొసగ వలెనో రామదేవునకు తెలియదా? ఒకరు చెప్పునదేమి?" అని అతని వాదము. తుదకు భద్రాద్రి యాత్రచేసి వచ్చినారు. పార్వతమ్మ కోర్కె ఫలించి గర్భవతి యైనది. కాని ఒక పంచ పక్ష్యుపాసకుడు వచ్చి, పుత్రుడు ఉదయించునని, పుత్రోదయ మైన గంటలో తండ్రి మరణించునని చెప్పెను. పార్వతమ్మ అవస్థ చెప్ప తరము కాదు.

పుత్రోదయ మైన వెనుక కూడ రామరాజు బ్రతికెను. ఆరాత్రి గడచెను. ఊరి వారందఱును ఆయనను అభినందింప వచ్చిరి. కాని ఆయన వారితో అది అభినందనీయ మగు విశేషమే కాదని చెప్పును. వైశాఖ శుద్ధ ఏకాదశి నాడు నాల్గు గడియల ప్రొద్దు ఎక్కు వేళకు తన సన్నిధికి రావలెనని భద్రాద్రిలో నుండగా రామదేవుడు స్వప్నమున ఆనతి ఇచ్చెనని చెప్పుచు, ఆ సమయము ఆసన్నము అగుటచే తాను ప్రయాణమునకై నిరీక్షించు చున్నట్లు తెలుపును. ఇంతలో పాలికాపు గొడ్లకు గడ్డిమోపు ఎత్తుకొనిరాగా, సాయము చేసి దింపు చుండగా అందులోనుండి ఒక పాము బయటకు వచ్చి రామరాజును కాటువేసెను.

ఈ కథను వారు చెప్పిన తీరు, పాత్రములను ముఖ్యముగా ఎడ్లపాటి రామరాజును - పోషించిన పద్ధతి అత్యంత హృద్యముగా ఉన్నవి. రామరాజునకు బఱ్ఱెలపై, దూడలపై ప్రీతి. "బిడ్డనిచ్చిన రాముడే కాదా బఱ్ఱెదూడ నిచ్చెడివాడు కావున బఱ్ఱెదూడను పెంచుకొనరాదా?" అని భార్యకు హితవు చెప్పెను.

భార్య భద్రాద్రి పోదము అనినప్పుడు "నా మటుకు నాకు వంటయింటి గూటిలో నున్న రామునికంటె భద్రాద్రి రాము డెక్కువ కాదు. రాము డేడ నున్నాడో యాడనే భద్రాచలము. రాముని బట్టి భద్రాచలము గాని, భద్రాచల మును బట్టి రాముడు గాడు." అని బదులు చెప్పెను.

ఈ కథలోని పాత్ర సంభాషణములో పంతులు గారు చక్కని పౌలభ్యమును, వ్యవహార సన్నిహితత్వమును సాధించినారు.

"ఇష్టము వచ్చి యిచ్చునా సంతోషము. ఈయడు? అంతకంటె సంతోషము."

రామరాజు పాత్రకు "అది సంగతి. తెలియలేదు?" అని తరచుగా అనుచుండుట అలవాటు. దీనిలో అతని సంభాషణములందు పంతులుగారు దత్త మండల ప్రాంతమందలి మాండలిక భాషా ప్రయోగములను పొదిగినారు. "ఓయబ్బ! కుట్ల కెల్లతిని- మస్తుగా- వెంకులాడు కొనుట- దొడ్డుగా నుండుట- సిసలు పఱచు- తుట్టు బడాయించు- వన్నింపులు- స్గాల్లాయగుట" ఇట్టి అనేక ప్రయోగములు అందు ఉండి సహజతను తెచ్చి పెట్టినవి.

## ఆంధ్ర పత్రికలోని కథలు

ఆంధ్ర పత్రిక సారస్వతాను బంధములో సాక్షి ఉపన్యాసములతోపాటు పంతులు గారి కథలును కొన్ని ప్రకటింప బడినవి. కొన్ని చోట్ల వీనికి పేరు పెట్టకుండ చిన్న కథ అనినారు. ఆ కథల వివరములు ఇవి.

| | |
|---|---|
| 25- 9-1920 | చిన్న కథ |
| 8-10-1920 | హిందూగృహిణి |
| 11-12-1920 | Adaptation |
| 5- 2-1921 | మేరీ నారాయణీయము |
| 30- 4-1921 | చిన్న కథ |

ఇవి స్కెచెస్ వలె ఉన్నవి. వీనిలో కథా వస్తువు తక్కువ. ఇవి కాక 1921 లో మార్చి 19 న, ఏప్రిల్ 23 న చిన్న కథ అను పేరుతో రెండు కథలు ఉన్నవి. వీనికి రచయిత పేరు ప్రకటించలేదు. కాని శైలిని బట్టి పంతులుగారివే అనిపించు చున్నవి.

## సాక్షి యందలి కథలు

సాక్షి వ్యాసము లందలి కథలను రెండు వర్గములుగా చేసి పరిశీలింప వలయును. ఒక్కొక్కప్పుడు సాక్షిలో ఏదో ఒక కథను ఇచ్చుట జరిగినది. ఆ కథల నామములు ఇంతకు పూర్వము విపరించుట యైనది. అవికాక ప్రాసంగికముగా వచ్చినవి ఇంకెన్నియో కలవు. అచ్చటచ్చట కథ వలె విచిత్రము లైన కొన్ని సన్నివేశములును ఉన్నవి. సరస్వతి నాటకములో కూడ, కురంగి, జయరామసింగు పాత్రములచే చమత్కారములగు చిన్న చిన్న కథాత్మక సన్నివేశములను ( anecdotes ) పంతులు గారు చెప్పించి యున్నారు.

సాక్షి వ్యాసములందలి కథల ప్రత్యేకత ఏమనగా అవి కేవలము పఠించుట కొఱకుగా వ్రాయబడలేదు. ఉపన్యాస వేదికపైనుండి వానిని ఎవ్వరో వినిపించుట జరిగినది. దీనిమూలమున వానికి విలక్షణత అబ్బినది. ఒక్కొక్క సన్నివేశమును మిగుల విపులముగా చిత్రించుట, భావికాలంకారమును బహుళముగా ఉపయోగించుటయు అందు జరిగినది. కథ చెప్పు తీరులో కథకుని ఉత్కంఠ, ఆవేశము చక్కగా వెల్లడియై రస పరిప్లుతములుగా కథలు సాగినవి.

సాక్షి రచనలో పరిపక్వ మైన వచన రచన శైలి ఆ కథలను మనోజ్ఞ శిల్ప ఖండములుగా తీర్చినది. తక్కిన కథలలో రామరాజు, కానుగుచెట్టు ఈ రెండు కథలందు మాత్రమే సాక్షి రచయిత లేఖిని మెరుగు కానవచ్చును.

పండితుని యుపన్యాసము (3-24) లో వ్యాసుడు కాంతగా వచ్చినప్పుడు పండితుని మనఃస్థితి వర్ణన ఆ కథకు వన్నె తెచ్చినది. పంతులుగారి భావనాపటిమ ఇందు అక్షరాక్షరమున కాననగును. స్త్రీ దర్శనముచే వికలమైన మనస్సును చక్కబఱచు కొనుటకై పండితుడు వ్యాఘ్రాజినముపై పండుకొని హరినామ స్మరణకు ఉపక్రమించెను. "హ యన్న తరువాత రి యనున దింక నుచ్చరింప కుండనే హరి మధ్య స్వరూపము శత సహస్ర వ్యాస ఘట్టముల పటిష్ఠతతో, శత సహస్ర చంద్రమండలముల ప్రసన్నతతో నడ్డు పడుచుండగ నాత డేమి చేయ గలడు ?" ఇంత బిగువైన రచన, ఇంత నిశితమైన భావన దీనిలో కాననగును.

" హరిభక్త రాలిప్పై భవము " (4-9) అను కథలో పాఠకులకు ఎట్టి ఉత్కంఠత వారు కలిగించుచు కథా కథనము చేయుదురో నిదర్శన పూర్వకముగా చూడవచ్చును. వరదాచార్యుని పత్ని రామానుజాచార్యుల వారికి భిక్ష ఇచ్చుటకై తన తనువును ఏ వైశ్యునికైన భోగార్థమిచ్చి వస్తువులు తేవలెనని పోవుచుండెను. ఆ ఘట్టము నందలి రచన మిది:

"రామరామా! సాధ్వీతిలక మెంత సాహసమున కొడిగట్టినదో! అయ్యయ్యో! పరివ్రాజక సమారాధన మాచరింప నిశ్చయించు కొనినదా? అయ్యయ్యో! అప్పుడే ఇంటినుండి బయలు దేరినదే! ఆహా! ఆహాహా! ఇప్పుడైన నామె కాళులకు దారిలో నాల్గు రూపాయలున్న మూట దగుల రాదా? మూటయు వలదు, ముల్లెయు వలదు. ఆమె మృదులారుణ చరణమున కేదైన కఱకు ఱాయి దగులుటచే నామె ప్రయాణ మాగిపోరాదా? రంగ రంగ రంగా! నీ వామెకు ప్రసాదించిన మహా దారిద్ర్యము వలననే కదా యా నారీ శిరోమణి యిట్టి ఘోర కృత్యము నొనర్ప నిశ్చయించు కొనినది. నీవైన నామె నాప జాలవా? ఇది పాపమే యగు నెడల నీ పాపమునకు బాధ్యుడవు నీ వగుదువు. జాగ్రత్త! రంగ రంగ రంగా! రక్షింపవా? ఱాయియైన నడ్డు పడదే! రంగ డైన నడ్డు పడడే! అయ్యయ్యో! వీధి వెంట బోవుచున్నదే!"

సాక్షి యందలి కథల రీతులను అవగతము చేసికొనుటకు ఈ ఘట్టములు చాలును. తన్మయుడై, రచనాను గుణములగు అనుభావములను ముఖ కవళికలందు కనబఱచుచు జలపాతపు వేగముతో కలము పరువెత్తించుచున్న తద్రచయిత మూర్తి కన్నులకు గోచరమగుట లేదా?

పానుగంటి వారు ప్రత్యేకముగా కథా వాఙ్మయ శాఖ పట్ల ఆదరము చూపలేదు. కాకపోయినచో కథా రచనమున వారు తప్పక క్రొత్త బాటలు వేసియుండెడి వారే! ఉన్నంతలో సాక్షి వ్యాసము లందలి కథలు, భారతిలోని కొన్ని కథలు వారి కథన నైపుణ్యమును ప్రకటింప జాలిన ఆణిముత్యములు.

# వచన శైలి

గద్యరచనము అభివృద్ధి పొందుట చాల ఆవశ్యకము అని పానుగంటి వారు గుర్తించిరి. వచన రచనచే కాని భాష అభివృద్ధి పొందదు అని వారు నొక్కి వక్కాణించిరి. డాంబికముగా, వ్యర్థముగా, పద్యరచన చేసి తృప్తి పడుటను వారు తీవ్రముగా అధిక్షేపించినారు. సాక్షిలో వాణీదాసుడు స్వీయ చరిత్రమును పద్యములలో వ్రాసినట్లు చెప్పి, జంఘాలశాస్త్రి చేత వారు దానిని ఆక్షేపింప జేసిరి (2-2).

గద్య గ్రంథ బాహుళ్యమునే కాక వారు రచనమున ప్రామాణిక శైలులను గూడ కాంక్షించిరి. "ఇప్పటి వచనశైలి తరచుగ నీరసముగను, నిశ్ప్రౌఢముగ నున్నది కాని మిగుల సంతుష్టి కరముగ నుండలేదు. ఇంకను బలిష్ఠమై, ధారాళమై, పౌరుష యుక్తమై, ప్రాణ ధురంధరమైన శైలి బయలు దేరలేదు. క్రమ క్రమముగ బయలుదేర గలదు." పంతులు గారు బహు గాఢ శీలము గలవారు. వచనశైలి ఎట్టిది బయలుదేర వలె నని కోరిరో ? "పౌరుషయుక్తమును-ప్రాణ ధురంధరమును !"

1922 లో సాహిత్య పరిష దధ్యక్షోప న్యాసములో, వచనశైలీ వైవిధ్యము గూర్చి ఎంత ఆరాటపడిరో, ఎన్ని ఊహలు చేసిరో స్పష్టముగ చూడవచ్చును; ఆంగ్ల భాషలోని మెకాలే, రస్కిన్, గిబ్బన్, కార్లైల్, అడిసన్, లాక్, హెర్బర్ట్ స్పెన్సర్ మొదలగు మహావచన ప్రబంధ కర్తల భిన్నశైలుల వంటివి ఆంధ్ర భాషలోగూడ రావలెనని వారి కోరిక.

ఆంధ్ర సాహిత్య పరిష దేకాదశ వార్షికోత్సవ వేదికపైనుండి హెచ్చరించిన వారి మాటలు ఇవిగో :

"చిత్రములైన శైలీ భేదములు మన భాషలో మిగుల నరుదుగా నున్న వని వేరే చెప్పనేల? రైమని పేక చువ్వ పైకెగిరిన ట్లున్న శైలి భేదమేది? కాకి పైకెగిరి యెగిరి తెక్కలు కదలకుండ జండెపుఁ బెట్టుగ సాపుగ వాలుగ దిగునప్పటి లఘు పతన చమత్కృతి కనబఱచు శైలి పద్ధతి యేది? తాళము వాయించునప్పటి తళుకు బెళుకులు, టింగుటింగులు, గలగలలు, జలజలలు గల శైలి యేది?....భయంకరమయ్యును మనోహరమై, మహాశక్తి సక్తమయ్యు మార్దవయుక్తమై, ధారాళమయ్యు విశాలమై, స్వభావ సమృద్ధమయ్యు సరసాలంకార భూయిష్ఠమై, సముద్ర ఘోషము గలదయ్యు సంగీత ప్రాయమై, స్పష్టీకృత సకల విషయ తత్త్వమయ్యు నస్పష్ట స్వకీయ తత్త్వమై, చదువరులకుఁ గనుకట్టై, వాకట్టై మడిగట్టై తల పులిమినట్లు శ్వాసమైన సలుపకుండఁ జేసినట్లు, ముష్టివాని చిప్పనుండి మూర్ధాభిషిక్తుని కిరీటమువఱకు, భూమిక్రింది యరలనుండి సముద్రములోని గుహలవఱకు, నెవరెస్టు కొండనుండి యింద్ర ధనుస్సు రంగులవఱకు, మందాకినీ తరంగ రంగ ద్దంసాంగనా క్రేంకారముల నుండి మహాదేవ సంధ్యా సమయ నాట్యరంగము వఱకు మనోవేగముతో నెగురు శక్తిగల చిత్రవిచిత్ర శైలి భేదము లింక నెన్నియో భాషలోఁ బుట్టవలసి యున్నవి."

పంతులుగారి వచన రచనము ఒక విశిష్టతను గడించు కొనినది. తెలుగు వచనములో ఒక వాక్యమును బట్టి రచయితను గుర్తింప వలెనన్న యెడల అది పానుగంటివారి రచనల విషయమున సులభము. అట్టి విశిష్ట శైలిని వినిర్మించిన వారు పంతులుగారు. ఆ విశిష్టత స్వరూప స్వభావములు ఇటు పరిశీలన చేయ వలసి యున్నది.

పంతులుగారు గ్రాంథిక భాషావాదులు. వీరు గ్రాంథిక భాష వ్రాయుట మాత్రమే కాక గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదములయందు పాల్గొనిరి. ప్రకీర్ణోపన్యాసములలోని "గ్రామ్యవాదుల భాషాపవాదము", "గ్రామ్యవాద విమర్శనము", "తలక్రిందు నడక" అనువ్యాసములు "విమర్శాదర్శ విమర్శా దర్శము" అను గ్రంథము—వారు ఈ సందర్భమున వ్రాసినవే. పట్టుదలతో వాదించి వీరు గ్రాంథిక భాషావశ్యకమును సమర్థించిరి. పంతులు

గారికి గ్రాంథిక భాషయందుగల మక్కువను ఉగ్గడించుటకు ఈ అంశము ఒక్కటి చాలును. వివిధ నాటక పాత్రములకు ఉచిత భాషను కూర్చుటలో గూడ పానుగంటివారు గ్రాంథిక భాషనే ఆదరించిరి.

సలక్షణాంధ్ర భాషలో వ్యాకరణ శాస్త్ర సమ్మతమగు రీతినే వ్రాసినను వీరి వచన రచన వ్యవహారమునకు చాల సన్నిహితముగా ఉండును. పంతులు గారు ఎక్కువగా చిన్న చిన్న వాక్యములే వ్రాయుదురు. ఆ వాక్యములు ఒక్కొక్కసారి కర్త, కర్మ, క్రియలేని పొడిముక్కలే అయియుండ వచ్చును. మనము సాధారణముగా మాటాడు సరణినే వా రనుసరింతురు.

సమత

పానుగంటివారి వచన రచనలలో అగ్రగణ్యముగా చెప్పుకొనదగిన గుణము అందలి 'సమత'. ఈ పదము ఇచ్చట సాధారణ లాక్షిణికార్థమున కాదు.) శబ్దార్థ భావములను అన్నింటిని ఒక 'తూకము'లో నడపుచు వాక్య నిర్మాణము చేయుటపై వారి కెంతయు ప్రీతి. దీనివలననే వారి రచనకు సౌష్ఠవము, విశిష్టతయు ఏర్పడినవి.

వాక్యములలో చదువు ఊపును బట్టి రెండు మూడు భాగములు వేఱు పరచుట కవకాశము ఉండును. ఆ భాగములు ఒండొంటితో సమములుగా ఉండి మొత్తముమీద వాక్యమునకు ఒక అందమును కలిగించును.

" ఈ మీసాల కవులలో నూటికి తొంబది తొమ్మండ్రు శుద్ధశుంఠలని యిప్పుడు మీకు వెల్లడి యైనది కాదా ? కవిత్వమన్న, నగాధ హృదయముగల—యాడుది చెప్పవలయును. ఆహ్లాదపు బావియగు—నాడుది చెప్పవలయును, ఔచిత్యపు రాశియగు—నాడుది చెప్పవలయును.

ఈ వాక్యములలో చిన్నగీత పెట్టిన చోటికి వాక్యములు ఎట్లు సమముగ విరుగునో చూడుడు. పైగా అచ్చట యతి కుదిరియుండును. ప్రాయికముగ ఇట్టి స్థలముయందు పంతులుగారు యతిగాని ప్రాసగాని పాటించుచుందురు.

" చీమకుత్తుకలో—సింహము ప్రవేశించినదే! సముద్ర సప్తకము—చౌటి పడియలో నిజికినదే! పరమాణువులో—పర్వత మిమిడినదే! కానులేని వాని గుడిసెలో—గైలాస మవతరించినదే!"

వాక్యములలో ఈ "సమత" (balance) పంతులుగారు ఎంతెంత విచిత్రముగ సాధించిరో ఆ పద్ధతి గమనార్హము, ప్రశంసార్హము. ఒక్కొక్క పర్యాయము ఈ తూకపు సర్దుబాటు ఒక్క వాక్యములో గాక వాక్య సముదాయములో ఉండును.

" వైద్యుఁడు లేకుండ వ్యాధి దాటింపవచ్చును. పురోహితుఁడు లేకుండఁ బెండ్లి నీడువ వచ్చును. పౌసగుడు వాఁడు లేకుండ సంత సాగింప వచ్చును. భోక్త లేకుండ తద్దినము కిడతేర్చ వచ్చును."

ఇచ్చట నాలుగు వాక్యములు చెప్పబడినవి. కాని ఉద్దిష్టార్థమునందు ఇది అంతయు ఒక భాగము. దీనికి మరొక్క వాక్యము చేర్చినగాని ఈ సముదాయమునకు 'సమత' ఏర్పడదు.

" కాని, వార్షికోత్సవము మాత్ర మగ్రాసనాధిపతి లేకుండఁ దెప్ప దాటించుటకు వీలు లేకుండ పోవుటచేత...."

అసంభావ్యములైన పెక్కు విశేషములు సంభావ్యములుగా చెప్పి తుట్ట తుదకు ఒక స్వల్ప విశేషమును అత్యంతము అసంభావ్యముగ పంతులుగారు చెప్పి పై వాక్య సముదాయమునకు దానిని మకుటముగా జేసిరి. ఇట్టిదే మఱి యొక్క ఉదాహరణము.

" అన్నము లేనివాని బాధ బాధ కాదు, భార్య లేనివాని బాధ బాధ కాదు, కొడుకులేని వాని బాధ బాధ కాదు, పొడుము లేనివాని బాధ ముమ్మాటికిని బాధ."

ఈ ఉదాహరణములలో భావ చమత్కృతియే కాక రచన చమత్కృతియు కనవచ్చును.

## వే గ ము

పానుగంటివారి వచన రచనలో మఱియొక ప్రధాన గుణము " వేగము. " వేగము అననేమో వారి రచన చదువు చున్నప్పుడు అనుభవించునంత సులభముగా వివరించుట కుదురదు. పంతులు గారిది వ్యాక్రియా ప్రధానమైన రచన. భావ ప్రకటనము చేయుటలో వారికి నైశిత్యము, తీక్ష్ణత, ఔజ్జ్వల్యము నున్నవి. ఈ కారణముచేత ఎప్పటి కప్పుడు పాఠకుడు ఆపుకోలేని ఉత్కంఠతో ముందునకు సాగి పోవుచుండును. " వైద్యుడు లేకుండ...." అనియు, " అన్నములేని వాని బాధ" అనియు ఆరంభింపగనే, ఈ ఉపోద్ఘాతము దేని కొఱకో, తుద కేమి చెప్పబోవు చున్నారో తెలిసికొను వఱకు పాఠకుని మనము తహతహ లాడిపోయి ఉత్కంఠతో చకచక పఠనము సాగిపోవును. ఇది వారి సర్వ రచనల యందును ఉన్న గుణము.

## చి త్ర ణ ము

దీని అనుబంధముగా పరిగణింప దగిన మఱి యొక విశేష మున్నది. పంతులు గారి రచనలో " చిత్రణము " మెండు. తాము సృష్టించిన వాణీదాసుని వలెనే వారును నువ్వు గింజపై నూరు పద్యములే కాదు నూరు పుటలు వ్రాయ గలిగిన వారు. ఏ విషయమును గూర్చి చెప్పవలసినను, వారు దానిని గూర్చి గాఢముగా భావింతురని, స్పష్టముగా మనో నేత్రము ముందు నిలుపు కొందురని వారి రచనల వలన సువిదిత మగును. ఈ స్పష్టతయే వారి చిత్రణ శక్తికి మూలము. భావ ప్రకటన నైశిత్యమునకు ఆధారము. తమకు స్పష్టముగా తట్టిన అంశమును పాఠకులకు గూడ విస్పష్ట మగునట్లు చేయుటలో పంతులు గారి ప్రతిభ ద్యోతకము అగును. ఇంకను చెప్పుకొన దగిన విశేషము ఏమనగా, ఈ చిత్రణమును వారు చేయుటలో ఉన్న జిగిబిగి మూలమున, రచన యందు భావ వేగము చక్కగా ప్రసరించును గాని కుంటు వడదు.

" ఒక్క గులాబి పువ్వులోని సారళ్యము, సౌందర్యము, సౌరభము నాలోకింప బోయి, యాస్వాదింప బోయి, యనుభవింప బోయి, యా పుష్ప సౌభాగ్యములో గలసి, యా కేసర మార్దవమున నార్ద్రమై, యా మకరంద బిందు

సందోహమున లీనమై మన స్సై యట్టై తన్మయత్వమును జెందుచున్నదే. తుట్టతుద కొక్క గడ్డి పొరకలో బరమేశ్వరుని కరుణ, పరమేశ్వరుని లీల, పరమేశ్వరుని జ్ఞానము, పరమేశ్వరుని యానందము, పరమేశ్వరుని మహిమము భావించి, యా మూర్తిని సేవించి సేవించి, యా శక్తిని ధ్యానించి, ధ్యానించి తరింప వచ్చును గదా ! "

ఇట్టి భావ వేగాన్విత చిత్రణ ఎందు చూచిన వారి రచనల కాననగును.

ప ద గుం భ న ము

వీరి వచన రచనలో కానబడు నాల్గవ గుణము- "పద గుంభనము." ఏ చిన్న విషయము చెప్ప వచ్చినను, కుప్పలు తిప్పలుగా పంతులు గారు మాటలను కురిపింతురు. ఒక్కదానికి పది పోలికలు తెత్తురు. భంగ్యంతరముగా వాక్యముల దొంతరలు పేర్తురు. ఆ మాటలు, ఆ వాక్య విన్యాసము వారికి తోచవలసినదే కాని మఱి యొకరు ఊహ చేయ గల్గినవి కావు.

" ఊత రుప్పలు, తాటి పంటి పీచులు, గొడ్డెబొచ్చు దొంతరలు కనుప గడ్డి దుబ్బలు, చికిలింత కంపలు, చిట్టడవులు నైన తలలు సైతమా దినమునఁ బాద గయాహ్రదమున ముంపఁ బడినవి. "

" ఒక పద్ధతియా ? ఒక వరుసయా ? ఒక తెన్నా ? ఒక తీరా ? ఒక క్రమమా ? ఒక సూత్రమా ? ఏమియు లేదు. చక్కదన మనగా నేమో సర్వ జాతులకు సంబంధించిన సామాన్య సూత్రము లొనర్చుట బ్రహ్మతరమా ? "

" నీ వేద్చు చున్న తెలివితక్కువ నిర్భాగ్యపు టల్లరి చిల్లరి యవకతవక యాసమ్మ యోసమ్మ యారిగ చొప్ప యలుకు గుడ్డ కవిత్వము నే జెప్పలేక మాని వేయలేదు. గడియ సేపు ఛందో గ్రంథ మేదైనఁ జూచితినేని నీ పేల పిండి వట్టి గడ్డి కల్లబొల్లి కాకి కూత కవిత్వము నా కవిత్వము చుట్టు ముమ్మారు త్రిప్పిత్రిప్పి దిగఁ దుడుచుట కైనను బనికి రాకుండఁ జేయఁ గలుగుదును. "

పానుగంటివారి పదగుంభనమున వారి నూత్న పద సృష్టియును గమనార్హము. ఇదివఱకు లేనివి ఎన్నియో వారు పొందికగా, చిత్రముగా సృష్టించిరి. న్యాయవాదులు కాలాంబర కవచధారులు. నిరుపయోగపు పలుకులు బోదకాలి మాటలు. బుద్ధి వైశద్యము లేదని చెప్పుటకు సంభాషణములో "Upper portion to let" అని వెక్కిరించుట కలదు. దీనిని ఒకచో పంతులుగారు ఆంధ్రీకరించి చిత్రముగా వాడిరి. "కాని యిపుడు భగవద్గీతా భాష్యమునకై బుద్ధిని వ్యయపఱుప గలరా ? వ్యయపఱుచుట కది విశేషముగా నున్నదో లేదో, కాక మిద్దె గది యద్దెకో యెట్లు తెలియవచ్చును ?" ఇట్లే మఱికొన్ని—ఖండకర కార్పాస కూర్పాసము (Cut Banion) హేమాంచల రోచమాన కాచ నేత్రముల వాడు (wearing bright gold rimmed spects). ధ్వన్యాద్యను కరణములు విశేషముగా వాడుటయు పంతులుగారికి ఇష్టమైన పద్ధతియే.

"ఎక్కడ వినిన గాజుల గలగల; అందెల ఝుణఝుణ; కాంచీ ఘంటికల గణగణ; ఎక్కడఁ జూచిన జెక్కుటద్దముల తళతళ; గబ్బిగుబ్బల పెళపెళ; తారహారముల మిలమిల; వేణీ భారముల జలజల; ముద్దు మొగముల కలకల; ఎక్కడకుఁ బోయిన నగరు ధూపముల గమగమ, చందన చర్చల ఘమ ఘమ; మృగమద లేపముల ఘుమ ఘుమ."

ఉపసర్గ లుపయోగింపుచు కొద్ది భావమును విస్తరించి దీర్ఘ సమాసములలో విపులముగా గంభీరముగా వ్రాయుటయును వారి వచన రచనలలో కానవగును. ఇదికూడ పదగుంభన పద్ధతులందు ఒకటి. సంసారము అన్న ఒక్క భావమును విపులీకరించుటకు "సంసార సంఘ సమావిష్ట సతీపుత్త్ర పౌత్త్ర ప్రపౌత్త్రాది సన్నిపాతము" అనుటయు, చిత్రము అనుటకుగా "చిత్ర విచిత్రాతి విచిత్ర మహా విచిత్రము" అనుటయు మున్నగునవి ఇట్టివే.

పెద్దపెద్ద వాక్యములు వ్రాయుచో వానిని అనేక ఖండములుగా చేసి, అందులో ఒక్కొక్క ఖండమున విశేషణములు పర్యాయముగా, పరంపరగా వేసి, క్రియాపదములకు పర్యాయ పదములను వాడి వ్రాయుట పంతులుగారి ప్రత్యేకతలతో ఒకటి. వారి సాక్షి మొదటి వ్యాసములోని ఆరంభ వాక్యములే ఇందుకు నిదర్శనము.

వర్ణనములు చేయునెడల శబ్దాలంకారములు అధికముగ వాడుట వారికి అభిమతమగు పద్ధతి. పది విశేషములు గుది గ్రుచ్చినప్డు ఆ పది మాటలును ఒకే అక్షరముతో, లేక అక్షర సముదాయముతో ఆరంభించుట ఒక చమత్కార ముగ వారు చేసిరి. నన్నయ రచనయందు గూడ ఇది అనేక స్థలముల ఉన్నది. " విషయ విభాగ వినిర్ణయ న్యాయ నిపుణ విద్వత్సంభాషణ ఘోషంబులును...." అదే విధముగ పంతులుగారు వ్రాయుదురు.

" వారి దుర్నయము, దుష్ప్రవర్తనము, దురహంకారము, దురభి ప్రాయము, దుర్గర్వము, దుర్మనస్కత యెట్లు వెల్లడి కాగలదు ? "

" నేల యీనిన శైక్కడ జూచిన స్త్రీలు ! వివిధ రూపలావణ్య సంప దలు, వివిధాభరణ వైభవములు, వివిధ వయఃపరిపాకములు, వివిధ వర్ణ వైచిత్ర్య విశేషములు, వివిధ వాగ్ధోరణీ నైపుణులు, వివిధ చేష్టా సామర్థ్యములు, వివిధ స్వభావగతులు గల కాంతలగని యగు నా సంస్థానము...."

సాక్షి వ్యాసములలోని వారి వచనశైలి, నాటకములలోని వారి వచనశైలి కన్న, అన్య వ్యాసములలోని వారి వచనశైలి కన్న విశిష్టముగా నుండును. సాక్షి వ్యాసములలోని శైలి ఉపన్యాస శైలి. ఉపన్యాసము రక్తి కట్టుటకు అనువుగా ఇందు మాట లిచ్చి పుచ్చుకొన్నట్లుగా, బంతు లాడినట్లుగా, గిరగిర త్రిప్పినట్లుగా నుండును. పై ఉదాహరణము నందువలె వివిధ యని ఆరంభించిన, అయిదారు సార్లు అది సామాన్యముగ నుంచి తక్కినవి మార్చుట—భిన్న భిన్న పదములతో నారంభించి యొకే సామాన్య పదముతో ముగించుచుండుట— " పతి ప్రక్కలో మాయ. న్యాయవాది నాలుక కొనను మాయ...." ఇట్లు వాక్య ఖండములను అమర్చుట ఇది అంతయు ఉపన్యాసమున శోభ నిచ్చును. ఈ అమర్చుట వలన గద్యము మత్త కోకిలము, తరలములవలె ఊగి యూగి ఒయ్యారపు నడకను సంతరించుకొనును.

భావోద్వేగమునకు అనుగుణమగు తూగుతో వాక్యములు చిన్నవిగా, పెద్దవిగా నేర్పడి పాఠకుని ఉక్కిరి బిక్కిరి చేసి నిమగ్నునిగా చేయును. పంతులుగారు కాంక్షించిన " ప్రాణ ధురంధరమైన " శైలి కాదా ఇది !

దాదాపు ఇంతవఱకు ఒసగబడిన ఉదాహరణములను చూచిన, వచన రచనలలో పంతులుగారు ఎట్టి సౌష్ఠవము సాధించిరో అగపడుచునే యున్నది. సాక్షిని ప్రధానముగ ఉంచుకొని పానుగంటివారి వచనమందలి ముఖ్య గుణములను చూపుటయైనది.

ఈ గుణములను కలబోయుటలో వారి రచన కొన్ని చోట్ల సౌష్ఠవ ప్రధానము, ఇంకను కొన్నిచోట్ల వైశద్య ప్రధానము. మఱికొన్ని చోట్ల వేగ ప్రధానము. ఇట్లుండుటలో అలతి వాక్యములు ఒకచోట, దీర్ఘ వాక్యములు ఒకచోట, తెలుగు పలుకు పొలుపు ఒకచోట, సంస్కృత సమాసముల సాగుడు ఒకచోట వారు వ్రాసియుండిరి.

పంతులుగారికి శబ్దాలంకారములు మాత్రమే కాక అర్థాలంకారములన్నను మక్కువ ఎక్కువే. అయినను వారు "శబ్ద వైచిత్రిని వలచిన వారు." అనుటలో అతిశయోక్తి లేదు. సాక్షి వ్యాసములందు అనేక స్థలముల ఒక్క వాక్యమేని వృథకాకుండ ఒండు రెండు పుటలవఱకు ఏదో అలంకారము కన్పడుచునే యుండును. ఈ సందర్భమున వారు నూత్నాలంకారములను సృజించినారనియు చెప్పవచ్చును. పానుగంటివారు ఆంగ్ల పదములను, ఉరుదూ, పారసీక, హిందూస్థానీ పదములను అనేకము స్వేచ్ఛగా వాడిరి. దానిని గూర్చి మఱల చెప్పుకొన వచ్చును.

పద్యముకంటె గద్యము వైశద్య ప్రధానమైనది. పంతులుగారి చేతిలో గద్యము పద్య శిల్పమును మేలవించు కొనినది. ఇది వృత్తగంధి రచన కాదు. అయినను నియతమగు యతిప్రాసలు, వాక్య నిర్మాణమునందలి సమతా సౌష్ఠవములు, భావ ప్రకటనము నందలి పరపదాస హిష్ణుత (Precision) మున్నగు గుణములచే ఇది ఉత్తమ పద్య కవితతో తులదూగుచున్నది. ఇట్టి వచనము పానుగంటివారు తప్ప మఱి యెవ్వరును వ్రాయలేదు.

# ఉపక్రమణిక

"హాస్యరసము జీవ మతని గ్రంథములకు
వచన రచన లందుఁ బద్య రచన
నశ్రమంబు తోడ హాస్య రసంబొల్కుఁ
బలుకునుండి చేతి కలము నుండి."

—"సరస్వతి" నాటక ప్రస్తావన.

పానుగంటి వారికి కీర్తిహేతువులైన వానిలో ఒకటి వారి వినూతన హాస్య సృష్టి. తెలుగులో హాస్యమయ కృతులు ఎక్కువగా లేవని, వెలువడుట లేదని పరిషద్వార్షికోత్సవములలో తమ అధ్యక్షోపన్యాసమున వారు మిక్కిలి చింతించిరి. పానుగంటివారు ఈ లోపమును గుర్తించుటతో నాగక తీర్చుటకు కూడ యత్నము చేసిరి.

కూచి నరసింహముగారు పంతులుగారి నాటకములకు ప్రస్తావనలు వ్రాయుచో హాస్యమునుగూర్చి వెలువఱచిన భావములను ఇట్లు క్రోడీకరింప వచ్చును.

1. భావోద్వేగములకు విరతి కల్పించి, విశ్రాంతిని, హాయిని కలిగించుట.

2. లోక సహజమగు చింతోత్కరమును బాపి, ఆనందము కలిగించుట.

2. లోకములోని బాగోగులను విభజించి, శివేతరక్షతి చేయుచు నీతిని, ఉత్తమ ప్రవర్తనమును గరపుట.

కూచివారి మాటలు సాధారణముగా హాస్యమునకు చెల్లినను, ప్రత్యేకముగా పానుగంటివారి హాస్యరీతులను దృష్టిలో నిడుకొని చెప్పినవే యని గ్రహింపనగును.

పంతులుగారి రచనలలోని హాస్య సృష్టిని, తదవాంతర భేదములను వ్యాకరించు కృషి ఇప్పుడు చేయబడును. హాస్యము వికృతి దర్శనమున ఉద్భూద్ధమగునది కదా! ప్రపంచములో ఒకనికి వికృతియైనది మఱియొకనికి వికృతి కాకపోవుటయు సహజమే. అట్లు కాక ఎల్లరకును వికృతియే అని పించునది కొంతయుండును. సామాన్యులు కనుపట్టనేరని వికారములను ప్రతిభావంతుడైనవాడు చూడనేర్చును. పంతులుగారిలో ఇట్టి ప్రతిభాయుత మగు బుద్ధియున్నది. తత్కారణముననే వారి సర్వ రచనలలో హాస్యము వెల్లివిరిసినది.

## నాటకములందలి హాస్యము

పంతులుగారి నాటకము లన్నింటిలో హాస్యమెచ్చటనో యొకచోట స్థానము సంపాదించియే తీరును. శృంగార ప్రధానములగు నర్మదాపురు కుత్సీయాదులలో ఇది అంగరసముగా నున్నది. తక్కిన వానిలో అంకము లందలి కథ నానారస సముద్భవమగుటలో హాస్యమునకు చోటు కలిగినట్లెంచ వలెను.

పానుగంటివారి నాటకములలో మనోమహిమము, వృద్ధవివాహము, కంఠాభరణము, విచిత్ర వివాహము హాస్యరస ప్రాధాన్యమున్నట్లు తోపించునవి. అయినను ఒక్క విచిత్ర వివాహము దక్క తక్కిన వానిలో హాస్యము ప్రధాన రసమనుటకు వీలులేదు. మనోమహిమము ప్రహసనమని పంతులుగారే భావింపనట్లు హాస్యవల్లరి పీఠిక స్పష్టముచేయును. ఇందలి సూరయ్య పేరయ్యల చర్యలు హాస్యాస్పదములుగా నున్నను, ఇందలి హాస్యము అంతమున ఆభాసమగును. దృఢారోగ్యముగల అప్పడు పంతులను దరిదాపుగా హత్యగావించిన వీరు తుదకు జుగుప్సపడదగువారు అగుదురు.

వృద్ధ వివాహము హాస్యయుక్తమని పంతులుగారే వ్రాసిరి. మొదటి మూడంకముల తీరు ఎట్లున్నను చివరి యంకములో కాంతమ్మ, ఆమె సవతి కుమారుడు చేయు సద్బోధలవలన ఇందలి హాస్యమునకు శాంతి కలిగి

ఉదాత్తత ఏర్పడి ఇది ప్రహసనమని కొట్టివేయుటకు వీలుకాక పోవును. కాని రచనా పద్ధతినిబట్టి యిది ప్రాథమికముగా ప్రహసనమగును.

కంఠాభరణ మట్లుకాదు. పీఠికాపురాధీశుల కోరికపై పానుగంటి వారు మిగుల నవ్వువచ్చు నాటకముగా నుద్దేశించియే దీనిని వ్రాసిరి. ఇందలి హాస్యాలంబన పాత్రములను జూచి, హాస్యమున కిందు ఒసగబడిన ప్రాధాన్యమును జూచి దీనిని ప్రహసనమని ఎవరైన భావింపవచ్చును. ప్రహసనములో నీతి బోధమున్నప్పటికిని అందు సాధారణముగా నుండు హాస్యము కేవల హాస్యము కొఱకే అన్నట్లుండును. ఇది సంఘ సంస్కరణమునకైన అధిక్షేపణ హాస్యము కావున దీనిని వ్యంగ్య హాస్య సమన్వితమగు కామెడీ ఆఫ్ మేనర్స్‌గా పరిగణింపదగి యుండును. సంఘ జీవితములో మౌఢ్యముగాని, ఆడంబరముగాని అధికమైనప్పుడు అధిక్షేపణ హాస్యము, వ్యంగ్య రచన - వీనికి అవసరము కలుగును. ఆంగ్ల రూపక చరిత్రమును జూచినచో నాగర కతాతిశయము ఏర్పడినప్పుడు దానిని సంస్కరించు నిమిత్తము కామెడీ ఆఫ్ మేనర్స్ వ్యాప్తిలోనికి వచ్చినట్లు స్పష్టమగును. కంఠాభరణమున నాగర కతాతిశయముతో బాటుగా జీవిత పద్ధతులలో నేర్పడిన స్తబ్ధతగూడ పరిహ సింపబడినది. దీనిలోని కథానాయకుడు కృష్ణారావు అని అనుకొనినప్పుడు ఇది హాస్యము అంగియైన నాటకమని అనుట కుదరదు.

విచిత్ర వివాహము అధిక్షేపణలేని హాస్యరూపకము. ఈ నాటకమున సన్నివేశగతమైనది మాత్రమేకాక సంభాషణగతమైన హాస్యమును బాగుగా నున్నది. ఇందు ప్రత్యేకించి చెప్పుకొనదగిన పాత్ర అతి బాల్య వివాహములను ఆమోదింపజాలని సుందరమ్మ. ఆమె మాటలు నవ్వు పుట్టించినను ఆ మాటల వెనుకనున్న తీవ్రత మరుగుపడదు. పెండ్లికూతురు తల్లి "పిల్ల పెద్దదైన యెడల నేమి చేయవలయును ?" అని ప్రశ్నవేసి, వివాహము సేయక తప్పదని తేల్చెను. దానికి సుందరమ్మ వాచ్యార్థమును గ్రహించి, "ఏమి చేయవలయునా ? మూడు దినములు వాకిటిలో గూరుచుండ బెట్టి నాల్గవ నాడు స్నానము చేయింపుము. అంతకంటె నేమి చేయవలయును ? నీకేమి చేసినారు ? నాకేమి చేసినారు ? అమ్మా ! నీ కంతకంటె నెక్కువ యేమైన

చేసినారా ?" అని బదులిడును. ఇచ్చట హాస్యరస పోషణము పాత్ర పోషణము నకు జీవమై సజీవ పాత్ర సృష్టికి దారి తీసినదని వేరుగా చెప్పనక్కర లేదు గదా! దీనిలో మరియొక్క ముచ్చటైన ముచ్చట మూడవ యంకములోని కోమటి దంపతుల ప్రణయ కలాపము.

సరస్వతి కోకిల మున్నగు నాటకములలో కొంతవఱకు ఆభాస శృంగారము హాస్యమునకు దారితీసినది. దీనితో పాటుగా అనుత్తమ పాత్ర గతమైన శృంగారముగూడ హాస్యహేతువైనది. సరస్వతిలో జయరామసింగు కురంగి యిట్టి పాత్రములే. కోకిల సరస్వతులలో స్త్రీ పురుషుల అన్య వేషధారణము వలన భ్రమలచే సంఘటిల్లిన శృంగారమును హాస్య పోషక మైనది.

శృంగారాభాసమువలెనే తక్కిన రసముల ఆభాసరూపములును హాస్య మొదవించును. నిపుణుడును, ప్రతిభావంతుడును అగు కవి మాత్రమే అట్టి హాస్యమును సృజింపగలడు. రాతి స్తంభములో నారాయణరావు మాటలలో ఉదాత్త భావములు ఆభాసము పొందింపబడి హాస్యము ఏర్పడినది.

"వేశ్యారక్తిగలిగిన రసజ్ఞునకు సంసారపు జంజాటము ముండగూడదు. ఈ దిక్కుమాలిన సంసారపు గొడవ 'యైహికానందానుభవమునకు నిరోధకమే- యాముష్మికానందానుభవమునకు నిరోధకమే. అందుకొఱకే సంసారమును బరిత్యజింపవలయునని పెద్దలు చెప్పినారు......"

ఈ పద్ధతి హాస్యమున అట్టి ప్రకృతిగల పాత్రలపై కవికిగల రోత, కసి కొట్టవచ్చినట్లు కన్పడుచుండును. పాత్రల యవివేకమును, అల్పబుద్ధిని అతిశయోక్తిగా ప్రకటించి వానిని హాస్యాస్పదముగా జేయుట ఈ పద్ధతి.

శృంగారమునకు పోషకమగు హాస్యము భయానక, రౌద్ర, శాంత, కరుణములకు విరోధియైనది. కావున ఆ నాలుగు రసములున్న పట్టుల హాస్యమును పరిహరింపవలసి యున్నది. ఈ విరుద్ధ రసములకు సన్నిహితత్వము ఒక్క విధముగా మాత్రమే కలుగును.

దీనిని

భృత్యయోర్నాయక స్యైవ నిసర్గద్వేషిణోరపి
అంగయో రంగినో భవేదేకత్ర సంగతిః

అని రసార్ణవసుధాకరకర్త వివరించియున్నాడు. పానుగంటివారినాటకములలో హాస్యము శక్తిమంతమై విరోధి రసముల కడ నైతము ఉజ్జ్వలమై నిలిచినది. ఇంతకు పూర్వము ఉదాహరింపబడిన పాదుక యందలి షష్ఠాంకస్థ విష్కంభము ఇందులకు తార్కాణము. పంచమాంకమున రామ వనవాస గమనమువలన దశరథాదులు పొందు శోకము హృద్యముగ చిత్రింపబడినది. సామాజికుల మనస్సులు దీనివలన కరుణ రసాస్పదములై యుండును. తిరిగి షష్ఠాంకము కరుణరస ప్రధానము. ఈ నడుమ పంతులుగారు వ్రాసిన విష్కంభము అనుచితమైన హాస్యముతోడిది. కాని పరిశీలించి చూచిన ఈ విష్కంభమును గూర్చిన పానుగంటివారిని తప్పుపట్టలేము. దీనివలన పూర్వోత్తర సన్నివేశములందలి కరుణము చెడలేదు. ఈ హాస్యమునకు వన్నె తగ్గలేదు.

ప్రచండ చాణక్యమున చాణక్యుడు అంతఃపురము ప్రవేశించి నంద సుతులను వధించు భీభత్స ఘట్టమున హాస్యము చోటుచేసికొనినది. సునందా దేవి రాజసము చాణక్యుని భీభత్సాత్మక చర్యల నడుమ ఇందుశర్మ చతుర సిగ తరుగుటకు పూని "మా మేనమామ శిరములు గోయగ నేను శిరోజములనైన గోయలేనను కొంటివా? హా హా! ఇదుగో అపర చాణక్యుడు – అపర చాణక్యుడు." అని చిందులు వేయును.

అయినను హాస్యము మానవుని ప్రాథమిక భావములలో నొకటి. వికృతి హాసకారణముగదా! చూడ నేర్చిన వానికి వికృతి సర్వవ్యాప్తమై కనుపట్టును. వేదాంతము ననుసరించి మానవ జీవితమే వికృతి. కావున హాస్యమునకు జీవితమందలి ఏ రంగమునను ప్రవేశ నిషిద్ధములులేవు. కాని సామాన్యులగు రచయితలు, లోకజ్ఞులు కాని వారు పాటించుటకై కల్పింపబడినవి ఆలంకారికుల సూచనలు; నేర్పరియైన కవి లోకమునుండి గ్రహించిన యనుభవములు ఆలంకారిక ప్రోక్త లక్షణముల కన్నను శిరోధార్యమైనవి.

కావుననే కవి సృష్టిని విమర్శించునప్పుడు దూకుడు కూడదు అని పానుగంటి వారు మఱల మఱల హెచ్చరించినారు.

## హాస్యాలంబన పాత్రములు

హాస్యమున ఆలంబనములుగా పంతులుగారు సృష్టించిన పాత్రలను పరిశీలించుటకు ముందు ఒక ప్రశ్న. నవ్వు పుట్టింప నేరని, వికార రహితుడగు వాడెవ్వడైన సృష్టిలో నుండునా ? ఎల్లర యందును స్వభావ సిద్ధమగు చమత్కారము ఉండును. ఎవడేని యిట్టి చమత్కారములేని వాడుండెనా అది ప్రకృతి విరుద్ధమైన ఘటన కావున అట్టివాడును హాస్యాలంబనమే యగుచున్నాడు. అందుచేత రససిద్ధుడయిన కవి తన పాత్రలను ఉత్తమ, మధ్యమాధమ పాత్రలుగా వివేకించుకొని, తత్తదనుకూలముగా హాస్య ముత్పాదించును.

ఉదాత్త నాయకులగు శ్రీరామాదులలో పంతులుగారు అందించిన ఉత్తమశ్రేణి హాస్యము మిక్కిలి మృదువుగను మనోహరముగను తోచును. అమ్మతో మాటలాడినను, చూపు మాత్రము నాపై నిలుపుము అని శ్రీరాముని చుబుకము పట్టి తనపై త్రిప్పుకొను దశరథుడు మున్నగు పాత్రలనుండి, నిర్లజ్జ కారణముగా పరిహాసాస్పదుడగు నారాయణరావు వఱకును అన్ని రకముల వారును ఈ నాటకముల నున్నారు.

పరిపాటిగా లోకమునందు హాస్యమొదవించు నంశములు, తరహా వ్యక్తులు కొల్లలుగా నుందురు. సాంప్రదాయికమైన హాస్యమున తిండిపోతుదనము వాగుడుకాయదనము అల్పజ్ఞానపూర్వకనహంకారము ఇవియన్నియు నపహాస్యార్హ మగు నంశములు. రెండవ పెండ్లి చేసికొనిన భర్తలు, చిన్న పిల్లల పరిణయమాడిన వృద్ధులు, వేశ్యమాతలు అప్రధాన పాత్రములలో బహు సంఖ్యాకములు ప్రాయికముగా వీరి నాటకములలోను హాస్య పాత్రలుగా నుండును. ఆయా నాటకములనుగూర్చి వివరముగాచర్చించినప్పుడు వీనికి పెక్కుదాహరణము లీవరకే ఒసగుట జరిగినది.

హాస్య పాత్రలను పోషించుటలో పంతులుగారు సాధారణముగా నుండు సంప్రదాయమును ఆదరించిరి. అనగా కోమటి, నబాబు మున్నగు పాత్రలపేర్లు వినగానే మనకు మునుముందు మనస్సులో హాస్యరసానుకూల మగు భావము ఉద్బుద్ధమగును దానిని విస్తరించుటలో వారు తమ ప్రత్యేక తను చూపినారు.

మొత్తము మీద చెప్పవలెననినచో వీరి హాస్య పాత్రలన్నియును సహజ వికారము కలవే. వీనిని తీర్చుటలో పంతులుగారు ఎక్కువగా ఔదార్యము, ఉదాత్తతలనే కనబఱచినారు. వారి నాటకములందలి హాస్యము ప్రాయికముగా హృదయ వైశాల్యమునే చాటునుగాని మనః ప్రజ్వలనమును పురస్కరించుకొనియుండదు. కసితో కటువుగా అధిక్షేపణ పద్ధతిని వారు హాస్యమును పోషించినది సాతియందే.

పాశ్చాత్య సంప్రదాయమున విషాదాంత రూపకములలో గంభీర హాస్యము ఉండుటకు వీలున్నది. పంతులుగారి విషాదాంతములలో ఉత్తమ మైనది పూర్ణిమ. ఇందు హాస్య ప్రధానమగు పాత్ర భైరవన్న యను దొంగ. ఇతడు కవి కూడను. తప్పిజారి ఇతడు దొంగలలో పడినాడనిపించును. తెలివి గలవాడు, వస్తుతః సాధువైనవాడు, చమత్కారి. శారద సహగమనము చేయుటకుగా ఏర్పాటు చేయుమని నప్పుడు ఆ పని సమ్మతము కాక పోవుటచే ఎదురెత్తి "అమ్మా! నీవు మాకు రాజవుకావు. నీ యాజ్ఞను వినవలసిన పని మాకులేదు. మా ప్రభు వీతడు. ఈతడట్టి యాజ్ఞ నిచ్చిన మొదల" అని పలికి తప్పింపజూచినాడు. కాని ఈ చమత్కారము దేవ రాజునకు ప్రాణ సంకటమైనది. తన నోటిమీదుగా తల్లి చావునకు ఏర్పాటు చేయుమని అతడు ఆజ్ఞాపింపవలసివచ్చెను. సర్వమంగళ దాసియగు పద్మినితో ఇతని ప్రణయముకూడ హాస్యయుక్తముగా నున్నది. పంతులుగారికి అలవాటగు మోతాదు మించిన శృంగారజ హాస్యము ఇందులేదు. తుదకు పద్మిని సోమనాథ దేవుని చేతిలో మరణించినప్పుడు "పద్మినీ! కవిని గట్టుకొని నీవు సుఖపడలేదు; నిన్ను గట్టుకొని కవి సుఖపడలేదు." అన్న రెండు వాక్యములలో గాఢ సంతాపము వ్యక్తీకరించి, పాఠకుల కన్నులు చెమర్చు

నట్లు చేసినాడు. ఆడుచు, పాడుచు, హాయిగా తిరుగుచుండిన ఒకవ్యక్తి పొందిన యీ దుఃఖము నాటక విషాదాంతతను పరిపూర్ణము చేయును. ఇట్లే హాస్యము విషాద భావతరంగణికి ఒక ఉపనదియైనది.

పూర్ణిమలోని కథాగతిలోనే కొంత చమత్కారమున్నది. దేవరాజు సోమనాథదేవుని లొంగదీయుటకై వేసిన మోసపు ఎత్తులు - వానిలో సోమనాథదేవుడు పడుట. కొంత హాస్యభావమును కలిగించును. కాని యిది స్వచ్ఛమగు హాస్యముగాదు. ఈ హాస్యముతో కలిసి యొక వికటచ్ఛాయ గోచరించుచుండును. పూర్ణిమ నాటకములో అట్టి విలక్షణమగు హాస్య మొకటి రెండు సన్నివేశములందున్నది.

ప్రథమాంకమున నాటకారంభముననే వీరసేనుడు భవానిదాసుడు అను ద్వారరక్షకులు కాపు కాయుచుండిరి. ఆ సమయమున పెండ్లికొడుకు తండ్రియగు విజయరావు తప్పించుకొని వచ్చుచుండగా వీరిలో భవాని దాసుడు గొంతు మార్చి అతనిని ఆకర్షించును.

వీర : భవానీదాసా...ఇతడే యీ శ్రాద్ధపు బెండ్లి కొడుకు తండ్రి. పెండ్లి కొడుకును జంపుటకంటె వియ్యంకుని జంపుటలో నెక్కువ ఘనత యున్నది సుమా !

భవా : ఎందుచేత ?

వీర : తిరుగనిట్టి నిర్భాగ్యపు బెండ్లికొడుకుల గనకుండ జేసినవాడు లోకోప కారి కాడా ?

(నేపథ్యమున) నాయనా ! దేవరాజా ! ఎచ్చట నున్నావు ?

భవా : (విచారముతో) తండ్రీ ఇక్కడ ఇక్కడ.

వీర : ఓరి నీ గొంతుకొయ్య, రాని యేడుపు నిట్టె తెచ్చుకొంటివి. నీవు రాజుగారి నటక సమాజములో బూడిద పూసికొనదగిన వాడవురా !

ఈ ఆక్షేపణములు, ఈ పరిహాసములు పిని తరువాత నేదో దారుణ మైన సంఘటన జరుగనున్నదని శంక కలిగించుచుండుటచేత ఈ హాస్యము నకు విలక్షణత కలుగును. నవ్వుకొని యొక నవ్వును ఒదవించును.

ఇట్టిదే మఱియొక సంఘటనము చతుర్థాంకమున నున్నది. దేవరాజు పారిపోవుటకు తోడుపడినాడన్న కసితో చంద్రశేఖరస్వామిని రక్షించుటకై సోమనాథుడు పిలిపించెను. తన కసికి, క్రౌర్యమునకు ముసుగువేసి వికటముగ "ఓమ్ గురుభ్యో నమః — శ్రీ పరమ గురుభ్యో నమః — శ్రీ మచ్చంద్ర శేఖర భగవత్పాదాచార్యేభ్యో నమః — ఏదీ! ఆశీర్వచనపు బనస! శతంజీవే — ఏదీ !" అనును. స్వామి శతంజీవే అనగానే సోమనాథుడు "ఎవడురా శతంజీవే — నేనా, దేవరాజా? నీ గొంతుక కొయ్య! ఆఁ! ఎవడురా అక్కడ? భటులారా! వాని చెవులు పట్టుకొనుడు" అని మండి పడును. ఇట్టిరీతి హాస్యము ట్రాజడీ వాతావరణమునకు అనుగుణమై యుండును గదా?

సరోజిని నాటకములో దుష్టపాత్ర, హాస్యాలంబన పాత్ర, సానుభూతి పాత్రము అన్నియు సరోజినియే. ఆమె చర్యలు మాటలును అపార్థములును అపోహలును దుర్వ్యాఖ్యానములును హాస్య భాజనములైనను మనకు పాత్రపై జాలి పొడముచుండును. నాటకము పొడుగునను కొమ్మనుండి పట్టువీడిన ఎండుటాకువలె, విషాదాంతతకే దారితీయుచున్న కథాగతి మూలమున కలుగు భీతితో హాస్యము సమ్మిశ్రితమై యుండును.

రాతి స్తంభము, పరిప్రేమలు, విషాదాంతత కలిగినను విషాదాంత నాటకముల స్థాయికి వచ్చునవి కావు.

## సాక్షి వ్యాసములందలి హాస్యము

సాక్షి వ్యాసములలో జంఘాలశాస్త్రి ముఖ్య పాత్రము. అతడు తన కృషిని తానే ఒకటి రెండు చోటుల సమీక్షించుకొనెను. మొదటి సంపుటము లోని 'తోలు బొమ్మలు'లో ఉపన్యాసము నడుమ శాస్త్రి యిట్లనును.

"మీ మనస్సులకు గిలిగింతనిచ్చు కాసంత మృదులతగల మాటలతో, రసనలకూట నిచ్చు కాసంత తీపి, కాసంత వెగటు మాటలతో మనలోనున్న దురభ్యాసములను దుష్ట విశ్వాసములను దుష్కర్మములను వెల్లడించుచుంటి నని నా నమ్మకము"

జంఘాలుని సంభాషణలోని హాస్యరస స్వరూపము ఈ మాటలలో వెల్లడియగుచున్నది. సాక్షి రచనలో పంతులుగారు పోషించిన హాస్యపు స్వరూపమును ఇదియే.

సాక్షి రచనా శిల్ప విధానము విచిత్రమైనది. దీనిలో గమనార్హమగు మొదటి యంశము— "విస్తృతి". చిన్న విషయమును చెప్పుటకు కూడ పంతులుగారు విపులమైన వర్ణనచేసి సుదీర్ఘములయిన ఉపోద్ఘాతములు చెప్పి. భావ చిత్ర పరంపరల రంగవల్లులు దీర్చి క్రమముగా చెప్పదలుచుకొనిన దానిని చెణుకుగా చెప్పుదురు. ఈ విపులీకరణమంతయును ఒక ఇంద్రజాల కలాపమువలె నుండును. ప్రాయికముగా నిది హాస్య పోషకమగును. చిటికెలో చెప్పదగిన దానిని వర్ణనలచిక్కు పెట్టి చెప్పుట వికృతియై హాస్యమును గలుగజేయును.

ఈ విస్తృతికి అనుబంధముగా చెప్పుకొనదగినది "వైశద్యము"అన వచ్చును.ఇదియు పానుగంటివారి ప్రత్యేకతయే వారి విస్తృత వర్ణనములలో భావనాత్మకమైన కల్పనకన్న వాస్తవికమయిన కల్పనయే మెండు. సహజోక్తి ప్రధానముగ కన్నులెదుట చూచుచున్నట్లు పాఠకులు ఊహింపని యన్ని వివరములు సూక్ష్మాంశములు వారు ఇత్తురు. "పురుషులకంటె స్త్రీ లెక్కు వగనున్నారు." ఇక్కడికి చెప్పవలసిన యంశమేదో ఆ సత్యకథనము అయినది. "కొర్నాటి చీరలవారు, బనారసు కోకలవారు, బరంపురపు పీతాంబరములవారు, సన్న కుసుంబా చీరలవారు, గోచికట్లవారు. గూడ కట్లవారు, చుట్టు త్రిప్పులవారు, మేలి ముసుగులవారు, వ్రేలుముళ్ళవారు, జడచుట్లవారు, వంక కొప్పులవారు..." ఈ సుదీర్ఘ వర్ణనవారు చేర్పక మానరు. ఇది నవ్వు పుట్టించును.

గంభీరముగ జెప్పవలసిన దానిని సూక్ష్మముగ తేల్చిచెప్పుట సాధారణ విషయము నెంతయు ఉదాత్తముగ చెప్పుట ఉక్తివిషయకముగా వారి హాస్యపద్ధతి. జంఘాలుడును వాణీ దాసుడును కలియబడిరి. వానిని సాక్షిచే పానుగంటివారు వర్ణింప జేసిన విధము ఇది. "కాల్చి కుండలో బడ వేసిన సీమ టపాకాయపెట్టెవలె టపటప ధమధమాంతర్గత చురచుర తుసు తుసు వారభటీ సాంప్రదాయమున దుదకు బల్ల క్రిందకు బడిన వీరు చిత్ర విచిత్ర శబ్ద ప్రతిసృష్టి నైపుణ్యమున ప్రకాశించిరి."

లక్ష్మీ నరసింహారావుగారిది పదనైన నాలుక; వారి లేఖిని తీవ్రమైనది. పర్యవసానముగా వారు వ్రాసిన వాక్యము ప్రాణము సంతరించుకొని ఎదుట నిలువబడి ఎవ్వరో చెప్పుచున్నట్లు. చదువుకొను చుండగా చెవులలో మనః కుహరములలో గింగురుమనును. వాక్యములో ఎక్కడో ఒకచోట వారు ఆ ప్రాణశక్తిని జాగృతము చేయుదురు. ఆ భాగము చదువసరికి అర్థము మూర్తిమంతమై పంచవర్ణ చిత్రమువలె మనో నేత్రములకు ప్రత్యక్ష మగును. అట్టి ప్రాణ శక్తితో గూడిన హాస్యమే పంతులుగారి రచనలో ఒకచో మృదు వ్యంగ్యమై, మఱియొకచో కటువ్యంగ్యమై తోచుచుండును,

చెప్పుచున్న విషయములకు గల ప్రాధాన్యము తూచినట్లు సమముగా బోధపడుటకై తుల్యాంశములను, ఉదాహరణములను పానుగంటి వారెన్నియో చెప్పుట కలదు. ఒకచో అర్థాంతరన్యాసము, మరియొకచో వికస్వరము ఇంకొకచో ఉపమ, వేరొకచో ఉత్ప్రేక్ష - ఇట్లనే కాలంకారములు గూర్చి యీ సామ్యమును వారు చిత్రింతురు. ఉదాత్తముగా వర్ణించు నెడలగాక, అధిక్షేపణము చేయతగిన స్థలములవారు ఈ తుల్యాంశముల నెన్నుకొనుటలోనే హాస్యరసము ఉద్బుద్ధమగును.

"శనివార ప్రాతః కాలమునకు దుర్ముహూర్తమునకు, బత్తె కట్టు కొయ్యకు బాడికి, నుప్పు చేపకు నాసాపుటరోమ దహన సమర్థమగు దుర్వాస నకు, యాచనకు దైన్యమునకు నెట్లవినా భావ సంబంధమో-పండ్ల శాస్త్రి లకు నూకి సాని కట్టి యభేదాధ్యవసాయము."

"కల్పనా చమత్కృతి, యలంకార సమృద్ధి, వివిధ రస విజృంభణము, వ్యంగ్య భావాది సంధాన చాకచక్యము కావలసిన యితివృత్తమునకు బద్యము తఱచుగా నావశ్యకము గాని లోక సాధారణ చర్యాకథన సాధన మగు చరిత్రమునకు బద్యరచనయే మంత యావశ్యకము ? సర్వహృదయా కర్షణ చణలైన కాంతా శిరోమణుల కలంకార సౌభాగ్యము రసోద్దీపన సమర్థమగు నంబర విలాసముగాని సాత్విక సంచారి భావాభావ పవిత్రయగు పూర్వ సువాసినికి బొత్తాముల అవికయేల, బంగారు జలతారు చీరపైటపై వజ్రపు సూదియేల ?"

ఈ యుదాహరణముల వలన తెల్లమగు విషయమేమనగా, ఒక విషయములోని వికృతిని స్పష్టముగ ప్రదర్శించుటకై పంతులుగారు అట్టి వికారమునే ఆరోపించి మరియొక సామ్యమును వెలికితెత్తురు. ఇట్టివి అనేకములు గుదిగ్రుచ్చి గ్రుక్క తిప్పుకోకుండ ఉపన్యసించుటలో వారి వెల్లడియగును.

సాక్షిలోగూడ శబ్దార్థములను ఆశ్రయించి ద్వివిధ హాస్యమున్నది. సన్నివేశ గతమైన హాస్యము పాత్రగతమైన హాస్యమును ఉన్నవి. ఆద్యంతము హాస్యరసము తొణికిసలాడు సాక్షి వ్యాసములలోని రసమయ ఘట్టములను వర్గీకరించి ఇన్ని విధముల హాస్యమును పోషించిరని చెప్పుట సాధ్యమైన పనియేకాదు. ఎచ్చటి కచ్చట వారు మౌలిక ప్రతిభతో నవనవోన్మేష మార్గములను అనుసరించిరి.

అర్థాశ్రయ హాస్యమును పోషించుటలో పంతులుగారికి నారి సద్యః స్ఫూర్తి మిగుల తోడుపడినది. సాక్షి సంఘము నిర్మించిన సాక్షి తొలి వ్యాసమున చెప్పిన మాటలు చూడుడు.

"మీ రైదుగురు చేరి యిట్టి మహాకార్యము సేయగలరా యని మీ రడుగుదురేమో ? ఉడుత లుదధిని బూడ్చినట్లు చేసెదము. తరువాత మాతో నెన్ని కోతులు చేరునో, యెన్ని కొండ ముచ్చులు నెలుగుబంట్లు కూడునో!"

ఒంఘూలశాస్త్రి పాశ్చాత్య నాగరికతా ప్రభావమునకు లోనైన వారిని హేళనముచేయుచు అద్భుత శిరస్నమాజమును ఆక్షేపించెను. ఆసందర్భమున అతడు ప్రశ్నించెను. "గోష్పాదమంత జుట్టున్నవాడు వెఱ్ఱివాడుగ మీ కగపడగ గొఱ్ఱెతలయంత జుట్టున్నవాడు మా కెట్టులగపడునో చెప్పవలయునా ?" జుట్టు పరిమాణమునకు వెఱ్ఱి పరిమాణమునకు లేని సంబంధము వెట్టి హేత్వాభాసము నిచ్చుట హాస్యముగా పంతులుగారు సాధించిరి. ఇదియును సద్యః కాలయుక్తియే. ఆ మాటకు వచ్చినచో పానుగంటివారి రచనలయందు ఎచ్చటను ప్రయత్న పూర్వకమయిన రచన యనిపించు లక్షణముండదు. దానియంతట నది మాట వెంట మాట, వాక్యము వెంట వాక్యము, ఊహ వెంట ఊహ మొలిచివచ్చినట్లుండును

పానుగంటివారి అర్థాశ్రయ హాస్యమును గూర్చి పరిశీలించినపుడు తోచు మరియొక లక్షణము వారి విలక్షణమైన యూహ. ఎవ్వరికిని తోచని యూహను వారు టక్కున ఒకటి రెండు వాక్యములలో ఇమిడ్చి వదలి వేయుదురు. ఆ ఊహలోని వైలక్షణ్యమువలన కలుగు హాస్యమునకు దాని హఠాత్ప్రకటనము ఉత్కర్ష కలిగించును.

పాచకజన మహాసభలో (సాక్షి ౭-౫) ఒక వంటవాడు తమ వృత్తి గౌరవమును స్థాపించుచు ఇట్లు ప్రతిపాదన చేయును. "ఇప్పు డాంధ్ర దేశమున నున్న కవులందరు వంట వాండ్రగునెడల భారతమాత పరమానందమున దాండవించును. కవుల లెక్కయేమి ? నలుడు వంటలవాడై స్వరాజ్యమును సంపాదించుకొన్నాడు. భీముడు వంటలవాడై స్వరాజ్యమును సంపాదించుకొనెను. అటులే కవులెల్ల పాచకులగునెడల స్వరాజ్యము మన కవలీలగ రాగలదు."

ఒక్కొక్కచోట సాక్షిలో లఘువైన యంశమునకు అక్కఱలేని గౌరవ మిచ్చి సూక్ష్మముగా చెప్పదగినదానిని విస్తరించి పంతులుగారు చమత్కారములు చేసిరి. "అన్నము లేని వాని బాధ బాధ కాదు. భార్య లేని వాని బాధ బాధ కాదు భర్తలేని దాని బాధ బాధకాదు, కొడుకు లేనివాని బాధ బాధకాదు. పొడుములేనివాని బాధ ముమ్మాటికిని బాధ"

ఇవి కాలాచార్యుని మాటలు. అతని కట్లగుటలో ఆశ్చర్యములేదు. కాని పాఠకులకు మాత్రము ఇది హాస్యహేతువు. ఈ బాధ స్వరూపమును ఇంత విస్తరించి వర్ణించి పంతులుగారు కడుపుబ్బ నవ్వించిరి.

వీని యన్నింటికి తోడు వీరి రచనలో ఉక్తి వైచిత్రియున్నది. సకల విధముల హాస్యములను దీనితో ఉజ్జీవనము పొందినవి. పంతులగారు చెప్పెడు తీరులో చిరునవ్వు తెప్పించు నంశముకూడ చిన్న భూకంపమువంటి నవ్వు పుట్టించునదిగా నగును.

"ఇంతలో జిన్ననూకిసాని పెద్దయేనుగువలె మందయానమున ముందు నకువచ్చి చేతు లెడమప్రక్కను జోడించి దండమిడెను. అంత నధ్యక్షుడు తెల్లబోయి "యిదెందులకండోయి" యని మునసబుగారి నడిగెను. "ఇది యిది యని మీరనుట న్యాయము కాదయ్యా! గౌరవము కొఱకు బ్రతుకు చున్నవారముగాని మరియొకటి కాదు. అల్లరి చిల్లర వారి ననినట్లనుట తగదయ్యా" యని సాని యధ్యక్షుని మందలించెను." ఈ రీతిగా 'సాగిపోవు గ్రంథాలయ వార్షికోత్సవము (సాక్షి 3-25) చదివిన ఈ లక్షణము స్పష్ట మగును.

పంతులుగారి శబ్దాశ్రయ హాస్యము ప్రత్యేకించుటకు వీలులేనట్లు అర్థాశ్రయ హాస్యములో కలిసిపోయినది. పై యుదాహరణమునందే చిన్ననూకిసాని పెద్దయేనుగువలె అనినప్పుడు వ్యతిరేకార్థ బోధకములయిన చిన్న, పెద్ద శబ్దముల కలయిక ఇచ్చట హాస్యమునకు పోషకమగుచున్నది.

పంతులుగారి రచనలలో అనుకృతి పదములకు ప్రాముఖ్యము ఎక్కువ. ఈ మిలమిలలు, జిలజిలలు, కలకలలు పకపకలకు వికవికలకు దారితీయును. చిన్న ఆంగ్లపదమును ఉపయోగించుటకు మారుగా పెద్ద సంస్కృత సమాసమువాడినచోట, ఆంగ్ల పారసీకాది పదములు తెలుగులో కలిపి వ్రాసినచోట శబ్దాశ్రయ హాస్యమున్నది. బనియన్లు తొడిగికొనిన వారిని ఖండకరకార్పాస కూర్పాసము వారు అనుట, నున్నగా జుట్టు వెనుకకు దువ్వినవానిని కమఠ పృష్ఠపరిపాటీ సమ శిరోవాటి వాడు అనుట ఇట్టివి.

ధనియాలు డై జెషనుకు మంచివి, మిరియాలు లివరుమీద ఆక్టు చేయును. పాలసర్యామీద ఓఘానా వేసినవాడు నలుపా తెలుపా ? ఇట్టి ఆంగ్లాది భాషా శబ్దముల కలయికవలన హాస్యము కలుగును. ఇదే విధముగా కొన్ని మతా చారములందు, కొన్ని వర్ణములవారిచే కొన్ని వ్యవహారములందు మాత్రమే ఉపయోగింపబడు రూఢ్యర్థముగల పదములను, పలుకుబడులను అన్యత్ర వాడుటయు హాస్యరసస్ఫూర్తి కలిగించును సాయించుట, తిరుమాళిగ మున్నైన పదములను పంతులుగారు చిత్రముగా చమత్కారము కొరకు అటనట వాడిరి.

ఇదే విధముగా పానుగంటివారు పదగుంభనము మూలమున హాస్య రసోద్బుద్ధి గావించిరి. చిత్రమైనమాటల పొందికతో విస్తృతభావమును కొద్దిలో నిముడించి వారు చెప్పుదురు. నవీనకాలానుగుణముగ క్రాపింగులు కత్తిరింపించుకొని మీసములు తీసివేసినవారిని జంఘాలుడు ఆక్షేపించుచు ఇట్లనును. "తల పెరుగుదేమి? మూతిగొరుగుదేమి?".

సాక్షివ్యాసములలో పాత్రగతమైన హాస్యమునకు కాలాచార్యుడు ప్రథమోదాహరణము. అతనిని పరిచయముచేయుచు సాక్షిచెప్పిన ఆకృతి గత వికారములు చూడనగును. సాక్షి తప్పతక్కిన నలుగురు సభ్యులందును ఇట్టి వికారములుండి వారు హాస్యాలంబనములైరి. స్వరూపమునందే కాక స్వభావమునందును వీరు వికృతులు గలవారే. కాలాచార్యుని వివాహావు తహద్దీ, నిరాఘాట నస్యభిక్షా దీక్ష, వాణిదాసుని యీర్ష్యావేశము శ్లేష కవితాప్రీతి. జంఘాల శాస్త్రి తీవ్రతాడంబరము, వీనివలన హాస్యాస్పదు లగుచున్నారు. సంఘ సభ్యులే కాక ప్రస్తావన వశమున వచ్చిన యనేక సంఘ టనముల లోని పాత్రములు సైతము నిట్లే స్వభావ వికారముచే హాస్యాలం బనము లగుచున్నారు. సాక్షి సంఘదూషణమూలమున వ్యక్తులను సంస్క రించుటకై వ్రాసినదగుట చేత ఇందు వికార మనస్తత్వములుగల పాత్రలను నిర్మించుట యావశ్యకమైనది.

సన్నివేశగతమగు హాస్యమునకు కూడ సాక్షియందు ఉదాహరణములు కోకొల్లలుగా లభించును. స్త్రీస్వాతంత్ర్యము (1-4) లో స్త్రీ, పురుష

రాజ్యముల వీరుల యుద్ధము, సారంగధర నాటక ప్రదర్శనము (1-12) గ్రంథాలయ వార్షికోత్సవ విశేషములు (3-25) మున్నగునవి ఎన్నియో హాస్యమయ సన్నివేశములతో ఒప్పుచున్నవి.

సాక్షియందని అధిక్షేపణ హాస్యము, వ్యంగ్యము మిక్కిలి నిశితమైనవి. "నా ప్రక్క నొక మురికినాటి వైదిక బ్రహ్మచారి కూరుచుండి తానుంచు కొనిన దూదేకులది పరమ యోగ్యురాలనియు నిప్పుడు శ్రీ పార్వతీ పరమేశ్వరుల వారి కటాక్షమున గర్భవతిగా నున్నదనియు, వేవిళ్లెక్కువగా నుండుటచేత బుల్లని వస్తువునందధిక ప్రీతి కలిగియున్నదనియును-" ఇట్టి వాక్యములలో అధిక్షేపణ వ్యంగ్యము దట్టించినట్లుగా నుండును. "యూనియన్ గుమాస్తాపని పరీక్షకు జదువుచుండి తప్పిపోయిన తత్త్వజ్ఞాన నిధి". వంటి కూర్పులు అతిసులభముగా పంతులుగారు చేయుచుందురు.

సాక్షివ్యాసము లారంభించినప్పుడు పంతులుగారు హాస్యప్రధానములుగా వానిని ఉద్దేశించిరి. కాని క్రమ క్రమముగా పంతులుగారి దృక్పథము మారిపోయినది. జీవితమునుగూర్చి లోకమునుగూర్చి వారికున్న యభిప్రాయములు కొంత మారుచు వచ్చినవి. లోక యాత్రయందలి ఆనందానుభూతులకన్న కష్టక్లిష్టములగు ననుభవముల ముద్ర వారి మనస్సుపై ప్రబలతరమైనది. లోకమును సంస్కరించు ప్రయత్నము తీవ్రతరమైన కొలదియు సంస్కరింపబడవలసిన ఆవశ్యకము లోకమున హెచ్చగుచున్నట్లు వారికి రూఢిగా తోచినది. ఆ కారణముచేత మొదటి రెండుమూడు సంపుటములలో ఎక్కడనోగాని కన్పట్టని కటు వ్యంగ్యము క్రమక్రమముగా తరువాత ఎక్కడ చూచినను అదే యైనది. అధిక్షేపణ విషయమునగూడ తొలి వ్యాసములలో కొంత తీవ్రముగానున్నను వెనుక కొంత సానుభూతియు కన్పట్టుచుండును. కాని క్రమక్రమముగా అధిక్షేపణమునకు వెనుక నిస్పృహా, నైరాశ్యము బాధ, విరక్తి గోచరించి సానుభూతి సన్నగిల్లినట్లు అనిపించును. కాని సంస్కారము కలిగిన పంతులుగారు ఎట్టి వ్యథలోనైనను నిరాశలోనైనను మానవత్వముపైని విశ్వాసమును, సానుభూతిని పరిత్యజింపలేదు.

# సమీక్ష

పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారికి హాస్య వాఙ్మయ నిర్మాతగా ఆంధ్ర సాహిత్య చరిత్రలో అగ్రగణ్యమగు స్థానము కలదు. ఆంగ్ల సారస్వతములో ఛార్లెస్ డికెన్సు, ఎడిసన్, స్విఫ్ట్, షేక్స్పియరు ప్రభృతుల హాస్యరస పోషణ సంవిధానము వారు చక్కగా నెఱిగిరి. తెలుగులోగూడ అట్టి ఉదాత్త హాస్యమును కల్పించుటకు విశేషకృషిచేసి వారు కృతకృత్యులైరి.

పానుగంటివారి హాస్యసృష్టికి మూలమైనది వారు చేసిన లోకవృత్త పరిశీలనము, వారి లోకజ్ఞత. మానవత్వమును ఆరాధించు పంతులుగారు దేశ కాల పరిస్థితులకు తలలొగ్గి ప్రవర్తించు సామాన్య మానవుల దిన చర్యలలోగల వ్యత్యస్త పరిస్థితులను సానుభూతితో గమనించి చక్కదిద్దుటకై యత్నించిరి. ఈ ప్రయత్నములో వారి హాస్య వాఙ్మయ నిర్మాణ కౌశలము వారికొక శక్తియుతమగు నాయుధమైనది. పంతులుగారు అధిక్షేపణ హాస్యమును పరాకాష్ఠదశకు గొనిపోయిరి.

స్పెక్టేటర్ వ్యాసావళికి ముగ్ధులై తెలుగులో అట్టి సాక్షి వ్యాసములు వెలయించినను పానుగంటివారు ఎడిసన్ సౌమ్యధోరణిని చేబట్టలేదు. వారి హాస్యరచన మౌలికముగా డికెన్స్ ధోరణికి సన్నిహితము. డికెన్స్ హాస్యములో ఎక్కువగా నవ్వించు గుణము కలదు. డికెన్స్‌గూడ మానవ చర్యలలో అర్థరహితమై, హాస్యాస్పదములగు వానిని అపహసించినను, ఈ నవ్వుల మాటున ఒక విసురు ఉండునుగాని సూటిగా తీవ్రముగా ఎదుర్కొనడు. స్విఫ్ట్ అట్లుకాదు– కసితో గూడియుండును. అతని అధిక్షేపణము కటువై బుసలుకొట్టి, పెదుపును అణచుకొని మొగము గంటువెట్టుకొని నవ్వినట్లుండు నవ్వుపుట్టించును. పంతులుగారు క్రమముగా డికెన్స్ ధోరణి నుండి స్విఫ్ట్ ప్రభావమునకు తరలినారు, సాక్షి వ్యాసములలో కొన్నిచోట్ల పంతులుగారు ఉన్మత్త వేదన తోడనే వ్రాసినారు. కాని ఇదివరకే చెప్పినట్లు అచ్చటి సుగుణమేమనిన, మానవత్వమునందలి విశ్వాసము వారు పోగొట్టుకొనలేదు.

పంతులుగారు ఎంత తీక్షణముగా అధిక్షేపించినను, దూషించినను వారిని తప్పు పట్టజాలము. ఆ తీవ్రాక్షేపణము వెంటనే వారు లాలనగా హితవు చెప్పుట చూడగలము. తప్పుపనిచేసెననియో, సరిగా చదువుకొనలేదనియో విద్యార్థినిదండించు గురూత్తమునివలె ఆయన మూర్తి తోచును.

అధిక్షేపణ చేయుటలో పంతులుగారికి గల భాషా పాటవము, ఉద్విగ్న ప్రకృతి, రచనా సామర్థ్యము వెల్లడియైనట్లే, అపహాస్యముచేయుటలో వారి కళా కౌశలము వెల్లడి యగుచుండును. పంతులుగారి యీ మూర్తి ప్రసన్నమైనది కన్నులలో తళుకువలన మాత్రమే నగవు గోచరించు గంభీరాకృతియై వారి రూపము సాక్షాత్కరించును పంతులుగారి హాస్య సృష్టిలోని విశేషభాగము వారు ఈ అంశమునుండి సృజించినదే యనుటలో అనుమానములేదు. నిరంతర పరిశీలనముచే మాత్రమే సాధ్యమైనది ఇచ్చటి హాస్య సృష్టి. నాటకములలోని బహు సంఖ్యాక విష్కంభ పాత్రములు, సాక్షి వ్యాసములలోని అనేకోపాఖ్యానములు ఇందలివే. వాస్తవికత యందలి ఒక అంశమును అతిశయముగా చిత్రించి తాను నవ్వుచు ఇతరుల నవ్వించు ప్రసన్న మనఃస్థితినుండి యొక చిత్రపాత్ర సంకీర్ణ ప్రపంచమును సృజించిన బ్రహ్మ పంతులుగారు. దీనిని బట్టియే పంతులుగారు తెలుగుదేశపు డికెన్సు అనిపించును. షేక్స్పియర్ ప్రభావముగూడ ఇచ్చటనే గోచరించును.

పానుగంటివారి హాస్యములో నీలి నీడలు లేక పోలేదు. పంతులుగారు కొన్నియెడల ఔచిత్య విషయమున ఎంత అప్రమత్తులో, అంత తెంపరులుకూడను. ఆ కారణముచేత అధమవర్గమునకు చెందిన హాస్య పాత్రలను సృజించి వారిచే యథేచ్ఛా ప్రసంగములు చేయించిరి. స్త్రీ పురుష సంబంధమునకు పవిత్ర ప్రేమ నిరూపణరూప మహోన్నత భవనములు కట్టిన వారు పరిసరములలో మురుగు వీధులను తొలగింపలేదు. ఇట్టి అనౌచిత్యములకు పాలుపడిన హాస్యమునకు కొల్లలుగా వారి పుస్తకములందు ఉదాహరణములు ఉన్నవి.

ఏది ఎట్లున్నను పంతులుగారు తెలుగులో హాస్య రచనములు చేయుటలో క్రొత్త ప్రయోగములు చేసి క్రొత్త దారులు త్రొక్కిరి. కందుకూరి వీరేశలింగము పంతులుగారు కొంతవరకిట్టి అధిక్షేపణ హాస్యమును హాస్య ప్రధానమగు కృతులను వ్రాసినను, కళాత్మక దృష్టితో ఆ మార్గమునకు మెరుగులుపెట్టినది పానుగంటివారే.

## ఉ ప క్ర మ ణి క

ఇంత వఱకును పంతులుగారి కృతులను ఒక్క టొక్కటిగా సమీ క్షించుట అయినది. రూపక రచనలో, హాస్య వచన రచనలలో వారి విశిష్టతను పరిశీలించుటయు నైనది. ఈ అధ్యాయమున వారి సాహిత్యసృష్టియందలి మఱికొన్ని విశేషములను సమీక్షించుట జరుగును.

పానుగంటివారి కృతులను సవిమర్శముగా పఠించినప్పుడు వారు ఉత్తమ కవులలో నొక్కరని స్ఫురించుటలో ఆశ్చర్యములేదు. వారి నేతృత, ప్రతిభ, వ్యుత్పన్నత, ఉదాత్తత, లక్ష్యశుద్ధి, విశ్వకల్యాణాకాంక్ష — అన్నియును పాఠకుల హృదయములలో వారి మూర్తిని ఉన్నతముగా ప్రతిష్ఠించును. పానుగంటివారు ఉబుసుపోకకుగాని, కేవలము కీర్తికొరకు గాని, జీవిక కొరకుగా మాత్రమేగాని రచనలు చేయలేదు. వారికి పర మేశ్వరుడు కవిత్వ సృష్టికి గావలసిన యర్హతలను ప్రసాదించెను. విచక్షణా పటిష్టమగు మనస్సు, విశేషగ్రహణశక్తిగల బుద్ధి, ప్రకృతి లోలోతుల పరిశీ లింపగల నిశితదృష్టి, ఈ యన్నింటికంటె మిన్నగా స్పందనశక్తిగల హృదయము-ఇవి వారి కున్నవి. ఇకవారు సాహిత్య స్రష్టకాకపోవుటయెట్లు?

కావ్య నిర్మాణమునకు నిసర్గములగు ఈ ఉపకరణములేగాక వారికి వ్యుత్పన్నత, నవ్యాన్వేషణకుతూహలము తోడై వారిని ఒక కవితాశిల్పిగా చేసినవి. తాముచేపట్టిన ప్రక్రియలలో శిల్పమార్గమున తమకొక విశిష్టతను వారు సాధించుకొనినారు గదా ! సాహిత్య సృష్టి చేయుటలో వారికి భవ్యమగు ఒక ఆవేశౌజ్జ్వల్యము ఉన్నట్లు తోచును. లోకచర్యల యందలి వైపరీత్యములను గమనించి, వానిని సంస్కరింపవలెనను తీవ్రతచే పంతులు గారు రచనలు కావించిరి. శివేతరక్షతి చేయుచు, శుభంకరములగు భావము లను వ్యాపింపజేయుటకు వారు చేసిన కృషి సాహిత్య రంగమున నాటకములుగ, గద్యకావ్యములుగ, ప్రహసనములుగ ఫలించినది. వారి

సాహిత్య సృష్టికి మూలమైన అట్టి ఆవేశమునందలి గాఢతయే వారి సజీవ పాత్ర సృష్టికి, ప్రాణధురంధరమైన శైలికిని హేతువైనది.

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు నవీన గుణసనాథులు, రస పోషణ సంవిధాన చక్రవర్తులు అని నిస్సందేహముగా చెప్పుకొనవచ్చును. క్రమముగా ఈ అధ్యాయమున ఆయా గుణములు సమీక్షింపబడును.

## కవితా ప్రతిభ

పానుగంటివారు పద్యకావ్యములు బహుళముగా అల్లలేదు. "విష్ణు నామ సహస్రమాల" ఒక్కటే వీరి పద్యమయ రచన. ఇందైనను నలుబది నాల్గు సీస పద్యములు మాత్రమే యున్నవి. పద్య కావ్యకర్తలు మాత్రమే కవి శబ్దవాచ్యులను కొనుట ప్రౌఢ సారస్వత జ్ఞానము లేనివారి భ్రమ గదా!

పంతులుగారిది కవి హృదయము. కావుననే ఆంధ్ర సాహిత్య పరిష దేకాదశ వార్షికోత్సవములకు అధ్యక్షత వహించినప్పుడిట్లు పలుకగలిగినారు.

"గంగానది నురుగులో, కైలాసేశ్వరుని జటాజూట మావరించిన మందహాసమును మనము గాంచలేనప్పుడు మనకు గవిత్వ మెక్కడిది ? గరుడుడు కృష్ణా యనునప్పుడు "విష్ణువాహ నమస్తుభ్యం పక్షి రాజాయతే నమః" యని చేతులు జోడించుకొనలేని మనకు గవిత్వమెక్కడిది ?"

ఎట్టి సాధారణ దృశ్యములు వారి మనస్సులో ఎట్టి సుందర భావము లను పొడమించినవో చూడుడు. వచన రచనలో శైలీ భేదములు ఏర్పడ వలెనని చెప్పుచు వారు ఈ ఉపన్యాసమున ఎట్టి భావ చిత్రణము చేసిరో కనినవారికి వారి కవి హృదయము సాక్షాత్కరింపదా ?

పంతులుగారు ప్రతిభ, వ్యుత్పన్నత, అభ్యాసము మూడును సమముగా గల మహాకవి. వారు గద్యము వ్రాసినను, పద్యములు – అందును వృత్త ములు పొంకముగా వ్రాయగలిగినను, లేకున్నను – వారి కవితాశక్తి ఎట్లు మరుగుపడును ? వారే చెప్పినట్లు ఎచ్చట రసముండునో అచ్చట కవిత్వ ముండును. కవిత్వము గుణములో నున్నదిగాని గణములో లేదు.

కవిత వర్ణనాత్మకమైనది. కవి ప్రతిభ అతని దర్శన ప్రదర్శన శక్తులపై ఆధారపడియుండును. సునిశితమైన ప్రతిభాచతువుగలవారు మనసు కేంద్రీకృతముచేసి "అతి రూక్ష చింతనాగ్రస్థితము" అగు ప్రకృతి నిజ స్వరూపమును, అచ్చమగు సౌందర్యమును కనుగొనినట్లు వారి రచనలలో అనేక భాగములు స్పష్టముచేయును.

నాటకములలో వారు సృష్టించిన పాత్రములను ప్రత్యక్షము చేయుటలో ప్రతిభా సాధ్యములగు చిత్రముల నెన్నింటినో వారు గీచిరి. అందలి విశేష మేమనగా, ఆ పాత్రలను భావోద్వేగపు టనుభవములకు సంబంధించిన కదలికలలో నుండగా అందు ఒక భంగిమలో పంతులుగారు వానిని పట్టుకొనగలిగిరి. కావుననే ఆ స్తబ్ధ చిత్రములలో ఒక చైతన్యము ఉండి అవి ఆహ్లాదదాయకములు అగుచున్నవి నర్మదా వియోగ తప్తుడగు పురుకుత్సుడు, శృంగారరస మూర్తియై రదములు వెన్నెలగాయ నవ్వు కోకిల, రాధాకాంతకు భక్త్యున్మాదమున మనోఫలకముపై సాక్షాత్కరించిన దివ్యమంగళ మూర్తి ఇందరును దీనికి తార్కాణము.

పాత్రల బాహ్యరూపములనేగాక వారు మనస్సుల అంతరాంతరము గూడ వారు కనుగొనిరి. ఒక్క మాటలో చెప్పినచో మానవ మనస్తత్వపు లోతులన్నిటిని వారి లేఖిని స్పృశించినది. శబ్దమాత్ర సహాయముతో ఆ భావములను, అనుభవములను వారు లెస్సగా పలికింపగలిగిరి. అట్లు వారు రససిద్ధులగు నుత్తమ కవులైరి.

రసానుకూలములగు పదము లుపయోగించుటలో వారి సిద్ధహస్తత ప్రశంసార్హమైనది. వారి రచన చదువుచు చదువుచునుండగా నొక్క మాటలో రసానుభవము గలిగి పాఠకుని స్వరము గద్గదికమగును. సాక్షి వ్యాసముల నుండి ఈ వరకే ఉదాహృతములైన భాగములు పరిశీలించినవారి కవన చాతుర్యము స్పష్టమగుచున్నది గదా! పంతులుగారి కవితా ప్రతిభ ప్రధానముగా వారి వర్ణన శక్తివలన ద్యోతకమగుచున్నను, ఈ సందర్భమున చెప్పుకొనదగిన గుణము లింకను గలవు. వారి రస పోషణ విధానము, ఆలంకారిక రచన, శైలి మున్నగునవి పరిశీలనార్హములు.

## రస పోషణము

లక్ష్మీనరసింహారావుగారు రస పోషణ సంవిధాన చక్రవర్తులను కొంటిమి. వారి కృతులలో అన్ని రసములును ఉన్నవి; రస భావములున్నవి. వారి హాస్య రసమునుగూర్చి ఈవరకే వివరించుటయైనది. ఇప్పుడు తక్కిన రసములను వారు నిర్వహించిన విధానము వివరింపబడును.

పంతులుగారు శృంగారి. వారి రచనలలో శృంగార రస ప్రాధాన్యము అనల్పము. చుంబనాశ్లేషములతో గూడిన కాయిక శృంగారము నధిగమించిన అలౌకిక ప్రేమ మహత్వము, అందులకు ఏతాము పెట్టుగా విరుద్ధమైన మదనోన్మత్తత-అన్నింటిని వారు తమ కావ్యములలో వర్ణించిరి.

నర్మదాపురు కుత్సీయమునందు పంతులుగారు ఆలంకారిక సమ్మత మును, సాంప్రదాయికమును అగుపద్ధతిని శృంగార రస పోషణము చేసిరి. కాళిదాస మహాకవి నాటకమును ఆదర్శముగా నుంచుకొని వ్రాసిన దగుటచే, శృంగార నిరూపణమున గూడ ఆ మహాకవితో స్పర్ధ పెట్టుకొనినట్లు వ్రాసి యున్నారు. అమలిన శృంగారమునకు వారి పాత్రలలో రాధ (రాధా కృష్ణ), కళాలలితా కళాలలితులు (సరస్వతి) పేర్కొనదగినవారు.

కామమే ప్రధానముగా, జుగుప్సావహముగ ప్రవర్తించిన పాత్రలును వీరి నాటకములలో నున్నారు. రసభావములను కావ్యకర్తలు పాత్రలనుబట్టి పరిస్థితులనుబట్టి చెప్పించుచుండవలయునను మాట కాదనరానిదే। అయినను చెప్పించు ధోరణిలో ముతుక పద్ధతి నవలంబించుట ఎట్లు చూచినను సమర్థింప రానిది. "నా యీ పాత్ర యిట్టిది." అనుటలో కవి అనౌచిత్యము సమసి పోవునట్లు చేయజాలడు. రాతి స్తంభములో నారాయణరావు ద్వితీయాంక మున - త్రాగియున్నప్పుడే అనుకొనుడు - పాడిన పాట, ఆ తరువాత పలికిన పలుకులు చూడుడు.

"సానిదాని తెచ్చినాడు సంతలోన బెట్టినాడు
గోనెగుడ్డ గప్పినాడు - కోక కొంగులాగినాడు"

"మగవానికి మీసమెంత డాబో ఆడుదాని కదిగో! యది యంత డాబు - హె హె హే! దాని పేరెందులకు దలపెట్టలేదో యెఱుగుదువా? అసభ్యము, ఎవరికి? చదువుకొన్న నపుంసకపు ముండకొడుకులకు".

శృంగారము పేరిట ఇట్టి దూకుడు మాటలు ఎక్కువ యగుటచేతనే వారు చిత్రించిన యమలిన శృంగారము పరువుకూడ విస్మృతమై పోయినది. పంతులుగారి మనస్సునకు చైతన్యశక్తి ఎక్కువ. వడ్లగింజంత బరువు ఒక సిబ్బిలో పడినచో ఆ సిబ్బి నేలమీదకు, రెండవసిబ్బి నింగిమీదకు పోవు త్రాసువంటిది వారి మనస్సు. అందువలననే ఉత్తమ శృంగారము వర్ణించిన చోట మిన్నందుకొనిరి, అధమ శృంగారము చూపుచో ఊహింపరాని యడుగునకు పోయిరి. ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు అన్న రీతి ఒకచో నగౌన్నత్యము, మరియొకచోట పృథ్వీలుంఠనము వారి కృతుల యందు గోచరించుచుండును.

పంతులుగారి మనస్సునకున్న యీ తీవ్రతయే వారి గుణదోషములు రెండింటికిని హేతువై యున్నది. శృంగార హాస్యములకు ఇట్టి తీవ్రత సమగ్రముగా ఉపయుక్తమగునది కాదు అవి రెండును లాలిత్యముచే శోభిల్లు రసములు. వానిని సముచితముగా నిర్వహించుటకు సంయమనము ఆవశ్యకమై యుండును. కరుణ, వీరము లట్లుగాదు - వీనిలో మనస్సెంత ప్రజ్వలించిన అంత రక్తికట్టును. ఈ కారణముచే వారు కరుణ వీరరసము లలో ఉన్నత పదము లందుకొన జాలిరి. పాదుకా పట్టాభిషేకమున దశరథ పాత్రగతముగా వారు ఆవిష్కరించిన కరుణము అనితర సాధ్యమనిపించును. చూడామణిలో పద్మావతీ పాత్రగత వీరరసావిష్కారమును అట్టిదే. అదే విధముగ భక్తిరసమునందును మనస్సును బిగియలాగి యుంచుకొనవలసిన పని కలుగదు. పోగలిగినంత మేరయు ఊహ ప్రసరింపజేయవచ్చును. కావు ననే పంతులుగారు రాధాకృష్ణలో, విప్రనారాయణలో భక్తిరసమును పరాకాష్ఠదశ పొందింపజాలిరి.

ప్రచండ చాణక్యము, పూర్ణిమలలో వారు రౌద్ర భీభత్సములను పోషించిరి. వారే రసమును పోషించినను దానిలో ఒక విశిష్టమైన పద్ధతి

వారికున్నది వారు విలక్షణముగ నూహసేయుదురు. అట్టి ఊహ యొక్క మహాత్మ్య ప్రకటనము రసోత్కర్ష కలిగించును. పాదుకలో శ్రీరామ వనవాసము నకు దుఃఖించుచున్న దశరథుడు తన్నువధింపుమని లక్ష్మణుని వేడుట - శిరంబు గిరగిర దొరలుచు రాము పాదముల బడవలెనని విధించుట - ఆ ఒక్కవాక్యముతో ఎంత రసపుష్టి కలుగును? ఎదురుచూడని యిట్టి భావపు మలుపులు వారి రచనలలో పరిపాటిగా రసోత్కర్షకములగును.

నాటక పాత్రలచే సంభాషణము చేయించునప్పుడు ఆ యా సందర్భ ములలోనున్న చిత్తవృత్తిని అనుసరించి, మనసులో పొడము భావముల కదలికలకు అనురూపముగా వారు వాక్యముల దైర్ఘ్యము నిబంధించెదరు. ఆయాపట్టుల భాషకూడ తదనురూపగాంభీర్యాది గుణములు వహించును రసభావావేగమునకు సంభాషణములు రూపాంతరములై సులువుగా నాటక ప్రయోగము రక్తికట్టును.

రసానందానుభవమెట్లు మాటలలో వివరింపరానిదో, తదానంద హేతువును అట్లు విశదీకరింప శక్యముకానిదే. కావున పంతులుగారి సరస కవన ప్రశస్తి చేయవలసినదే కాని దానిని విభజించి చూపుట యశక్య కార్యము - పంతులుగారి రచనలో శబ్దార్థములు, అలంకారములు, గుణ, రీతులు రసాభిముఖములై యుండునని, కనుమూసి తెఱచునంతలో వారు పాఠక సామాజికులను రసానంద శిఖరము లెక్కింపగలరని మాత్రమే సంగ్రహముగా నుడువదగును.

## ఆలంకారిక రచన

పానుగంటివారి రచనలో అలంకారములకు వినియోగ మెక్కువ. సాక్షి వ్యాసములలో ఒక్క వాక్యమేని బీరుపోకుండ, ఒకటి రెండు పుటలు దాక శబ్దార్థాలంకారయుక్తమగు రచన సాగిన ఘట్టములు పెక్కులున్నవి. పంతులుగారు ఎక్కువగా ఔపమ్యమూలకములగు అలంకారములనే కూర్చు చుందురు. వారి ఉపమాలంకార వైభవము వారికి ఆంధ్ర కాళిదాస ప్రశస్తి సంపాదించి పెట్టినది.

ఉపమ మిక్కిలి ప్రాథమికమయిన అలంకారము. నిత్య వ్యవహారములో ఇది అప్రయత్నముగనే దొరలుచుండును. ఇట్టి అలంకారమును జేపట్టి విశిష్టత చూపించుకొనుట సులభమైన పనికాదు. వస్తు స్వరూప స్వభావము లను మాత్రమే కాక విపులమగు సన్నివేశములను పోల్చి చెప్పుటకు గూడ పంతులుగారు ఉపమాలంకారము వాడిరి. ఆ ఉపమానములు సాంగముగా, వర్ణ్యాంశమును నిరూపించుచుండును.

అరణ్యమున కేగనున్న సీతారాముల కిరుప్రక్కల శోక బాష్పాకులు లగు కౌసల్యా దశరథులున్న సన్నివేశమును చూడుడు– ఈ వర్ణన వసిష్ఠు నిచే చేయించిరి.

"దంపతులు చెరియొక వంకఁ దల్లడిల్ల
నడుమ జానకీయుత రాముఁ డడరు సోమ
యాజియును సోమిదమ్మ బాష్పాంబు లొలుక
మధ్యమున నకీలాజ్య ధూమమ్ము బోలె."

ఇట్లే సమగ్రోపమకు "నర్మద" యందలి పురుకుత్సుని మాటలు చూడుడు :

"భయము, సిగ్గు, నెనరు, బలుశంక, సంభ్రమం
బాశ, సంతసంబు లన్నికలిసి
చిత్రగతిని గ్రమ్మె చింతార్ద్రమౌ మది
జలదగత సురేంద్ర చాపమట్లు."

ప్రచండ చాణక్య ప్రస్తావనలోని కూచివారి పద్యమును అనుసరించి, పానుగంటి వారు ఎన్నియో విజ్ఞాన శాస్త్ర సంబంధులగు ఉపమానములు కూర్చిరి. వీని వలన చమత్కారము కలిగినను, రస పోషణానుకూల్యము కలుగలేదు. అట్లే పంతులుగారు చమత్కారమునకై కాల సంబంధులగు అనౌచిత్యమును పాటింపక వ్రాసిన ఘట్టములును ఉన్నవి. ఏమయినను పంతులుగారి యుపమానములు వారి నిశిత పరిశీలనమును, అద్భుతకరమగు ప్రతిభను వ్యక్తము చేయుచుండును.

సాక్షి వ్యాసములలో వారు భావికాలంకారము నెక్కువగా నుపయోగించిరి. దానివలన కథలలో ఎట్లు రసపుష్టి కలిగినదో ఉదాహృతులు ఈ వరకే ఇచ్చుటయైనది.

సాంప్రదాయికమగు రూపకోత్ప్రేక్షాతిశయోక్తి స్వభావోక్తులు మున్నగునవే కాక, పంతులుగారి రచనలలో ఆంగ్ల సాహిత్య ప్రభావమున క్రొత్తగా వచ్చిన అలంకారములును గలవు.

"మహాకవి నిలయమగుటచే రక్తికి, మహా రాజాస్థానమగుటచే భుక్తికి, మాధవ మహాక్షేత్రమగుటచే ముక్తికి నిదానమైన యీ పుర మాంధ్రదేశ మహిళామతల్లి కంఠమాలా నాయకమణియై ప్రకాశించుచున్నది."

—క్లైమాక్సు.

"ఇప్పటి యసహాయ వాదుల ప్రచారమహిమచే పల్లెపాలెములో నిద్దరు ఫాక్సులు—తెనాలిలో నల్వురు డెమాస్థెనీసులు—సీతానగరములో నెనమండ్రు సిసిరోలు – గ్రామ గ్రామమునకు గ్లాడ్స్టనులే."

—సినెక్డొకి.

"అక్షపాదుఁడుండగా నరిస్టాటిలు చదివిన వారొకరు. పాణిని యుండగా బెయిను చదివిన వారొకరు."

—మెటానొమీ.

"పోనీ, చిరకాలాచారములనైన మీరు గణించు చున్నారా? సహస్ర ఘటాభిషేకముల నమ్మికతోఁ జేసితిరా? నదీ గర్భమున విరాట పర్వమును జదివించితిరా? పురాణములు, పూర్వాచారములు బూతులా? ఇంకను వర్షములు లేవనుచున్నారా? మీకు బుద్ధు లున్నయెడల వర్షములేల లేకుండును?"

—ఇంటరాగేషన్.

"ఓ! ఇందరు జ్ఞానసూర్యులొక్కసారి మా యజ్ఞాన తిమిరవిచ్ఛేదమునకై యిట నుదయించి యుండ నింక మాకు రాత్రి యెక్కడిది? ఇక మీ వలన మాకుఁ బగలే! మీ చదువులేమి? మీ జ్ఞానములేమి! మీ వచో

నై పుణ్యము లేమి ? మీ యధిక్షేపణ సామర్థ్యము లేమి ! మీ దేహదార్ఢ్యము లేమి ! మీ మనఃస్థైర్యము లేమి ! మీ మతాభిమానము లేమి! మీ పూర్వాచార సంప్రదాయ విశ్వాసము లేమి ! మీ స్వభాషాభిలాష లేమి ? మీ బంధు మర్యాద వై ఖరులేమి !"

—ఎక్స్ట్రీమేషన్.

పంతులుగారి వచన రచనమున – ముఖ్యముగా సాక్షిలో నిట్టి యాలంకారిక సమృద్ధి ఆద్యంతమును అవిచ్ఛిన్నముగా నడచుచుండును. వృత్తగంధి రచనమున ఛందోబద్ధత వలె వారి రచనమునందు అలంకారము లుండును. వేరుపఱచి వానిని నిరూపించుట కష్టమగునట్లుగా రచనలో పెన వేసికొనిపోయి యుండును. దీని మూలమున వారి రచనకు ఆస్వాద్యత హెచ్చినది.

## భాషాశైలి

పానుగంటి వారి వచన శైలిని గూర్చి ఇంతకు ముందు చెప్పుట యైనది. ఇందు వారి భాష విశిష్టతను గూర్చి కొంత చెప్పుకొనదగి యుండును. పంతులుగారు ఆంధ్ర గీర్వాణ భాషా నిష్ణాతులు. పారసీకము, ఉరుదూ, కన్నడము, తమిళము– వీనిలో గూడ వారికి వ్యవహార దక్షత యున్నది.

పాత్రోచిత భాష వ్రాయుటకు తప్ప వారు ఎచ్చటను ఉరుదూ పారసీ కాంధ్రములను గలిపి వ్రాయలేదు. పాత్రోచిత భాషకై వారు తెలుగు పదములను వికారము పరచక అన్యభాషాపదములు ఎక్కువగా ఉండునట్లు వ్రాసిరి.

తెలుగులో బహు కాలముగా కలిసిపోయి యుండి దేశ్యములని భ్రమ గొలుపునట్టి ఉరుదూ, హిందీ పదములనే కాక చెమకు, చేలావంటి క్రొత్త పదములను గూడ వారు స్వీకరించిరి. మరికొన్ని పదములు ఉరుదూ హిందీ భాషా పదములు సిద్ధించు పద్ధతిగా ఆంగ్ల పదములనుండి సిద్ధించియున్నవి. లోక వ్యవహారమునుండి వీనిని గ్రహించిరి.

కలెక్టరు — కలెక్టరీ
ప్లీడరు — ప్లీడరీ
మేనేజరు — మేనేజరీ మొ॥

హిందీ ఉరుదూల నుండి "ఇంచు" ప్రత్యయము చేర్పుతో సిద్ధించు క్రియలను పంతులుగారు విశేషముగా గ్రహించియున్నారు. ఉదా॥ జెటకాయించు, టొకాయించు, జొకాయించు మొ॥

ఆంగ్ల పదములను గ్రహించుటలో పంతులుగారు కొన్నిచోట్ల వానిని తెలుగు వర్ణ క్రమములో నిచ్చిరి. మరికొన్ని యెడల ఆంగ్లలిపిలోనే ఇచ్చిరి. తొలుదొలుత పంతులుగారు ఆంగ్లభాషా పదములను అర్థస్ఫూర్తికి వాడవలసి వచ్చినను, వానికి తుల్యార్థములగు తెలుగు పదములనే వ్రాసి ఆంగ్ల పదములను కుండలములలో ఇచ్చెడివారు. సాక్షి మొదటి సంపుటియందు ఈ పద్ధతి చూడవచ్చును.

| | | |
|---|---|---|
| సంఘ దూషణము— (Social odium) | సాక్షి | 1-1 |
| హైందవ సర్వ కళానిలయము— (Indian University) | | 1-2 |
| ఆమోదము (Vote) | | 1-2 |
| గురువులు (Professors) | | 1-2 |

తరువాత ఆంగ్ల పదములను స్వేచ్ఛగా వాడ దొడగిరి. అట్లు వాడినప్పుడు ఆంగ్లలిపిలోనే వానిని వ్రాసిరి. ఒకే అంగ్ల పదము పలు విధములయిన తెలుగు వర్ణ క్రమముతో వ్రాయబడిన సందర్భములును ఉన్నవి. ఉదా॥ జంటిల్మెన్, జెంటిలు మాన్, జంటిల్ మన్, జంటిల్మేన్, జెంటిలు మ్యాన్.

పంతులుగారి భాష సర్వసాధారణముగా తత్సమ బహుళమైన భాషయే. సుదీర్ఘ సంస్కృత సమాసములను వారు మిక్కిలి సులువుగా సుందరముగా నిర్మింతురు. ఈ సమాస ఘటనము శ్రుతి పేయముగా నుండి రసానుకూలమై యుండును. కొలది భావమును దీర్ఘ సమాసములలో విస్త

రించి హాస్యస్ఫూర్తి కలిగించినవి, బిగువైన సమాసములలో ప్రౌఢి ఉదాత్తత సాధించినవి ఘట్టము లనేకము లున్నవి.

క్రొత్త నాగరకతతో ఎన్నియో భావములు జాతియందు ప్రవేశించినవి. క్రొత్తవస్తు సముదాయము వచ్చినది. వీనిని తెలుపుటకు నూత్న పద సృష్టియైన చేయవలయును లేదా అన్యభాషాపద స్వీకారమైన చేయవలయును గదా! పంతులుగారు అందులకు సిద్ధపడుటయే కాక తక్కిన వారిని ప్రోత్సహించిరి. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి నుద్బోధించుచు వా రనిన మాటలివి :

"ఇదివరకెన్నో నాటకములు నవలలున్నవి కదా? వానివలన భాషాభివృద్ధి కాలేదా యని యందురేమో! ఏదో స్వల్పముగ నయియుండును గాని వాని వలన భాషలో నూతనాభిప్రాయములు గలిగినవా? నూతన విషయములేమైన బోధింప బడినవా? నూతన శబ్దజాల మేమైన భాషలో ప్రవేశించినదా?"

అన్యభాషా పదములను స్వీకరించినట్లే వ్యవహారములో నుండి గ్రంథస్థ స్థితిలేని పదములను గ్రహించిరి. కొన్ని కొన్ని గ్రాంథిక పదములను విశేషార్థము లందుపయోగించిరి. క్రొత్త పద సముదాయమును ఊహించిరి.

| | | |
|---|---|---|
| ఎలెక్ట్రిక్ ఫాన్ | — | విద్యుదాయసవృంతము |
| టెలెగ్రామ్ | — | ఎఱ్ఱకాగితము; శోణపత్రము |
| పోస్ట్ ఆఫీస్ | — | లేఖాస్థానము |
| నైట్‌స్కూల్ | — | యామినీ పాఠశాల |
| హ్యాన్‌డ్‌బిల్ | — | కరపత్రము |
| రెసొల్యూషన్ | — | తీరుమానము |

అగ్రాసనాధిపతివలె అగ్రాసనాధిపత్ని, దద్దయ్య, ద్వితీయించు, ఊరిసిపారు మొదలయిన పదములు విశేషపరిశీలనార్హములు.

## తార్కిక ప్రతిభ

పానుగంటివారినిగూర్చిన పరిశీలనము వారి తార్కిక ప్రతిభను లోకజ్ఞతనుగూర్చి చెప్పికొనక సమగ్రము కానేరదు. పంతులుగారి మేధ అతి సునిశితమైనది. ఒక అంశమునందు ఉన్నట్లేయుండి పది యంశములను గుప్పించి, పది సామ్యములనుదెచ్చి వారు మనలను ఒప్పింపగలరు. తర్కము నకను రసానుభూతికిని ఎంతదూరమున్నను వారిదిమాత్రము రసవత్తర్కము.

సాక్షిలో "ప్రాణము" అను వ్యాసమునందు (3-15) ఒక లేడిపిల్ల రప్చరు ఆఫ్ ది అయోర్టా చేత మరణించినట్లు ఐ. ఎమ్. ఎస్. చెప్పెనని ఆ అభిప్రాయమును జంఘాలశాస్త్రిచేత విమర్శింపజేసిరి. వైద్యశాస్త్ర ప్రవీణుడు అశాస్త్రీయమైనది చెప్పడుగదా! దానిపై జంఘాలుని ఖండన మిట్లున్నది.

"కట్టుదిట్టమైన చుట్టు గుడిసెనుండి కుక్క కష్టపడి దడిచింపుకొని యీవలకు బారిపోయి వచ్చినది. కుక్క దడిలో దారిచేయుటచేతనే దారి యైనది కాదా! అంతకు బూర్వమున దారిలేదే! కావున దారికి, గుక్క కారణమా? దారి కుక్కకు కారణమా? ప్రాణోత్క్రమణ ప్రాబల్యమున రక్తనాళము భగ్నమైనది. ప్రాణము పోవుటచేత రక్తము వెడలినది కాని రక్తము వెడలుటచేతఁ బ్రాణము పోలేదే!...దానిమ్మ పండు పగిలినది. లోని కెంపు లీవలబడినవి. పండు లోపలి గింజల సమూహ మునికి స్థలము చాలక ఫలముపై నున్న చర్మమును బగుల చేసినదా? అదివరకే పండు పగిలియుండుటచేత గింజ లీవలకు వచ్చినవా? నీటిలోనుండి కప్ప గట్టుమీదికి దుమికినది. కప్ప యీవలకు వచ్చుటచేత నీరు దారి యిచ్చినదా? ముందుగా నీరు దారి యిచ్చినహేతువు చేత గప్ప యీవలకు వచ్చినదా? మన డాక్టరుగారు మూతి వెనుక తోక ముందని చెప్పినారేల? గునపముతో గోయి పడినదా? గోయి ముందే పడియుండుటచేత. గునపము దిగినదా?"

ఈరీతి వాదము సాగినప్పుడు ప్రతిపక్షి హాస్యాస్పదుడై ఎన్నడో తలవంచుకొనవలసిన వాడైనాడు. అతని శాస్త్రము ప్రకారము అతడు

చెప్పినది సరియే కావచ్చును. కాని యిట్టి తార్కికుడు కాకిని గ్రద్దను, గ్రద్దను కాకిని చేయజాలిన వాడు.

పంతులుగారి తర్క ప్రతిభకు ప్రాణముపోసినది ఇక్కడి అధిక్షేపణ హాస్యశక్తి. తన వాదమును బలపరచుకొనుటకై పంతులుగారు పరుకొను ఉదాహరణములు సామ్యములు వారి అధిక్షేపణకు తీవ్రతను ప్రసాదించునవి. నడుమ నడుమ తమ తమ వాదమును నిలిపి ప్రతిపక్షి నిస్సహాయస్థితిని ప్రయోజనకరముగా గ్రహించి ఎగతాళిచేయుచుందురు. పంతులుగారు వాదములలో సామ్యములేరి తెచ్చుటలో ఎట్టిపోకడలు పోయిరో తెలియుటకు ఈ క్రింది ఉదాహరణములు చూడుడు.

"నీ తప్పులు నీవు దిద్దుకొంటివాయని నన్నధిక్షేపింతురేమొ! హంపి గ్రామమున కిదిదారి; ఆనె గొంది గ్రామమున కది దారియని రెండు చేతులతో రెండు వేరువేరు మార్గములను గనబరచు కఱ్ఱ స్తంభముతో నీ వానె గొందికిపోయితివా, నీవు హంపికి బోయితివా యని దెబ్బలాడు వాడెవడైన నుండునా? అట్టి వాడెవడైన నున్నాడని మీకు తోచిన యెడల వానిని మద్రాసు పిచ్చి యాసుపత్రిలో జారవేయుడు. అంతవరకు మీ కోపిక లేనిచో సమీపములోనున్న బంగాళా ఖాతములో జారవేయుడు."

—సాక్షి 3-22

"విమర్శకునకు గవితాశక్తి యుండవలసిన యావశ్యకత యెంత మాత్రమును లేదు. పప్పులో నుప్పెక్కువయని చెప్పగలవాడు పాచకుడు గావలయునా? రుచిగ్రహణ పారీణుడు, భోజన ప్రియుడునైన చాలదా?

—సాక్షి 1-3

పంతులుగారు ఈ వాద ప్రతిభ వారి యనేక పాత్రములకు సంక్రమింపజేసిరి. అట్టి పాత్రలలో దేవదేవి యొకతె. ఈమె వాదమునకుగూడ అధిక్షేపణ హాస్యము ప్రాణము విప్రనారాయణుడు పల్కిన ఒక్క వాక్యము నిట్లు ఖండించి ఆమె వాదస్థాపన చేసినది.

(నేపథ్యమున - విప్రనారాయణుడు)

రంగడే రంగడు అని నేను చేసిన గ్రంథమును నీవు విందువా ?

దేవదేవి : నేను జేసిన గ్రంథమనుచున్నాడు. ఈతనికింక నహంకారము వదలలేదు. నీవు వింటువా యనుచున్నాడు. ఒకని మెప్పు నపేక్షించుచున్నాడు. ఈతడు స్తుతిప్రియుడు. ఈతని కింకను భక్తి పూర్ణముగా గుదురలేదు.

పంతులుగారి రచనలకు వైశిష్ట్యము కలిగించిన గుణములలో ఇట్టి వాద ప్రతిభాయుక్తియును ఒక్కటి.

## లోకజ్ఞత

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు లోకజ్ఞులు. వారి రచనల రక్తికి వారి లోకజ్ఞతయే కుదురు. కవి యగుటకు లోకజ్ఞత ప్రప్రథమార్హత. లోకము నెఱుగుటే లోకజ్ఞత. "లోక్యతే సర్వమస్మిన్నితి లోకః"—సర్వమును దీనియందు గానబడును కావున నిది లోకము. కనబడు దానిని చూచుట యేమి ఘనత ? దానికి పానుగంటివారి మాటలలో సమాధానమిది.

"కన్నులున్నవారందరు కనుచున్నారా ? చెవులున్న వారందరు వినుచున్నారా ? నోరున్న వారందరు తినుచున్నారా ? మంచమునకు గన్నులులేవా ? గంగాళమునకు చెవులులేవా ? అక్షయపాత్రకు నోరులేదా? ఇవి యన్నియు నుండవలసినది లోనకాని పైనకాదు."

లోకము అతి విచిత్రమైనది. అది పరమేశ్వరుని ప్రతిబింబించు దర్పణము. విడదీయుటకు శ్రమింపదలుచుకొనిన వారికి జటిల సమస్య, అనుభవింపదలుచు కొనినవారికి అరచేతిలో ఒలిచిపెట్టిన యరటిపండు. కవిగాని, సామాన్యుడుగాని, లోకములో తన ప్రతిబింబమునే చూచుకొనుట తటస్థించును. ప్రేమానురాగములో, నిస్పృహా వైరాశ్యములో, మన

మనసులలో నుండు ఆలోచనలకు, భయసందేహములకు అందు ప్రతిధ్వనులు వినవచ్చును. కవి తన రచనలో ఇట్లు తన అనుభవములోనికి వచ్చిన ప్రపంచమునే చిత్రించుట జరుగును. కావుననే ఆలంకారికులు "శృంగారీ చేత్కవిః కావ్యేజాతమ్ రసమయమ్ జగత్, స ఏవ వీతరాగశ్చేత్ నీరసం జాత మేవతత్" అని గుర్తించిరి.

సాక్షి వ్యాసములన్నియు వారి లోకజ్ఞతను విస్తారముగా చాటును. మానవ మనస్తత్త్వమును గుర్తించిన పానుగంటి ఉల్లిపొరను నూరు పొరలుగ తీసినంత సూక్ష్మముగ మనుష్యుల అంతరాంతరములలోనికి చొచ్చుకొనిపోయి సత్యేతరమైన దానిని, శివేతరమైన దానిని, సుందరేతరమైన దానిని నిర్భీకులై ఎదుర్కొనిరి. సాక్షి వ్యాసములు ఆరంభము చేసినప్పుడే వారు ప్రాపంచిక చర్యలయందలి చిత్ర విచిత్రాతి చిత్ర మహావిచిత్రాంశములను గుర్తించినట్లు వ్రాసినారు. ఈ విచిత్రాంశములను వెలికి దెచ్చి, సంస్కరించు కృషిలో ఆవశ్యకమగుచోట్లనెల్ల వారు సృష్టించిన పాత్రలు, వివరించిన సన్నివేశములు వారి అసామాన్య లోకజ్ఞతకు నిదర్శనములై భాసిల్లుచున్నవి.

సాక్షి వ్యాసములలో వారికిగల బహుముఖ ప్రజ్ఞ ద్యోతకమగును. శాస్త్ర విషయములందుగాని, మతవిషయికాంశములందు గాని, చరిత్రాద్యనేకాంశములందుగాని, లోక వృత్తాంతములందుగాని వారికి తెలియనిది కనబడదు. బర్త్రు కంట్రోలునుండి బ్రహ్మ పదార్థమువఱకు అణువునుండి విశ్వాంతరాళమువఱకు వారన్ని విశేషములను స్పృశించి, ప్రామాణికము లగు అభిప్రాయము లిచ్చిరి.

పంతులుగారు తమ కృతులలో భిన్నభిన్న స్వభావములుగల యనేక పాత్రలను సృష్టించిరి. వీనిలో అనేకములు విపరీత సంభవములుగా నుండునని పూర్వమే వ్యాఖ్యానింపబడెను. ఇట్టి పాత్రల విశిష్టతను ఊహించుటకు వారి లోకజ్ఞతయే అవకాశమిచ్చినది. సృష్టిలో, పరమేశ్వరుని విలాసములో ప్రకృతి యెంతసహజమైనదో వికృతికూడ అంతసహజమైనదే యన్న మాటలోని యాథార్థ్యము అందరకును వెంటనే స్ఫురించునది కాదు. ఈ

బాహ్యాంభ్యంతర వికృతులను సృష్టించి, వాని ప్రకృతిని నిరూపించుట పానుగంటి వారికి సుకరమైన పని. పంతులుగారు ప్రపంచమునందలి వాస్త వికతకు, కల్పనా చమత్కారము నతికి ఉజ్జ్వల సృష్టి చేయగలిగినారు తమ రచనలలో ప్రపంచమును జీవితమును కాచి వడియగట్టిన తత్త్వములు వారు ఎన్నియో ప్రవచించిరి.

లోకజ్ఞతకు సరియైన నిదర్శనము సదసద్వివేకము. కేవలదేశకాల పాత్ర నిబద్ధమైన దృష్టితోగాక విశాల దృష్టితో సమస్యలను పరిశీలన చేయ వలయును. పంతులుగారి రచనలు సవిమర్శముగా పఠించినచో అందీ లక్షణము గోచరించును. వారు అపహాస్య ధోరణిని అవలంబించినను, చాల చోట్ల ఫలితాంశములుగా మహోదాత్త భావములను వివరించినారు

ఈ రీతి లోకజ్ఞతయంతయును ఒకయెత్తు. ఈ వివరింపబోవునది మరియొక ఎత్తు. ఒక దృష్టితో లోకజ్ఞత యనగా నిదియే !

పలువురు మనీషులు, మహర్షులు పర్యాపలోకనము చేసి పోయినను ఈ లోకపు తత్వమేమి యను ప్రశ్నకు సరియగు సమాధానము ఇప్పటికి అట్లే మిగలిపోయినది. ఇది స్వప్న ప్రాయము. జల బుద్బుదసమము. మన కరుణలు, కార్పణ్యములు, ప్రేమలు, ద్వేషములు సమస్తమును భ్రమా సంజనితములు. ప్రకృతి, పరమేశ్వర సంకల్పము సర్వశక్తిమంతమైనవి. ఆ మాట జ్ఞప్తియందుంచుకొనినచో మనుష్యునకు వినమ్రత ఏర్పడును. అహంకారము, అజ్ఞానము తొలగిపోవును. అచ్ఛపు తెలివికలుగును. అదియే జీవిత పరమార్థము. అదియే ప్రాప్యము. పానుగంటివారి లోకజ్ఞత ఆ ఔన్నత్యమును అందుకొనినది. వారికి సర్వోదయ భావన. సర్వభూత సమహిత తత్వము అలవడినవి. కావుననే "మామిడిపూత యెట్టిదో మసూరిపోత యట్టిది; గోరంటపూవు వాసనయెట్టిదో కోరింత దగ్గట్టిది. గుబ్బలాడి కంటి తళుకెట్టిదో మబ్బులోని పిడుగట్టిది; పద్మములోని మధువెట్టిదో పాములోని విషమట్టిది" అనగలిగిరి. (అం. సా. ప. వార్షికోత్సవాధ్యక్షోపన్యాసము.) "నీ కాలికొక్కు సహింపలేని గండుచీమ నిన్నెదుర్కొని పీకివేయదా. దాని

శౌర్యము ముందు నీ శౌర్యము హెచ్చని నీవు చెప్పగలవా ? శౌర్య ప్రకటనమున పెద్దపులి ఘుూంకార మెట్టిదో దోమ హూంకారముగూడ నట్టిదే సుమా !" అని పాత్రలచేత (చూడామణి) అనిపింప గలిగిరి.

పర్యవసానముగా వారి సర్వ రచనలలో వారు ఒక్క ధ్యేయమును కనబరచు ప్రయత్నము సేసిరి. "గులకరాయి తక్కువలేదు-కొండ యెక్కువ లేదు. చవుటిగుంట తక్కువలేదు. సముద్రమెక్కువలేదు. మసిబొగ్గుకంటె మాణిక్యము హెచ్చుకాదు. పరమాణువుకంటె భానుడధికుడుకాడు. పురుగు కంటె నరు డుత్కృష్టుడుకాడు. సృష్టిలోనియన్ని వస్తువులు నొక్కటే - పరమార్థమున నొక్కటే - వస్తుతత్త్వమున నొక్కటే."

ఈ సమస్తమును "ప్రబల ప్రభా భాసమానుడగు భానుడు, సమస్త నక్షత్రమండలములో, చంద్ర మండలముతో. మనకు కనబడని యింక ననేక సహస్రభాను మండలములతోకూడ నవాఙ్మానస గోచరమగు ఏ తేజోలేశము ముందు మసిబొగ్గుకంటె నధమాధముడో ఆ పరమాత్ముని స్వరూపమని గుర్తించుటకన్న వాస్తవికమగు లోకజ్ఞత ఎందున్నది ?

## వ్యక్తిత్వము

పానుగంటి వారి రచనలన్నిటిని విమర్శనాత్మకముగ జదివిన మీదట సర్వత్ర ప్రస్ఫుటమగుచు వచ్చిన వారి వ్యక్తిత్వముమ గూర్చి కొంత అధిక ముగ పరిశీలింప వలెనను బుద్ధి పొడమును. నిశ్చయముగా పంతులుగారొక మహా వ్యక్తి. అసాధారణ శేముషీ విభవము కలవారును, లోకజ్ఞులును అగు వారు చేసిన విస్తృత సాహిత్య సృష్టికి సారస్వత సంబంధి మాత్రమే కాక విపులమగు ప్రయోజనము ఉన్నది. పంతులుగారి జీవితము ఒక మహోద్యమము. వారి సాహిత్య సృష్టి లోక కల్యాణార్థమగు యజ్ఞము.

పంతులుగారి జీవిత చరిత్రమునకు చెందిన అంశములు ఏ కొలదిగనో మాత్రమే లభ్యమగుచున్నవి. వారి జీవిత సంఘటనము లన్నియు తెలియ కున్నను వారి రచనల మూలమున ఆ సంఘటనల వలన వారు పొందిన అను భూతులు మాత్రము ప్రకటమగుచున్నవి.

శ్లిష్టమగు లోకయాత్రయందు మానవులపై పరిస్థితుల ప్రభావము మెండుగా ఉండును. ఈ హేతువుచే ఒకడు తన ఆశయములకు అనుగుణముగ జీవించుటకు అవకాశములేకపోవచ్చును. అప్పుడు వాస్తవికతకు కల్పనకు నడుమ నుండు నిత్య సంగ్రామమే జీవిత మగుచుండును. పరిపాటిగా అనేకుల బ్రతుకు లిట్లేయుండును. అందును, భావనాబలము, స్వల్పాతి స్వల్ప విషయములకు సైతము స్పందించు హృదయముగల వ్యక్తి మాట చెప్పనే అక్కరలేదు. ఇది లోక రహస్యము. పానుగంటి వారు సైతము ఈ శ్రేణిలో ఒక్కరే యనిపించును.

వీరు వ్రాసిన వానిలో అధిక భాగము నాటకములు. వీనిలో రమారమి మున్నూట యేబది పాత్రము లున్నవి. ఈ పాత్రల స్వభావములను, సంభాషణ రీతులను బట్టి కవి చాతుర్యము నూహింప వచ్చినంత సులభముగా కవి స్వభావమును నిర్ణయింపరాదు గదా! అయినను శ్రద్ధగా పరిశీలించినచో, కొంతవరకు వీనిని చిత్రించిన పంతులుగారి స్వభావమును కనుపట్ట వచ్చును. "సాక్షి" వ్యాసములలో గూడ వారు పాత్రలను నిర్మించి, వాని ముఖమున విషయ విపులీకరణము చేయించుటచే, సూటిగా వారి స్వభావము గాని, అభిప్రాయములు గాని తెలియరావు. కొంత పరిశీలన, వ్యాకృతి, తర్కమును తప్పనిసరి యగును. ఈ భాగమునందు వారి రచనల నాధారముగ జేసికొని వారి వ్యక్తిత్వ మెట్టిదో అరయు ప్రయత్నము చేయబడును. రచనలనగానే వారి మానసిక జీవితము, అంతరంగ స్వభావములను పర్వరించుటకే వీలుండునని స్పష్టము కదా!

నాటకములలో పంతులుగారు సహజముగా రమ్యముగా పోషించిన పాత్రలలో బహు సంఖ్యాకములు విశిష్టములైనవి. మంచితనము, లేదా చెడ్డతనము – అట్టి గుణావగుణములతో గూడిన సూటియైన (సింపుల్) స్వభావము గల పాత్రలను ఎవరయినను ఒకే రీతిని పోషింతురు. వానిలో రచయిత వ్యక్తిత్వపు ముద్ర చెప్పుకొనదగినంతగా నుండదు. సంశ్లిష్ట (కాంప్లెక్స్) స్వభావము గల పాత్రలను జూచినచో గాని కవి మనసు బోధపడదు. అట్టి పాత్రలలో మిక్కిలి గడుసు పాత్రముల నుండి మిక్కిలి అమా

రసికమ్ములైన పాత్రముల వరకును ఉన్నవి. పంతులుగారు మధ్యరకము పాత్రలను గూడ చతురముగానే సృష్టించినను వారి ప్రత్యేకత అటునిటు పరమావధులను (ఎక్స్ట్రిమిటీస్) అందుకొనిన పాత్రలను సృష్టించుటయే. ఇది మిక్కిలి పరిశీలనా నైశిత్యము, ఉద్విగ్న ప్రకృతి కలవాడు గాని చేయునది కాదు. పాత్ర సృష్టి చేయుటలో పంతులు గారి కొకరీతి ఆవేశము కలదు. దీని చేతనే వారు తమ భావమున పొడసూపిన భిన్న పాత్రలకు స్పష్టమగు రేఖలు తీర్చి ప్రత్యక్షము చేయగలిగిరి. దేవదేవి, రాధా సత్యభామలు, పద్మిని, పద్మావతి మున్నగు పాత్రములన్నియు తీవ్రప్రకృతి కలవియే. ఒక్కొక్కరి తీవ్రత యొక్కొక్క తీరున ప్రసరించినది.

ఇవి యన్నియును ఇట్లుండగా కంఠాభరణమునందలి కృష్ణారావు ఒక గొప్ప విచిత్ర వ్యక్తి – "నా మనస్సునం దన్ని రసములున్నవి. సదాచారమున్నది ; వ్యభిచారమున్నది ; భక్తియున్నది : రక్తి యున్నది ; వైరాగ్యమున్నది ; పామరత్వమున్నది : నా మనస్సృష్టి వైఖరి యట్టిది.

తులసి సాలగ్రామముల మీద నుంతును,
పూవులు వేశ్య కొప్పునను ముడుతు,
వాయుస్తుతినిఁ గపి ప్రభు నభిషేకింతుఁ,
బన్నీటి జడి వారభామ కిడుదుఁ,
జందనాగురు చర్చ స్వామికి నర్పింతుఁ,
జందనాగురు చర్చ సాని కిడుదుఁ,
గప్రంపుటారతి కంసారి కొనగుదు
మణి దీపముల వెల మగువ కిడుదు,
బట్ట మెడ జుట్టుకొనుచు శ్రీవల్లభునకు
భక్తి సాష్టాంగ మొనరింతు బాపహృతికిఁ
బైట చేపట్టి జారిణీ పదములందు
వ్రాలు చుందును బ్రణయ కోపంబు దీర."

అని చెప్పుకొన గల్గినవాడు. తేజస్తిమిర న్యాయమగు విరుద్ధాంశముల సమన్వయమును కృష్ణారావు పాత్రలో నూహించిన పంతులుగారి మనస్సు

బొందిక కందని భిన్నాంశముల సమన్వయ రూపమై యుండుటలో ఆశ్చర్య మేమి ? పానుగంటి వారి వ్యక్తిత్వమును గూర్చి మొదట చెప్పుకొనదగిన దే యిది. వారిలో ఎంత ఉదాత్తత యున్నదో అంత పరిహాస ప్రియత్వ మున్నది. ఎంత మార్దవమున్నదో అంత ఆక్షేపణ హాస్యమున్నది. వారి పాత్రలందు గూడ ఇట్లే ప్రధానములగు రెండు వర్గములను ఏర్పరుప వచ్చు నని వివరింపబడెను గదా ! పంతులుగారి మనస్సు సాత్వికతా ప్రధానమో రాజసిక ప్రధానమో నిశ్చయించుటే కష్టము.

వారి పాత్రలలో చాల భాగము ఎదిరి పాత్రలు పలికిన పలుకులను దూరేకిన శ్లేకి పూర్వపక్షము చేసి ఆక్షేపించు చుండును. సామాన్యముగా కనుపట్టని సూక్ష్మాంశములను వెలికి లాగుట, ఆ యంశములను అపహాస్యము చేయుటలో నిర్దాక్షిణ్యముగా వ్యవహరించుట ; అసంగతమైన దానిని గూడ సుసంగతముగా నిరూపింపగల తార్కిక ప్రతిభ వెలయించుట ఈ అధిక్షేపణము నందు జూడవచ్చును ఇది పానుగంటి వారి తత్వమును గొంత పట్టియిచ్చును. పంతులుగారు క్రొత్తవారి నడుమ నున్నప్పుడు ఎక్కువగా మాటలాడెడివారు కారని, పరిచితుల నడుమ మాత్రము విశేషముగా ప్రసంగించెడి వారని విన వచ్చుచున్నది. అట్టి సంభాషణములలో తడుముకొనకుండ వారు ఎల్లరను అధిక్షేపించు చుండెడివారు

పానుగంటి వారిలో ఉన్న సంశ్లిష్ట వ్యక్తిని గూర్చి ఆలోచింపగా మరియొకఊహ తోచును. పంతులుగారు అంతరంగములో సాత్వికస్వభావులు; పైకి నిత్య జీవితములో రాజసి. రాజామాత్యులుగా, ఆస్థానకవులుగా ఉండిన వారు ఇట్లగుటలో వింతలేదు. ఈ గుణద్వయ సమ్మేళనములో వారికి విశిష్ట వ్యక్తిత్వము అబ్బినది. ఒక విషయముపై వారికెంత లాలస ఉండెడిదో, అంత వైరాగ్యము కూడ వారికుండి యుండవలెను. పారమార్థికముగా వారికి ఎంత వినమ్రత యున్నదో ఐహికముగా అంత ఆత్మ విశ్వాసాధిక్య మున్నది.

పంతులుగారి స్వస్థాన వేష భాషాభిమానము బహుతర ప్రశంసనీయము. అట్టి యభిమానమును సమకాలికులలో కలిగించి నిలువ బెట్టుటకు వారొన

రించిన కృషి అనల్పము. వారు జ్ఞానము అంగమైన భక్తిని ముక్తి మార్గముగా గ్రహించిరి. వారు శ్రీరామ భక్తులు. భక్తిరస పోషణయందు వారెట్టి యున్నత శిఖరములను అందుకొనిరో పరిశీలించిన భగవద్విషయాత్మకమైన వారి ఆవేదన స్వరూపమును గమనించిన పంతులుగారి ఆధ్యాత్మిక శీలము బోధపడును.

## ఉపసంహారము

పంతులుగారు కందుకూరి వీరేశలింగముగారు ఆద్యులై శ్రీకారము చుట్టిన ఉద్యమమును చేపట్టి దృఢము కావించిరి. గద్య వాఙ్మయాభివృద్ధి యగుట సంఘాభ్యున్నతికి అత్యంతావశ్యకమని విశ్వసించి తత్కృతికి నడుము గట్టిరి. అవహేళనాధిక్షేపణ హాస్యరీతులను ఆదరించి సంఘ సంస్కారము నిమిత్తమై విస్తృత వాఙ్మయ సృష్టి గావించిరి.

వీరేశలింగము గారిచే ప్రభావితులైనను రచనా పద్ధతియందు ఇరువురకును ఎంతయు భేదమున్నది. అనేక హేతువులచే వీరేశలింగముగారు తమ రచనలలో సాధింపలేకపోయిన కళాగౌరవము పానుగంటివారు నిస్సందేహముగ సాధించిరి; సంఘ సంస్కరణ కృషికి సాహిత్య సృష్టి ఒక సాధనముగ గ్రహించిన వీరేశలింగముగారు సాహిత్య మార్గమున తాము క్రొత్తపుంతలు త్రొక్కినను, వారి సృజనాత్మక శక్తికి అవి పరిణత రూపములు కాలేదు. పానుగంటివారు దేశమునందు పూర్వమే నెలకొనియున్న సాహిత్యప్రక్రియలలో తమ సృజనాత్మక శక్తిని తాండవింపజేసి వానిలో క్రొత్త రూపములను, క్రొత్త తేజమును ఆవిష్కరించిరి,

ఆశయము, ఆచరణ; కుతూహలము, శక్తి; ప్రతిభ, వ్యుత్పన్నత పానుగంటి కవీంద్రునిలో సమన్వయము పొందినవి. గద్య వాఙ్మయ సృష్టిలో రూపక సాహిత్య సృష్టిలో హాస్య వాఙ్మయ సృష్టిలో పంతులుగారు నవ్యాంధ్ర వాఙ్మయ చరిత్రమున విశిష్ట స్థానమును గెలుచుకొనిరి. "రాజును చూచిన కంటితో మగని జూచిన" అను సామెతకు లక్ష్యభూతులుగా నున్న ఆంగ్ల విద్యా వ్యామోహితుల కన్నులు చెదరునట్లుగా పంతులుగారు వినూతన

సృష్టి కావించి తెలుగు పరువు నిలువబెట్టిరి. అట్టి మహనీయుని ఋణమును తెలుగు భాషా సారస్వతాభిమాను లెట్లు తీర్చుకొనగలరు ?

పానుగంటి వారి కృతులన్నింటిని సవిమర్శముగా పరిశీలనము చేయుటకు ఇది తొలి ప్రయత్నము. ఎడనెడ పత్రికావ్యాసములలో, విమర్శన వ్యాసములలో సంగ్రహముగా పంతులుగారి కృషి శ్లాఘింపబడి యున్నది. కాని విపులమగు చర్చ మాత్రము చేయబడలేదు. ఈ పరిశీలనమైనను ఉన్నంతలో సమగ్రమే కాని, జరుగుటకు అవకాశమున్న బృహత్కృషి దృష్టితో ప్రాథమికమే. మహా మేధావి యగు రచయిత జీవిత కృషిని సంపూర్ణముగా వివరించి వెచుటకు అయిదారేండ్ల కాలము పెద్ద వ్యవధి కాదు. శ్రద్ధాసక్తులతో, గౌరవ తాత్పర్యములతో చేసిన ప్రయత్నము మాత్రమే ఇది.

ఈ ప్రయత్నమును హర్షించుటకు మరియొక మాట గమనింపవలసి యున్నది. విరివియగు నొక దృశ్యమును ఒక పటమున గీచినప్పుడు అందు పొందుపరచగల వివరములు తక్కువ యగును. అదే విధముగా ఇచ్చట సూక్ష్మ విచారము కొంతవరకు వదలివేసి, మునుముందు జరుగదగిన కృషికి సోపానములు కట్టుటయే చేయవలసి వచ్చినది. ఈ పరిశీలనలో నిరూపింపబడిన పథకము, వెలువరింపబడిన విశేషములు భవిష్యత్తులో జరుగు కృషికి గట్టి పునాది కాగలదని ఆశింపవచ్చును. ఆ విధమగు పునాది నిర్మించుటలో శక్తివంచనగాని, అంతఃకరణ శుద్ధి లోపముగాని జరుగలేదని నా ధైర్యము.

—o—